పరాశరమహర్షి ప్రణీత

# బృహత్పరాశర హోరాశాస్త్రము

ప్రథమభాగము.

ఆంధ్ర తాత్పర్య వివరణసహితము

అనువాదకుడు :

"జ్యోతిష విజ్ఞానభాస్కర"

మధుర కృష్ణమూర్తిశాస్త్రి

(సంపాదకుడు ;- జ్యోతిష విజ్ఞానపత్రిక)

ప్రచురణ :

జ్యోతిష విజ్ఞానకేన్ద్రము

రాజమహేన్ద్రవరము-4

ప్రాప్తిస్థానము :-

జ్యోతిషవిజ్ఞానకేంద్రము.

రాజమహేంద్రవరము - 4

ప్రథమముద్రణము 1983



వెల : రు. 40-00

ముద్రణము :-

విజయశ్రీ ప్రింటింగువర్క్సు, - రాజమహేంద్రవరము - 1

# విజ్ఞాపనము

పాఠకమహాశయులారా!

జ్యోతిశ్శాస్త్రము అనగా గ్రహనక్షత్రాదులకు సంబంధించిన శాస్త్రము. ఆకాశమందు మనకనుదినము గనబడుచున్న గ్రహనక్షత్రాదులయొక్క కాంతికిరణములు భూమిపైబడుటచేత, ఆయా గ్రహాదులయొక్క కాంతికిరణముల యొక్కశక్తులు భూమిపైగల చరాచరజగత్తుపైదనెట్టి ప్రభావమును గలిగించుచున్నవో ఆయా విషయములను కూలంకషముగ నీశాస్త్రము తెలియజేయును.

"వేదైస్సహసముద్భూతం వేదచక్షుస్సనాతనం" మ్మను వచనానుసారము ఈ శాస్త్రము వేదములతోగూడ బ్రహ్మముఖము నుండియే వెలువడినది. వేదములయొక్క షడంగములలో నేత్రస్థానీయమైనదగుటచేత, వేదవిహితములైన కర్మలనాచరించుటకు అర్హమైన కాలమును తెలియచేయునదగుటచేత నీశాస్త్రము వేదాంగములలో ప్రాముఖ్యము నొందినది. మరియు మనుష్యాదుల యొక్క జన్మాంతరార్జిత పుణ్యపాపఫలములను తెలియచేయునదియు అగుచున్నది.

ఈ శాస్త్రము సిద్ధాంతము, సంహిత, హోరయని మూడు భాగములతో కూడియున్నది. వీనిలో ప్రథమభాగమగు సిద్ధాంతమువలన రవ్యాదిగ్రహములయొక్క గమనవిశేషములు, ఉదయాస్తమయాదులు, రవి, చంద్రగ్రహణాదులు, మొదలగు అనేక విషయములు తెలిసి కొనబడును. సంహితయను భాగమువలన రవ్యాదిగ్రహగమనాదులవలన భూమండలముపై సంభవించు సమష్టిశుభాశుభఫలములు తెలియును. మూడవదగు హోరాభాగమువలన ప్రతిమనుష్యునియొక్క జీవితకాలములో సంభవింపబోవు శుభాశుభములు తెలియును. సమువాయములో నీశాస్త్రము గణితభాగము, ఫలితభాగము అనురెండు ప్రధానభాగములుగలదని చెప్పవచ్చును. సిద్ధాంతమందుగూడ గణితద్వైవిధ్యము గలదు. మొదటిది భూగోళ గణితము, రెండవది ఖగోళ గణితము. సాధారణముగ గణితము వ్యక్తావ్యక్తభేదముచే ద్వివిధము. ఈ గణితజ్ఞానము గలవారికి మాత్రమే సిద్ధాంతభాగము వశ్యమగును.

హోరాభాగము ఫలభాగము. ఫలమును చెప్పుట కనేకమహర్షుల గ్రంథములు గలవు. అందు "కలౌపారాశరీహోరాప్రత్యక్షఫలదాయినీ" యను ప్రాచీనులయనుభవసిద్ధవాక్యమువనుసరించి, పరాశరహోరాశాస్త్రము సమస్తఫలితగ్రంథము

లందునత్తమోత్తమము. పరాశరమహర్షి కలియుగారంభమునకు పూర్వములో గర్గ మహర్షి వలన తానునేర్చిన విద్యను మైత్రేయునకుపదేశించినట్లు ఈ గ్రంథము యొక్క చివరలో నిట్లు తెలిపియుండెను.

వేదేభ్యశ్చసముద్ధృత్య బ్రహ్మప్రోవాచ విస్తృతమ్।
గర్గస్తస్మాదిదం ప్రాహ మయాతస్మాద్యథాతథా॥
తదుక్తంతవమైత్రేయ శాస్త్ర మాద్యంతమేవహి॥

అని ఫలశ్రుతి కథనమందు చెప్పియుండెను. పాఠాంతరమందు బ్రహ్మనుండి నారదుడు, నారదునివలన శౌనకాదిమునులు, వారివలన పరాశరుడు, పరాశరుని వలన మైత్రేయుడు ఈ శాస్త్రమును తెలిసికొనినట్లు క్రిందనుదహరింపబడిన శ్లోకములవలన తెలియుచున్నది.

యచ్ఛాస్త్రం బ్రహ్మణాప్రోక్తం నారదాయ మహాత్మనే।
తదేవ శౌనకాదిభ్యోనారదః ప్రాహ సాదరమ్॥
తతోమయాయథాజ్ఞాతం తుభ్యముక్తం తథాద్విజ॥

పరాశరుడెవరివలన నీజ్ఞానమును సంపాదించెనను విషయము ప్రస్తుతాంశముకాదు.

ఈ గ్రంథమును "బృహత్పరాశరహోరాసారాంశ" మ్మను పేరుతో శ్రీధర పండితుని సంస్కృత హిందీవ్యాఖ్యలతో బొంబాయిలోగల వెంకటేశ్వరస్టీమ్ ప్రెస్సువారు ముద్రించిరి. తరువాత కాశిలో శ్రీ సీతారామ్‌ఝాగారి హిందీవ్యాఖ్యతో మాస్టర్ ఖేలాడీలాల్ అండ్ సన్సువారు, దేవచంద్రఝాగారి హిందీవ్యాఖ్యతో చౌకాంబా విద్యాభవన్‌వారు, గణేశదత్తపాఠకగారి హిందీవ్యాఖ్యతో ఠాకూర్ ప్రసాదు పుస్తకభాండారువారును ముద్రించిరి. ఈ నాలుగు గ్రంథములలోను శ్రీధరవ్యాఖ్యతో గూడి బొంబాయినుండి వెలువడిన గ్రంథము, గణేశదత్తపాఠకగారి హిందీవ్యాఖ్యతో గూడి కాశినుండి వెలువడిన గ్రంథము ఇంచుమించు సమానముగానున్నవి. ఇట్లే సీతారామ్‌ఝాగారి హిందీవ్యాఖ్యతో గూడినపుస్తకము, దేవచంద్రఝాగారివ్యాఖ్యతో కూడినపుస్తకము ఇంచుమించు సమముగనున్నవి. కాని దేవచంద్రఝాగారి గ్రంథములలోగల శ్లోకములందుగల శబ్దములు, సీతారామ్‌ఝాగారి గ్రంథములోగల శ్లోకశబ్దములు భిన్నభిన్నములుగానుండియు అర్థభేదములేకుండ యున్నందున గ్రంథము చాలవరకు సామ్యమునొందియున్నవి.

ముద్రితములై యున్న యీనాలుగు గ్రంథములు రెండు విధములుగనున్నవి. రెండుగ్రంథములందును "పరాశరహోర" శతాధ్యాయ పరిమితమని వ్రాయబడినది. గాని శతాధ్యాయములులేవు.

1. శ్రీధర, గణేశదత్త పాఠకుల గ్రంథములలో పూర్వభాగమందు 61అధ్యాయములు గలవు. ద్వితీయభాగమందు 21అధ్యాయములు గలవు. అధ్యాయక్రమము కూడ సక్రమముగ గుర్తింపబడలేదు.

2. సీతారామ్‌ఝూ, దేవచంద్రఝూల పుస్తకములలో ప్రథమభాగమందు 85 అధ్యాయములు, ద్వితీయభాగమందు 81 అధ్యాయములుగలవు

దేవచంద్రఝూగారి గ్రంథము పూర్వభాగములో "గ్రహాదిసాధనాధ్యాయము" "సూతికాధ్యాయము" అనురెండధ్యాయములు, ద్వితీయభాగమందు 'ప్రశ్నాధ్యాయము' అధికముగనుండెను. మొత్తముగా 100 అధ్యాయములకంటె తక్కువగనే యున్నవి.

నేనీనాలుగు గ్రంథములయొక్క సహాయముతోను శ్రీసీతారామ్‌ఝూగారు వ్రాసిన మూలశ్లోకముల నాధారముగ చేసికొని 'బృహత్పరాశరహోరాశాస్త్ర ప్రథమ భాగమును అంధ్రతాత్పర్య వివరణముతో వ్రాయ సంకల్పించితిని. గానిపాఠభేదము లుండుటచేత, గ్రంథమునందధ్యాయక్రమము భేదించుటచేత, వరాహమిహిరాదులు తమగ్రంథములందనుసరించిన క్రమమువనుసరించి అధ్యాయములను గ్రహించితిని. గ్రంథములలోగల విషయభేదములనుబట్టి కొంతెము మార్పుగనబడినను, విషయానుకూలముగ నధ్యాయములు ప్రవేశ పెట్టబడినవి.

జాతకశాస్త్రములలో పరాశరమతము, జైమినిమతము, యవనమతము ప్రసిద్ధములు. పరాశరమతమునననుసరించిన ప్రాచీనగ్రంథకర్తలుకూడ కొందరు వారి వారి గ్రంథములందు కొన్నిసందర్భములలో విషయక్రమమును ముందువెనుకలకు పెట్టియున్నారు.

జాతకశాస్త్రములో ఫలనిర్ణయము ఆరువిధములుగనున్నది. 1. గ్రహజము 2. భావజము 3. రాశిజము 4. గ్రహభావజము 5. గ్రహరాశిజము 6. యోగజము.

1. గ్రహములచే స్వతంత్రముగ వీయబడుఫలము గ్రహజము (గ్రహకారకత్వములు) 2. భావములచే స్వతంత్రముగ వీయబడుఫలము భావజము (భావకారకత్వములు) 3. రాశిస్వరూపాదులచే వీయబడుఫలము రాశిజము 4. తన్వాదిభావములందు గ్రహములుండుటచేత వీయబడుఫలము గ్రహభావజము 5. మేషాదిరాశులందు

గ్రహములుండుటచేత నీయబడుఫలము రాశిగ్రహజము 8. రాశిభావసంబంధముతో గ్రహములచేత నీయబడుఫలము యోగజము అని అనేకములు. ఈ ఫలితములను చెప్పుటలో కొందరు కొన్నివిషయములను, మరికొందరు కొన్నివిషయములను గ్రహించి గ్రంథములను రచించియున్నారు.

జాతక పారిజాత. సర్వార్థచింతామణి, భావార్థరత్నాకరము, భావప్రదీపము, మొదలగు గ్రంథములు పరాశరగ్రంథములోనున్నట్లు తన్వాదిద్వాదశ భావఫలాధ్యాయములను తెలుపుచున్నవి. బృహజ్జాతక, సారావళి, యవనజాతకాదిగ్రంథములు భావఫలములను వేరొకవిధముగ తెలుపుచున్నవి.

పరాశరహోరలో తన్వాదిద్వాదశ భావఫలనిర్ణయవిధానమునకు, యవన మతాదులందు భావఫలనిర్ణయవిధానమునకు వ్యత్యాసముగలదు.

పరాశరమతమునమసరించి భావవిచారణ చేయునపుడు పరాశరమతమునను సరించియే ఫలనిర్ణయమును చేయవలయును. ఈ నిర్ణయించినఫలము మతాంతరరీత్యా గూడవిచారించి ఉభయమతములందు నొకేరీతిఫలము గలిగినప్పుడుఫలమునవశ్యము చెప్పవలయును. ఫలతారతమ్యము గలిగినప్పుడు తత్తన్మతములందు చెప్పబడిన గ్రహబలము నాధారముగ చేసికొని ఫలమును నిర్ణయించవలయును. ఉదాహరణము నకు పరాశరోక్త షోడశవర్గ వివేకముచే ఫలమును చెప్పదలచినపుడా గ్రహభావము లకు వర్గవింశోపకబలమునుబట్టి ఫలము నూహించవలయును. భావస్థ గ్రహఫలమును చెప్పదలచినపుడు షడ్బలసాధనమునుబట్టి సాధించినబలమునుబట్టి ఫలమును నిర్ణయిం చవలయును. జైమినిమతము ననుసరించి ఫలమును నిర్ణయించునపుడా మతమందు చెప్పబడినబలమునే గ్రహించి ఫలములు నిర్ణయించవలయును. శాస్త్రమందుగల మతభేదములను బాగుగ విచారించి తత్తన్మతానుసారము గ్రహబలమునుబట్టి ఫలనిర్ణ యమును చేయవలసియుండును.

ఈ గ్రంథమందు భావేశఫలాధ్యాయములో చెప్పబడిన ఫలములకు యవన జాతకోక్త భావేశఫలాధ్యాయములో చెప్పబడిన ఫలములకుగల తారతమ్యమును తెలిసికొనుటకు భావేశఫలాధ్యాయమందు పరాశరయవన జాతకమతములు రెండును జూపబడినవి. అక్కడక్కడ తారతమ్యములు చూపబడినవి.

ఈ గ్రంథమందు "అప్రకాశకగ్రహఫలాధ్యాయము" గలదు. గ్రంథాంతరము లందు యీవిధానము చెప్పబడలేదు. భావఫలవిచారణ చేయునపుడీ విషయములను గూడ గ్రహించి ఫలమును చెప్పినచో ఫలితములనుభవములో సరిగనుండగలవు.

శతాధ్యాయ పరిమితమగు నీగ్రంథమును పూర్తిగ ముద్రించుటకు విశేష ధనము అవసరమగుటచేత దీనిని భాగములుగ ప్రకటించుటకు నిర్ణయించుకొని ప్రస్తుతము ప్రథమభాగమున 28 అధ్యాయములనుమాత్రము తాత్పర్య వివరణము లతో ప్రకటించితిని.

నేనీ గ్రంథమును ముద్రించుటకు విశేషప్రోత్సాహమునిచ్చి తగిన ద్రవ్యస హాయమును చేయించిన మామిత్రులు శ్రీ గోలి నరసింహారావుగారు (ప్లాంటు మేనే జరు - సుగర్ ఫ్యాక్టరి - చెల్లూరు) ముద్రణకు రు. 7000.00 లను విరాళముగ ఇచ్చి విశేషభారమును లెక్కచేయని వితరణశీలురగు శ్రీకోడూరు బహ్మాజ్యముగారు (తాపేశ్వరము) విశేషించి అభినందనీయులు. శ్రీ పార్వతీ పరమేశ్వరులువారికి వారి కుటుంబములకు దీర్ఘాయురారోగ్యైశ్వర్యములనిచ్చి రక్షించుగాతయని యాపార్వతీపర మేశ్వరులను ప్రార్థించుచుంటిని.

గ్రంథముద్రణ సమయమందు ప్రూఫులను చూచుటలోను, ఇతర కార్యక్రమ నిర్వహణములోను సహకరించిన నా కుమారులు చి॥ వెంకటేశ్వరశర్మ, పాలశంకర శర్మలకు, మా శిష్యుడు శ్రీనివాసశర్మకు నా ఆశీస్సులు.

గ్రంథమును ముద్రించుటలో శ్రద్ధవహించి జాగరూకతతో ముద్రించిన శ్రీ విజయశ్రీ ప్రెస్సు - రాజమండ్రి వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

గ్రంథము అనువాదము చేయుటలోను, వివరణము వ్రాయుటలోను నాబుద్ధికి తోచినంతవరకు జాగరూకతతో చేసితినని భావించుచుంటిని. కాని విశేషపరిశ్రమను చేసిన పండితులు నావలన గలిగిన దోషములను తెలియజేసినచో సవరించుకొనగలనని సవినయముగ మనవి చేయుచుంటిని.

## ఈ భాగమందు అనువాద వివరణములతో ప్రకటించిన అధ్యాయముల పట్టిక.

గ్రంథ ముద్రణమునకు ధనసహాయమును చేసిన

ఉదారచిత్తులు, సహాసుభ్యులు.



మ॥రా॥శ్రీ
హోతా సుబ్రహ్మణ్యముగారు.

ధర్మపత్ని
శ్రీమతి
సీతారామాంజరాజేశ్వరిగారు

తాపేశ్వరము.

# బృహత్పరాశర హోరా శాస్త్రము
## ప్రథమ భాగము
### విషయానుక్రమణిక

# సవరించుకొనవలసినవి

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 9 | 22 | ఉక్త్వం | ఉక్త్వ |
| 18 | 20 | మతాంతము | మతాంతరము |
| 22 | 1 | శ్చద | శ్చద్ర |
| 22 | 18 | గురోర్జ్ఞేయః | గురోః జ్ఞేయః |
| 38 | 13 | కావేష్ట | కాలేష్ట |
| 122 | 28 | వారి | వా |
| 224 | 13 | గ్రంథాంతముల | గ్రంథాంతరముల |
| 240 | 17 | శుక | శుక్ర |
| 241 | 22 | కళత్రమగును | కళత్రనష్టమగును |
| 248 | 21 | ద్వితీయ | ద్వితీయ |
| 250 | 18 | దీర్ఘా | దీర్ఘా |
| 278 | 3 | యవి | యవి |
| 279 | 1 | గహము | గ్రహము |
| 288 | 28 | వది. | వవి. |
| 348 | 28 | యుద్ధ | యుర్ధ |
| 378 | 26 | యుకి | యుకి |

శ్రీరస్తు
శ్రీ మహాగణాధిపతయేనమః
శ్రీ ప్రజ్ఞామేధా దక్షిణామూర్తి దేవతాభ్యోనమః

పరాశరమహర్షి ప్రణీత

# బృహత్పరాశర హోరా శాస్త్రము

(అర్థ తాత్పర్య వివరణ సహితము)

## టీకాకారకృతమఙ్గలాచరణము

సూర్యం చంద్రమసం భౌమం సౌమ్యం దేవపురోహితమ్।
భృగుజం సూర్యపుత్రం చ రాహుకేత్వాదికాన్ గ్రహాన్ ॥ ౧
పరాశరం మహాయోగిపుఙ్గవం జ్ఞానసాగరమ్।
జ్యోతిశ్శాస్త్రప్రవక్తారం ప్రణమ్య చ యథామతిః ౨
తత్కృతే జ్యోతిషే శాస్త్రే శతాధ్యాయమితస్య వై।
హోరాస్కంధస్య ప్రత్యక్షఫలదస్య కలౌయుగే॥ ౩
అత్రిగోత్రసముత్పన్నః కృష్ణశాస్త్రీత్యాహ్వయ సుధీః॥
కరోమి విపులాం టీకాం దైవజ్ఞానాం ముదే సదా॥ ౪

## అథ గ్రన్థావతరణమ్

శ్లో॥ అథైకదా మునిశ్రేష్ఠం త్రికాలజ్ఞం పరాశరమ్।
పప్రచ్ఛోపేత్య మైత్రేయః ప్రణిపత్య కృతాంజలిః॥ ౧

తా॥ ఒకానొకప్పుడు మైత్రేయ మహర్షి మునిశ్రేష్ఠుడును, త్రికాలజ్ఞుడు అగు పరాశర మహర్షిని సమీపించి సాష్టాంగ దండ ప్రణామముల నాచరించి కృతాంజలియై యిట్లు ప్రశ్నించెను.

మైత్రేయ ఉవాచ :- (మైత్రేయుడు పలికెను)

శ్లో॥ భగవన్! పరమం పుణ్యం గుహ్యం వేదాంగముత్తమమ్।
త్రిస్కంధం జ్యోతిషం హోరా గణితం సంహితేతి చ॥ ౧

ఏతేష్వపి త్రిషు శ్రేష్ఠా హోరేతి శ్రూయతే మునే
త్వత్త స్తాం శ్రోతు మిచ్ఛామి కృపయా వద మే ప్రభో॥ ౨
కథం సృష్టి రియం జాతా జగత శ్చ లయః కథమ్ ॥
ఖస్థానాం భూస్థితానాం చ సంబంధం వద విస్తరాత్ ॥ ౩

తా॥ పరాశర మహర్షిని మైత్రేయుడిట్లు ప్రశ్నించుచున్నాడు. ఓ మునీశ్వరా! పరమ పవిత్రమైనట్టియు, అతిరహస్యమైనట్టియు, వేదాంగములలో నుత్తమమైనట్టిదియు అగు జ్యోతి శ్శాస్త్రము హోరా, గణిత, సంహితలనెడు మూడు స్కంధములతో కూడి యున్నది. ఈ మూడు స్కంధములలోను హోరా స్కంధము అతి శ్రేష్ఠమైనదని తెలియుచున్నది. ఈ హోరా స్కంధమును నీ వలన వినవలయునని కుతూహల పడుచుంటిని.

కనుక నీవు దయగల వాడవై యీ శాస్త్రమును నాకు బోధించవలసినదియని ప్రార్థించుచున్నాను. ఓ మునీశ్వరా! ఈ సృష్టి ఎట్లు జరిగినది? ఈ సృష్టి యెట్లు లయము (నాశము)ను పొందుచున్నది? ఆకాశమందు సంచరించుచున్న నక్షత్ర గ్రహాదులకు భూమియందు సంచరించుచున్న సకల జీవరాశులకు గల సంబంధమెట్టిది? మొదలగు విషయములను సవిస్తరముగ నాకు తెలియచేయవలయునని ప్రార్థించు చున్నాను.

## సృష్టిక్రమ కథనా ధ్యాయము ॥౧॥

పరాశర ఉవాచ:- (పరాశరుడు చెప్పుచున్నాడు)

శ్లో॥ సాధు పృష్టం త్వయా విప్ర లోకానుగ్రహకారిణా ।
అథాహం పరమం బ్రహ్మ తచ్ఛక్తిం భారతీం పునః ॥ ౪
సూర్యం నత్వా గ్రహపతిం జగదుత్పత్తి కారణమ్।
వక్ష్యామి వేదనయనం యథా బ్రహ్మముఖా చ్ఛ్రుతమ్॥ ౫
శాన్తాయ గురుభక్తాయ సర్వదా సత్యవాదినే।
ఆస్తికాయ ప్రదాతవ్యం తతః శ్రేయో హ్యవాప్స్యతి॥ ౬

న దేయం పరశిష్యాయ నాస్తికాయ శఠాయ వా।
దత్తే ప్రతిదినం దుఃఖం జాయతే నాత్ర సంశయః॥ ౭

మైత్రేయుని ప్రశ్నమునకు పరాశరుడిట్లు చెప్పుచున్నాడు,

తా॥ ఓ విప్రోత్తమా! లోకమునకు హితమును చేకూర్చు తలంపుగలవాడవై లెస్సగ ప్రశ్నించితివి. నేను పరబ్రహ్మను అతని శక్తి స్వరూపిణియగు భారతీదేవిని, సర్వజగదుత్పత్తి హేతుభూతుడైనట్టి, గ్రహాధిపతియైనట్టియు సూర్యుని నమస్కరించి, బ్రహ్మ ముఖము నుండి జ్యోతిశ్శాస్త్రము నెట్లు వినియుంటినో అదే విధముగ చెప్పుచున్నాను. ఈ శాస్త్రమును శాంతిస్వభావము గలవానికి, గురుభక్తిగలవానికి, ఎల్లప్పుడు సత్యమునే చెప్పువానికి, ఆస్తికబుద్ధి గలవానికి, చెప్పవలయును. అట్లు చెప్పుటచేత శ్రేయోలాభము గలుగును. మరియు పరులకు శిష్యులైనవారికి, నాస్తికులకు, మూర్ఖులకు ఈ శాస్త్రమును చెప్పరాదు. అట్లు చెప్పినచో నిత్యము దుఃఖము గలుగును. సందేహాంశ మాత్రము లేదు.

అథ సృష్టిక్రమమాహ.

శ్లో॥ ఏకోఽవ్యక్తాత్మకో విష్ణు రనాదిః ప్రభు రీశ్వరః।
శుద్ధసత్త్వో జగత్స్వామీ నిర్గుణ స్త్రిగుణాన్వితః॥ ౮
సంసార కారకః శ్రీమాన్ నిమిత్తాత్మా ప్రతాపవాన్
ఏకాంశేన జగత్సర్వం సృజ త్యవతి లీలయా। ౯
త్రిపాదం తస్య దేవస్య హ్యమృతం తత్త్వదర్శినః।
విదంతి తత్ప్రమాణం చ సప్రధానం తథైకపాత్॥ ౧౦
వ్యక్తావ్యక్తాత్మకో విష్ణు ర్వాసుదేవస్తు గీయతే।
యదవ్యక్తాత్మకో విష్ణు శ్శక్తిద్వయ సమన్వితః॥ ౧౧
వ్యక్తాత్మక స్త్రిభి ర్యుక్తః కథ్యతే ఽనంతశక్తిమాన్।

తా॥ అద్వితీయుడైనట్టి, అవ్యక్త స్వరూపుడైనట్టి విష్ణువు అనాది, సర్వప్రభువు, శుద్ధసత్త్వుడు, జగత్స్వామి. నిర్గుణుడయ్యు త్రిగు

ణాన్వితుడు, సంసారకారకుడు, సర్వశక్తి సంపదలుగలవాడు, ప్రతాప
వంతుడును అగుచు విరాజిల్లుచున్నాడు. అట్టి సర్వ ప్రభువగు శ్రీ
మహావిష్ణువు తనయొక్క యేకాంశము (చరణము) వలన సమస్త
జగత్తుయొక్క సృష్టిస్థితులను చేయుచున్నాడు. ఆ మహావిష్ణువు
యొక్క మిగిలిన మూడు అంశము (చరణము) లను అమృతస్వరూప
ములుగా తత్త్వదర్శనులగు మహానుభావులు తెలుసుకొనుచున్నారు.
ప్రధానమైన యంశము ప్రకృతిగను, వ్యక్తావ్యక్త స్వరూపుడగు శ్రీ
మహావిష్ణువు వాసుదేవుడుగా కీర్తింపబడుచున్నాడు. అవ్యక్త స్వరూ
పుడగు శ్రీమహావిష్ణువు ద్వివిధములైన శక్తులతో కూడియుండెను.
శక్తిస్వరూపుడగు శ్రీమహావిష్ణువు శక్తిత్రయ సమన్వితుడై అనంత
శక్తియుక్తుడని చెప్పబడుచున్నాడు.

శ్లో॥ సత్త్వప్రధానా శ్రీశక్తి ర్భూశక్తిశ్చ రజోగుణా. ౧౨
శక్తిస్తృతీయా యా ప్రోక్తా నీలాఖ్యా ధ్వాంతరూపిణీ,
వాసుదేవ శ్చతుర్థో భూత్ శ్రీశక్త్యా ప్రేరితో యదా. ౧౩
సంకర్షణశ్చ ప్రద్యుమ్నోఽనిరుద్ధ ఇతి మూర్తిధృక్,
తమశ్శక్త్యాన్వితో విష్ణు ర్దేవ స్సంకర్షణాభిధః. ౧౪
ప్రద్యుమ్నో రజసా శక్త్యానిరుద్ధః సత్త్వయా యుతః॥

తా॥ శక్తిత్రయములో శ్రీశక్తి సత్త్వప్రధానముగను, భూశక్తి
రజోగుణ ప్రధానముగను, నీలశక్తి తమోగుణ ప్రధానముగను చెప్ప
బడుచున్నవి. ఈ మూడు శక్తులకంటె భిన్నమైన వాసుదేవుడు సత్త్వ
గుణప్రధానయగు శ్రీశక్తిచే ప్రేరితుడై సంకర్షణ, ప్రద్యుమ్న, అని
రుద్ధయను మూడు స్వరూపములను ధరించుచున్నాడు. ఈ మూడిం
టిలో తిరిగి సంకర్షణుడు నీలాశక్తితోను, ప్రద్యుమ్నుడు భూ (రజః)
శక్తితోను, అనిరుద్ధుడు సత్త్వశక్తితోను కూడుకొనియున్నాడు.

శ్లో॥ మహాన్ సంకర్షణా జ్జాతః ప్రద్యుమ్నో ద్యదహం కృతిః. ౧౫

శ్లో॥ అనిరుద్ధా త్త్వయంజాతో బ్రహ్మాహంకారమూర్తిధృక్,
సర్వేషు సర్వశక్తిశ్చ స్వశక్త్యాధికయా యుతః. ౧౬

తా॥ సంకర్షణుని వలన మహత్తు, ప్రద్యుమ్నునివలన నహంకారము, అనిరుద్ధుని వలన అహంకార స్వరూపుడగు బ్రహ్మయు స్వయముగ జన్మించిరి. వీరు ముగ్గురు పూర్వమందు చెప్పబడిన తమ తమ శక్తులతో కూడియుండిరి.

శ్లో॥ అహంకార స్త్రిధాభూత్వా సర్వ మేత దవిస్తరాత్।
సాత్త్వికో రాజస శ్చైవ తామసశ్చ దహంకృతిః. ౧౭
దేవా వైకారికా జ్జాతా స్తైజసా దింద్రియాణిచ,
తామసా చ్చైవ భూతాని ఖాదీని స్వస్వశక్తితః॥ ౧౮

తా॥ అహంకారము మూడు విధములు :- ఎట్లనగా సాత్త్వికము (వైకారికము) రాజసము (తైజసము) తామసము (భౌతికము) వీనిలో వైకారికాహంకారము వలన దేవగణము (దిక్కు, వాయువు, సూర్యుడు మొ॥) తైజసాహంకారము వలన నింద్రియ గణము (శ్రోత్రనేత్రాదులు) మరియు తామసాహంకారము వలన భూతాది గణము (పంచభూతాదులు, ఆకాశాదులు) పూర్వమందు చెప్పబడిన తమ తమ గుణములతో కూడినవై జన్మించినవి.

శ్లో॥ శ్రీశక్త్యా సహితో విష్ణుః సదా పాతి జగత్త్రయమ్।
భూశక్త్యా సృజతే బ్రహ్మా నీలశక్త్యా శివోఽత్తి హి. ౧౯

తా॥ శ్రీమహావిష్ణువు శ్రీశక్తితో కూడినవాడై జగత్త్రయము (మూడులోకముల) ను పరిరక్షించుచున్నాడు. బ్రహ్మ భూశక్తితో కూడినవాడై జగత్త్రయ సృష్టిని చేయుచున్నాడు. పరమశివుడు నీలశక్తితో కూడినవాడై జగత్త్రయము యొక్క లయము(నాశము) ను చేయుచున్నాడు.

శ్లో॥ సర్వేషు చైవ జీవేషు పరమాత్మా విరాజతే,
సర్వం హి తదిదం బ్రహ్మన్ః స్థితం హి పరమాత్మని. ౨౦

సర్వేషు చైవ జీవేషు స్థితం హ్యంశద్వయం క్వచిత్,
జీవాంశో హ్యధిక స్తద్వత్ పరమాత్మాంశకః కిల. ౨౧
సూర్యాదయో గ్రహా స్సర్వే బ్రహ్మకామద్విషాదయః.
ఏతే చాన్యే చ బహవః పరమాత్మాంశకాధికాః. ౨౨
శక్తయశ్చ తథైతేషా మధికాంశాః శ్రియాదయః,
స్వస్వశక్తిషు చాన్యాసు జ్ఞేయా జీవాంశకాధికాః. ౨౩

తా॥ సమస్త జీవములందు పరమాత్మ ప్రకాశించుచుండును. ఈ సమస్త జగత్తు బ్రహ్మయందు నిబిడీకృతమై యుండును. సమస్త జీవకోటియందు రెండురకముల యంశములు గలవు. 1. జీవాంశము, 2. పరమాత్మాంశము. ఈ రెండు అంశములలో కొన్నింటియందు జీవాంశమధికముగ నుండును, కొన్నింటియందు పరమాత్మాంశ మధికముగ నుండును. ఎట్లనగా ; సూర్యాది గ్రహములు. బ్రహ్మరుద్రాది దేవతలు. ఇతరములైన యవతార విశేషములు పరమాత్మాంశము నధికముగ గలవారగుచున్నారు. మరియు వీరియొక్క శక్తులగు లక్ష్మి మొదలగువారు గూడ పరమాత్మాంశము నధికముగ కలవారగుచున్నారు. ఇతరములైన దేవాది గణమందు, వారి వారి శక్తిగణమందు జీవాంశమధికముగ నుండును.

ఇతి

శ్రీ బృహత్పరాశరహోరాశాస్త్రే - గ్రన్థావతరణే సృష్టిక్రమ కథనాధ్యాయః ౧
ఇది శ్రీ బృహత్పరాశరహోరాశాస్త్రమందు గ్రంథావతరణమందు
సృష్టిక్రమ కథనాధ్యాయ మను ప్రథమాధ్యాయము ముగిసెను.

## అవతార కథనాధ్యాయము ౨

మైత్రేయ ఉవాచ:- (మైత్రేయుడు ప్రశ్నించుచున్నాడు)

శ్లో॥ రామకృష్ణాదయో యే యే హ్యవతారా రమాపతేః,
తేఽపి జీవాంశసంయుక్తాః కింవా? బ్రూహి మునీశ్వర. ౧

తా॥ ఓ మునిశ్రేష్ఠా ! రమాపతియగు శ్రీమహావిష్ణువుయొక్క రామకృష్ణాద్యవతారములు జీవాంశతో కూడినవా ! పరమాత్మాం

కముతో గూడినవా? యను విషయమును నాకు తెలుపవలయునని కోరుచున్నాను.

పరాశర ఉవాచ :— (పరాశర మహర్షి చెప్పుచున్నాడు)

శ్లో॥ రామః కృష్ణశ్చ భోవిప్రః నృసింహః సూకర స్తథా,
ఏతే పూర్ణావతారాశ్చ హ్యన్యే జీవాంశకాన్వితాః. ౨

తా॥ ఓ మైత్రేయా! రాముడు, కృష్ణుడు, నృసింహుడు, వరాహము అను 4 అవతారములు పూర్ణావతారములు, మిగిలిన అవతారములు జీవాంశమధికముగ గలవి.

వి॥ రాముడు, కృష్ణుడు, నృసింహుడు, వరాహము అను 4 అవతారములు పూర్ణావతారములనగా వీని యందు పరమాత్మాంశము సంపూర్ణముగనున్నది. మిగిలిన అవతారములగు మత్స్య, కూర్మ, వామన, రామ, బుద్ధ, కల్కి యను వానియందు జీవాంశ మధికముగ నున్నట్లు చెప్పబడినది.

శ్లో॥ అవతారా హ్యనేకాని హ్యజస్య పరమాత్మనః,
జీవానాం కర్మఫలదో గ్రహరూపీ జనార్దనః॥ ౩
దైత్యానాం బలనాశాయ దేవానాం బలవృద్ధయే,
ధర్మసంస్థాపనార్థాయ గ్రహాజ్జాతాః శుభాః క్రమాత్. ౪

తా॥ జన్మరహితుడైన పరమాత్మయొక్క యవతారము లనేకములు గలవు. అందు జీవులకు స్వస్వకృత కర్మఫలముల నిచ్చెడి సూర్యాది గ్రహస్వరూపుడగు జనార్దనుడను నామముగల రూపవిశేష మొకటి గలదు. దైత్యుల (పరులకు కష్టములను కలిగించెడి వారల) యొక్క నాశనము కొరకు, దేవతల (పరులకు హితమును కలిగించెడి వారల) యొక్క బలాభివృద్ధి కొరకు, ధర్మసంస్థాపన నిమిత్తము శుభప్రదములైన యవతారములు సూర్యాది గ్రహములవలన జన్మించినవి.

యథా :- (ఎట్లనగా)

శ్లో॥ రామోవతార స్సూర్యస్య చంద్రస్య యదునాయకః।
నృసింహో భూమిపుత్రస్య బుద్ధ స్సోమసుతస్య చ॥ ౫
వామనో విబుధేజ్యస్య భార్గవో భార్గవస్య చ।
కూర్మో భాస్కర పుత్రస్య సైంహికేయస్య సూకరః॥ ౬
కేతో ర్మీనావతారశ్చ యే చాన్యే తేపి ఖేటజాః।
పరాత్మాంశోఽధికో యేషు తే సర్వే ఖేచరాభిధాః॥ ౭

తా॥ నవగ్రహములలో ప్రధానుడగు శ్రీ సూర్యుని వలన రామావతారము, చంద్రుని వలన కృష్ణావతారము, కుజునివలన నృసింహావతారము, బుధునివలన బుద్ధావతారము, బృహస్పతి వలన వామనావతారము, శుక్రునివలన పరశురామావతారము, శనివలన కూర్మావతారము, రాహువువలన వరాహావతారము, కేతువువలన మీనావతారము కలిగినవి. వీనికంటె భిన్నములైన యవతారము లన్నియు గూడ గ్రహములవలననే అవతీర్ణములైనవి. వీనియందు అధికమైన పరమాత్మాంశము గోచరించుచుండునో యట్టియవతారము లన్నియు ఖేచర నామధేయములు (దేవవాచకములు) అగుచున్నవి.

శ్లో॥ జీవాంశోహ్యధికో యేషు జీవాస్తేవై ప్రకీర్తితాః।
సూర్యాదిభ్యో గ్రహేభ్యశ్చ పరమాత్మాంశవిఃసృతాః॥ ౮
రామకృష్ణా దయస్సర్వే హ్యవతారాభవంతివై
తత్రైవతే విలీయంతే పునఃకార్యోత్తరే సదా. ౯
జీవాంశ విస్సృతాస్తేషాంతేభ్యో జాతా వరాదయః,
తేఽపి తత్రైవలీయంతే తేఽవ్యక్తే సమయంతిహి. ౧౦

తా॥ జీవాంశమధికముగ యెవరియందు గోచరించునో వారు జీవులుగ చెప్పబడుచున్నారు. సూర్యాదిగ్రహములయొక్క అధిక పరమాత్మాంశము వలన బుట్టిన రామకృష్ణాదులు అవతారములుగ చెప్పబడుచున్నారు. అట్టి యవతార విశేషములు తమతమ కార్య

ములను పూర్తి చేసుకొని తిరిగి యాసూర్యాది గ్రహములలో లయ
మును పొందెదరు. ఇదే విధముగ సూర్యాది గ్రహములయొక్క
యధిక జీవాంశము వలన బుట్టిన మనుష్యాది జంతుసముదాయము
గూడ తమ తమ కర్మఫలముల ననుభవించి తిరిగి యా సూర్యాది
గ్రహములలో లయమును పొందుచుందురు. మరియు ప్రాకృతిక ప్రళ
యకాలమందు ఈ సూర్యాదిగ్రహములన్నియు గూడ నవ్యక్త పర
మాత్మయందు లీనమగుచుండును.

వి. సూర్యాది గ్రహములశక్తియందు పరమాత్మాంశము,
జీవాంశము అను రెండు అంశములు గలవు. ఆత్మాంశాధిక్యముగల
రామకృష్ణాద్యవతారవిశేషములు ధర్మసంస్థాపన నిమిత్తముద్భవించి
వారి వారి కార్యములు పూర్తియైన పిమ్మట మరల ఆత్మాంశము
నందు లయమగుననియు, జీవాంశ సంభూతులగు మనుష్యాదులు తమ
తమ కర్మఫలముల ననుభవించిన పిమ్మట జీవాంశమందు లయమగు
దురనియు తెలియచేయబడినందున జీవాంశ సంభూతులగు మనుష్యా
దులయొక్క కర్మఫల విచారణ చేయుటకు జ్యోతిశ్శాస్త్రము చెప్ప
బడినట్లు విశదమగుచున్నది.

శ్లో॥ ఇదం తే కథితం విప్ర సర్వం యస్మి న్నపే దితి,
భూతాన్యపి భవిష్యంతి తత్త 'జ్జానంతి తద్విదః. ౧౧
వినా తజ్జ్యోతిషం నాన్యో జ్ఞాతుం శక్నోతి కర్హిచిత్,
తస్మా దవశ్య మధ్యేయం బ్రాహ్మణైశ్చ విశేషతః. ౧౨
యో నర శ్శాస్త్రి మజ్ఞాత్వా జ్యోతిషం ఖలు నిందతి,
రౌరవం నరకం భుక్త్వా చాన్ధత్వం చాన్యజన్మని. ౧౩

తా॥ విప్రోత్తమా! ఈ విధముగ సృష్టియొక్క ఆరంభము,
సృష్టియొక్క లయము నీకు చెప్పబడినది. గతకాలములలో జరిగిన సృష్టి
లయములను గురించి, భవిష్యత్కాలములో జరుగబోవునట్టి సృష్టి

లయముల గురించి తత్త్వవేత్తలగు మహానుభావులు లెస్సగ తెలుసు కొనగలరు. ఇట్టి విజ్ఞానము జ్యోతిశ్శాస్త్రము వలననే తెలుసుకొను టకు వీలగును. వేరొక మార్గము వలన తెలుసుకొనుట కెవ్వారికిని శక్యముకాదు. కనుకనీ జ్యోతిశ్శాస్త్రము బ్రాహ్మణులచే నవశ్యముగ నభ్యసించదగినదై యున్నది. ఏ మానవుడు జ్యోతిశ్శాస్త్రమును సను గ్రముగ తెలుసుకొనకుండ నిందించునో యట్టి మానవుడు ఈ జన్మాంతమందు ఘోరమగు రౌరవ నరకము ననుభవించి జన్మాంతర మందు అంధుడై జన్మించి బహువిధ దుఃఖముల ననుభవించును.

ఇతిశ్రీబృహత్పరాశర హోరాశాస్త్రే అవతార కథనాధ్యాయోనామద్వితీయః॥
ఇది శ్రీ బృహత్పరాశర హోరాశాస్త్రమందు అవతారకథనాధ్యాయమను ద్వితీయాధ్యాయము ముగిసెను.

## అథగ్రహగుణ స్వరూపాధ్యాయః 3
### (గ్రహగుణ స్వరూపాధ్యాయము) 3

మైత్రేయ ఉవాచ :- (మైత్రేయుడు ప్రశ్నించుచున్నాడు)

శ్లో॥ కథితం భవతా ప్రేష్ఠ గ్రహావతరణం మునే,
తేషాం గుణస్వరూపాద్యం కృపయా కథ్యతాం పునః. ౧

తా॥ ఓ ముని శ్రేష్ఠా ! అత్యంత ప్రేమతో నీవు గ్రహావతర ణమును నాకు బోధించితివి. గ్రహములయొక్క గుణములు, స్వభావ ములు, వారి వారి యొక్క కారకత్వములు మొదలగు విషయముల నన్నింటిని దయగలవాడవై నాకు తెలియచేయవలసినదగ ప్రార్థించు చున్నాను.

పరాశర ఉవాచ :- (పరాశరుడు చెప్పుచున్నాడు)

శ్లో॥ శృణువిప్ర ః ప్రవక్ష్యామి భగ్రహాణాం పరిస్థితిమ్,
ఆకాశేయాని దృశ్యంతే జ్యోతిర్బింబాన్యనేకశః. ౨

తేషాం నక్షత్రసంజ్ఞాని గ్రహసంజ్ఞాని కానిచిత్,
తాని నక్షత్రనామాని స్థిరస్థానాని యానివై. ౩

తా॥ విప్రోత్తమా! నీవడిగిన ప్రశ్నమునకు సమాధానముగ ఆకాశమందుగల నక్షత్రములయొక్క, గ్రహములయొక్క, పరిస్థితిని నీకు సమగ్రముగ చెప్పుచున్నాను. సావధానచిత్తుడవై వినుము. ఆకాశమందనేకములైన జ్యోతిర్బింబము లేవిమనకు గనపడుచున్నవో వానికి నక్షత్రములని పేరు. అందులో కొన్నింటికి మాత్రము గ్రహములని సంజ్ఞ గలదు. ఏ జ్యోతిర్బింబము యొక్క స్థానములు ఎల్లప్పుడు స్థిరములై (తుల్యాంతరితములై) యుండునో వానికి నక్షత్రములని పేరు.

శ్లో॥ గచ్ఛన్తో భాని గృహ్ణంతి సతతం యే తు తే గ్రహాః,
భచక్రస్య నగాశ్వ్యంశా అశ్విన్యాదిసమాహ్వయాః. ౪
తద్ద్వాదశ విభాగాస్తు తుల్యా మేషాదిసంజ్ఞకాః,
ప్రసిద్ధా రాశయ స్సంతి గ్రహా స్సూర్యాదిసంజ్ఞకాః. ౫
రాశీనా ముదయో లగ్నం తద్వశా దేవ జన్మినామ్,
గ్రహయోగ వియోగాభ్యాం ఫలం చింత్యం శుభాశుభమ్. ౬

తా॥ ఆకాశమందు యే జ్యోతిర్బింబములు పూర్వాభిముఖముగ సంచరించుచు, నక్షత్రభోగమును చేయుచున్నవో వానికి గ్రహములని పేరు. భచక్రము 27 భాగములై అశ్విన్యాది 27 నక్షత్రములతో కూడియున్నది. అట్టి భచక్రము 12 భాగములుగ చేయబడినదై మేషాది ద్వాదశ రాశులతో కూడియున్నది, మేషాదిరాశులు. రవ్యాది గ్రహములు ప్రసిద్ధములై యున్నవి. జననకాలమున ఉదయించు రాశికి జన్మలగ్నమని పేరు. ఈ జన్మలగ్నమును బట్టి జననసమయమునకుగల గ్రహయోగ, గ్రహవియోగాదులను బట్టి జీవుల (మనుష్యాదుల) యొక్క జీవితకాలమందు జరుగబోవు శుభాశుభము

లను (పాప పుణ్య కర్మఫలరూపములగు శుభాశుభములను) విచారించ వలయును.

శ్లో॥ సంజ్ఞా నక్షత్రబృందానాం జ్ఞేయా స్సామాన్యశాస్త్రతః
ఏతచ్ఛాస్త్రాను సారేణ రాశి-ఖేటఫలం బ్రువే. ౭

తా॥ అశ్విన్యాది నక్షత్ర సముదాయము యొక్క సంజ్ఞలను సామాన్యశాస్త్రము (నారద, వశిష్ఠ, గర్గాది ప్రణీత సంహితా గ్రంథ ముల) వలన తెలుసుకొనవలయును. ఈ శాస్త్రము ననుసరించి రాశులయొక్క గ్రహముల యొక్క సంయోగ వియోగముల వలన గలుగు శుభాశుభ ఫలములను తెలుసుకొనవలయును.

శ్లో॥ యస్మిన్ కాలే యతః ఖేటా యాన్తి దృగ్గణితైక్యతామ్,
తత ఏవ స్ఫుటాః కార్యాః దిక్కాలౌ చ స్ఫుటౌ విదా. ౮

తా॥ ఏ కాలమందు యే సిద్ధాంత గ్రంథము ననుసరించి సాధించబడిన గ్రహములు దృక్తుల్యములుగ నుండునో ఆయా కాల ములందు ఆయా సిద్ధాంత గ్రంథముల ననుసరించి గ్రహములను, దిక్కాలములను స్పష్టముగ సాధించవలయును. మరియు లగ్నమును సాధించునపుడు జన్మించిన ప్రదేశమునకు (స్వదేశమునకు) గణితముచే సాధించబడిన స్ఫుటలగ్న ప్రమాణములను గ్రహించి. వానివలన లగ్నాది సాధనమును చేయవలయును.

వి॥ పరాశర మహర్షి పై శ్లోకములలో దృక్సిద్ధ గ్రహముల వలన, దృక్సిద్ధ స్వదేశీయ లగ్నప్రమాణముల వలన జాతక గణితము లను సాధించి, జాతకుల యొక్క జన్మాంతరీయ కర్మఫల రూప శుభా శుభ ఫలములను విచారణ చేయువలయునని చెప్పినాడు. ప్రాచీన మహర్షులచే రచింపబడిన బ్రహ్మ, వశిష్ఠ, వ్యాస, పరాశర, సౌరాది సిద్ధాంత గ్రంథముల వలన సాధించబడు గ్రహము లీకాలములో వేధ సిద్ధ గ్రహములతో సామ్యము నొందకపోవుటచే ప్రాచీన గ్రంథము

లందు బీజకల్పన చేసిగాని లేక ఆధునిక గ్రంథ సహాయము చేతగాని గ్రహాదులను సాధించవలయును. ప్రాచీనులందరు ఈ అభిప్రాయమునే తెలిపియున్నారు.

జాతకసార దీపము 'దృగ్గణితైక్య సంస్థాపనాధ్యాయము' లో—

జాతకాదిషు సర్వత్ర గ్రహైర్జ్ఞానం ప్రజాయతే,
తస్మాద్దృక్తుల్య గణితా త్స్వతంత్రా త్సాధయే ద్గ్రహాన్.
వివాహే జాతకే యాత్రా ప్రశ్నే వాస్తు వ్రతాదిషు,
జ్యోతిశ్శాస్త్రే ఫలం సర్వం ప్రస్ఫుటద్యుచరాశ్రయాత్.
తత్ర సమ్యక్ప్రకారేణ ప్రవక్తుం నైవ శక్యతే,
సిద్ధాంతానాం తు సర్వేషాం సామ్యతాప్తి మిథో యతః।
ప్రత్యక్షసమయా చైత్రే యేన పక్షేణ యత్ర వై.
స్ఫుటం దృక్తుల్యతాం యాంతి తేన సర్వే విపశ్చితః. అనియు,

"జ్యోతిర్వివరణ" మందు —

యాత్రోద్వాహ ప్రకృతిషు ఫలం స్పష్టఖేటాశ్రయం యత్,
తస్మా త్తత్సాధన మిహ బుధై ర్వ్యాపితేఽపి క్వచిత్తే,
స్పష్టా న స్యుః పరమపురుషాంశా శ్చలా లక్ష్యదారా
న్తస్మా త్సాధ్యా బహువిధమతై ర్నైకపక్షాభిమానః. అనియు,

"దామోదర" పద్ధతియందు —

యాంతి సంసాధితాః ఖేటాః యేన దృగ్గణితైకతామ్।
తేన పక్షేణ తే కార్యాః స్ఫుటా ప్రత్యయయోద్భవాః: అనియు,

'సర్వార్థ చింతామణి' "సంజ్ఞాధ్యాయములో"

స్ఫుటగ్రహాన్ లగ్నముఖాది భావాన్,
ససంధికాన్ దృక్సమతాప్త సిద్ధాన్,
సంపాద్య పూర్వోక్త విచారసిద్ధ,
బలేన సంజ్ఞాది ఫలం విమృగ్యమ్, అనియు చెప్పినారు.

ఇట్లు ప్రాచీన గ్రంథకర్తలు దృక్సిద్ధ గ్రహసాధనములు చేసి, వానివలన జాతకాది సర్వవిషయములను విచారించవలెననియు, తమ తమ కాలములలో నేగ్రంథములను బట్టి సాధించబడిన గ్రహములు దృక్తుల్యములుగ నుండునో యా గ్రంథములను బట్టి గ్రహగణితాదులను చేయువలయుననియు, కాలాంతరమందీ సమయమున సరిపడుచున్న గ్రంథమునుబట్టి సాధించబడు గ్రహము లాకాలములో సరిపడని పక్షమున యా కాలమునకు సరిపడునట్లు గ్రంథములను సరిచేసుకొనిగాని, నూతన గ్రంథములను రచించుకొనిగాని తాత్కాలిక దృక్సిద్ధముగ గ్రహసాధనమును చేసుకొని వ్యవహరించవలయుననియు చెప్పియున్నారు. కనుక సర్వకాలములందు దృగ్గణితమునే సాధించుకొనవలయును. అట్లుగాని పక్షమున గ్రహగణితములందు స్థౌల్య మేర్పడి ఫలితము లనుభవములో సరిపడక వ్యతిరేకముగ జరుగుచుండును. దానివలన జ్యోతిశ్శాస్త్రమునకు లోకాదరణము తగ్గును. కనుక సుశిక్షితుడగు జ్యోతిశ్శాస్త్రజ్ఞుడు సర్వవిధముల దృగ్గణితము చేతనే వ్యవహరించవలయును. దృగ్విసంవాద గ్రంథములననుసరించి గ్రహ గణితాదుల నెంతమాత్రము చేయరాదు.

శ్లో॥ అథా ఔ వచ్మి ఖేటానాం జాతి రూప గుణానహమ్॥ ౯

తా॥ అనంతరము ముందుగ గ్రహముల యొక్క జాతి రూప గుణములను చెప్పుచున్నాను.

శ్లో॥ అథ ఖేటా రవిశ్చంద్రో మంగళశ్చ బుధస్తథా।
గురుః శుక్రః శనీ రాహుః కేతుశ్చైతే యథాక్రమమ్॥ ౧౦

తా॥ సూర్యుడు; చంద్రుడు, కుజుడు, బుధుడు, గురుడు, శుక్రుడు, శని రాహువు, కేతువు అని గ్రహములు 9 గలవు.

శ్లో॥ తత్రార్క శవిభూపుత్రాః క్షీణేందు రాహుకేతవః।
క్రూరా శ్శేషగ్రహాస్సౌమ్యాః క్రూరః క్రూరయుతో బుధః॥ ౧౧॥

తా॥ పైన చెప్పిన 9 గ్రహములలో [రవి, శని, కుజ, క్షీణ చంద్ర, రాహు, కేతువులు పాపగ్రహములు. మిగిలిన బుధ, గురు, శుక్ర, పూర్ణ చంద్రులు శుభులు. పాపులతో గూడిన బుధుడు పాప గ్రహము] అని గ్రహించవలయును.

వి॥ క్షీణచంద్రి, పూర్ణ చంద్రి విషయమై "కాలామృతము" ప్రథమ బిందువు 6వ శ్లో॥లో

అష్టమ్యోరుభయోశ్చ మధ్యమ గతశ్శుక్లాన్యయోర్వ్యత్యయే।
పూర్ణః క్షీణ ఇతి క్రమాచ్ఛశధరః . . . . . . . ॥

[ప్రతిమాసమందు శుక్లాష్టమి మొదలు కృష్ణాష్టమి పర్యంతము చంద్రుడు పూర్ణుడు] [కృష్ణాష్టమి మొదలు శుక్లాష్టమి పర్యంతము చంద్రుడు క్షీణుడు]

పరాశర ఉవాచ :—

శ్లో॥ సర్వాత్మాచదివానాథో మనః కుముదబాంధవః
సత్త్వంకుజో బుధైః ప్రోక్తోబుధో వాణీప్రదాయకః, ౧౨
దేవేజ్యో జ్ఞాన సుఖదోభృగుర్వీర్య ప్రదాయకః,
ఋషిభిః ప్రాక్తనైః ప్రోక్తశ్ఛాయాసూనశ్చ దుఃఖదః. ౧౩

పరాశరుడు చెప్పుచున్నాడు.

సమస్త చరాచర ప్రపంచమునకు [సూర్యుడు ఆత్మస్వరూపుడు. చంద్రుడు మనస్స్వరూపుడు. కుజుడు బలమునిచ్చెడివాడు, బుధుడు వాక్కునిచ్చువాడు. గురుడు జ్ఞానమును, సుఖమును కలిగించువాడు. శుక్రుడు వీర్యప్రదుడు. శని దుఃఖములనుకలిగించువాడు] అగుచుందురు.

రవిచంద్రౌతు రాజానౌ నేతాక్షేమోధరాత్మజః।
బుధో రాజకుమారశ్చ సచివౌ గురుభార్గవౌ. ౧౪
ప్రేష్యకో రవిపుత్రశ్చ సేనాస్వర్భానుపుచ్ఛకౌ,
ఏవం క్రమేణవై విప్ర। సూర్యాదీన్ ప్రవిచింతయేత్. ౧౫

ఓ విప్రోత్తమా! గ్రహములలో రవి చంద్రులు రాజులు, కుజుడు సైన్యాధిపతి, బుధుడు రాజకుమారుడు (యువరాజు) గురు శుక్రులు మంత్రులు., శని సేవకుడు. రాహుకేతువులు సైన్యము ఈ విధముగ సూర్యాది గ్రహములను తెలుసుకొనవలయును.

## గ్రహవర్ణములు

రక్తశ్యామో దివాధీశో గౌరగాత్రో నిశాకరః.
నాత్యుచ్చాఙ్గో కుజో రక్తో దూర్వాశ్యామో బుధస్తధా
గౌరగాత్రో గురుర్జ్ఞేయః శుక్రశ్శ్యావస్తథైవచ,
కృష్ణదేహో రవేః పుత్రో జ్ఞాయతే ద్విజసత్తమ. ౧౬

సూర్యుడు రక్తశ్యామ వర్ణము గలవాడు. చంద్రుడు గౌర వర్ణము గలవాడు. కుజుడు మధ్యమ శరీరముగల రక్తవర్ణము గల వాడు, బుధుడు దూర్వాశ్యామ వర్ణము గలవాడు, శుక్రుడు శ్యావ (చిత్ర) వర్ణముగలవాడు, శని కృష్ణవర్ణము గలవాడు అనుచున్నారు.

## గ్రహదేవతలు

వహ్న్యంబు శిఖిజా విష్ణు బిడౌజః శచికాద్విజ,
సూర్యాదీనాం ఖగానాంచ దేవాజ్ఞేయాః క్రమేణచ. ౧౭

సూర్యునకు అగ్ని, చంద్రునకు జలము, కుజునకు కార్తికేయుడు బుధునకు విష్ణువు, గురునకు ఇంద్రుడు, శుక్రునకు ఇంద్రాణి, శనికి బ్రహ్మ దేవతలనుచున్నారు.

వి॥ మతాంతము. శ్లో)

శివఃశివా గుహోవిష్ణు ర్బ్రహ్మేన్ద్రః కాలఏవచ,
రవ్యాదీనాంక్రమేణోక్తా గ్రహాణామధిదేవతాః.

సూర్యునకు శివుడు, చంద్రునకు పార్వతి, కుజునకు గుహుడు (కుమారస్వామి), బుధునకు విష్ణువు, గురునకు బ్రహ్మ, శుక్రునకు ఇన్ద్రుడు, శనికి యముడు అధిదేవతలుగ చెప్పబడుచున్నారు.

## గ్రహలింగ భేదములు

క్లీబౌ ద్వౌ సౌమ్య సౌరీ చయువతిన్దుభృగూ ద్విజ ।
నరాః శేషాశ్చ విజ్ఞేయా భానుర్భౌమో గురుస్తథా॥ ౧౯
అగ్ని భూమినభస్తోయవాయవః క్రమతో ద్విజ,
భౌమాదీనాం గ్రహాణాంచ తత్త్వానీతి యథాక్రమమ్, ౨౦

[బుధ శనులు నపుంసకులు, చంద్ర శుక్రులు స్త్రీలు, శేషించిన రవి, కుజ, గురువులు పురుషులు] (కుజుడు అగ్నికి, బుధుడు భూమికి గురుడాకాశమునకు, శుక్రుడు జలమునకు, శని వాయువునకు భూతాధిపతులగుచున్నారు.

వి॥ [బుధుడు స్త్రీ నపుంసకుడని, శని పుంనపుంసకుడనియు బృహజ్జాతకనౌకా వ్యాఖ్యాత వివరించెను.]

గురు శుక్రౌ విప్రవర్ణౌ కుజార్కౌ-క్షత్రియౌ ద్విజ।
శశిసౌమ్యౌ వైశ్యవర్ణౌ శనిః శూద్రో ద్విజోత్తమ॥ ౨౧
జీవసూర్యేందవఃసత్త్వం బుధ శుక్రౌ రజస్తథా,
సూర్యపుత్ర-ధరాపుత్రౌ తమః ప్రకృతికౌ ద్విజ. ౨౨

[గురు శుక్రులు బ్రాహ్మణులు, రవి కుజులు క్షత్రియులు. చంద్రబుధులు వైశ్యులు, శని శూద్రుడు] అని గ్రహించవలెను. గురు, రవి, చంద్రులు సాత్త్విక గుణము గలవారు. బుధ శుక్రులు రజోగుణము గలవారు. శని కుజులు తమో గుణము గలవారు.]

## : నవగ్రహ స్వరూపాణి :

### ( నవగ్రహ స్వరూపములు )

రవి స్వరూపం

మధుపిఙ్గల దృక్సూర్యః చతురస్రః శుచిర్ద్విజ,
పిత్తప్రకృతికో ధీమాన్ పుమానల్పకచో ద్విజ, ౨౩

[సూర్యుడు తేనెరంగువలె పింగల వర్ణముగల నేత్రములు గలవాడు. చతురస్ర దేహము గలిగినవాడు. పరిశుద్ధుడు, పిత్త ప్రకృతిగలవాడు. ధీమంతుడు. పురుషుడు, అల్పమైన కేశశోభ గలవాడు.]

బహువాతకఫః ప్రాజ్ఞః చంద్రోవృత్తతనుర్ద్విజః,
శుభదృఙ్మధువాక్యశ్చ చంచలో మదనాతురః. ౨౪

చంద్రుడు వాతకఫ ప్రకృతి గలవాడు, పండితుడు. గుండ్రని శరీరమును ధరించినవాడు. శుభదృష్టి గలవాడు, మధురవాక్కు గలవాడు, చంచల స్వభావుడు. కామ పీడితుడు అని గ్రహించవలెను.

క్రూరోరక్తేక్షణోభౌమ శ్చపలో దారమూర్తికః,
పిత్తప్రకృతికః క్రోధీ కృశమధ్యతనుర్ద్విజః. ౨౫

కుజుడు క్రూరుడు, ఎఱ్ఱని నేత్రములు గలవాడు, చంచలుడు, ఉదారహృదయము గలవాడు, పిత్త ప్రకృతి గలిగినవాడు. క్రోధ మెక్కువ గలవాడు, కృశించిన, మధ్యమమైన దేహము గలవాడుగ చెప్పబడుచున్నాడు.

వపుః శ్రేష్ఠఃశ్లిష్టవాక్చహ్యతి హాస్యరుచిర్బుధః,
పిత్తవాన్కఫవాన్విప్రః మారుత ప్రకృతి స్తథా। ౨౬

బుధుడు సుందరమైన దేహముగలవాడు, (శ్లేషతో కూడిన వాక్కు గలవాడు. ఒక మాటలో ననేకార్థములు వచ్చునట్లు మాట్లాడుటకు శ్లేషయందురు.) హాస్యమందు ప్రీతి గలవాడు, వాత,పిత్త, కఫ ప్రకృతి గలవాడు అగుచున్నాడు.

బృహద్గాత్రో గురుశ్చైవ పింగలే మూర్ధజేక్షణే,
కఫప్రకృతికోధీమాన్ సర్వశాస్త్ర విశారదః. ౨౭

గురుడు విశాలమైన దేహము గలవాడు, పింగల వర్ణముగల కేశములు, నేత్రములు గలవాడు, కఫప్రకృతి గలవాడు, ధీమంతుడు, సర్వశాస్త్ర పారంగతుడని గ్రహించవలెను.

సుఖీకాన్తవపుః శ్రేష్ఠఃసులోచనో భృగోస్సుతః,
కావ్యకర్తా కఫాధిక్యో విలాశ్మా వక్రమూర్ధజః. ౨౮

శుక్రుడు సుఖము గలవాడు, సుందరమైన దేహము గలవాడు, శ్రేష్ఠుడు, యోగ్యమైన నేత్రములు గలవాడు, కావ్యరచన చేయు

వాడు, కఫవాతప్రకృతి గలవాడు, మెలికలు తిరిగిన వెంట్రుకలు (కేశములవాడు) అగుచున్నాడు.

కృశదీర్ఘ తనుస్సౌరిః పింగదృష్ట్యనిలాత్మకః,
స్థూలదంతో లసత్పంగుః ఖరరోమకచోద్విజ.

శని కృశించిన, పొడవైన దేహము గలవాడు, పింగళవర్ణము గల నేత్రములు గలవాడు, వాతప్రకృతి గలవాడు, పెద్ద దంతములు గలవాడు, ప్రకాశించెడి సమూహము గలవాడు. కఠినమైన రోమములు, కేశములు గలవాడని చెప్పబడెను.

ధూమ్రాకారో నీలతనుర్వనస్థోఽపి భయంకరః,
వాతప్రకృతికో ధీమాన్ స్వర్భానుస్తత్సమః శిఖీ. ౩౦

రాహువు పొగవంటి ఆకారము గలవాడు, నల్లని శరీరము గలవాడు, వనములందు సంచరించెడివాడు, భయంకరుడు, వాతప్రకృతిగలవాడు ధీమంతుడని తెలుసుకొనవలెను. కేతువు కూడ రాహువుతో సమానమైన గుణములు గలవాడని గ్రహించవలెను.

అస్థిరక్తస్తథా మజ్జా త్వగ్వసా వీర్యమేవచ,
స్నాయురేషామధీశాశ్చ క్రమాత్సూర్యాదయో ద్విజ.

రవి ఎముకలకు, చంద్రుడు రక్తమునకు, కుజుడు మజ్జ (ఎముకలలో నుండెడి నేయివంటి పదార్థము)కు, బుధుడు చర్మమునకు, వస (మాంసమందుండు క్రొవ్వు) కు, శుక్రుడు వీర్యమునకు, శని స్నాయువుల (నరముల) కు అధిపతులగుచున్నారు.

దేవాలయజలం వహ్నిక్రీడాదీనాం తథైవచ,
కోశశయ్యోత్కరాణాన్తు నాథాః సూర్యాదయః క్రమాత్. ౩౨

సూర్యుడు దేవాలయములకు, చంద్రుడు జలాశయములకు, కుజుడు అగ్నిస్థానములకు, బుధుడు క్రీడాస్థలములకు, గురుడు కోశాగారములకు, శుక్రుడు శయ్యాగృహములకు, శని మలిన ప్రదేశములకు అధిపతులగుచున్నారు.

అయనక్షణవారర్తు మాసపక్షసమాద్విజ,
సూర్యాదీనాం క్రమాత్ జ్ఞేయా విర్విశంకం ద్విజోత్తమ. ౩౩

[సూర్యుడు అయనములకు, చంద్రుడు ముహూర్తమునకు, కుజుడు అహోరాత్రమునకు, బుధుడు ఋతువునకు, గురుడు మాసమునకు, శుక్రుడు పక్షమునకు, శని సంవత్సరమునకు అధిపతులగుచున్నారు.

కటుక్షార తిక్త మిశ్రమధురామ్ల కషాయకాః,
క్రమేణ సర్వేవిజ్ఞేయాః సూర్యాదీనాం రసాఇతి. ౩౪

రవి కటు (కారము) రసమునకు, చంద్రుడు క్షార (ఉప్పు) రసమునకు, కుజుడు తిక్త (చేదు) రసమునకు, బుధుడు మిశ్రమరసమునకు, గురుడు మధుర (తీపి) రసమునకు, శుక్రుడు అమ్ల (పులుపు) రసమునకు, శని కషాయ (ఒగరు) రసమునకు అధిపతు లగుచున్నారు.

బుధే జ్యౌబలినౌ పూర్వే రవిభౌమౌ చ దక్షిణే,
పశ్చిమే సూర్యపుత్రశ్చ సితచంద్రౌ తథోత్తరే. ౩౫

బుధ గురులు తూర్పు దిక్కునందు, రవి కుజులు దక్షిణదిక్కునందు, శని పశ్చిమమందు, శుక్ర చంద్రులు ఉత్తరమందు బలవంతులగుచున్నారు.

నిశాయాంబలినశ్చంద్ర కుజ సౌరా భవన్తిహి,
సర్వదాజ్ఞో బలీజ్ఞేయో దినేశేషా ద్విజోత్తమ. ౩౬

చంద్ర కుజ శనులు రాత్రియందు. రవి, గురు, శుక్రులు పగటియందు బుధుడు అహోరాత్రమందు (సర్వకాలమందు) బలవంతులగుచున్నారు.]

కృష్ణేచ బలినః క్రూరాః సౌమ్యావీర్య యుతాః సితే,
సౌమ్యాయనే సౌమ్యఖేటో బలీ యామ్యాయనేఽపరః. ౩౭

క్రూరగ్రహములగు రవి, క్షీణచంద్ర, కుజ, పాపయుత బుధ, శనులు కృష్ణపక్షమందు, సౌమ్యగ్రహములగు పూర్ణచంద్ర, బుధ,

గురు, శుక్రులు శుక్ల పక్షమందు, బలవంతులగుదురు. శుభగ్రహము ఉత్తరాయణమందు, పాపగ్రహము దక్షిణాయనమందు బలముగలిగి యుండును.]

(వర్షమాసాహ హోరాణాం పతయో బలినస్తథా,
శమంబుగు శుచంరాద్యా వృద్ధితో వీర్యవత్తరాః ౩౮

[వర్షాధిపతి, మాసాధిపతి మరియు హోరాధిపతి తమ తమ సమయములలో ఉత్తరోత్తరముగ బలవంతులగుదురు.] మరియు [శని, కుజ, బుధ, గురు, శుక్ర, పూర్ణచంద్ర, రవులు క్రమముగ నొకరి కంటె నొకరు బలవంతులగుదురు.]

వి॥ శనికంటె కుజుడు బలవంతుడు, కుజునికంటె బుధుడు బలవంతుడు, బుధునికంటె గురుడు బలవంతుడు, గురునికంటె శుక్రుడు బలవంతుడు, వానికంటె పూర్ణచంద్రుడు బలవంతుడు, వానికంటె రవి బలవంతుడు, సర్వగ్రహములలోను రవి బలవంతుడుగను, శని బలహీనుడుగను చెప్పబడుచున్నారు.

శ్లో॥ సూర్యో జనయతి స్థూలాన్ దుర్భగాన్ (సూర్యపుత్రకః)
క్షీరోపేతాం స్తథా చంద్రః కటుకాద్యాన్ ధరాసుతః.
పుష్పవృక్షం భృగోః పుత్రః గురుజ్ఞౌ సఫలాఫలౌ.
నీరసాన్ (సూర్యపుత్రశ్చ) ఏవం జ్ఞేయా ఖగా ద్విజ.

తా॥ [సూర్యుడు సారవంతములైన వృక్షములను, శని కుత్సితములైన వృక్షములను, చంద్రుడు క్షీర వృక్షములను, కుజుడు కటుక (నింబాది) వృక్షములను శుక్రుడు పుష్ప వృక్షములను, గురుడు ఫల వృక్షములను, బుధుడు ఫలరహిత వృక్షములను, శని నీరస వృక్షములను జనింపచేయుదురు.]

రాహుశ్చండాలజాతిశ్చ కేతుర్జాత్యంతర స్తథా,
శిఖిస్సర్పానుమందానాం వల్మీకం స్థాన ముచ్యతే. ४०

చిత్రకంథా ఫణీంద్రస్య కేతో శ్ఛిద్రయుతో ద్విజ,
సీసం రాహో శ్శీలమణిః కేతో ర్జ్ఞేయో ద్విజోత్తమ. ४२

గురోః పీతాంబరం విప్ర భృగోః క్షౌమం తథైవ చ,
రక్తక్షౌమం భాస్కరస్య ఇందోః క్షౌమం సితం ద్విజ. ४३

బుధస్య కృష్ణక్షౌమం తు రక్తవస్త్రం కుజస్య చ
వస్త్రం చిత్రం శనే ర్విప్ర పట్టవస్త్రం తథైవ చ. ४४

తా॥ రాహువు చండాలుడు, కేతువు జాత్యంతరుడు (మ్లేచ్ఛుడు). శని రాహు, కేతువులకు వల్మీకము (పుట్ట) నివాసస్థానము. రాహువునకు చిత్రవస్త్రము, కేతువునకు ఛిద్రవస్త్రము (చినిగిన గుడ్డలు). రాహువునకు సీసము, కేతువునకు సీలమణి ధాతువులగుచున్నవి. గురునకు పీతాంబరము, శుక్రునకు పట్టువస్త్రము, రవికి ఎరుపురంగు గల వస్త్రము, చంద్రునకు తెల్లని వస్త్రము, బుధునకు నల్లని వస్త్రము, కుజునకు ఎఱ్ఱని వస్త్రము. శనికి చిత్రవర్ణముగల వస్త్రము అని గ్రహించవలయును.

## ఋతువులకధిపతులు

శ్లో॥ భృగో ర్ఋతు ర్వసంతశ్చ కుజభాన్వో శ్చ గ్రీష్మకః,
చంద్రస్య వర్షా విజ్ఞేయా శరచ్చైవ తథా విదః. ४५
హేమంతోపి గుర్తోర్జ్ఞేయః శనేస్తు శిశిరో ద్విజ,
అష్టౌ మాసాశ్చ స్వర్భానోః కేతో ర్మాసత్రయం ద్విజ. ४६

తా॥ శుక్రుడు వసంతర్తువునకు, రవికుజులు గ్రీష్మర్తువునకు, చంద్రుడు వర్షర్తువునకు, బుధుడు శరదృతువునకు, గురుడు హేమంతమునకు, శని శిశిరర్తువునకు అధిపతులు. రాహువు 8 మాసములకు, కేతువు 3 మాసములకు, అధిపతులగుచున్నారు.

వి॥ రాహువునకు 8 మాసములు, కేతువునకు 3 మాసములు యే యే మాసములో వివరించలేదు. "దేవచంద్రఝా" హిందీ వ్యాఖ్యతో గూడిన పరాశరహోర యందు "కేతోర్మాసద్వయ" మని కేతువు 2 మాసముల కధిపతియని పాఠాంతరము చూపబడెను. ఋతువులు సాయన, నిరయన భేదముచేత 2 విధములు. సాయనమేష, వృషభములు వసంతర్తువు, మిథున కర్కాటకములు గ్రీష్మర్తువు, సింహ కన్యామాసములు, వర్షర్తువు, తులావృశ్చికమాసములు శరదృతువు, ధనుర్మకర మాసములు హేమంతర్తువు, కుంభ మీన మాసములు శిశిరర్తువు. ఇవి సాయన మేషాది రాశులందు సూర్యుని సంచారముచే సంభవించును.

లోకవ్యవహారములో నిరయన మేషాది రాశులందు సూర్యుని సంచారముచే ఋతువులు గ్రహింపబడుట లేదు. చాంద్రమానముచే చైత్రవైశాఖములు వసంతము, జ్యేష్ఠ ఆషాఢములు గ్రీష్మము. శ్రావణ భాద్రపదములు వర్షర్తువు, ఆశ్వయుజ కార్తికములు శరదృతువు, మార్గశీర్ష పౌషములు హేమంతము, మాఘ ఫాల్గుణ మాసములు శిశిరర్తువు అని వ్యవహరింపబడుచున్నవి. గాని వాస్తవముచే సాయన మేషము నుండియే ఋతు విభాగమును చేసుకొనవలయును. అట్లు విభజించిన యెడల నీ క్రింది విధముగ వచ్చును.

| ఋతువు | ప్రారంభము | అంత్యము | అధిపతి |
|---|---|---|---|
| 1. వసంతము | 20 తే॥ మార్చి | 19 తే॥ మేయి | శుక్రుడు |
| 2. గ్రీష్మము | 20 ,, మేయి | 19 ,, జూలై | కుజుడు, రవి |
| 3. వర్షము | 20 ,, జూలై | 19 ,, సెప్టెంబరు | చంద్రుడు |
| 4. శరత్తు | 20 ,, సెప్టెంబరు | 19 ,, నవంబరు | బుధుడు |
| 5. హేమంతము | 20 ,, నవంబరు | 9 ,, జనవరి | గురుడు |
| 6. శిశిరము | 20 ,, జనవరి | 19 ,, మార్చి | శని |

(సాధారణముగ సంభవించు సాయన మేషాది రాశి సంక్రమణములు)

వీని ప్రయోజనములను గూర్చి "నష్టజాతక" గణితమందు లగ్నమందున్న గ్రహమును బట్టిగాని, లగ్నమందే గ్రహమును లేనపుడు ద్రేక్కాణాధిపతిని బట్టిన్ని, ఒకప్పుడు లగ్నమందు బహుగ్రహములున్నప్పుడు బలవద్గ్రహమును బట్టియు ఋతునిర్ణయమును చేయవలయును. మరియు దశాంతర్దశా ఫలవిచారణ చేయునప్పుడు ఆయా గ్రహములు శుభులై బలయుతులైనచో నాయా ఋతువులయందు అనిష్ట ఫలములను చెప్పదగును.

జన్మకాలమందే గ్రహము సంపూర్ణ బలవంతుడై శుభముల నిచ్చుటకు తగియుండునో, వాని యధిపత్యములోనున్న ఋతువునందు ప్రతి సంవత్సరము శుభమును, ఇష్టఫలమును చెప్పదగును. ఏ గ్రహము బలరహితుడై దోషములనిచ్చుటకు తగియుండునో వాని యాధిపత్యమందుగల ఋతువునకు ప్రతిసంవత్సరము అనిష్ట ఫలమును చెప్పదగును.]

## ధాతుమూల జీవగ్రహములు

శ్లో॥ రాహ్వారపంగుచంద్రాశ్చ విజ్ఞేయా ధాతుఖేచరాః।
మూలగ్రహా సూర్యశుక్రౌ అపరా జీవసంజ్ఞకాః॥ ४౭

తా॥ [రాహువు, కుజుడు, శని, చంద్రుడు ధాతుచింతా గ్రహములు. సూర్యశుక్రులు మూలచింతాగ్రహములు మిగిలిన బుధ, గురు, కేతువులు జీవ చింతా గ్రహములగుచున్నారు.]

## శనికి విశేషము

శ్లో॥ గ్రహేషు మందో వృద్ధోఽస్తి ఆయుర్వృద్ధిప్రదాయకః।
నైసర్గికే బహూన్సమాన్ దదాతి ద్విజసత్తమ॥ ४౮

తా॥ ఓ ద్విజసత్తమా! సర్వ గ్రహములలో శనివృద్ధుడు. ఆయుర్వృద్ధి ప్రదాయకుడు. నైసర్గిక దశయందు అధిక సంవత్సరములు ఆయుర్దాయము నిచ్చువాడగుచున్నాడు.

## గ్రహముల యుచ్చనీచ స్థానములు

శ్లో॥ మేషో వృషో మృగః కన్యా కర్కో మీన స్తథా తులా।
సూర్యాదీనాం క్రమాదేతే కథితా ఉచ్చరాశయః ॥ ౪౯॥

భాగా దశ త్రయో ష్టావింశ స్తిథ్యోఽక్ష త్రివింశా వశాః॥
ఉచ్చా త్సప్తమభం నీచం తై రేవాంశైః ప్రకీర్తితమ్॥ ౫౦

తా॥ [సూర్యునకు మేషము, చంద్రునకు వృషభము, కుజునకు మకరము, బుధునకు కన్య, గురునకు కర్కటకము, శుక్రునకు మీనము, శనికి తుల, ఉచ్చరాశులగుచున్నవి. తమ తమ ఉచ్చరాశులకు సప్తమ రాశులు ఆయా గ్రహములకు నీచరాశులగుచున్నవి. రవికి మేషమందు 10వ భాగము, చంద్రునకు వృషభమందు 3వ భాగము, కుజునకు మకరమందు 28వ భాగము, బుధునకు కన్యయందు 15వ భాగము, గురునకు కర్కటకమందు 5వ భాగము, శుక్రునకు మీనమందు 27వ భాగము, శనికి తులయందు 20వ భాగము, పరమోచ్చ భాగములగుచున్నవి. వారి వారి పరమోచ్చ భాగములకు 180 భాగముల దూరములో నునగా వారి వారి నీచరాశులందా యా భాగములు పరమ నీచభాగములగుచున్నవి.]

వి॥ పరాశర మహర్షి రాహు కేతువులకు ఈ ప్రకరణమున యు స్వక్షేత్రాదులను తెలిపియుండలేదు. ఉచ్చ, నీచ, పరమోచ్చ, పరమనీచ భాగములను గూడ తెలిపియుండ లేదు. కాని దశాఫలాధ్యాయములో "రాహుదశాఫల" మనుచోట ;

శ్లో॥ ఏవం రాహోశ్చ కేతోశ్చ కథయామి గృహాదికమ్।
తయో ర్దశాఫలజ్ఞప్త్యై తవాగ్రే ద్విజనందన ॥
రాహోస్తు వృషభం కేతో ర్వృశ్చికం తుంగసంజ్ఞకమ్॥
మూలత్రికోణకం జ్ఞేయం యుగ్మం చాపం క్రమేణ చ॥
కుంభాళీ చ గృహౌ ప్రోక్తౌ కన్యా-మీనౌ చ కేవలౌ॥

అవి పీతాంబరయూ హిందీవ్యాఖ్యతోగూడినగ్రంథమందు:

అథాగో శృఖిన శ్చాపి వచ్మి గేహాదికం మునే।
తద్దశాఫలబోధాయ శృణుత్వం తత్సమాహిత॥
రాహోస్తు వృషభం కేతో ర్వృశ్చికం తుంగసంజ్ఞకమ్।
మూలత్రికోణకం యుగ్మం చాపం వేద్యం యథాక్రమమ్॥
ఘటాళీ అపివా కన్యా-మీనౌ కైశ్చి గ్గృహే మతే॥

అని 'దేవచంద్రఝా' హిందీ వ్యాఖ్యతో గూడిన గ్రంథమందు గలదు.

అనగా [రాహువునకు వృషభము ఉచ్చరాశి, మిథునము మూల త్రికోణము, కుంభము స్వక్షేత్రమనియు, కేతువునకు వృశ్చికము ఉచ్చరాశి, ధనుస్సు మూల త్రికోణరాశి, వృశ్చికము స్వక్షేత్రము అనియు, కొందరి మతములో రాహువునకు కన్య స్వక్షేత్రము, కేతువునకు మీనము స్వక్షేత్రమనియు] గలదని వివరింపబడెను.

'గణేశదత్త పాఠక' హిందీ వ్యాఖ్యతో గూడిన గ్రంథమందు 'శ్రీధర' విరచిత సంస్కృత వ్యాఖ్యతో గూడిన గ్రంథమందు మాత్రము ఈ క్రింద విధముగ నున్నది.

శ్లో॥ రాహోశ్చ వృషభం కేతో ర్వృశ్చికం తుంగసంజ్ఞకమ్।
మూలత్రికోణం కర్కం చ యుగ్మచాపం తథైవ చ।
కన్యా చ స్వగృహం ప్రోక్తం మీనం చ స్వగృహం స్మృతమ్॥

అనగా [రాహువునకు మూలత్రికోణము కర్కటకమనియు, కేతువునకు మిథునము, ధనుస్సు రెండురాశులు మూల త్రికోణ మనియు, రాహువునకు కన్య, కేతువునకు మీనము, స్వక్షేత్రములని తెలుపబడినది. వీనియందు కొన్ని మతభేదములున్నవి.]

జైమిని సూత్ర వ్యాఖ్యాతలగు 'సోమనాథుడు', జాతకసార సంగ్రహకర్తయగు 'రాఘవభట్టు' ఈ క్రింద విధముగ తెలిపి యున్నారు.

'జాతకసార సంగ్రహము' ఆయుర్నిర్ణయములో

లగ్నాష్టమేశాభ్యా మాయుర్నిర్ణయవేలాయాం, కదాచి ద్రాహుకేత్వోరపి లగ్నాష్టమాధి పతిత్వం సంభవతి। తత్కదా సంభవతీతి చేత్ ఉచ్యతే। యదా శనిరాహ్వో ర్మధ్యే శనిః కుంభే స్థితః రాహు రన్యత్ర స్థితః తదా రాహో రాధిపత్యం। యదా తూభయో రన్యక్షేత్రవృత్తిత్వం తదా గ్రహాంతరేణ యుక్త స్యాధిపత్యం। ఉభయో ర్గ్రహయుక్తత్వే, అధికగ్రహయుక్తస్య। గ్రహయుక్త సమానత్వే రాశితో బలం చింత్యం। రాశిబలసమానత్వే బహువర్షప్రదస్యా ధిపత్యం। ఉభయో ర్మధ్యే ఏకస్య ఉచ్చస్థితి రన్యస్యా న్యక్షేత్రస్థితి స్తదోచ్చస్థస్యైవ అధిపత్యం జ్ఞేయం॥ రాహో ర్వృశ్చిక ముచ్చరాశిః। కేతో స్స్వక్షేత్రం కేతో రుచ్చం కుంభరాశిః రాహో స్స్వక్షేత్రం। ఏవం వృశ్చికే కుజేన సాకం బలాబలం నిశ్చిత్య కేతో రప్యాధిపత్యం నిర్ణేయం తదుక్త మభియుక్తైః॥

ద్వినాథక్షేత్రయో రేకనిర్ణయః కథ్యతేఽధునా।
ఏక స్స్వక్షేత్రగో వ్యస్తు పరత్ర యది సంస్థితః।
తదాన్యత్ర స్థితం నాథం పరికల్ప్య దశాం నయేత్॥
ద్వా వప్యన్యర్క్షగౌ తౌ చే త్సగ్రహో బలవాన్ భవేత్॥
గ్రహయోగసమానత్వే చింత్యం రాశివశా ద్బలమ్।
రాశిసత్వసమానత్వే బహువర్షో బలీ భవేత్॥
ఏక స్స్వోచ్చగత స్త్వన్యః పరత్ర యది సంస్థితః॥
గ్రాహయే త్స్వోచ్చరాశిస్థం ఖేట మన్యం విహాయ వై।
ఏవం సర్వం సమాలోచ్య జాతస్య మృతి మాదిశేత్॥

అనగా లగ్నాష్టమాధిపతులను బట్టి ఆయుర్నిర్ణయము చేయునపుడు రాహు కేతువులకు కూడ లగ్నాష్టమాధిపత్యము సంభవించును. అదియెప్పుడు సంభవించుననగా, శని రాహువులలో శని కుంభమందుండి రాహువు వేరొక రాశియందున్నప్పుడు రాహువు కుంభమున కధిపతియగును. శని రాహువులిద్దరు అన్యక్షేత్రవర్తులైనపుడు, ఇతర గ్రహములతో కూడిన వానికి కుంభాధిపత్యము వచ్చును. శని రాహువులిద్దరు అన్యగ్రహములతో కూడినచో అధికగ్రహములతో

కూడిన వానికి కుంభాధిపత్యము వచ్చును. గ్రహయుక్తత్వము గూడ సమానమైనచో శని రాహువులున్న రాశిబలము వలన బలవద్గ్రహమునకు సంభవించును. అదియు సమానముగ నున్నచో యెక్కువదశా సంవత్సరములే గ్రహము వలన వచ్చునో వానికి సంభవించును. ఒకరుచ్చయందుండి మరొకరు ఇతరరాశియందున్నప్పుడు ఉచ్చస్థ గ్రహమునకే అధిపత్యము సంభవించును.

రాహువునకు వృశ్చికముచ్చరాశి కేతువునకు స్వక్షేత్రము, కేతువునను కుంభరాశి ఉచ్చరాశి, రాహువునకు స్వక్షేత్రములగుచున్నవి. ఇదే విధముగ కేతు విషయమునుగూడ నిర్ణయించవలెను. ఈ నిర్ణయము దశాఫల విచారణయందు, ఆయుర్నిర్ణయ సమయమందు చేయవలయునని చెప్పబడినది. భావఫల విచారణ చేయుటలో రవ్యాది సప్తగ్రహములకు మాత్రమే రాశ్యధిపత్య. స్వక్షేత్రాది విచారణ చేయబడినదిగాని రాహు కేతువులకు చెప్పబడలేదు. కనుక రాహు కేతువుల స్వక్షేత్రాది విచారణమును దశాఫల విచారణ చేయు సందర్భము లోను, ఆయుర్నిర్ణయ విచారణ చేయునప్పుడు మాత్రమే గ్రహించవలయునని తెలియుచున్నది.]

## గ్రహములకు మూలత్రికోణ స్థానములు

రవేః సింహే నఖాంశాశ్చ త్రికోణమపరే స్వభమ్॥
ఉచ్చ మిందోర్వృషే త్ర్యంశా త్రికోణ మపరేంశకాః॥ ౨౧॥
మేషేఽర్కాంశాస్తు భౌమస్య త్రికోణమపరే స్వభమ్।
స్త్రియాం బుధస్య తిథ్యంశా స్తతః పంచ త్రికోణకమ్॥ ౨౨॥
తత స్స్వభం దశాంశాశ్చ త్రికోణ మపరే స్వభమ్।
చాపే దశాంశా జీవస్య త్రికోణమపరే స్వభమ్॥ ౨౩॥
తులే శుక్రస్య తిథ్యంశా త్రికోణమపరే స్వభమ్॥
శనేః కుంభే నఖాంశాశ్చ త్రికోణమపరే స్వభమ్॥ ౨౪॥

[సూర్యునకు సింహమందు 20 భాగల వరకు మూలత్రికోణము. 21 నుండి 30 వరకు స్వక్షేత్రము. చంద్రునకు వృషభమందు 3 భాగల వరకు ఉచ్చము 4 నుండి 30 వరకు మూలత్రికోణము. కుజునకు మేషమందు 12 భాగలవరకు మూల త్రికోణము 13 నుండి 30 భా॥ల వరకు స్వక్షేత్రము. బుధునకు కన్యయందు 15 భా॥ల వరకు ఉచ్చము, 16 నుండి 20 భా॥ల వరకు గల 5 భా॥లు మూలత్రికోణము 21 నుండి 30 భా॥ల వరకు గల 10 భా॥లు స్వక్షేత్రము. గురునకు ధనుస్సులో 10 భాగలు మూలత్రికోణము. 11 నుండి 30 భా॥ల వరకు స్వక్షేత్రము. శుక్రునకు తులయందు 15 భా॥లు మూల త్రికోణము. 16 భా॥ నుండి 30 భా॥ వరకు స్వక్షేత్రము. శనికి కుంభ మందు 20 భా॥లవరకు మూలత్రికోణము. 21 నుండి 30 వరకు స్వక్షేత్రము అని గ్రహించవలెను.]

## గ్రహములకు నైసర్గిక మిత్ర-సమ-శత్రుకథనము ౮

శ్లో॥ త్రికోణాత్ స్వాత్ సుఖ స్వాన్త్య ధీ ధర్మాయుః స్వతుఙ్గపాః।
సుహృదో రిపవ శ్చాన్యే సమా శ్చోభయలక్షణాః॥ ౫౫॥

తా॥ [గ్రహములకు తమ తమ మూల త్రికోణ రాశుల నుండి 4. 2, 12, 5, 9, 8 స్థానాధిపతులు తమ ఉచ్చ స్థానాధిపతులు మిత్రులగుదురు. మిగిలిన స్థానాధిపతులు శత్రువులగుదురు. ఏ గ్రహములకు మిత్రత్వ శతృత్వ లక్షణములు సంభవించునో ఆయా గ్రహములు సములగుదురు. ఈ విధముగ గ్రహముల యొక్క నైసర్గిక మిత్రశతృ సమత్వములను తెలుసుకొనవలెను.

ఉదాహరణము :- సూర్యునకు మూలత్రికోణమగు సింహము నుండి 2, 4, 5. 8. 9, 12 స్థానాధిపతులగు బుధుడు, కుజుడు, గురుడు చంద్రుడు మిత్రులగుచున్నారు. వీరికంటె భిన్నములైన 3.6,7 10,11 స్థానాధిపతులగు శుక్ర - శని - బుధులు శత్రువులగుచున్నారు. ఇందులో బుధుడు మిత్రుడు, శత్రువు కూడ యగుటచేత సముడగు

చున్నాడు. కుజుడు మిత్రుడు. గురుడు మిత్రుడు. చంద్రుడు మిత్రుడు. శుక్రుడు శత్రువు శని శత్రువు అగుచున్నారు. ఇట్లు మిగిలిన గ్రహము లకు కూడ తెలుసుకొనవలెను.

## నైసర్గిక మైత్రి చక్రము

| గ్రహ | ర | చ | కు | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|
| మిత్ర | చ. కు గు | ర. బు. | ర. చ గు | ర శు | ర. చ. కు. | బు. శ. | బు. శు. |
| సమ | బు. | కు. గు శు. శ | శు. శ. | కు. గు. శ. | శ. | కు. గు. | గు. |
| శత్రు | శు. శ. | × | బుధ | చం | బు.శు | ర.చం. | ర.చం.కు. |

నైసర్గిక మిత్రత్వ శత్రుత్వములను గురించి మతాంతరముగ బృహజ్జాతకములో వరాహమిహిరునిచే ॥జీవో జీవబుధౌ...॥ అను శ్లోకములో చెప్పబడినది. ఆ మతమును గురించి వరాహమిహిరుడు "కేషాంచి దేవం మతమ్" అని చెప్పియుండుటచేత. బహు సమ్మత మైన పరాశరమతమునే యతని బృహజ్జాతకములో చెప్పియున్నాడు. కొంతమంద యొక్క మతములో :-

| | మిత్రి | శత్రువులు |
|---|---|---|
| సూర్యునకు :- | గురుడు | చ, కు, బు, శు, శ. |
| చంద్రునకు :- | గురు, బుధులు | ర, కు, శు, శ. |
| కుజునకు :- | శుక్ర, బుధులు | ర, చ, గు, శ. |
| బుధునకు :- | చ, కు, గు, శు. శ. | రవి |
| గురునకు :- | ర, చ, బు, శు, శ | కుజ |
| శుక్రునకు :- | కు, బు, గు, (శు) శ | ర. చ |
| శనికి :- | బు, గు, శు | ర, చ కు |

ఇట్లు మిత్రత్వ శత్రుత్వములను కొంతమంది యవనాదులు చెప్పియున్నారు. సత్యాచార్య మతములో చెప్పబడిన మిత్రత్వాదులు పరాశర మతముతో సమానముగ నున్నవి.]

## గ్రహములకు తాత్కాలిక మిత్రత్వ శత్రుత్వ సమత్వ కథనము

శ్లో॥ దశబంధ్వాయ సహజ స్వాంత్యస్థా స్తే పరస్పరమ్।
తత్కాలే మిత్రతాం యాంతి రిపవోన్యత్ర సంస్థితాః॥ ౨౬

తా॥[తానున్న రాశినుండి గ్రహమునకు 10,4,11,3,2.12 స్థానములలో నున్న గ్రహము తత్కాలమందు మిత్రుడగును. మిగిలిన రాశులలో నున్న గ్రహము శత్రువగును.]

వి॥ ఉదాహరణము :- మేషమందు రవి యుండగ వానికి 10,4, 11,3,2,12 స్థానములందున్న యే గ్రహమైనను, తాత్కాలిక మిత్రుడగును. మిగిలిన 1.5,6,7,8,9 స్థానములందు యే గ్రహములున్నను, శత్రుగ్రహములగుదురు. మేషమందున్న రవికి 1,5,6,7,8,9 స్థానములందున్న గ్రహములు తాత్కాలిక శత్రువులని గ్రహించవలయును.

## పంచధా మైత్రీ నిర్ణయము

శ్లో॥ తత్కాలే చనిసర్గేచ మిత్రంచే దధి మిత్రకమ్।
మిత్రం మిత్ర సమత్వేతు శత్రుః శత్రుసమత్వకే॥ ౨౭॥

శ్లో॥ సమోమిత్ర రిపుత్వేతు శత్రుత్వేత్వధిశత్రుతా॥
ఏవం వివిచ్య దైవజ్ఞో జాతకస్య ఫలంవదేత్॥ ౨౮॥

1. నైసర్గిక మిత్రగ్రహము తాత్కాలిక మిత్రుడైనచో అధి మిత్ర గ్రహమగును

2, నైసర్గిక సమగ్రహము తాత్కాలిక మిత్రుడైనచో మిత్ర గ్రహమగును.

3. నైసర్గిక మిత్రగ్రహము తాత్కాలిక శత్రువైనచో సమ గ్రహమగును.

4. నైసర్గిక సమగ్రహము తాత్కాలిక శత్రువైనచో శత్రు వగును.

5. నైసర్గిక శత్రు గ్రహము తాత్కాలిక శత్రువైనచో అధి శత్రువగును.]

వి॥ రవికి గురుడు నైసర్గిక మిత్రగ్రహము, తత్కాలమందు రవికి దశమములో నుండెను. అప్పుడు తాత్కాలిక మిత్రుడగుటచే రవికి దశమాదిస్థానము లందున్న గురుడు అధిమిత్ర గ్రహమగును. ఇట్లు ఇతరము లూహ్యములు.

## గ్రహములకుచ్చాది స్థానబలము

స్వోచ్చే శుభం ఫలం పూర్ణం త్రికోణేపాద వర్జితమ్।
స్వర్క్షే ఽర్ధం మిత్రగేహేతు పాదమాత్రం ప్రకీర్తితమ్। ౨౯
పాదార్ధం సమభే ప్రోక్తం శూన్యం నీచాస్త శత్రుభే।
తద్వదుష్ట ఫలం బ్రూయాత్ వ్యత్యయే నవిచక్షణః॥ ౩౦

తా॥ గ్రహము శుభఫలమును ఉచ్చలో నున్నప్పుడు సంపూర్ణముగను, మూల త్రికోణ మందున్నప్పుడు త్రిపాద ఫలమును, స్వక్షేత్రమందు అర్ధఫలమును, మిత్రక్షేత్ర మందు పాదఫలమును, సమ క్షేత్రమందు పాదార్ధఫలమును, నీచ, అస్త, శత్రు క్షేత్రములందు శూన్యఫలమును ఇచ్చును. అశుభమును ఇచ్చునపుడు పై దానికి వ్యత్యాసముగ గ్రహించవలయును.]

వి॥ ఒక గ్రహము నైసర్గికాధిపత్యములచే శుభఫలము నిచ్చు సమయమునందు ఆ గ్రహముచ్చరాశిలో నున్న యెడల తానిచ్చెడి ఫలితమును సంపూర్ణముగ ఇచ్చును. స్పష్టార్థము చక్రము వేయ బడె.

## శుభ ఫలము

| ఉచ్ఛ | మూ.త్రి | స్వగృ | మిత్ర | సమ | నీచ. శత్రు |
|---|---|---|---|---|---|
| 60' | 45' | 30' | 15' | 7'-30" | ○ |

## అశుభ ఫలము

| ఉచ్ఛ | మూ.త్రి | స్వ.గృ | మిత్ర | సమ | నీచ. శత్రు |
|---|---|---|---|---|---|
| ○ | 7'-30" | 15' | 30' | 45' | 60' |

## ధూమాద్య ప్రకాశక గ్రహసాధనము

శ్లో॥ త్ర్యంశాఢ్య విశ్వభాగైశ్చ చతుర్భి స్సహితోరవిః।
ధూమోనామ మహా దోషః సర్వ కర్మ వినాశకః॥ ౬౧

ధూమో మండలతః శుద్ధో వ్యతీపాతో౽త్ర దోషదః।
సషడ్భోత్ర వ్యతీపాతః పరివేషో౽తిదోషకృత్॥ ౬౨

పరివేషశ్చ్యుతశ్చక్రాదింద్ర చాపస్తు దోషదః।
విత్ర్యంశా త్యష్టిభాగాఢ్య శ్చాపః కేతుశ్శుభో౽శుభః॥ ౬౩

ఏకరాశి యుతః కేతుః సూర్యతుల్యః ప్రజాయతే॥
అప్రకాశ గ్రహా శ్చైతే పాపాదోష ప్రదాః స్మృతాః॥ ౬౪

తా॥ తాత్కాలిక స్పష్ట సూర్యునిలో రా 4 భా 18 లి 20 లు కలిపినచో ధూమగ్రహము వచ్చును. ఈ గ్రహము మహా దోషము నిచ్చును. సర్వకర్మలను నాశనము చేయును. ధూమగ్రహమును 12 రాశులలో తీయగ వ్యతీపాత గ్రహము వచ్చును. వ్యతీపాతమునకు 6 రాశులను కలిపినచో పరివేషము వచ్చును. పరివేషమును 12 రాశు లలో తీయగ ఇంద్రచాపము వచ్చును. ఇంద్రచాపమునకు భా 16-40 లి॥లను కలిపినచో కేతువు వచ్చును. దీనికి 1 రాశి కలిపిన మొదల

తాత్కాలిక స్పష్ట సూర్యుడు వచ్చును. అప్రకాశగ్రహము లైదును చాల దోషప్రదములని, పాపులని చెప్పబడిరి.]

ఉ॥ స్పష్ట సూర్యుడు 6-5-23-12 ఉ॥లు ఉండెను. దీనిలో రా 4-13-20 ఉ॥లు కలుపగ రా10-18-48-12 ధూమగ్రహమగును. దీనిని 12 రాశులలో తీసివేయగ రా 1-11-16-48 వ్యతీపాతమగును. వ్యతీపాతమునకు 6 రాశులు కలుపగ 7-11-16-48 పరివేషమగును. పరివేషమును 12 రాశులలో తీయగ రా 4-18-43-12 ఇంద్రచాపమగును. ఇంద్రచాపమునకు రా 0-16-40-0 కలుపగ రా 5-5-23-12 కేతువగును. కేతువునకు రా 1-0.0.0 కలుపగ స్పష్టరవి 6-5-23-12 వచ్చును.

పై గణితమును బట్టి ధూమము 10-18-48-12, వ్యతీపాతము 1-11-16-48 పరివేషము 7-11-16-48, ఇంద్రచాపము 4-18-43-12 కేతువు 5-5-23-12, స్పష్టరవి 6-5-23-12 వచ్చును. రవ్యాదిగ్రహముల స్ఫుటములను బట్టి రాశ్యంశాదులందు వారి స్థితిని గుర్తు చేసుకొనుచున్నట్లు ధూమాది పంచగ్రహముల స్థితినివారి వారి స్ఫుట ప్రమాణములను బట్టి గుర్తు వేసుకొనవలయును.

## అప్రకాశ గ్రహముల ఫలము

శ్లో॥ సూర్యేందు లగ్నగే ష్వేషు వంశాయు ర్జ్ఞాననాశనమ్।
ఇతి ధూమాది దోషాణాం స్థితిః పద్మాసనోదితా॥ ౬౫

తా॥[ఈ అప్రకాశ గ్రహము లైదును, రవి, చంద్ర, లగ్న ములలో ఎవరితో కలసినను, ఎవరు కలసినను. క్రమముగ వంశము, ఆయువు, జ్ఞానము నశించును.] ఈ విధముగ అప్రకాశ గ్రహముల స్థితి వలన గలుగు ఫలమును బ్రహ్మ చెప్పియుండెను.

ఉ॥ రవితోగాని, చంద్రునితోగాని, లగ్నముతోగాని, ధూమాది గ్రహములలో నెవరు కలసియున్నను, దోషఫలము సమానముగనే చెప్పబడినది.

## గులిక, కాలవేళ, మృత్యు, యమఘంట, అర్ధయామ కాల జ్ఞానము.

శ్లో॥ రవివారాదిశన్యంతం గుళికాది నిరూప్యతే।
దివసా నష్టధా భక్త్వా వారేశా ద్గణయే త్క్రమాత్॥ ౬౬॥
అష్టమోంశో నిరీశ స్స్యా చ్ఛన్యంశో గుళిక స్స్మృతః।
రాత్రి మప్యష్టధా కృత్వా వారేశా త్పంచమాదితః॥ ౬౭॥
గణయే దష్టమః ఖండో నిష్పతిః పరికీర్తితః।
శన్యంశో గుళికః ప్రోక్తో రవ్యంశః కాల సంజ్ఞకః॥ ౬౮॥
భౌమాంశో మృత్యు రాదిష్టో గుర్వంశో యమఘంటకః।
సౌమ్యాంశో౽ ర్ధప్రహారకః స్వస్వదేశోద్భవః స్ఫుటః॥ ౬౯

తా॥ ఆదివారము నుండి శనివారము వరకు గల యేడు వారముల లోను గుళిక, కాలవేళ, మృత్యు, యమఘంట, అర్ధయామ(అర్ధప్రహార) ములయొక్క కాలములు చెప్పబడుచున్నవి. దినప్రమాణమును 8 భాగ ములు చేసి ఆవారాధిపతి నుండి లెక్కపెట్టగ ఏడుగ్రహములు ఏడు ఖండ ములకు అధిపతులగుదురు. 8 వ ఖండమునకు, అధిపతిలేదు, దానికి నిరీ శ్వర ఖండమని పేరు, ఇట్లు రాత్రి భాగమును కూడ 8 ఖండములు చేసి, వారాధిపతికి 5వ వాని నుండి క్రమముగ లెక్కపెట్ట వలయును. అట్లు లెక్కపెట్టగ శని ఖండము గుళిక ఖండమగును.

రవి యొక్క ఖండము కాలవేళయనబడును. కుజఖండము మృత్యు వనబడును. గురు ఖండము యమఘంట మనియు, బుధఖండము అర్ధ ప్రహారమనియు అనబడును. వీనిని సాధించునప్పుడు స్వదేశీయదిన,రాత్రి ప్రమాణములను గ్రహించి సాధించ వలయును.

ని॥ ఇష్టదినమందు స్వదేశీయదిన రాత్రి ప్రమాణములను గ్రహించి, వానిని 8 సమాన ఖండములు చేయవలయును. ఆదివారము నుండి శనివార పర్యంతము గల ఏడు వారములకు రవి,చంద్ర, కుజ, బుధ, గురు, శుక్ర, శనులు వరుసగ వారాధి పతులగుచున్నారు.

ఏ వారమున గుళికాది సాధనమును చేయదలచితిమో ఆ వారాధిపతి నుండి లెక్కపెట్టగ శన్యంశము గుళికుడగును. రవ్యంశము, కాలవేళ యగును. కుజఖండము మృత్యువగును. గురుఖండము యమఘంటము, బుధఖండము అర్ధప్రహరము అగును.

రాత్రి యందైన ఇష్టవారాధిపతి నుండి 5వ వానితో ప్రారంభించి క్రమముగ లెక్కపెట్ట వలయును. అట్లు లెక్కపెట్టగ శన్యంశము గుళికుడు, రవ్యంశము కాలవేళ, కుజాంశము మృత్యువు, గుర్వంశము యమఘంటము, బుధాంశము అర్ధప్రహారమగును. ।

ఉదాహరణము :-

ఇష్టదినము ఆదివారము. దినప్రమాణము 32 ఘ 20 విలు. దీని అధిపతి సూర్యుడు అగును. పగటియందు సూర్యునినుండి 7 ఖండములను లెక్కించ వలయును. రాత్రి యందు రవి నుండి 5వ వాడగు గురుని నుండి లెక్కించ వలయును. ఇట్లు లెక్కించగ శన్యాంశము గుళికుడగును.

గు ళి క సా ధ న ము :-

దినమానము ఘ 32-20÷8 = ఘ 4-2-30 ఖండ ప్రమాణమగును. 7వ ఖండము 28-17-30 వరకు ఉండును. ఈ ఘడియలు గుళిక సమయమని గుర్తించవలయును. రాత్రి మానము ఘ 27-40÷8 = 3-27-30 ఆదివారము రాత్రికి రవి నుండి పంచమాధిపతియగు గురుని నుండి లెక్కపెట్ట వలయును. గనుక గురునినుండి 3వ ఖండము శనిఖండము రాత్రి ఘ 10-22-30 ల వరకు నిలచును. ఈ ఘడియలకు గుళికుడుండును. దీనికి లగ్నమును సాధించినచో గుళిక లగ్నమగును. ఈవిధముగ మిగిలిన వారము లందు కూడ సాధించవలయును.

దీనిలో మత భేదములు గనబడుచున్నవి. "పరాశరహోర" (దేవచంద్రఝా వ్యాఖ్యాన సహితము) లోని క్రింద పాఠముగలదు.

శ్లో॥ గుళికారంభకాలే షసమయాశ్రియత స్తు యత్।
లగ్నం యత్సాధ్యతే విద్భి ర్గుళికః స విగద్యతే॥
నామాంతరం తు తస్యైవ మాంది రిత్యభిధీయతే॥

[శనయంశ ప్రారంభకాలమునకు గుళికా రంభకాలమని పేరు. ఈ సమయమునకు సాధించబడిన లగ్నమునకు గుళికుడున్న లగ్నమని చెప్పబడును. గుళికునకు మాందియని నామాంతరము గలదు.

పైన చెప్పిన దానిని బట్టి శనయంశము యొక్క ప్రారంభ కాలమునకు గుళికుని సాధించవలెనుగాని అంత్యమునకు గాదని విశదమగుచున్నది. గుళికునకే మాందియని పేరు అని చెప్పుటచేత మాందిగుళికులు ఒక్కరేయని గ్రహించవలసియున్నది. కాని "ఉత్తరకాలామృతము" లో కాళిదాసు "మాందిగుళికసాధన" విషయమై ఇట్లు చెప్పియుండెను

శ్లో॥ అంత్యాంశో హి విరీశ్వర స్తు గుళికః శనయంశక స్త్విన్నో
వారేవా దిహ పంచమాదిత అయం భందాంతభేంశే భవేత్॥
స్యాతాం మందసుతా వుభా వతిఖలా విత్యేవ మూచే ముని
ర్మాండవ్యః కిల యత్ర తౌ విషసతౌ తత్రైవ దోషప్రదౌ॥

అను శ్లోకములో మాంది, గుళికులు ఇద్దరు శనిసుతులని మాండవ్యముని చెప్పెననియు శనిఖండము యొక్క అంత్యాంశమందు గుళికుడుండుననియు చెప్పియుండెను.]

మాంది గ్రహసాధన విషయమై :-

వారః ఖారి జటా వయో నట తనూ రూపం మ్యమానాహతం।
ఖాంగాప్తం రవిమానరావి ఘటికా వ్రత్యాక్రలభే మందజః।
రాత్రే ర్మాన మహః ప్రమాణ మహిహృ త్తంద ప్రమాణం భవే
దర్కాద్యా శవిమానరాంతదివసే వారేశ్వరా త్తందపాః॥

అను శ్లోకములో [దినప్రమాణము 30 ఘడియ లైనప్పుడు ఆదివారము 26 ఘ॥ల మీాద, సోమవారము 22 ఘ॥ల మీాద, మంగళవారము 18 ఘ॥ల మీాద, బుధవారము 14 ఘ॥ల మీాద, గురువారము 10 ఘ॥ల మీాద, శుక్రవారము 6 ఘ॥ల మీాద, శనివారము 2 ఘ॥ల

మీద మాంది గ్రహముండును. దినప్రమాణ భేదమున్నప్పుడా దిన మానము నాయా వార ధ్రువ ఘడియలచేత గుణించి 30చే భాగింపగ స్పష్టమైన మాంది గ్రహ సమయము వచ్చును. అని చెప్పి. ఆదివారము దినస ప్తమ ఖండాంతమగు 26 ఘు॥ 15 వి॥లలో 0-15 వి॥లను వదలి 26 ఘడియల సమయమే మాంది సమయమని చెప్పియుండెను. సోమవారమునాడు ఘ22-30 లో 0-30 వి॥లను వదలి 22 ఘ॥లను. మంగళవారమునాడు 18-45 వి॥లలో 0-45ను విదలి 18 ఘు॥లను, బుధవారమునాడు 15-0 ఘు॥లలో 1 ఘు॥ను విదలి 14-0 ఘు॥లను, గురువారమునాడు 11-15 ఘు॥లలో 1-15 వి॥లను వదలి 10-0 వి॥లను, శుక్రవారము రోజున 7-30 వి॥లలో 1-30 వి॥లను వదలి 6 ఘు॥లను, శనివారమునాడు 3-45 వి॥లలో 1-45 వి॥లను వదలి 2 ఘు॥లను మాత్రమే గ్రహించి, మాంది సాధనమును చెప్పియుండెను. కాని"గుళికారంభ కావేష్ట సమయాశతస్తు యత్" లగ్నం యత్సాధ్యతే విద్భిర్గుళికస్య నిగద్యతే॥ అను పరాశర హోరలో పాఠాంతర శ్లోకమును బట్టి శన్యంశారంభ కాలమే గుళిక ప్రారంభ సమయమని గ్రహించినప్పుడు. 30 ఘడియలు దినమానమైనప్పుడు ఆదివారమున ఘ 22-30లకు, సోమవారము ఘ 18-45లకు, మంగళవారము ఘ 15-0 లకు, బుధవారమున ఘ 11-45లకు గురువారమున ఘ 7-30 లకు శుక్రవారము ఘ 3-45లకు, శనివారము 0-0 లకు శన్యంశమారంభమై అదియే గుళికారంభ సమయమగుచున్నది.]

దీని విషయమై "విద్యామాధవీయము" ముహూర్త దీపికా వ్యాఖ్యానములో శ్రీపతి, సర్వసిద్ధి, సంగ్రామ విజయోదయాది గ్రంథములలో గల 4 మతములను విచారించి. ఈ క్రింద విధముగవివరించెను.

ఏను చతుర్ణా మేతేషాం మతానాం అన్యోన్య వైషమ్యదర్శనాత్ కథమయం నిశ్చీయతే గుళికోదయః ఉచ్యతే! మందాంశో గుళిక ఇతి సామాన్యాభిధానం,

తేన మందాంశే గుళికోదయ ఇత్యేతావ దేవ సిద్ధమ్। తస్మిన్ సర్వత ఏకదేశే వేత్యా కాంక్షాయాం "సోదయఘ్నా కృతుర్వారా॥"తద్వారాదియమాంతం।" ఇత్యుభే అపి ప్రాప్నుతః తత్ర సంగ్రామ విజయోక్తః మందాంశాంతా దర్వాచీన ఘటికాయాం గుళికోదయస్యా నవసేయత్వాత్ తద్ఘటికైవ గుళికోదయః। సర్వసిద్ధ్యక్తశ్చ తదంత్యత్ర్యంశే॥ అసియోశ్చ నాడికామాత మూనం వాంతర" మితి గుళికస్యో దయస్యా నవసేయత్వాత్ తద్ఘటికైవ గుళికోదయ ఇతి॥ సధాస నారాయణః :-

గుళికో నాడికామాత్ర స్థాయీ త్యాజ్య స్సృయత్నతః।
అత స్తదుదయే కర్మ కృతం సర్వం వినశ్యతి॥
శ్రీపతినాతు తదుదయ స్సర్శదుష్టా ఇత్యపి ముహూర్తానిందితాః।

తథాచార్తిః:-

గుళికాంతరాశి శేషస్యాప్యో హ్యత్రఘాత పుష్పవత్। ఇతి।
సర్వైరపి మందాంశత్ర్యంశే గుళికోదయ ఇతి ప్రతిపన్నమ్॥

అని వివరించెను.

పైన వ్రాసిన దానిలో గుళికుని గుణించుటలో 4 మతములు గలవు. ఆ మతములను బట్టి శనిఖండములో అంత్యమందుగల ఘడియ గుళికోదయ కాలమని తాత్పర్యము.

పై వ్యాఖ్యానమును బట్టి ప్రతిదినమందు శన్యంశము యొక్క అంత్యమందు 3వ భాగము (రమారమి 1 ఘ॥చిల్లర) గుళికకాలమని నిర్ణయించబడినది.

సర్వవారములందు దినమానము 30 ఘడియలని గ్రహించినపుడు గుళికోదయాంత్య కాలములు.

పగలు

| వారము | గుళికారంభ | గుళికాంత్యకాలము |
|---|---|---|
| ఆదివారము | ఘ 25_0 | 26_15 |
| సోమవారము | 21-15 | 22-30 |
| మంగళవారము | 17_30 | 18-45 |

| వారము | గుళికారంభ | గుళికాంత్యకాలము |
|---|---|---|
| బుధవారము | 13-45 | 15-0 |
| గురువారము | 10-0 | 11-15 |
| శుక్రవారము | 6-15 | 7-30 |
| శనివారము | 2-30 | 3-45 |

గ్రంథాంతర వచనములను బట్టి పై విధముగ వచ్చును. రాత్రికాలమందు గూడ గణితరీత్యా పై విధముగ సాధించుకొన వలయును.

పరాశర మతములో శన్యంశమని చెప్పబడినందున, శన్యంశము మొత్తము గుళికభాగమని గ్రహించవలసియుండును.

ఉత్తర కాలామృతములో గల మాండవ్యమతము ననుసరించి మాంది, గుళికులు ఒకరుకాదని, ఇద్దరు వేరని చెప్పబడి, కాలమును గురించి చెప్పుటలో "చారుఃఖారి" అను శ్లోకములో తత్కాలభే మందజః' అనియు 'ఖండాంత భేంశే భవేత్' అనియు చెప్పుటచేత దిన మానరాత్రి మానములు 30 ఘు॥ లైనప్పుడు మాందిగుళిక కాలము లీ క్రింద విధముగ వచ్చును.

| | పగలు | | రాత్రి | |
|---|---|---|---|---|
| వారము | మాంది | గుళిక | మాంది | గుళిక |
| ఆదివారము | ఘు 26 | 26-15 | ఘు 10-0 | 11-15 |
| సోమవారము | ,, 22 | 22-30 | ,, 6-0 | 7-30 |
| మంగళవారం | ,, 18 | 18-45 | ,, 2-0 | 3-45 |
| బుధవారము | ,, 14 | 15-00 | ,, 26-0 | 26-15 |
| గురువారము | ,, 10 | 11-15 | ,, 22-0 | 23-30 |
| శుక్రవారము | ,, 6 | 7-30 | ,, 18-0 | 18-45 |
| శనివారము | ,, 2 | 3-45 | ,, 14-0 | 15-0 |

పై విధముగ మాంది, గుళిక ధ్రువములు వచ్చును. ఆ యా దిన రాత్రి ప్రమాణములలో గల హెచ్చు తగ్గులను బట్టి యీ ప్రమాణములు మారుచుండును. బహుగ్రంథ కర్తలు మాంది గుళికులను ఒకనినిగ గుర్తించియే వ్యవహరించినట్లు తెలియుచున్నది. వార ధ్రువ ఘడియలను బట్టియే మాంది గ్రహసాధనమును చేయుచుండిరి. గాని "బృహత్పరాశరహోర" లో పాఠాంతర శ్లోకమును బట్టి శన్యంశారంభ సమయమునకు మాంది లగ్నసాధనమును చేయవలయునని తెలియుచున్నది.]

## (మాంది) గుళిక లగ్నసాధనము

గుళికేష్టవశా ల్లగ్నం స్ఫుటం యత్ స్వస్వదేశజమ్ ।
గుళికం ప్రోచ్యతే తస్మా జ్జాతకస్య ఫలం వదేత్ ॥ ౽౦ ॥

తా॥ పూర్వోక్త రీతిగ గుళిక కాలమును సాధించి,ఆసమయమునకు స్వస్వదేశీయ లగ్న ప్రమాణములను గ్రహించి లగ్న సాధనమును చేయవలయును. దానినే గుళికలగ్నమని లేక మాందిలగ్నమని యందురు. దీనినిబట్టి జాతకునకుఫలములను నిర్ణయించి చెప్పవలయును.

వి॥ ఇష్టదినము నాటి దిన ప్రమాణమును గుర్తించి, దానిని 8 ఖండములు చేయవలయును. ఇష్ట దినమునాటి వారమేదియగునో ఆ వారాధిపతి నుండి శన్యంశము వరకు ఖండములను కలుపుకొనిరావలయును. శనిఖండకాలారంభమునకు ఎన్ని ఘడియ విఘడియలు వచ్చునో ఆ సమయమున కేలగ్నము వచ్చునో దానిని గుళిక లేక మాంది లగ్నమని గ్రహించవలయును.

1. ప్రథమ పద్ధతి :—

ఇష్టదినము బుధవారము. దీని అధిపతి బుధుడు. ఈనాటి దిన ప్రమాణము 32.24 వి॥లు, 1 ఖండముయొక్క ప్రమాణము ఘ 4-3 వి॥లువచ్చును. వారాధిపతియగు బుధుని నుండి వరుసగ శని ఖండారంభమువరకు కూడవలయును.

బుధఖండము — 4-8
గురు — 4-8
శుక్ర — 4-8

12-9 ఇది శని ఖండారంభ

మగును. ఈ దినమునాటి సూర్యోదయ లగ్న భుక్తి ఘ 2-50 లు వృషభమందైనది. 17వ అక్షాంశమునకు వృషభ లగ్న ప్రమాణము ఘ 4-56లు గలదు. దీనిలో భుక్తిని తీసివేయవలయును.

| | |
|---|---|
| వృషభ ప్రమాణము | 4-56 |
| భుక్తి | 2-50 |
| వృషభ శేషము | 2-6 |
| మిథునప్ర | 5-26 |
| కర్కటకప్ర | 5-31 |
| | 13-03 |

కర్కటక లగ్నములో శని ఖండారంభకాలముండుటచేత కర్కటక లగ్నము గుళిక లేక మాందిలగ్నమని గ్రహించవలయును. కర్కటక లగ్నమందు గూడ భుక్తిని ఏష్యమును సాధించి, నవాంశ లగ్నమును సాధించవలయును.

| | | | | |
|---|---|---|---|---|
| కర్కటకాంతము ఘ | 13-03 | కర్కటకప్ర | 5-31 | లో |
| శనిఖండప్రారంభము | 12-09 | శేషము | 0-54 | తీయగా |
| కర్కటక శేషము - | 0-54 | భుక్తి | 4-37 | విॱలు |

వచ్చెను. కర్కటకములో 1 నవాంశప్రమాణము విఘ 37-20పॱలు అగును. భుక్తి ఘ 4-37 లకు 7 నవాంశములు గతించినవి. ఎనిమిదవ నవాంశములో విఘ 16లు భుక్తమైనందున కర్కటక లగ్నము ఎనిమిదవ నవాంశమందు గుళిక లేక మాంది గలదని గ్రహించవలయును. అనగా కుంభ నవాంశములో గుళికుని గుర్తించవలయును.

2. ద్వితీయ పద్ధతి :-

శని ఖండాంత సమయమునకు లగ్నసాధనమును కొందరు చేయుచున్నారు. పై ఉదాహరణములో శని ఖండాంత సమయము ఘ 16-12 వి॥లగును. పై విధముగ గణితము చేయగ సింహ లగ్నములో ఘ 3-9 వి॥లు భుక్తమైనది. ఈ ప్రకారము సింహ లగ్నమగును. కన్యానవాంశము వచ్చును.

3. తృతీయ పద్ధతి :-

ఉత్తర కాలామృత, ఫలదీపికాది గ్రంథములందు ధ్రువాంకములివ్వబడినవి. ఆ ప్రకారము బుధవారమునకు ఘ 14లు చెప్పబడెను.

దినమానము 32 - 24 × 14 ÷ 30 = లబ్ధము ఘ 15-7-12 వచ్చెను. ఈ ఘడియలకు లగ్నమును కట్టగ సింహలగ్నములో ఘ2-4 వి॥లు భుక్తమైనది. ఉత్తర కాలామృతములో చెప్పిన మాండవ్య మునిమతానుసారము శని ఖండారంభ సమయము ఘ 15-7-12 లకు మాంది లగ్నమును, శనిఖండాంత సమయము ఘ 16-12 లకు గుళిక లగ్నమును గ్రహించ వలసియున్నది.

ప్రచారములో శని ఖండాంతమునకుగాని, శని ఖండారంభమునకుగాని మాందిలగ్నమును కట్టుటలేదు. ఉత్తర కాలామృతాది గ్రంథములలో అనుసరించిన మార్గమునే యనుసరించుచున్నట్లు గోచరించుచున్నది.

## ప్రాణపద పరిభాష

ఖాంశపాదసమైః ప్రాణైః కృత్వా ద్యర్క-త్రికోణభాత్ ।
ఉదయాదిష్ట కాలాంతం యద్వం ప్రాణపదం హి తత్ ॥ ॥౧॥

తా॥ భచక్రము (360భా) లో నాలుగవ వంతు (90భా) కు సమమైన 15 విఘడియలకు ఒక ప్రాణపదనుని గ్రహించి, సూర్యోదయాది ఇష్టకాలము వరకు ఎన్నిగతించినవో తెలుసుకొని, సూర్యుడు

చరరాశి యందున్నచో సూర్యునకు, స్థిరరాశియందున్నచో సూర్యునినుండి నవమభావమునకు, ద్విస్వభావమందున్నచో పంచమమునకు కలుపగ ప్రాణపదము వచ్చును.

## ప్రాణ పద సాధనము

స్వేష్టకాలం పలీకృత్య తిథ్యాప్తం భాదికం చయత్
చరాగ ద్విభసంస్థేర్కే భానౌ యుక్ నవమే సుతే
స్ఫుటం ప్రాణపదాఖ్యం తల్లగ్నం జ్ఞేయం ద్విజోత్తమ
లగ్నా ద్ద్వికోణే తుర్యేచ రాజ్యే ప్రాణపదం తదా।
శుభం జన్మ విజానీయా త్తద్వై వైకాదశే పివా॥
అన్యస్థానే స్థితం చే త్స్యాత్ తదా జన్మాశుభం వదేత్॥

తా॥ సూర్యోదయము నుండి జన్మసమయము వరకు గల ఘడియ విఘడియలను విఘడియలుగ మార్చుకొని 15చే భాగించగ వచ్చు రాశి భాగలిప్త విలిప్తలను ఒకచోట నుంచుకొనవలయును. సూర్యుడు చర రాశియందున్న యెడల పై రాశ్యాదిని సూర్యునిలో కలుపవలయును స్థిరరాశిలో సూర్యుడున్న యెడల సూర్యుని నుండి 9వ భావమునకు కలుపవలయును, ద్విస్వభావ రాశిలోనున్న యెడల సూర్యుని నుండి 5వ భావమునకు పై రాశ్యాదిని కలుపవలయును. అట్లు కలుపగ ప్రాణపద లగ్నము వచ్చును. జన్మ లగ్నమునుండి ప్రాణపదము 2,5,9'4,10,11 స్థానములలో నున్నచో జాతకుడు సుఖవంతుడగును. మిగిలిన భావము లందున్నచో దుఃఖవంతుడగును.

ఉ॥ సూర్యోదయము నుండి జన్మసమయము ఘ 15-40 అనుకొనుము. వీనిని విఘడియలుగ మార్చగ 940 వి॥లు వచ్చును. దీనిని 15చే భాగించినచో రాశులు వచ్చును. శేషమును భాగలలోనికి మార్చుకొని 15చే భాగించగ భాగలు వచ్చును. శేషమును 60చే గుణించి 15చే భాగించగ లబ్ధము లిప్తలగును, తిరిగి శేషమును 60చే గుణించి 15చే భాగించగ వచ్చు లబ్ధము విలిప్తలగును. ఈ

రాశ్యాది సముదాయమును సూర్యుడు చరరాశిలో నున్నప్పుడు సూర్యునిలోను, స్థిరరాశిలో నున్నప్పుడు సూర్యునకు నవమ భావము లోను, ద్విస్వభావములో నున్నప్పుడు పంచమభావములోను కలుప వలయును.

ఈ జన్మ సమయమునకు స్పష్ట సూర్యుడు 9రా 10భా 25వి 20 విలిప్తలు గండను కొనుము. 940÷15 = 62 రాశులు. 10 శేష మును 30చే గణించి 15 చే భాగింపగ 20 భాగలు వచ్చెను. 62 రాశులను 12 చే భాగింపగ 2రా 20 భాగలుగలదు. స్పష్టసూర్యుడు చరరాశిలో నుండుటచేత రవికి కలుపగ 9-10-25-20+రా 2-20భా= రా 0-0-25-20 ప్రాణపదమగును.

స్పష్టసూర్యునకు 4 రాశులను కలిపినచో సూర్యునకు పంచమ భావమును, 8 రాశులు కలిపినచో నవమ భావమును వచ్చును. సూర్యుడు స్థిరరాశిలోనున్నప్పుడు సూర్యునిలో 8 రాశులు, ప్రాణ పద రాశ్యాదికమును కలుపవలయును: సూర్యుడు ద్విస్వభావము లోనున్నప్పుడు సూర్యునిలో 4 రాశులు, ప్రాణపద రాశ్యాదిక మును కలుపవలయును. అట్లు చేయగ స్పష్ట ప్రాణపదము వచ్చును.

దేవచంద్రఝూ కృత హిందీ వ్యాఖ్యాన సహిత పరాశర హోరలో నీ క్రింద విధముగ నున్నది.

ఘటీ చతుర్గుణా కార్యా తిథ్యాప్తైశ్చ పలైర్యుతా।
దివాకరహృతా శేషం రాశిశ్చాథ పలాత్మకమ్।
పూర్వశేషం ద్విగుణితం లవాః స్ఫుట ముదీరితాః।
ఏవం రాశ్యంశకౌ సూర్య తత్త్రికోణభభాగయోః।
యోజయే త్తమతో విజ్ఞ శ్చరాదౌ సంస్థితే రవౌ।
స్ఫుటం రాశ్యాదికం ప్రాణపదం తత్ప్రోచ్యతే పునః॥

ఉదయాది జననాంతము వరకు గల ఘడియ విఘడియలలో ఘడియలను 4చే గుణించగ రాశులు వచ్చును. విఘడియలను 15చే

భాగించగ వచ్చిన లబ్ధము రాశులగును. శేషము నొకచోట నుంచు కొనుము. 15చే భాగించగ వచ్చిన లబ్ధరాశులను మొదట రాశులలో కలిపి 12చే భాగించగ మిగిలిన రాశులను ఒకచోట నుంచుకొనుము. విఘడియలలో మిగిలిన శేషవిఘడియలను 2చే గుణించగ భాగలు వచ్చును. ఈ విధముగా రాశులను, భాగలను గ్రహించి, జననకాల స్పష్ట సూర్యుడు చరరాశి యందున్నచో స్పష్ట సూర్యునిలో కలుపగ ప్రాణపదమగును. స్పష్ట సూర్యుడు స్థిరరాశి యందున్నచో సూర్యుని నుండి నవమ భావములో కలుపగ ప్రాణ పదమగును. సూర్యుడు ద్విస్వభావమందున్నచో సూర్యుని నుండి పంచమ భావములో కలుపగ ప్రాణపదమగును.

పై ఉదాహరణమందు జన్మఘడియలు 15-40లు గలవు. ఘ 15 లను 4చే గుణించగ 60 రాశులు వచ్చెను. విఘ 40 లను 15చే భాగించగ 2 రాశులు వచ్చి విఘ 10లు శేషము గలదు. ఈ రెండు రాశులను 60లో కలిపి 12చే భాగింపగ 2 రాశులు మిగిలెను. శేష విఘ 10 లను 2చే గుణించగ 20 భాగలు వచ్చెను. వీనిని పై 2 రాశులలో చేర్చగ రా 2-20లు వచ్చెను. ఈ సమయమున స్పష్ట సూర్యుడు రా 9-10-25-20 లో కలుపగ రా 0-0-25-20 ప్రాణ పదము వచ్చెను.

15 విఘ॥ల కొక రాశి చొప్పున ప్రాణపదము సంచరించును. సూర్యునకు 8 రాశులు కలిపినచో సూర్యుని నుండి నవమ భావము, 4 రాశులను కలిపినచో పంచమ భావము వచ్చును.

బొంబాయిలో ముద్రింపబడిన "బృహత్పరాశర హోరా సారాంశము" లో దీని విషయమై ఇట్లున్నది.

ఘటీ చతుర్గుణా కార్యా తిథ్యాప్తై శ్చ పలై ర్యుతా।
దినకరేణాపహృతం శేషం ప్రాణపదం స్మృతమ్।

శేషా త్పలాంతా ద్ద్విగుణీవిధాయ
రాశ్యంశసూర్యర్క్ష వియోజితాయ।
తత్రాపి తదాశిచరాన్ క్రమేణ
లగ్నాంశ ప్రాణాంశ పదైక్యతా యత్॥

పున॥ :- కోణా త్రిక్రమాంతరాదీనాం తథా ప్రాణపదా దపి।
స్వేష్టకాలం పలీకృత్య తిథ్యాప్తం భాదికం చ యత్।
చరాగద్విభగే భాగే భనా యుబ్ నవమే సుతే।
స్ఫుటం ప్రాణపదం తస్మా త్పూర్వవ చ్చోధయే త్తమః॥

ఇంతవరకు పూర్వమందు వ్రాయబడిన విషయముతో సరిపడు చున్నది. తరువాత -

వినా ప్రాణపదా చ్ఛద్ధో గుళికాద్వా నిశాకరాత్।
తదశుద్ధం విజానీయాత్ స్థావరాణాం తదైవ చ।
ద్వయో ర్హీనబలే ప్యేవం గుళికా త్పరిచింతయేత్।
తస్మా త్తత్సప్తమస్థానా త్తదంశాద్వ కళత్రతః॥
తత్రైవ తత్త్రికోణే వా జన్మలగ్నం వినిర్దిశేత్॥
మనుష్యాణాం పశూనాంచ ద్వితీయే దశమే రిపౌ।
తృతీయే మదనే లాభే విహంగానాం వినిర్దిశేత్।
కీట సర్ప జలస్థానాం శేషస్థానేషు సంస్థితః॥ అని గలదు.

దీని భావము :- జన్మకాల ఘడియలను ధ్రువపరచుటకు

1. ప్రాణపదలగ్నమును సాధించిన పిమ్మట, ప్రాణపదరాశికి జన్మలగ్నము 1,5,9 స్థానములలో నొకటి కావలయునను భావమును గ్రహించి, జన్మకాల ఘడియలను ప్రాణపదరాశి ప్రమాణముతో (15 విలు) హెచ్చించి గాని, తగ్గించి గాని కోణరాశి జన్మరాశి యగు నట్లు సవరించవలయునని కొందరభిప్రాయపడుచున్నారు. ఈ భావము సరియైనదికాదు. ఏలననగా మహర్షి అపకాశక గ్రహ ఫలాధ్యాయ మందు ప్రాణపదఫలమును చెప్పుచు ద్వాదశ భావస్థితి ఫలమును చెప్పియుండెను. అందుచేత ప్రాణపదము జన్మలగ్నమునకు కోణము లందు మాత్రమే యుండవలయుననుట యుక్తియుక్తముగ లేదు.

(2) జన్మలగ్నమును నిర్ణయించుటకు మార్గము చెప్పబడినది.

1. మాంది లగ్నమును బట్టి, తత్సప్తమ స్థానమును బట్టి, లేక మాంది స్థిత నవాంశమును బట్టి తదంశ సప్తమమును బట్టి 1,5,9 రాశులలో నొకటి జన్మలగ్నము కావలయును

2. చంద్ర లగ్నమును బట్టి తత్సప్తమ స్థానమును బట్టి లేక చంద్రస్థిత నవాంశమును బట్టి. తదంశ సప్తమమును బట్టి 1,5,9 రాశులలో నొకటి జన్మలగ్నము కావలయును.

మాంది చంద్రులలో ఎవరు బలవంతులో వారిని బట్టి లగ్న నిర్ణయమును చేయవలయును.

3, మాంది నుండిగాని చంద్రుని నుండిగాని కోణరాశులగు 1,5,9 రాశులందు మనుష్యులు, 2,10,6 రాశులందు పశువులు, 3,7.11 రాశులందు పక్షులు, 6,8,12 రాశులందు కీటకములు, సర్పములు జల జంతువులు జన్మించునని చెప్పబడినది.

గ్రంథాంతరము లందు మాంది, చంద్రులలో ఎవరు బలవంతులో వారికి కోణరాశులందు జన్మలగ్నమగునని చెప్పబడినదిగాని పశుపక్ష్యాదుల విషయము వివరింపబడలేదు.

“ ఫలదీపిక ” లో యీ విషయమై ; 3 అ 16వ శ్లోకములోనిట్లున్నది.

మాందిస్థరాశి పతి సంగత సుత్రికోణం।
తస్యాంశరాశిపతి సంయుత మంశకోణమ్।
లగ్నం వదంతి గుళికాంశకరాశి కోణం
తద్వద్విధౌ బలయుతే శశినైవ విద్యాత్॥

అనగా మాందిరాశి నాథుడున్న రాశికి కోణరాశులందుగాని, మాంది నవాంశాధిపతి యున్న నవాంశరాశికి కోణరాశులందుగాని. మాందిస్థరాశి కోణముగాని, మాంది స్థిత నవాంశ కోణముగాని జన్మలగ్నమగును. చంద్రుని బట్టి గూడ పై విధముగనే చూడవలయును.

చంద్రుడు బలవంతుడైతే చంద్రుని బట్టియే చూడవలయునని చెప్పబడినది.

ఇక్కడ మాందిస్థరాశ్యధిపతి, అంశాధిపతి కూడ గ్రహింపబడెను, గాని సప్తమ తదంశసప్తమ స్థానములు గ్రహింపబడలేదు.

"సర్వార్థ చింతామణిలో "సంజ్ఞాధ్యాయమందు" సందిగ్ధ లగ్న నిర్ణయమును గురించి,

> ప్రాణత్రికోణే ప్రవదంతి లగ్నం। తథైవ మాంద్యన్విత రాశికోణే।
> మాంద్యంశకా త్కోణగతం విలగ్నం। తదంశకా త్సప్తమరాశికోణే॥
> శశాంక సంయుక్త భ కోణరాశౌ తదంశకా త్తన్మదకోణభే చ।
> లగ్న బలే మాందివశా ద్విలగ్నం చంద్రే బలే చంద్రవశా ద్విలగ్నమ్॥
> ఓజే తదంశే పురుషస్య జన్మ లగ్నే స్త్రియ స్తద్విపరీతభాగే॥

అను శ్లోకములందు ;

ప్రాణపద త్రికోణమందు జన్మలగ్నము అగునని చెప్పబడినది. మాంది స్థిత రాశికోణము, మాంద్యంశ కోణము, మాంద్యంశసప్తమ రాశికోణము గ్రహింపబడినది. చంద్రుని బట్టి కూడ పై విధముగ చూడవలయును. లగ్న చంద్రులలో లగ్నము బలమైనచో మాందిని బట్టియు, చంద్రుడు బలవంతుడైనచో చంద్రుని బట్టి లగ్నమును స్థిరపరచవలయును. లగ్న నవాంశము విషమాంశమైనచో పురుష జన్మమనియు, సమాంశమైనచో స్త్రీ జన్మమనియు గ్రహించవలయునను భావము చెప్పబడినది,

ఈ గ్రంథకర్త ప్రాణపద త్రికోణమును గ్రహించెను.

మరియు

> ప్రశ్నేపి తజ్జన్మసమానకాలే లగ్నస్య నిశ్చాయక మత్ర తద్జ్ఞాః।
> తయో ర్బలేనాపి వికల్ప మాహు ర్లగ్నా ద్ద్వయో రిత్థ ముదాహరంతి॥

ప్రశ్న కాలమును బట్టి, జన్మకాలమును బట్టి కూడ లగ్నమును నిర్ణయించవలెను. మరియు లగ్న చంద్రుల బలాబలములను

బట్టి లగ్నమును నిర్ణయించవలయును. అని వివరించెను.

అనగా 1. ప్రాణపద లగ్నము, 2. మాంది గ్రహలగ్నము, 3. చంద్రలగ్నము. ఈ మూడు లగ్నముల యొక్క బలాబలములను బట్టి లగ్న నిర్ణయమును చేయవలయునని తెలియుచున్నది.

ఓజాంశలందు పురుషజన్మము సమాంశము లందు స్త్రీజన్మము గలుగునని మాత్రమే తెలిపియుండెను.

"ఉత్తర కాలామృతము" లో కాళిదాసు జననకాల ఘటీ స్ఫుటీకరణమును గురించి 'జన్మ లగ్న' నిర్ణయమును గురించి వేరొక మార్గమును గూడ సూచించెను.

జన్మ పత్రస్థ పరోపదిష్ట ఘటీ స్పష్టీకరణ మాహ లగ్నస్ఫుటం చాహ :-
వాద్యశ్చైవ వినాడికాః కృత (4) గుణాః సూర్యోదయా న్నంద (9)హృ
చ్ఛేషం దస్ర మఘాసురాత్రినవకే స్యా జ్జన్మభం దస్రతః।
యద్వాపీష్టఘటీ స్తదా విఘటికా స్తత్వాశ్వి (225) హృచ్ఛేషతో
బాణేలాః(15) ఖగుణా(30)శ్చ బాణవిగమాః(45) షష్టిశ్చ(60)బాణాద్రయః(75)॥
శుద్ధా స్తాః ఘటీః క్రమా న్నరవధూ పుంస్త్రీవిభేదః స్మృతో
మాందీరాశినవాంశయో ర్జననభా చ్చంద్రస్థితో వా వదేత్।
తత్రాద్రాశివశాచ్చ సప్తమగృహా త్తత్త్రికోణాచ్చ వా।
జన్మ స్యా న్నవమాంశ రాశివశా ద్వీర్యాధికా త్తద్వదేత్॥

జననకాల ఘడియవిఘడియలను 4చే గుణించి 9చే భాగించవలయును. భాగించగ వచ్చిన శేషసంఖ్య అశ్విని. మఘ మూలల నుండి జన్మ నక్షత్రమును సూచించును. లేక జననకాల ఘడియ విఘడియలను విఘడియల లోనికి మార్చుకొని 225చే భాగించగ వచ్చిన శేషము 0 నుండి 15 వరకు పురుషుడని, 16 నుండి 45 వరకు స్త్రీయని, 46 నుండి 90 వరకు పురుషుడని, 91 నుండి 150 వరకు స్త్రీయని, 151 నుండి 225 వరకు పురుషుడని గ్రహించవలయును.

ఈ పద్ధతిని బట్టి జన్మకాల ఘడియ విఘడియలను స్థిరము చేయవలయునని చెప్పెను.

జన్మలగ్నమును స్థిరముచేయుటకు విధానమును చెప్పుచున్నాడు.

1. మాందిరాశి నవాంశల నుండిగాని, చంద్రుడున్న రాశ్యాంశలనుండిగాని, 2. మాందిరాశి నవాంశ సప్తమము నుండిగాని, చంద్రరాశ్యంశ సప్తమము నుండిగాని. 3. ఆ యా రాశ్యంశాధిపతులున్న రాశుల నుండిగాని కోణరాశులలో నొకటి లగ్నము కాగలదు. ఎవరు బలవంతులో వారి నుండి నిర్ణయించవలయును.

ఈ ప్రమాణములను బట్టి చూడగ "పరాశరహోర" లో పాఠభేదమును బట్టి తెలియచేయబడిన విషయము కూడ గ్రహించబడగి యున్నట్లు తోచుచున్నది.

ఫల దీపిక, ఉత్తరకాలామృతాదులలో ప్రాణపదము గ్రహింపబడ లేదు. కాని "సర్వార్థ చింతామణి"లో ప్రాణపదము గ్రహింపబడినందున ప్రాచీనులు ప్రాణపదమును కూడ లెక్కలోనికి తీసుకొనినారు. ప్రాణపదమును బట్టి జన్మకాల ఘుడియ విఘుడియలను సరిచేయు పద్ధతి మాత్రము చెప్పబడ లేదు. లగ్ననిర్ణయమును గూర్చియే సర్వార్థ చింతామణిలో చెప్పబడినది.

పై గ్రంథములలో చెప్పిన సారాంశము :-

1. ప్రాణపద, మాంది, చంద్రులు జన్మలగ్న నిర్ణయమును చేయుటకు ముఖ్యము. ఈ మూడింటిలో నే రెండిటిచేతనైనను ఒకే లగ్నము సూచించబడెనేని దానిని నిశ్చయించవలయును. లేక యీ మూడింటిలో నెవరు బలవంతులో వారిని బట్టి నిశ్చయించవలయును.

ఇతి బృహత్పరాశర హోరాశాస్త్రే-గ్రహగుణ స్వహూపాధ్యాయోనామ తృతీయః||3||

బృహత్పరాశర హోరా శాస్త్రమందు
గ్రహగుణ స్వరూపాధ్యాయమను
తృతీయాధ్యాయము ముగిసెను.

## రాశిస్వరూపాధ్యాయము ॥౪॥

పరాశర ఉవాచ:-

అహోరాత్రస్య పూర్వాన్త్యలోపాత్ హోరాఽవశిష్యతే।
తస్య విజ్ఞానమాత్రేణ జాతకర్మఫలం వదేత్॥ ౧

తా॥ అహోరాత్ర శబ్దములోగల ఆద్యాన్త్యాక్షరముల లోపము వలన "హోర" యని మిగులును. ఈ హోరను గురించి తెలుసుకొనుటచే జీవుల యొక్క కర్మఫలమును చెప్పుటకు వీలగును.

వి॥ అహోరాత్రమనగా ఒకరోజు 60 ఘడియల ప్రమాణ కాలము. ఇందు 12 రాశుల యొక్క సంచారము పూర్తి అగును. హోర యను శబ్దము 'లగ్న' పర్యాయముగ శాస్త్రమందు గ్రహించ బడినది. జన్మలగ్నము తత్కాల గ్రహస్థితిని గురించి విచారించినచో నా యా సమయములందు జన్మించిన జీవుల యొక్క కర్మ ఫలమును తెలుసుకొనుటకు అవకాశము గలుగును.

మైత్రేయ ఉవాచ:-

యదవ్యక్తాత్మకో విష్ణుః కాలరూపో జనార్దనః।
తస్యాంగాని విబోధ త్వం క్రమా న్మేషాదిరాశయః॥ ౨

పరాశర ఉవాచ:-

మేషో వృషశ్చ మిథునః కర్కసింహకుమారికాః।
తులాలీ చ ధనుర్నక్రో కుంభో మీన స్తతః పరమ్॥ ౩

తా॥ జనార్దనుడు, అవ్యక్త పరబ్రహ్మ స్వరూపుడు, కాల స్వరూపుడగు శ్రీ మహావిష్ణువునకు, మేషాదిరాశులు ఏ యే అవయ ములగు చున్నవో వివరించుము. మేషము, వృషభము, మిథునము, కర్కటకము, సింహము, కన్య, తుల, వృశ్చికము, ధనుస్సు, మక రము, కుంభము మీనము అని 12 రాశులు గలవు.

వి॥ ఆకాశమందు రవ్యాది గ్రహములు, అనంతకోటి నక్షత్ర ములు గలవు. వానిలో ఆకాశమధ్యమందు వలయాకారముగ అశ్వి

న్యాది నక్షత్రములు 27 గలవు. ఈ నక్షత్ర వలయమును 12 సమాన భాగములు చేయగ, ఆ యా భాగములు మేషాది స్వరూపములను బొందియుండెను. వాస్తవముచే రాశులు లేవు. ఆ యా విభాగము లకు మాత్రమే ఆ యా నామములు పూర్వులచే నిర్ణయింపబడినవి.

కాల పురుషాంగ విభాగము

శీర్షాననౌ తథా బాహూ హృత్క్రోడకటివస్తయః।
గుహ్యోరుయుగలే జానుయుగ్మే వై జంఘకే తథా॥ ౪
చరణౌ ద్వౌ తథా మేషాత్ జ్ఞేయా శ్శీర్షాదయః క్రమాత్॥

తా॥ కాల పురుషునకు మేషము శిరస్సు, వృషభము ముఖము మిధునము భుజములు, కర్కటకము హృదయము, సింహము క్రోడము (భుజముల మధ్యభాగము, కడుపు) కన్య కటి ప్రదేశము, తుల వస్తి (పొత్తి కడుపు), వృశ్చికము మర్మాంగము,, ధనుస్సు తొడలు, మకరము మోకాళ్ళు, కుంభము పిక్కలు, మీనము పాదములు అగు చున్నవి.

చ ర స్థి రా ది న క్ష లు

చరస్థిరద్విస్వభావాః క్రూరాక్రూరౌ నపుంప్రియౌ।
పిత్తానిలత్రిధాత్వైక్యం శ్లేష్మకా శ్చ క్రియాదయః॥ ౫

తా॥ మేషాది రాశులలో మేష, కర్కట, తుల, మకరములు చరరాశులు. వృషభ, సింహ, వృశ్చిక, కుంభములు స్థిర రాశులు, మిధున కన్యా, ధనుర్మీనములు ద్విస్వభావ రాశులు. మేష, మిధున సింహ, తుల, ధనుః కుంభములు క్రూరరాశులు. వృషభ కర్కటక, కన్యా, వృశ్చిక, మకర, మీనములు సౌమ్య రాశులు మేషాదిక్రూర రాశులు, పురుష రాశులు, వృషభాది సౌమ్య రాశులుస్త్రీ రాశులు మేష, సింహ, ధనుస్సులు పిత్త ప్రకృతి గల రాశులు. వృషభ కన్యా మకరములు వాత ప్రకృతి గల రాశులు. మిధున. తులా కుంభములు త్రిధాతు ప్రకృతి గలవి. కర్కటక. వృశ్చిక, మీన రాశులు శ్లేష్మ ప్రకృతి గల రాశులు అని గ్రహించవలయును

రాశిస్వరూప, స్థాన, దిక్కు, స్వాభావ్యాదికథనము

రక్తవర్ణో బృహద్గాత్రః చతుష్పాద్రాత్రివిక్రమీ॥ ౬
పూర్వవాసీ నృపజ్ఞాతిః శైలచారీ రజోగుణీ।
పృష్ఠోదయీ పావకీ చ మేషరాశిః కుజాధిపః॥ ౭॥

తా॥ మేషరాశి రక్తవర్ణము, పెద్ద శరీరము, నాలుగు కాళ్ళు రాత్రియందు బలము గలది. తూర్పు దిక్కున నివాసము, క్షత్రియ జాతి. పర్వతములందు సంచరించునది. రజోగుణ ప్రధానము గలది. పృష్ఠోదయము గలది. అగ్ని తత్త్వము, కుజునధిపతిగ గలది యగు చున్నది.

శ్వేతః శుక్రాధిపో దీర్ఘః చతుష్పాచ్ఛర్వరీబలీ।
యామ్యేట్ గ్రామ్యో వణిగ్భూమి రజః పృష్ఠోదయో వృషః॥ ౮॥

తా॥ వృషభము తెల్లనిరంగుగలది, శుక్రుడధిపతి గలది, పొడ వైనది, నాలుగు పాదములు గలది, రాత్రి యందు బలముగలది, దక్షిణదిక్కుయందు నివాసముగలది, గ్రామమునందు సంచరించునది, వైశ్యజాతి, భూతత్త్వము గలది, రజోగుణ ప్రధానమైనది, పృష్ఠో దయముగలది యగుచున్నది.

శీర్షోదయో నృమిథునం సగదం చ సవీణకమ్।
ప్రత్యగ్వాయు ర్ద్విపాద్రాత్రిబలీ గ్రామవ్రజోఽనిలీ॥ ౯॥
సమగాత్రో హరిద్వర్ణో మిథునాఖ్యో బుధాధిపః

తా॥ మిథునము, శిరస్సుతో ఉదయించును, వీణతో గూడిన స్త్రీతోను, గదతో గూడిన పురుషునితోను కూడినది, పశ్చిమదిక్కుగ నివాసము చేయునది, వాయుతత్త్వము, రెండు పాదములు గలది, రాత్రియందు బలముగలది, గ్రామమందు సంచరించునది, వాతప్రకృతి, సమానమైన దేహము, పచ్చనిరంగు, బుధుడధిపతిగ గలదియగును.

పాటలో వనచారీచ బ్రాహ్మణో నిశి వీర్యవాన్॥ ౧౦
బహుపాదచరో స్థౌల్యతనుః సత్త్వగుణీ జలీ।
పృష్ఠోదయీ కర్కురాశి ర్మృగాంకాధిపతి స్స్మృతః॥ ౧౧॥

తా॥ కర్కటకము పాటల (లేతయెరుపు) వర్ణము, వనమందు సంచరించునది, బ్రాహ్మణజాతి, రాత్రియందు బలము గలది, అనేక పాదములు గలది. స్థూలదేహము గలది, సత్త్వ గుణముగలది, జలతత్త్వరాశి. పృష్ఠోదయము గలది అని గ్రహించవలయును. దీనికి చంద్రుడధిపతి యగుచున్నాడు.

సింహః సూర్యాధిపః సత్త్వ చతుష్పాత్ క్షత్రియో వనీ।
శీర్షోదయో బృహద్గాత్రః పాండుః పూర్వేట్ ద్యువీర్యవాన్॥ ౧౨

తా॥ సింహము సూర్యుడధిపతిగ గలది. సత్త్వగుణము గలది నాల్గు పాదముల జంతువు, క్షత్రియజాతి, వనములందు(అరణ్యములందు) సంచరించునది, శిరస్సుతో నుదయించునది, పెద్దశరీరముగలది, పాండు వర్ణముగలది. తూర్పుదిక్కు యందు నివాసము చేయునది, పగటి యందు బలమైనదని భావము.

పార్వతేయా థ కన్యాఖ్యా రాశి ర్దినబలాన్వితా॥
శీర్షోదయా చ మధ్యాంగా ద్విపా ద్యామ్యచరా చ సా॥ ౧౩
సా సస్యదహనా వైశ్యా చిత్రవర్ణా ప్రభంజనీ।
కుమారీ తమసా యుక్తా బాలభావా బుధాధిపా॥ ౧౪॥

తా॥ కన్యారాశి పర్వతములందు సంచరించునది, పగటియందు బలముగలది, శిరస్సుతో నుదయించునది. మధ్యమమైన శరీరాంగములు గలది. రెండు పాదములు గలది, దక్షిణ దిక్కునందు నివసించునది, ఒక చేతిలో వరికంకెలు, ఒక చేతిలో అగ్నిగలది. వైశ్యజాతి, చిత్ర వర్ణముగలది, వాయుతత్త్వము, కౌమారవయస్సు గలది, తమోగుణ ప్రధానమైనది, బాల్య చేష్టలు, భావములుగలది, బుధుడధిపతిగ గలది యగును.

శీర్షోదయో ద్యువీర్యాఢ్య స్తులః కృష్ణో రజోగుణః।
పశ్చిమో భూచరో ఘాతీ శూద్రో మధ్యతను ర్ద్విపాత్॥ ౧౫॥
శుక్రాధిపో౽థ - - - - - - - - - - - - -

తా॥ తులారాశి శీర్షోదయరాశి, పగటియందు బలముగలది, కృష్ణవర్ణము, రజోగుణ ప్రధానమైనది, పశ్చిమ దిక్సంచారము చేయునది. (పశ్చిమమందు నివసించునది) భూమిచరము, హింసా స్వభావము గలది, శూద్రజాతి, మధ్యమమైన దేహముగలది, రెండుకాళ్ళు గలది, శుక్రుడధిపతిగ గలది యగుచున్నది.

- - - స్వల్పాంగో బహుపా ద్బ్రాహ్మణో బిలీ।
సౌమ్యస్థో దిన వీర్యాఢ్యః పిశంగో జలభూవహః॥ ౧౮
రోమస్వాఢ్యోఽతితీక్ష్ణాంగో వృశ్చిక శ్చ కుజాధిపః॥

తా॥ వృశ్చికరాశి స్వల్ప శరీరముగలది. అనేక పాదములుగలది బ్రాహ్మణజాతి, కన్నములందు నివాసముగలది, ఉత్తరదిక్కుయందు నివసించునది. పగటియందు బలముగలది, పింశగవర్ణము, జలతత్త్వము భూమియందు సంచరించునది, ఎక్కువ రోమములుగలది, పదునైన అగ్రభాగముగలది, కుజాధిపత్యము గలది యగుచున్నది.

పృష్ఠోదయీ త్వథ ధను ర్గురుస్వామీ చ సాత్త్వికః॥ ౧౭॥
పింగళో నిశివీర్యాఢ్యః పావకః క్షత్రియో ద్విపాత్॥
ఆదావంతే చతుష్పాదః సమగాత్రో ధనుర్ధరః॥ ౧౮॥
పూర్వస్థో వసుధాచారీ తేజస్వీ బ్రహ్మణాకృతః॥

తా॥ ధనూరాశి పృష్ఠోదయము, గురుడధిపతి, సత్త్వగుణము గలది, పింగళవర్ణము. రాత్రియందు బలము గలది, అగ్నితత్త్వము, క్షత్రియజాతి, మొదటి 15భాగలు ద్విపాదము, తరువాత చతుష్పాదము, సమమైన శరీరము గలది, ధనుస్సును ధరించినది, తూర్పుదిక్కున నివసించునది, భూమియందు సంచరించునది, తేజస్సుగలది, యగుచున్నది.

మందాధిప స్తమీ భౌమో యామ్యేట్ చ నిశి వీర్యవాన్॥ ౧౯
పృష్ఠోదయీ బృహద్గాత్రః కర్బురో వనభూచరః।
ఆదౌ చతుష్పదోంతే తు ద్విపదో జలగో మతః॥ ౨౦॥

తా॥ మకరరాశి, శని అధిపతి, భూతత్త్వము, తామస గుణము గలది, దక్షిణనివాసము. రాత్రియందు బలముగలది, పృష్ఠముతో ఉదయించునది, పెద్ద శరీరముగలది, కర్బుర వర్ణము, వనములందు, భూమియందు సంచారము చేయునది, మొదట 15 భాగలు చతుష్పాదము. రెండవభాగము పాదములులేనిది, జలచరమని చెప్పబడినది.

కుంభః కుంభీ నరో బభ్రువర్ణో మధ్యతను ద్విపాత్।
ద్యుబీర్యో జలమధ్యస్థో వాతశీర్షోదయీ తమః॥ ౨౦॥
శూద్రః పశ్చిమదేశస్య స్వామీ దైవాకరిః స్మృతః॥

తా॥ కుంభము కుండచేతిలోగల పురుషరూపము, బభ్రువర్ణము, మధ్యమదేహము, ద్విపాదము, పగటియందు బలముగలది, జలచరము, వాయుతత్త్వము, శీర్షోదయము, తమోగుణ ప్రధానము, శూద్రజాతి, పశ్చిమ దిక్కులో నివసించునది, శని అధిపతిగలది అగుచున్నది.

మీనౌ పుచ్ఛాస్యసంలగ్నౌ మీనరాశి ర్దివాబలీ। ౨౧।
జలీ సత్త్వగుణాఢ్యశ్చ స్వస్థో జలచరో ద్విజః।
అపదో మధ్యదేహీ చ సౌమ్యస్థో హ్యుభయోదయీ। ౨౩।
సురాచార్యాధిప శ్చేతి రాశీనాం గదితా గుణాః।
త్రింశద్భాగాత్మకానాంచ స్థూల సూక్ష్మఫలాయచ। ౨౪।

తా॥ మీనము, పుచ్ఛాస్యములు కలిసిన రెండుచేపల స్వరూపముగలది. పగటియందు బలముగలది. జలతత్త్వము, సత్త్వగుణప్రధానము. మంచి ఆరోగ్యముగలది, జలచరము, బ్రాహ్మణజాతి, పాదములులేనిది, మధ్యమమైన దేహముగలది, ఉత్తరదిక్కుయందు నివాసముగలది' ఉభయోదయము (శీర్షోదయ, పృష్ఠోదయములు గలది) దీనికి గురుడధిపతి యగుచున్నాడు. ఈ విధముగ 30 భాగలు ప్రమాణముగల 12 రాశులయొక్క స్వరూప, గుణాదులు స్థూలసూక్ష్మఫల విచారణము కొరకు చెప్పబడినవి.

వి. 360 భాగలతో కూడిన నక్షత్ర చక్రమును అశ్వినీనక్షత్ర ప్రథమ బిందువుతో ప్రారంభించి ప్రతి 30 భాగలకు ఒక రాశియని గుర్తించి 12 రాశులుగ విభజింపబడెను. అశ్విన్యాదినుండి ప్రతి 30 భాగల దూరమునకు మేషాది ద్వాదశ రాశీ నామములు పెట్టబడెను. ఆయా దూరములను పరిశీలించగ మేషాది రూపములను పోలి యుండుటచే వానికా నామములు పెట్టబడినవి. ఆకాశమున చూచి నచో నక్షత్రములు, వానియందు సంచరించు రవ్యాది గ్రహములు మాత్రమే మనకు గోచరమగును. మేషాదిరాశులు, ఆకాశమందా యా ప్రాంతములయొక్క రూపములుగ ఊహింపబడినిర్ణయింపబడినవి.

జన్మకాలమునుబట్టి విషేకసమయమును తెలుసుకొనుట :

అథాతః సంప్రపక్ష్యామి శృణుష్వ మునిపుంగవ।
జన్మలగ్నంచ సంశోధ్య విషేకం పరిశోధయేత్॥ ౨౫

తదహం సంప్రపక్ష్యామి మైత్రేయ త్వం విధారయ।
జన్మలగ్నా త్పరిజ్ఞానం నిషేకం సర్వజంతు యత్॥ ౨౬॥

యస్మిన్భావే స్థితో మంద స్తస్య మాందే ర్యదంతరమ్।
లగ్నభాగ్యాంతరం యోజ్యం యచ్చ రాశ్యాది జాయతే॥ ౨౭॥

మాసాది తన్మితం జ్ఞేయం జన్మతః ప్రాక్ విషేకజమ్॥
యద్యదృశ్య దశేంగేశ స్త్వేందో ర్భుక్త భాగయుక్॥ ౨౮॥

తత్కాలే సాధయే ల్లగ్నం శోధయే త్పూర్వవ త్తనుమ్॥
తస్మా చ్ఛుభాశుభం వాచ్యం గర్భస్థస్య విశేషతః॥ ౨౯।

శుభాశుభం వదేత్ పిత్రో ర్జీవనం మరణం తథా।
ఏవం విషేకలగ్నేన సమ్యక్ జ్ఞేయం వ్వికల్పనాత్॥ ౩౦॥

తా. పరాశరముని యీ క్రింద విధముగ చెప్పుచున్నాడు :-

ఓ మైత్రేయా ! స్పష్టమైన జన్మలగ్నమును కనుగొని (జనన కాలసమయమును, జన్మలగ్నమును సంశోధించి స్పష్టముగ జన్మలగ్న

మును స్థిరపరచి) దానినిబట్టి నిషేక (గర్భాధాన) లగ్నమును తెలుసు కొను విధానమును చెప్పుచుంటిని. నీవు సావధానచిత్తముతో వినుము.

జన్మసమయమునకుగల శనిస్ఫుటమునకు. మాందిస్ఫుటమునకు అంతరమును కనుకొని, దీనిలో లగ్నభావ, భాగ్యభావాంతరమును కలుపగ వచ్చిన రాశ్యాదిక మెంతెగలదో దానికి సరిపడునట్టి మాసాదికమును జన్మసమయమునకు వెనుక నిషేక కాలలగ్నమని గ్రహించవలయును.

జన్మసమయమునకు జన్మలగ్నాధిపతి లగ్నమునుండి 6 రాశుల లోపునవున్నయెడల పైనసాధించిన రాశ్యాదికమునకు జన్మకాలపు చంద్రస్ఫుటరాశ్యాదికమును కలుపవలయును. ఈ కలుపగ వచ్చిన రాశ్యాదికమును బట్టి నిషేకలగ్నమును తెలుసుకొనవలయును.

నిషేకలగ్నమునుబట్టి గర్భస్థశిశువుయొక్క శుభాశుభములను, జాతకుని మాతాపితరుల జీవనము మరణము మొదలగు వానిని తెలుసు కొనవలయును. దైవవేత్తయగు పండితుడు తనయొక్క బుద్ధివిశేషము చేత స్థూల సూక్ష్మపరీక్షలచే శుభాశుభములను నిర్ణయించి చెప్ప వలయును.

వి. ముందుగ తన్వాది ద్వాదశ భావములను, రవ్యాది సప్త గ్రహములను, మాంది స్ఫుటమును సాధించుకొని యొకచోటనుంచు కొనవలయును. మాందిస్ఫుటరాశి భాగలిప్త విలిప్తలలో నుండి శని స్ఫుటరాశిభాగలిప్త విలిప్తలను తీసివేయగ వచ్చిన అంతరము నొక చోట నుంచవలయును. తరువాత భాగ్యభావము యొక్క స్ఫుటరాశి భాగలిప్తవిలిప్తలలోనుండి తను భావస్ఫుటరాశి భాగలిప్తవిలిప్తలను తీసివేయవలయును. ఈ రెండింటియొక్క అంతరమును పూర్వసాధిత మాంది శన్యంతర రాశ్యాదికములో కలుపవలయును. ఇట్లు కలుపగ

వచ్చిన రాశ్యాదికమునకు సరిపడు మాస దినఘటికావిఘటికలకు సరిపడు కాలమునకు, జననకాలమునకు పూర్వము నిషేకకాలమని గ్రహించవలయును. ఆ సమయమునకు లగ్నసాధనమును గ్రహస్థితిని సాధించినచో నిషేకలగ్న గ్రహస్థితి వచ్చును.
మరియు జనన సమయమందు లగ్నాధిపతి లగ్నమునుండి మొదటి 6 రాశులలోపున ఉన్నచో పూర్వసాధిత రాశ్యాదికములో జన్మకాల చంద్రస్ఫుటమును కలిపి నిషేక కాలసాధనమును చేయవలయును.

రాశులను మాసములుగను, భాగలను దినములుగ లిప్తలను ఘడియలుగ, విలిప్తలను విఘడియలుగ గ్రహించవలయును.

ఉదాహరణము 20-7-1981వ తేదీనాటి ఉదయము గం 9-30 ని. లకు జననము. జననకాలలగ్నభావము రా4-29-43-0 భాగ్య భావము 1-0-8-20 స్ఫుటశని రా5-14-2-0 స్ఫుటమాందిరా6-29-27-0లు గలవు.

మాందిస్ఫుటము 6-29-27-0లో శని స్ఫుటము 5-14-2-0 లను తీసివేయగ అంతరము 1-15-25-0 వచ్చినది. నవమభావము 1-0-8-20లో తనుభావము 4-29-43-0ను తీసివేయగ 8-0-25-20 అంతరము వచ్చినది. దీనిని పై అంతరమురా1-15-25-0లకు కలుపగ 9-15-50-20లు వచ్చినది. ఇందు 9 రాశులను 9మాసములుగ 15 భాగలను 15 దినములుగ 50 లిప్తలను 50 ఘడియలుగ 20 విలిప్తలను 20 విఘడియలుగ భావించి నిషేకకాలనిర్ణయమును చేయవలయును. అనగా శిశువు జన్మించుటకు 9 మా15 ది50 ఘ20వి॥ల పూర్వమందు నిషేక సమయమని గ్రహించవలయును. జన్మదినములోనుండి పై దానిని తీయగ వచ్చిన దినఘడియ విఘడియలకు లగ్నమును సాధించి తత్కాల గ్రహస్థితిని బట్టి శిశువుయొక్క మాతాపితరుల యొక్క జీవన మరణాదులను, శుభాశుభములను నిర్ణయించవలయును.

పై ఉదాహరణమందు లగ్నాధిపతి దృశ్యచక్రార్ధములో నుండుట చేత జన్మకాలచంద్రస్ఫుటముతో పనిలేదు. కొన్ని జననములందు లగ్నాధిపతి లగ్నమునుండి 6 రాసులలోపున యుండును. అట్టి స్థలములందు చంద్రభుక్త రాశి భాగాదిని కలిపి నిషేకకాలమును, లగ్నమును సాధించవలయును.

ఇతి శ్రీ బృహత్పరాశర హోరాశాస్త్రే రాశిస్వరూపాధ్యాయోనామ చతుర్థః॥
ఇది బృహత్పరాశర హోరాశాస్త్రమందు రాశిస్వరూపాధ్యాయమను చతుర్థాధ్యాయము ముగిసెను.

## విశేష లగ్నాధ్యాయము ౫

అథాహం సంప్రవక్ష్యామి తవాగ్రే ద్విజసత్తమ।
భావ హోరా ఘటీ సంజ్ఞా లగ్నానీతి పృథక్॥ పృథక్ ౧॥
సూర్యోదయం సమారభ్య ఘటికానాం తు పంచకమ్।
ప్రసూతి జన్మపర్యంతం భావలగ్నం తదేవ హి॥ ౨॥
ఇష్టం ఘట్యాదికం భక్త్వా పంచభి ర్యాదిజం ఫలమ్।
యోజ్య మౌదయికే సూర్యే భావలగ్నం స్ఫుటం చ తత్॥ ౩॥

శ్రీ పరాశర మహర్షి చెప్పుచున్నారు :-

తా. ఓ ద్విజోత్తమా! అనంతరము భావలగ్న హోరాలగ్న ఘటీలగ్నముల విషయమును వేరువేరుగ చెప్పుచున్నాను. ముందు భావలగ్నమును తెలుసుకొను విధమును చెప్పుచున్నాను. సావధానముతో తెలుసుకొనుము.

భావలగ్నసాధన పద్ధతి :- సూర్యోదయమునుండి 5 ఘడియల కొక్కొక్క లగ్నము చొప్పున గడచును. 1 రోజులో 12 లగ్నములు పూర్తియగును. జన్మసమయమునకు ఎన్ని లగ్నములు గతించినవో తెలుసుకొని సూర్యుడున్న రాశినుండి యున్నవరాశి భావలగ్నమైనదని గ్రహించవలయును.

సూర్యోదయాది జననకాలఘుడియ విఘుడియలను 5 చే భాగించగ వచ్చులబ్ధమును రాశిభాగలిప్తాదికముగ గ్రహించి, దానిని సూర్యోదయకాలిక స్పష్టరవిలో కలిపినచో స్ఫుటమైన భావలగ్నము వచ్చును.

వి. 1 ఘుడియకు 6 భాగలచొప్పున 5 ఘుడియలకు 30 భాగలు లేక 1 రాశి పూర్తి అగును. జన్మకాల ఘుడియలను 5 చే భాగించగ వచ్చిన లబ్ధమెంతయుండునో అన్నిరాశులు గతించినట్లు తెలుసుకొన వలయును. శేషించిన ఘుడియ విఘుడియలను 6 చే గుణించినచో వచ్చు లబ్ధము భాగలు, లిప్తలు అగును. వీనిని లబ్ధరాశిసంఖ్యకు చేర్చగ సూర్యోదయాది గతరాశిభాగాదికము వచ్చును. దీనిని సూర్యోదయ కాలీన సూర్యునిలో చేర్చగ స్పష్టభావలగ్నము వచ్చును.

ఉదా :- ఇష్టదినమునాటిజననకాలఘుడియ విఘుడియలు 9-35లు దీనిని 5చే భాగించగ 1 లబ్ధము అనగా 1 రాశియని గ్రహించవల యును. శేషము ఘ 4-35లు గలదు. దీనిని 6 చే గుణించగ 27 భా 30 లిప్తలువచ్చెను. దీనిని పూర్వలబ్ధమగు 1 రాశికి చేర్చగా రా 1-27-30 లిలు వచ్చెను. ఈ సంఖ్యను సూర్యోదయ కాలిక స్పష్టరవి లో కలుపవలయును. నాటి స్పష్టరవి రా3-6-50-0లో కలుపగ రా 5-4-20-0వచ్చెను. ఇదియే స్ఫుటభావలగ్నము.

హోరాలగ్న సాధనము

తథా సార్ధద్విఘటికా మితా దర్కోదయా ద్ద్విజ।
ప్రయాతి లగ్నం తన్నామ హోరాలగ్నం ప్రచక్షతే॥ ४॥
ఇష్టఘట్యాదికం ద్విఘ్నం పంచాప్తం భాదికం చ యత్।
యోజ్య మౌదయికే భానౌ హోరాలగ్నం స్ఫుటం హి తత్। ५॥

తా॥ సూర్యోదయమునుండి 2½ ఘుడియలకొక లగ్నము చొప్పున నడుచును. అట్టి లగ్నమునకు హోరాలగ్నమనిపేరు. సూర్యో

దయాది జననకాల (ఇష్టకాల) ఘడియలను 2చే గుణించి 5చే భాగిం
చగ వచ్చిన రాశ్యాదికమును సూర్యోదయ కాలిక స్పష్టరవిలో కలు
పగ స్ఫుటహోరాలగ్న ప్రమాణము వచ్చును.

ఉదా:- ఇష్టఘడియలు 9-35 దీనిని 2చే గుణించగ 19-10 వచ్చును. దీనిని 5చే భాగించగ 3 లబ్ధమురాశులు. శేషము 4-10 గలదు. దీనిని 6 చే గుణించగ 25 భాగలువచ్చును అనగా రా 3-25-0 లు. దీనిని ఉదయకాలపు స్పష్టసూర్యుని రా3-6-50-0 లో కలుపగ రా 7-1-50-0హోరాలగ్నస్ఫుట ప్రమాణమువచ్చును.

వి॥ హోరాలగ్న సాధనములో "జాతకసార సంగ్రహము"లో వేరువిధముగ చెప్పబడినది.

హోరాలగ్నసాధనము :-

తథా సార్ధద్విఘటికా మితా త్కాలా ద్విలగ్నతాత్।
ప్రయాతి లగ్నం తన్నామ హోరాలగ్నం ప్రచక్షతే॥

దివామానం రాత్రిమానం చ జ్ఞాత్వా ప్రత్యేకం ద్వాదశభి ర్విభజ్య జన్మలగ్న మారభ్య లగ్నే ఓజే క్రమేణ యుగ్మే లగ్నే వ్యుత్క్రమేణ ఇష్టజన్మకాలఘటికావశేన యల్లగ్నం భవతి తదేవ హోరాలగ్నం భవతి॥

రెండున్నఘడియలకొక లగ్నము చొప్పున ఇష్టకాలము వరకు ఎన్నిలగ్నములు నడచినవో అన్నవ సంఖ్య జన్మలగ్నమునుండి లెక్కించగ యే రాశియగునో దానిని హోరాలగ్నముగ గ్రహించ వలయును.

దినమానమును, రాత్రి మానమును ప్రత్యేకముగ గ్రహించ వలయును. పగలు జననమైతే ఆనాటి స్పష్ట దినమానమును, రాత్రి యందు జననమైతే రాత్రి ప్రమాణమును తీసుకొని 12చే భాగింపగ

హోరాప్రమాణమువచ్చును. ఇష్టకాలమువరకు ఎన్నిలగ్నములు గతించినవో లెక్కించి, జన్మలగ్నము చేసి రాశియైనచో క్రమముగను సరిరాశియైనచో వ్యుత్క్రమముగను లెక్కింపగ యేరాశివచ్చునో దానిని హోరాలగ్నముగ గహించవలయును.

పై ఉదాహరణములో ఇష్టఘడియలు 9-35 దినప్రమాణము ఘ32-18లు దీనిని 12చే భాగింపగ హోరాలగ్నప్రమాణముఘ2-41-30 వచ్చెను. ఇష్టకాలమునకు 3 లగ్నములు గడచినవి. అప్పటికి ఘ 8-4-30లు అయినది. 4వ లగ్నము వచ్చెను. జన్మలగ్నము సింహమగుటచే ఓజరాశి కనుక సింహమునుండి నాలుగవరాశి వృశ్చికము హోరాలగ్నమగును. దీనిని రాశ్యాద్యంశముగ లెక్కకట్టినచో యీ క్రిందవిధముగ వచ్చును.

హోరాప్రమాణముఘ 2-41-30లకు 30 భాగలైతే 3 రాశుల ప్రమాణము ఘ8-4-30పోగా మిగిలినది ఘ1-30-30కిఎంత? అని త్రై రాశికమును చేయవలయును. 1-30-30=90-30 = 5430పరలు×30÷ హోరాప్రమాణం. ఘ (2-41-30) లేక పరలు 9690.

5430×30=162900 ÷ 9690=భా16-48-40లు దీనికి 3 రాశులు కలుపగ వచ్చినది రా3-16-48-40లు. దీనిని స్పష్టలగ్నప్రమాణము రా4-29-43-0లో కలుపగ రా8-16-31-40 స్పష్టహోరాలగ్నము వచ్చినది. ధనుస్సు హోరాలగ్నమగుచున్నది. స్థూలముగ లెక్కించినచో వృశ్చికము అగుచున్నది. సూక్ష్మపద్ధతి ననుసరించి సాధించిన దానినే గ్రహించవలయును.

పరాశరుల మతము ననుసరించి హోరాలగ్నము రా7-1-50-0 వచ్చినది. ఈ మతము ననుసరించి హోరాలగ్నము రా8-16-31-40 వచ్చినది. హోరాలగ్న సాధనములోగల మత భేదమును గూడ గమనించవలయును.

## ఘటీలగ్నసాధనము

పరాశరమహర్షి చెప్పుచున్నాడు.

తా॥ ఓ ద్విజ శ్రేష్ఠా! ఘటీలగ్నమును గురించి చెప్పుచుంటిని. సావధానముతో వినుము. సూర్యోదయమునుండి ఒక్కొక్క ఘడియకు ఒకలగ్నము చొప్పున జననకాలమునకెన్ని ఘడియలైనవో అన్ని లగ్నములు గతించినవని గ్రహించవలయును. 1 ఘడియకు 1 లగ్న మనగా 30 భాగలని యర్థము. శేషించిన విఘడియలకు భాగలిప్తాదికమును కనుగొని మొత్తము రాశిభాగ లిప్తాదికమును ఔదయికస్పష్ట సూర్యునిలో కూడగ స్పష్ట ఘటీ లగ్నము వచ్చును.

పైన చెప్పిన భావ, హోరా, ఘటీ లగ్నములకు ప్రత్యేకముగ భావ చక్రమును వ్రాసుకొని యేయే భావములందే యే గ్రహము లున్నవో వానిని రాశి చక్రములో వలెనే ఆ యా భావములందు వేయవలయును.

ఉదా :- జనన ఘడియలు 9-35లు ఉన్నవి. 9 ఘడియలకు 9 లగ్నములు నడచినందున 9 రాశులు వచ్చెను. 35 వి॥లు గలవు. 2 విఘడియలకు 1 భాగ చొప్పున 35 విఘడియలకు 17భా 30 లిప్తలు వచ్చెను. మొత్తము రా 9-17-30 లిప్తలను ఔదయికరవి3-6-50-0 లో కలుపగ రా 0-24-20-0 లు ఘటీ లగ్నము వచ్చినది.

వి॥ జైమినీ సూత్ర వ్యాఖ్యాతయగు వెంకటేశ్వరుడు "వెంకటేశ్వరవృత్తి" లో నిట్లు వివరించెను.

"సూర్యోదయా మారభ్య జన్మకాలఘటికాపర్యంతం యావత్సంఖ్యా ఘటికా జాతా స్తావంతో రాశయః॥ ఏకైకఘటికా ఏకైకలగ్నం తథా ద్వాదశభిక్తం కృత్వా అవశిష్టఘటికాసంఖ్యా జన్మలగ్నరాశితో గణనయా తత్రాంతిమో రాశిః ఘటికాలగ్న మితి పరిగీయతే॥"

జననకాల లగ్నము నుండి ఘటికా లగ్నమును లెక్క పెట్ట వలయునని వివరించెను. పరాశరుని మతములో ఔదయిక రవి నుండి ఘటికా లగ్నమును సాధించవలెనని యున్నది.

పరాశరుని యభిప్రాయము ప్రకారము భావ, హోరా, ఘటికా లగ్నములను ఉదయకాలపు సూర్యుని నుండి సాధించవలెననియున్నది. కొంతమంది గ్రంథకర్తలు, వ్యాఖ్యాతలు మతభేదములను గ్రహించి యున్నారు. వెంకటేశ్వర వృత్తిలో "హోరా లగ్నసాధన" విషయములో వేరొక విధముగ చెప్పబడినది.

హోరా లగ్నమును సాధించునపుడు జన్మలగ్నము బేసి రాశియైనచో సూర్యుడున్న రాశి నుండి, జన్మలగ్నము సరిరాశియైనచో జన్మలగ్నము నుండి హోరా లగ్నమును సాధించవలెనని గలదు.

"జనకాల ఘటికాస్వ్యేతదృష్టా సురాజావః"

ఈ సూత్ర వ్యాఖ్యలో నిట్లు గలదు.

"కాలలగ్నం తు హోరాలగ్నం। తదానయనంచ। సార్ధఘటికాద్వయ మేకహోరా। తత్ర సూర్యోదయ మారభ్య యావద్ధోరా జాతా స్తాః పరిగణయ్య జన్మలగ్నే విషమే సతి సూర్యో యస్మిన్రాశౌ తిష్ఠతి తద్రాశి మారభ్య తావత్సం ఖ్యాంతర పరిగణయ్యాంతిమం హోరాలగ్నం కల్పనీయమ్। జన్మలగ్నే యుగ్మే సతి హోరాసంఖ్యాం జన్మలగ్నం తు యద్రాశౌ తిష్ఠతి తద్రాశి మారభ్య గణ యేత్॥ తత్రా ప్యంతిమం హోరాలగ్నం భవతి॥ అని వ్రాసియుండెను.

## వర్ణద లగ్న సాధనము

వర్ణదాఖ్యదశాం ఖానాం కథయామ్యథ తేఽగ్రతః।
యస్య విజ్ఞానమాత్రేణ వదే దాయుర్ధ్రువం ఫలమ్॥ ౧౦॥
ఓజలగ్నప్రసూతానాం మేషాదే ర్గణయే త్క్రమాత్।
సమలగ్నప్రసూతానాం మీనాదే రపసవ్యతః॥ ౧౧
మీనమేషాదితో జన్మలగ్నాంతం గణయే త్సుధీః।
తద్వైవ హోరాలగ్నాంతం గణయిత్వా తతః పరమ్॥ ౧౨
ఓజత్వేవ సమత్వేన సజాతీయే ఉభే యది।
తర్హి సంఖ్యే యోజయీత వైజాత్యే తు వియోజయేత్॥ ౧౩
మేషమీనాదితః పశ్చా ద్యో రాశి స్స తు వర్ణదః॥

తా॥ వర్ణద రాశిని కట్టు విధానము చెప్పబడుచున్నది.

వర్ణద రాశిని బట్టి, వర్ణద దశను బట్టి దాని వలన ఆయుర్దా యమును చెప్పుట యుక్తముగ నుండును.

బేసి రాశులందు జన్మించిన వారికి మేషాది నుండి లగ్నము వరుకు గణన చేయవలయును. సరిరాశులందు జన్మించిన వారికి మీనాది నుండి లగ్నము వరుకు అపసవ్యముగ (వెనుకగ) గణన చేయవలయును. ఆ సంఖ్య నొకచోట నుంచవలయును.

పై విధముగ హోరా లగ్నాంతము వరుకు కూడ గణన చేయవల యును. లగ్న హోరా లగ్నములు రెండును, బేసి రాశులైనను, సరి రాశులైనను, రెండు సంఖ్యలను కలుప వలయును. ఒకటి బేసి రాశి యగుచు, రెండవది సరిరాశియైనచో అధిక సంఖ్యగలదానిలో తక్కువ సంఖ్యగల దానిని తీసివేయవలయును. శేష సంఖ్యను బేసిరాశిలో పుట్టినవారికి మేషాది క్రమ గణనతోను, సరిరాశులలో పుట్టిన వారికి మీనాద్యపసవ్యముగను గణన చేయుగ నే రాశి వచ్చునో అదియే వర్ణదరాశి యగును.

వి॥ ఈ విషయమై "జాతకసార సంగ్రహము" లో వివరింప బడినది.

(1) "ఓజలగ్నప్రసూతానాం మేషాదిలగ్నాంతం హోరాలగ్నాంతం చ గణయిత్వా ఉభయోరోజత్వేన యుగ్మత్వేన వా సాజాత్యే సంఖ్యాద్వయం సంయోజనీయమ్॥

(2) ఏకస్యౌజత్వేన అపరస్య యుగ్మత్వేన వైజాత్యే అధికసంఖ్యాయాం న్యూనసంఖ్యా శోధనీయా। ఏవంచ యత్ప్రాప్తం యోజనోత్తరం విభజనోత్తరం వా తన్మేషాదితో గణనీయం। తత్ర యా రాశిరంతిమా లభ్యతే స వర్ణదరాశిర్భవతి"

1. తా॥ బేసి రాశులలో జన్మించిన వారికి మేషాది క్రమముగ జన్మ లగ్నము వరుకు, హోరాలగ్నము వరుకు లెక్కించి, రెండు లగ్నములు ఓజ రాశులైనను, సమరాశులైనను ఆ రెండింటిని కలుప వలయును.

2. ఒక రాశి బేసి రాశియై, ఒక రాశి సరి రాశియైనచో అధిక సంఖ్యగల లగ్నము నుండి తక్కువ సంఖ్యగల దానిని తీసివేయవలయును. తీయగ వచ్చినసంఖ్యను మేషాది క్రమముగ లెక్కపెట్టగ యే రాశి వచ్చునో అదియే వర్ణద లగ్నమగును.

(ఇక్కడ 1వ దానిలో బేసి రాశిలో జన్మించిన వారికి అనుమి రెండును సమరాశులైనచో కలుపవలయునని గ్రంథమందు గలదు. రెండును సమరాశులు కాజాలవు. గనుక జన్మలగ్నము బేసి రాశియై యుండగ హోరా లగ్నము గూడ బేసి రాశియగుచున్న యెడల కలుపవలయునని యుండుట యుక్తము.)

(3) యుగ్మలగ్నప్రసూతానాం మీనాద్యపసవ్యక్రమేణ లగ్నాంతం హోరా లగ్నాంతం చ గణయిత్వా తయో రోజత్వేన యుగ్మత్వేన వా సాజాత్యే సంఖ్యాద్వయం సంయోజనీయం (4) ఏక మోజ మపరం యుగ్మ మితి వైజాత్యే తు సంఖ్యాద్వయం వియోజనీయం॥ తతశ్చ మీనాద్యపసవ్యక్రమేణ గణనయా యో రాశి ర్లభ్యతేస వర్ణదరాశిః॥

తా॥ (3) సరి రాశులందు జన్మించిన వారికి మీనాద్య పసవ్య క్రమముగ లగ్నాంతము, హోరా లగ్నాంతము లెక్కపెట్టి అవి రెండును బేసి రాశులైనను, సరి రాశులైనను కలుపవలయును.

(4) ఒకటి బేసి సంఖ్యయై రెండవది సరిసంఖ్య యైనచో అధిక సంఖ్యలో నుండి తక్కువ దానిని తీయవలయును. శేష సంఖ్యను మీనాద్యపసవ్య క్రమముగ లెక్కపెట్టగ యేరాశివచ్చునో దానికి వర్ణదరాశి యని పేరు.

ఉదా :- ఇష్ట (జనన) కాల ఘడియలు 9-35 లకు జన్మలగ్నము సింహము రా 4-29-43-0 హోరాలగ్నము (పరాశర మతము ననుసరించి రా 7-1-50-0 వచ్చెను. ఇక్కడ జన్మలగ్నము బేసిరాశి యగుటచే మేషాదిగ లెక్క పెట్టవలయును. జన్మలగ్నము బేసిరాశియై, హోరా లగ్నము వృశ్చికమగుటచే సరిరాశి యైనందున

అధిక సంఖ్యగల హోరా లగ్నము రా 7-1-50-0లో జన్మలగ్నము 4-29-43-0 ను తీసివేయ వలయును. అట్లు తీయగ 7-1-50-0 - 4-29-43-0 = రా 2-2-7-0 మిగిలినది. దీనిని మేషాదిగ లెక్క చూడగ మిధునము వర్ణదరాశి యైనది. జాతకసార సంగ్రహకర్త యొక్క పద్ధతి ననుసరించి హోరా లగ్నము రా 8-16-31-40 వచ్చినందున ధనుస్సు బేసి రాశియైనది. జన్మలగ్న హోరా లగ్నములు బేసిరాసులగుటచే రెండింటిని కలుపవలయును. జన్మలగ్నము రా 4-29-43-0 + 8-16-31-40 = 1-16-14-40 వచ్చెను. వృషభము వర్ణద రాశి యగును. ఇట్లు ఉభయమతముల చేత చూడగ వ్యత్యాసము గనబడుచున్నది.

## వర్ణద రాశి ప్రయోజనము

ఏతత్ప్రయోజనం వక్ష్యే శృణు త్వం ద్విజపుంగవ।
హోరాలగ్నభయో ర్జ్ఞేయా సబలా ద్వర్ణదా దశా॥ ౧౪॥
యత్సంఖ్యో వర్ణదో లగ్నాత్ తత్తత్సంఖ్యా క్రమేణతు।
క్రమవ్యుత్క్రమభేదేన దశా స్యా దోజయుగ్మయోః॥ ౧౫॥

తా॥ ఓ ద్విజోత్తమా ! వర్ణదరాశి ప్రయోజనము చెప్పబడుచున్నది.

జన్మలగ్న హోరా లగ్నములలో నేది బలమైనదో తెలుసుకొని బలవద్రాశిని బట్టి కట్టవలయును.

వర్ణదరాశి జన్మలగ్నము నుండి ఎన్నవ సంఖ్యగల రాశియగుచున్నదో లగ్న హోరా లగ్నములలో బలవద్రాశి కన్నవ రాశి నుండి వర్ణద దశారంభమును ఓజయుగ్మ భేదముచే క్రమవ్యుత్క్రమముగ కట్టవలయును.

· వి॥ ఇక్కడ వివరించదగిన అంశములు గలవు. ముందుగ వానిని తెలుసుకొనవలయును. 1. జన్మలగ్న హోరా లగ్నములలో బలమైన

రాశిని తెలుసుకొనుట, 2. జన్మలగ్నము నుండి వర్ణదరాశి ఎన్నవ సంఖ్యగల రాశియైనదో ఆ సంఖ్యను గుర్తుపెట్టుకొనుట. 3. బలవద్రాశి నుండి దశారంభమును చేయునపుడు, బలవద్రాశి నుండి ఓజరాశియైన క్రమగణనచేత. యుగ్మరాశియైన వ్యుత్క్రమ గణన చేత వర్ణద సంఖ్యకు సరిపడిన రాశినిబట్టి దశాసంవత్సరములను గ్రహించవలయును. 4. వర్ణదసంఖ్యకు సరిపడిన రాశి ఓజరాశియైనచో దాని నుండి క్రమ గణనచే దాని అధిపతి ఎన్నవరాశిలో నుండునో అన్ని సంవత్సరములు దశావర్షములని గ్రహించవలయును. 5. సరిరాశియైనచో వ్యుత్క్రమముగ దశావర్షములను గ్రహించవలయును. దీనికి ఉదాహరణము దశాప్రకరణములో నీయబడును.

పాపదృష్టిః పాపయోగో వర్ణదస్య త్రికోణకే।
యది స్యాత్తర్హి తద్రాశిపర్యంతం తస్య జీవనమ్॥ ౧౬॥
రుద్రశూలే యథైవాయు ర్మరణాది విరూప్యతే
తథైవ వర్ణదస్యాపి త్రికోణే పాపసంగమే॥ ౧౭
వర్ణదా దపి భోవిప్ర! లగ్న వచ్చింతయే త్ఫలమ్॥
వర్ణదా త్సప్తమా ద్భావాత్ కళత్రాయు ర్విచింతయేత్॥ ౧౮
ఏకాదశా దగ్రజస్య తృతీయా త్తు యవీయసః।
సుతస్య పంచమే విద్యాత్ మాతు శ్చతుర్థభావతః॥ ౧౯
పితుశ్చ నవమాత్ భావా దాయు రేవం విచింతయేత్॥
శూలరాశిదశాయాం వై ప్రబలాయా మరిష్టకమ్॥ ౨౦

తా॥ వర్ణదదశ ఆయుర్దాయమును, మారకమును చెప్పుటకు ముఖ్యమైనది. వర్ణదరాశి నుండి ఏ త్రికోణరాశికి అధికపాప సంబంధముండునో ఆ రాశి వరకు దశలను కట్టి అంతవరకు ఆయుర్దాయము పట్టునని చెప్పవలయును. రుద్రశూల దశయందే విధముగ ఆయుర్దాయ మారక నిర్ణయములు చేయబడుచున్నవో అదే విధముగ నీ వర్ణద దశయందు గూడ ఆయుర్దాయ మారక నిర్ణయములను చేయువలయును.

లగ్నము నుండి పిత్రాది భావముల కాయుర్దాయాది నిర్ణయములను చేసినట్లు వర్ణదరాశి నుండి పిత్రాదిభావములను విచారించవలయును.

వర్ణదరాశికి సప్తమ భావమును బట్టి కళత్ర విషయమును, ఏకాదశము నుండి జ్యేష్ఠ సోదరుల యొక్క, తృతీయమును బట్టి కనిష్ఠ సోదరుల యొక్క, పంచమము వలన సంతానము యొక్క, మాతృ భావము వలన తల్లియొక్క, నవమ భావము నుండి తండ్రి యొక్క ఆయుర్దాయమును నిర్ణయించవలయును. శూలరాశి దశయందు మారకమును జెప్పవలయును.

వి॥ జాతకుని యొక్క ఆయుర్దాయమును నిశ్చయముగ తెలుసుకొనుటకు, మారకమును స్పష్టముగ నిర్దేశించుటకును రాశిచక్రప్రకరణములో 1. హోరాదశ, 2. దృగ్దశ, 3. శూలదశ, 4. మహేశ్వరదశ, 5. వర్ణదదశ మొదలగు దశలు చెప్పబడినవి. వీనిలో వర్ణదదశ, రుద్రదశ, శూలదశయను దశల యొక్క సంవాదముచేత ఆయుర్నిర్ణయమును, మారక నిర్ణయమును చేయవలయును. దశా ప్రకరణములో యీ దశలను కట్టు విధానములు వివరింపబడినవి. అక్కడ సోదాహరణముగ వివరింపబడును.

ఏవం తన్వాదిభావానాం కర్తవ్యా వర్ణదా దశా।
పూర్వవచ్చ ఫలం జ్ఞేయం దేహినాం చ శుభాశుభమ్॥ ౨౧

గ్రహాణాం వర్ణదా నైవ రాశీనాం వర్ణదా దశా॥
కృత్వార్క్షదా రాశిదశాం క్రమా దంతర్దశాం వదేత్॥ ౨౨

ఏవ మంతర్దశాదిం చ కృత్వా తేన ఫలం వదేత్॥
క్రమవ్యుత్క్రమభేదేన లిఖే దంతర్దశా మపి॥ ౨౩

తా॥ పై విధముగ తన్వాది ద్వాదశ భావములకువర్ణదదశను కట్టి జీవుల యొక్క శుభాశుభములను నిర్ణయించి చెప్పవలయును. గ్రహములకు వర్ణదరాశి లేదు, రాశులకు మాత్రమే గలదు. రాశు

లను బట్టి వర్ణద దశను కట్టి, దశా ప్రమాణమును 12 భాగములుగ చేసి 12 రాశులకు 12 అంతర్దశలను చెప్పవలయును. దశలను కట్టునప్పుడు, అంతెర్దశలను కట్టునప్పుడు క్రమవ్యుత్క్రమ భేదముల నాయా దశలందు నియమించిన విధముగ పాటించి అంతర్దశలను గూడ నడిపించవలయును.

వి॥ దశలు రెండు రకములు. 1. గ్రహదశలు. 2 రాశిదశలు వీనిలో గ్రహ దశలకు రవ్యాది గ్రహములే అంతర్దశలు. రాశులకు మేషాది రాశులే అంతర్దశలు. గ్రహదశల్లో వింశోత్తరి, అష్టోత్తరి, షోడశోత్తరి, ద్వాదశోత్తరి ఇత్యాది దశలు గ్రహదశలు. వీనిలో అంతర్దశలు గూడరవ్యాది గ్రహములకు సంబంధించినవై యుండును. రాశి దశల్లో స్థిరదశ, చరదశ, హోరాదశ, త్రికోణదశ, వర్ణదదశ ఇత్యాదులుగలవు. ఈ దశలందు అంతర్దశలు రాశి నామములతో సంబంధించినవై యుండును. ఉభయ పద్ధతుల ప్రకారము మొత్తము 70 దశల వరకు ఉన్నట్లు "జైమినీ సూత్ర వ్యాఖ్యాత" యగు సోమనాథుడు వ్రాసియుండెను.

> స్వస్వదేశోద్భవం లగ్నం జన్మలగ్న మిహోచ్యతే॥
> భావహోరాదిలగ్నానాం సర్వత్రైవ సమక్రియా॥ ౨౪॥

తా॥ జన్మలగ్నమును సాధించునపుడు స్వదేశ సంబంధమైన లగ్న ప్రమాణములను గ్రహించి, జన్మలగ్నమును సాధించవలయును భావ, హోరాదిలగ్నములను సాధించునప్పుడుసర్వదేశములందును ఒకే విధముగ గణితమును చేయవలయును.

వి॥ మేషాది ద్వాదశ లగ్న ప్రమాణములు ప్రతి అక్షాంశమునకు మార్పునుచెందును. జాతకుని జనన ప్రదేశము ఏ అక్షాంశమునకు సంబంధించి, ఏ రేఖాంశమునకు సంబంధించి యున్నదో తెలుసుకొని

దానిని బట్టి జన్మసమయమును స్థిరపరచుకొని, మేషాది లగ్న ప్రమాణముల నాయకాంశమునకు సంబంధించిన వానిని గ్రహించి ఇష్టకాలమునకు లగ్నసాధనమును చేయవలయును.

ఇతి శ్రీ బృహత్పరాశరహోరాశాస్త్రే విశేషలగ్నాధ్యాయోనామ పంచమః ॥
ఇది బృహత్పరాశర హోరాశాస్త్రమందు విశేష లగ్నాధ్యాయమను పంచమాధ్యాయము ముగిసెను.

## షోడషవర్గాధ్యాయము ॥౬॥

శ్రుతా గ్రహగుణాస్త్వత్త స్తథా రాశిగుణా మునే।
శ్రోతు మిచ్ఛామి భావానాం భేదాంస్తాన్ కృపయా వద॥ ౧॥

తా॥ ఓ మునిశ్రేష్ఠా! గ్రహగుణములు, రాశిగుణములు నీవలన వినియుంటిని. భావములయొక్క భేదములను వినవలయునను కుతూహలము గలవాడనై యుంటిని. నీవు భావ సంబంధమైన భేదములను తెలియచేయ గోరుచున్నాను.

వర్గాన్ షోడశ యానాహ బ్రహ్మా లోకపితామహః।
తా నహం సంప్రవక్ష్యామి మైత్రేయః శ్రూయతా మితి॥ ౨॥

తా॥ ఓ మైత్రేయా! లోకపితామహుడగు బ్రహ్మచెప్పిన షోడశవర్గభేదములను చెప్పుచుంటిని. సావధానముతో వినుము.

క్షేత్రం హోరా చ ద్రేక్కాణ స్తుర్యాంశ స్సప్తమాంశకః।
నవాంశో దశమాంశశ్చ సూర్యాంశః షోడశాంశకః॥ ౩॥
వింశాంశో వేదబాహ్వంశో భాంశ స్త్రింశాంశక స్తతః।
ఖవేదాంశో ఽక్షవేదాంశః షష్ట్యంశ శ్చ తతః పరమ్॥ ౪॥

తా॥ 1. క్షేత్రము 2. హోర 3. ద్రేక్కాణము 4. చతుర్థాంశము 5. సప్తమాంశము 6. నవమాంశము 7. దశమాంశము 8. ద్వాదశాంశము 9. షోడశాంశము 10 వింశాంశము 11. చతుర్వింశాంశము 12. సప్తవింశాంశము (భాంశము) 13. త్రింశాంశము 14. ఖవేదాంశము (చత్వారింశదంశము) 15. అక్షవేదాంశము, (పంచచత్వారింశదంశము) 16. షష్ట్యంశము అని 16 వర్గ భేదములు గలవు.

## వర్గభేద నిరూపణము

వర్గభేదా నహం వక్ష్యే మైత్రేయ త్వం విధారయ ।
షడ్వర్గాః సప్తవర్గాశ్చ దిగ్వర్గాః నృపవర్గకాః ॥ ౪౨
భవంతి వర్గసంయోగే షడ్వర్గే కింశుకాదయః ।
ద్వాభ్యాం కింశుకనామా చ త్రిభి ర్వ్యంజన ముచ్యతే ॥ ౪౩
చతుర్భి శ్చామరాఖ్యం చ ఛత్రం పంచభి రేవ చ ।
షడ్భిః కుండలయోగ స్స్యాత్ ముకుటాఖ్యం చ సప్తభిః ॥ ౪౪
సప్తవర్గేథ దిగ్వర్గే పారిజాతాది సంజ్ఞకాః ।
పారిజాతం భవే ద్ద్వాభ్యా ముత్తమం త్రిభి రుచ్యతే ॥ ౪౫
చతుర్భి ర్గోపురాఖ్యం స్యాచ్ఛరైః సింహాసనం తథా ।
పారావతం భవే త్షడ్భి ర్దేవలోకం చ సప్తభిః ॥ ౪౬
వసుభి ర్బ్రహ్మలోకాఖ్యం నవభి శ్శక్రవాహనమ్ ।
దిగ్భిః శ్రీధామయోగ స్స్యా దథ షోడశవర్గకే ॥ ౪౭
భేదకం చ భవే ద్ద్వాభ్యాం త్రిభి స్స్యాత్కుసుమాఖ్యకమ్ ॥
చతుర్భి ర్నాగపుష్పం స్యాత్ పంచభిః కందుకాహ్వయమ్ ॥ ౪౮
కేరళాఖ్యం భవే త్షడ్భిః సప్తభిః కల్పవృక్షకమ్ ।
అష్టభి శ్చందనవనం నవభిః పూర్ణచంద్రకమ్ । ౪౯
దిగ్భి రుచ్చైశ్శ్రవా నామ రుద్రై ర్ధన్వంతరి ర్భవేత్ ।
సూర్యకాంతం భవే త్సూర్యై ర్విశ్వై స్స్యా ద్విద్రుమాఖ్యకమ్ ॥ ౫౦
శక్రసింహాసనం శక్రై ర్గోలోకం తిథిభిర్భవేత్ ।
భూపై శ్శ్రీవల్లభాఖ్యం స్యా ద్వర్గ భేదై రుదాహృతాః ॥ ౫౧
స్వోచ్చ మూలత్రికోణ స్వభవనాధిపతే కృతాః ।
స్వారూఢాత్ కేంద్రనాథానాం వర్గా గ్రాహ్యాః సుధీమతా ॥ ౫౨
అస్తంగతా గ్రహజితా నీచగా దుర్బలా శ్చయే ।
శయనాదిగతా స్తేభ్య ఉత్పన్నా యోగనాశకాః ॥ ౫౩

తా॥ పరాశరుడు మైత్రేయునకు వర్గభేదములను తెలియచేయు చున్నాడు :—

1 షడ్వర్గము, 2 సప్తవర్గము, 3 దశవర్గము, 4 షోడశవర్గము అని నాలుగు విధములు.

1 షడ్వర్గమందు 2 స్వవర్గములు వచ్చినచో "కింశుకము" 3 వర్గములు వచ్చినచో "వ్యంజనము" 4 వర్గములు వచ్చినచో "చామరము" 5 వర్గములు వచ్చినచో "ఛత్రము" 6 స్వవర్గములు వచ్చినచో "కుండలము" అని చెప్పబడును.

2 సప్తవర్గమందు 6స్వ వర్గములవరకు షడ్వర్గమువలెనే గ్రహించవలయును. 7 వర్గములు వచ్చినచో "ముకుటము" అని పేరు.

3 దశవర్గమందు 2స్వవర్గములకు "పారిజాతము"3 వర్గములకు "ఉత్తమము" 4 వర్గములకు "గోపురము" 5 వర్గములకు "సింహాసనము" 6 వర్గములకు "పారావతము" 7 వర్గములకు "దేవలోకము" 8 స్వవర్గములకు "బ్రహ్మలోకము" 9 వర్గములకు "శక్రవాహనము" 10 వర్గములకు "శ్రీధామము" అని పేరు.

4 షోడశ వర్గమందు 2స్వవర్గములకు భేదకము "3 వర్గములకుకుసుమము 4 వర్గములకు నాగపుష్పము 5 వర్గములకు "కందుకము" 6 వర్గములకు "కేరలము" 7 వర్గములకు కల్పవృక్షము 8 వర్గములకు "చందనివనము"9 వర్గములకు పూర్ణచంద్రము 10 వర్గములకు ఉచ్చైఃశ్రవము 11 వర్గములకు "ధన్వంతరి" 12 వర్గములకు "సూర్యకాంతము" 13 వర్గములకు విద్రుమము 14 వర్గములకు శక్రసింహాసనము 15 వర్గములకు "గోలోకము" 16 వర్గములకు శ్రీవల్లభము" అని పేరు.

స్వోచ్ఛ, మూలత్రికోణ, స్వభవనాధిపతి నుండి, లగ్నము నుండి, ఆరూఢ లగ్నము నుండి కేంద్రాధిపతుల యొక్క వర్గములు శుభవర్గములని గ్రహించవలయును, అస్తంగత, పరాజిత, నీచగత, దుర్బలగ్రహముల యొక్క వర్గములు పాపవర్గములు. శయనాది

దుష్టావస్థలందున్న గ్రహవర్గములు కూడ పాపవర్గములు, ఈ పాప వర్గములను పొందిన గ్రహము శుభము నిచ్చుటకు మారుగ యోగ నాశనమును, అశుభమును కలిగించును.

వి॥ ఏదైననొక గ్రహమునకుగాని భావమునకుగాని షడ్వర్గాది వర్గములను సాధించునపుడా గ్రహము యొక్క, లేక ఆ భావాధిపతి యొక్క స్వవర్గములు, స్వోచ్ఛ, స్థానాధిపతియొక్క, మూలత్రికోణ రాశి యొక్క, తానున్న రాశినుండి కేంద్ర నాథులయొక్క లేక లగ్నమునుండిగాని, ఆరూఢలగ్నమునుండి కేంద్ర నాథులయొక్క వర్గములను శుభవర్గములుగ గ్రహించవలయును. పై వానిలో అస్తంగత, నీచ, పరాజిత, దుర్బల, శయనాది దుష్టావస్థాగత గ్రహముల యొక్క అంశము లైనచో వానిని పాపాంశములుగ గ్రహించ వలయును.

"సర్వార్థచింతామణి" లో వర్గనిర్ణయమును గురించి;

ఏకద్విత్ర్యంశకా స్సప్త నవాంశ ద్వాదశాంశకాః।
త్రింశాంశా ఇతి విజ్ఞేయా గ్రహాణాం సప్తవర్గకాః ॥ ఇతిసప్తవర్గనిర్ణయః॥
మూలత్రికోణకే స్వోచ్చే స్వక్షేత్రేపి చ కేంద్రకే।
చత్వార ఉత్తమాంశా స్స్యు రమీ శుభఫలాధికాః॥ ఇత్యుత్తమాంశః॥
సప్తవర్గో ద్రువాంశాశ్చ సాధిమిత్రాంశకా అమీ।
సోత్తమాంశకషష్ఠంశ్యా వర్గాః ప్రోక్తాః త్రయోదశ॥ ఇతత్రయోదశవర్గ నిర్ణయః

అని రాశి, హోరా, ద్రేక్కాణ, సప్త, నవ, ద్వాదశ, త్రింశాంశములకు సప్తవర్గ మనియు, మూలత్రికోణ, స్వోచ్ఛ, స్వక్షేత్ర, కేంద్రాది పాంశము లుత్తమమైనవి శుభదాయకములనియు (2) సప్తవర్గములో యీ నాలుగు అంశములను కలిపి మొత్తము 11 వర్గములకు ఉత్తమాంశ మనియు, (3) సప్తవర్గాంశములు, గ్రహము యొక్క అధిమిత్రాంశములు, ఉత్తమాంశముగ చెప్పబడిన నాలుగు

అంశములు, షష్ఠ్యంశము మొత్తము 13 కలిపి త్రయోదశ వర్గమనియు తెలిపియుండెను. షోడశవర్గమును గురించిగాని, దశవర్గమును గురించి గాని వివరించలేదు.

మరియు విశేషాంశ నిర్ణయము" అని చెప్పుచు;

ఉత్తమం తు త్రివర్గైక్యే చతుర్వర్గే తు గోపురమ్।
సింహాసనం పంచవర్గే ద్విర్వర్గే పారిజాతకమ్॥
పారావతం షట్శుభత్వే దేవలోకస్తు సప్తకే॥
అష్టవర్గశుభత్వేతు కుంకుమాంశ ఇతీరిత॥
నవవర్గశుభత్వేతు లభే దైరావతాంశకః।
దశవర్గే వైష్ణవం స్యా దేకాదశశుభే శివః॥
ద్వాదశానాం శుభత్వేతు భాస్వదంశ ఇతీరితః।
త్రయోదశానాం వర్గాణాం శుభే వైశేషికాంశకః॥

మూడు శుభవర్గముల కుత్తమాంశము 4 శుభవర్గములకు గోపురము 5 శుభవర్గములకు సింహాసనము, రెండు శుభవర్గములకు పారిజాతము, 6 శుభవర్గములకు పారావతము, 7 శుభవర్గములకు దేవలోకము, 8 వర్గములకు కుంకుమాంశము, 9 వర్గములకు ఐరావతము, 10 వర్గములకు వైష్ణవము 11 వర్గములకు "శివాంశము" 12 వర్గములకు సూర్యాంశము 13 శుభవర్గములకు వైశేషికాంశము అని పేరు. అని చెప్పియుండెను.

ఫలదీపికలో

"భ్యాతైః కోణయుతైః త్రికోణభవన స్వర్క్షోచ్చ కేంద్రోత్తమై
ర్వర్గాః సప్తదశ త్రయోదశ మితా వర్గాః ప్రదిష్టాః పరైః॥

అను శ్లోకములో సప్తవర్గముతో త్రికోణ, మూలత్రికోణభవన స్వక్షేత్ర, ఉచ్చ, కేంద్ర. వర్గోత్తమాంశములను గూడ లెక్కలోనికి తీసుకొని కొందరు త్రయోదశ వర్గమును చెప్పియున్నారని చెప్పియుండెను.

కొందరు సప్తవర్గము, కొందరు దశవర్గము, కొందరు త్రయోదశవర్గమును తెలిపియున్నారని చెప్పుచు; తన అభిప్రాయముగ

క్షేత్ర త్రిభాగ నవభాగ దశాంశ హోరా త్రింశాంశ సప్తలవ షష్టిలవాః కలాంశాః।
తే ద్వాదశాంశ సహితా దశవర్గసంజ్ఞా వర్గోత్తమో నిజనిజే భవనే నవాంశః॥

అను శ్లోకములో 1 క్షేత్రము (రాశి) 2 ద్రేక్కాణము 3 నవాంశము 4 దశాంశము 5 హోర 6 త్రింశాంశము 7 సప్తాంశము 8 షష్ట్యంశము 9 షోడశాంశము (కలాంశము) 10 ద్వాదశాంశము కలిపి దశవర్గమగుచున్నదని తెలిపియుండెను.

పారిజాతాద్యంశములను గూర్చి;

వర్గా స్స్వోజయతు త్రియోదశ సుహృత్స్వర్గోచ్చభేషు క్రమాత్
ద్విత్రిః పంచ చతు ర్నవా ద్రి వసు షట్సంఖ్యాసు వర్గైక్యతః
ప్రాహు శ్చోత్తమ పారిజాతకథితౌ సింహాసనం గోపురం
చైత్త్యైరావత దేవలోక సురలోకాంశాశ్చ పారావతమ్॥

రెండు శుభవర్గములచే పారిజాతము 3చే ఉత్తమము 4చే గోపురము 5చే సింహాసనము 6చే పారావతము 7చే దేవలోకము 8 చేత సురలోకము 9 శుభవర్గముల చేత ఐరావతాంశము వచ్చునని చెప్పియుండెను 10, 11, 12, 13, లకు చెప్పలేదు.

"జాతకపారిజాతము"లో వైద్యనాథ దీక్షితుడు;

లగ్నం హోరా దృగాణం స్వర నవ దశక ద్వాదశాంశాః కలాంశా
త్రింశత్ షష్ట్యంశకాఖ్యా వ్యయ దురితచయ శ్రీకరా మానవానామ్॥

అను శ్లోకములో లగ్న, హోరా, ద్రేక్కాణ, సప్త, నవ, దశ, ద్వాదశ, షోడశ, త్రింశాంశ, షష్ట్యంశలను గ్రహించి దశవర్గమును చెప్పియుండెను.

పారిజాతాద్యంశములను గురించి;

> ఉత్తమం తు త్రివర్గైక్యం చాతుర్వర్గం తు గోపురమ్।
> వర్గపంచకసంయోగం సింహాసన మిహోచ్యతే।
> వర్గద్వయం పారిజాతం షణాం పారావతాంశకః।
> సప్తమం దేవలోక స్స్యా దష్టమంచ తథా భవేత్।
> ఐరావతం తు నవకం ఫలం తేషాం పృథక్ పృథక్ ।

అని ఫలదీపికలో చెప్పినట్లుగ చెప్పి 7, 8 అంశములకు రెంటి కిని దేవలోకమునే చెప్పియుండెను.

గర్గజాతక, సూర్యజాతకాది గ్రంథములందు షడ్వర్గము, సప్త వర్గము మాత్రమే చెప్పబడియున్నది.

పరాశర మహర్షి మాత్రము షోడశవర్గమును చెప్పియుండెను.

గర్గాదులయొక్క యభిప్రాయములో షడ్వర్గము, సప్తవర్గము ఈ రెండు వర్గములే ముఖ్యములని తెలియుచున్నది.

"జాతక పారిజాతములో", "వర్గప్రయోజనము"ను గురించి,

> విలగ్న హోరా ద్రేక్కాణ నవాంశ ద్వాదశాంశకాః।
> త్రింశాంశకశ్చ షడ్వర్గః శుభకర్మసు శస్యతే॥
> సప్తాంశయోగః షడ్వర్గః సప్తవర్గోఽభిధీయతే।
> జాతకేషు చ సర్వేషు గ్రహాణాం బలకారణమ్॥

అను శ్లోకములందు షడ్వర్గము సర్వశుభకర్మలందు చూడవలె ననియు, సప్తవర్గము జాతకములందు చూడవలయుననియు చెప్పి యుండెను.

దశవర్గ విషయమై వెనుక శ్లోకములో "వ్యయ దురిత చయ శ్రీకరా మానవానాం" అని దశవర్గములు పాపవర్గములైనచో నష్ట మును, పాపమును, ఒకప్పుడు శీఘ్ర మృత్యువును కలిగించుననియు,

శుభాంశములైనచో జాతకులకు వృద్ధిని సంపదను కలిగించుననియు చెప్పియుండెను.

మరియు గ్రహముల యొక్క స్థానబల సాధనమందు "సప్తవర్గజబలము" కలదు. కనుక గ్రహముల బలనిర్ణయమును చేయుటకు "సప్తవర్గము" ముఖ్యమని జాతక పారిజాత గ్రంధకర్త చెప్పియుండెను.

పరాశరుడు షోడశవర్గమునకు "వర్గవింశోపక బలము"ను ముందు అధ్యాయములో చెప్పియుండెను.

వర్గవింశోపక బలమును వరాహమిహిర, శ్రీపతి, కేశవ దైవజ్ఞ, హోమ్లలుగి, దామోదరాదులు చెప్పియుండలేదు.

ఇతి శ్రీ బృహత్పరాశర హోరాశాస్త్రే షోడశవర్గాధ్యాయో నామ షష్ఠః॥

ఇది బృహత్పరాశరహోరా శాస్త్రమందు షోడశవర్గాధ్యాయమను షష్ఠాధ్యాయము ముగిసెను.

అథ షోడశవర్గేషు వివేకం చ వదామ్యహమ్।
లగ్నే దేహస్య విజ్ఞానం హోరాయాం సంపదాదికమ్॥ ౧॥
ద్రేకాణే భ్రాతృజం సౌఖ్యం తుర్యాంశే భాగ్యచింతనమ్।
పుత్రపౌత్రాదికానాం వై చింతనం సప్తమాంశకే॥ ౨॥
నవమాంశే కళత్రాణాం దశమాంశే మహత్ఫలమ్।
ద్వాదశాంశే తథా పిత్రోశ్చింతనం షోడశాంశకే॥ ౩
సుఖాఽసుఖస్య విజ్ఞానం వాహనానాం తథైవ చ।
ఉపాసనాయా విజ్ఞానం సాధ్యం వింశతిభాగకే॥ ౪॥
విద్యాయా వేదబాహ్వంశే భాంశే చైవ బలాఽబలమ్॥
త్రింశాంశకే రిష్టఫలం ఖవేదాంశే శుభాఽశుభమ్॥ ౫॥
అక్షవేదాంశకే చైవ షష్ట్యంశే ఖిల మీక్షయేత్।
యత్ర కుత్రాపి సంప్రాప్తః క్రూరషష్ట్యంశకాధిపః॥ ౬॥
తత్ర నాశో న సందేహో గర్గాదీనాం వచో యథా॥
యత్ర కుత్రాపి సంప్రాప్తః కలాంశాధిపతిః శుభః॥ ౭॥

తత్రి వృద్ధిశ్చ షష్టిశ్చ గర్గాదీనాం వచో యథా।
ఇతి షోడశవర్గాణాం భేదా స్తే ప్రతిపాదితాః॥ ౮॥

తా॥ షోడశ వర్గములందు విశేషము చెప్పబడుచున్నది.

లగ్నమువలన దేహము, హోరవలన సంపద, ద్రేక్కాణము వలన సోదరాది సౌఖ్యము, చతుర్థాంశమువలన భాగ్యచింతనము. సప్తమాంశము నుండి పుత్రపౌత్రాది చింతనమును, నవాంశమువలన కళత్ర విషయమును, దశమాంశమును బట్టి మహాఫలము (గొప్ప ధనము)ను విచారించవలయును. ద్వాదశాంశము నుండి మాతాపితరుల విషయమును, షోడశాంశము వలన వాహనాదుల సుఖదుఃఖములను, వింశాంశము నుండి దేవతోపాసనా విషయమును, చతుర్వింశాంశము నుండి విద్యను, సప్తవింశాంశము (భాంశ) నుండి బలాబలములను, త్రింశాంశము వలన అరిష్టములను, ఖవేదాంశము నుండి శుభాశుభ ఫలమును, అక్షవేదాంశ, షష్ట్యంశముల వలన సమస్త వస్తువుల యొక్క విచారణమును చేయవలయును. ఏ భావమునకు క్రూరషష్ట్యంశాధిపతి వచ్చునో యాభావమునకు నాశనమును చెప్పవలయును. ఏ భావమునకు శుభ షోడశాంశాధిపతి వచ్చునో యాభావమునకు పుష్టిని వృద్ధిని చెప్పవలయును. ఈ విధముగ షోడశవర్గములను బట్టి ఫల విచారణమును చేయవలయును.

వి॥ "హోరా ప్రదీపము"లో "వర్గప్రయోజనము"ను గురించి ఇట్లు గలదు.

లగ్నా ద్దేహవిచారో హోరాత శ్చార్థసంపదో ష్టేమాః॥
ద్రేక్కాణా త్కర్మఫలం భ్రాతృవిచారస్తు సప్తాంశాత్॥
సంతతిఫలం నవాంశాత్ ద్వాదశభా త్కళత్రచింతాచ।
మృత్యో ర్జ్ఞానం కథితం త్రింశాంశా న్నాశకజ్ఞైస్తు॥

అనగా లగ్నము నుండి దేహవిషయమును, హోర నుండి అర్థ సంపదలను గురించి, ద్రేక్కాణము వలన జన్మాంతర కర్మ ఫలమును, సప్తాంశము నుండి భ్రాతృ విచారణమును, నవాంశము నుండి సంతాన విషయమును, ద్వాదశాంశము నుండి కళత్రచింతనమును, త్రింశాంశమును బట్టి మృత్యు విషయమును, తెలుసుకొన వలయునని పరాశరుడు చెప్పినదానికి కొంతభేదము చెప్పబడినది.

> ఉదయాదిషు భావేషు ఖేటస్య భవనేషు వా।
> వర్గవింశోపకం వీక్ష్య జ్ఞేయం తేషాం శుభాశుభమ్॥ ౯॥

తా॥ తన్వాది ద్వాదశ భావముల యొక్క రాశ్యాది స్ఫుటములను బట్టి, రవ్యాది గ్రహముల యొక్క రాశ్యాది స్ఫుటములను బట్టి వర్గవింశోపక బలమును తెలుసుకొని వానియొక్క శుభా శుభములను తెలుసుకొన వలయును.

> అథాతః సంప్రవక్ష్యామి వర్గవింశోపకం బలమ్।
> యస్య విజ్ఞానమాత్రేణ విపాకం దృష్టిగోచరమ్॥ ౧౦
> గృహవింశోపకం వీక్ష్యం సూర్యాదీనాం ఖచారిణామ్।
> స్వగృహోచ్చే బలం పూర్ణం శూన్యం తత్సప్తమస్థితే॥ ౧౧
> గృహస్థితివశాత్ జ్ఞేయం ద్విరాశ్యధిపతే స్తథా।
> మధ్యేనుపాతతో జ్ఞేయం ఓజయుగ్మర్క్షభేదతః॥ ౧౨

తా॥ వర్గవింశోపక బలమును చెప్పుచున్నాను. దీనిని తెలుసుకొనుటవలన గ్రహముల వలనగలుగు శుభా శుభఫల విపాకము స్పష్టముగ దృష్టిగోచరమగునో యట్టి వర్గవింశోపకబలమును చెప్పుచుంటిని.

సూర్యాది గ్రహములకు తామున్న గృహము (రాశి) యొక్క వింశోపక బలమును సాధించవలయును. స్వక్షేత్రమందుగాని, ఉచ్ఛయందుగాని గ్రహమున్నప్పుడు సంపూర్ణ బలము గలదగును. ఉచ్ఛలో నున్న గ్రహము పూర్ణబలముగలది. నీచలోనున్న గ్రహము పూర్తిగ

బలములేదని. అనగా ఉచ్చలో బలము 1 అనుకొన్నచో నీచలోనున్న అగును. ఉచ్చనీచల మధ్యలో నున్నప్పుడు త్రైరాశికముచేత బలము యొక్క వృద్ధిక్షయములను తెలుసుకొనవలయును. ఉచ్చనుండి నీచకు వచ్చుచున్నచో బలముతగ్గును. నీచనుండి ఉచ్చకు వచ్చుచున్నచో బలము పెరుగును. ద్విరాశ్యధిపత్యముగల కుజాదిపంచ గ్రహముల యొక్క స్థితినిబట్టి ఓజయుగ్మాను సారము రాశిబలమును నిర్ణయించ వలయును. కుజాదిగ్రహములకు ఒకరాశి బేసిరాశి, ఒకరాశి సరిరాశి అధిపత్యము గలదు. పురుష గ్రహములు పురుష (బేసి) రాశులందు, స్త్రీ గ్రహములు స్త్రీ (సరి) రాశులందు బలముగలవగును. పురుష గ్రహములు స్త్రీ రాశులందు, స్త్రీగ్రహములు పురుష రాశులందున్న ప్పుడు బలము వేరుగనుండును. కనుక గ్రహమున్న రాశిని బట్టి గ్రహ మునుబట్టి రాశి బలనిర్ణయమును చేయవలయును.

సూర్యహోరాఫలం దద్యు ర్జీవార్కవసుధాత్మజాః॥
చంద్రాస్ఫుజిదసృక్పుత్రాశ్చంద్రహోరాఫలప్రదాః॥ ౧౩

తా॥ గురు, రవి, కుజులు సూర్య హోరలోనున్నప్పుడు ఫల ప్రదులు. చంద్రశుక్రశనులు చంద్రహోరయందున్నప్పుడు ఫల ప్రదుల గుదురు.

ఫలద్వయం బుధో దద్యాత్ సమే చేంద్రో స్త్రదన్యకే।
రవేః ఫలం స్వహోరాయా ఫలహీనం విరమకే॥

తా॥ బుధుడు సమరాశియందు చంద్ర హోరలోనున్నప్పుడు ఫలప్రదుడు బేసి రాశియందు సూర్య హోరలోనున్నప్పుడు ఫలప్రదుడు. బుధుడు రెండు హోరలయొక్క ఫలములను ఇచ్చును. హోరా, ద్రేక్కాణాది వర్గముల ప్రారంభమందు ఫలారంభము, మధ్యమందు పూర్ణ ఫలము, వర్గాంతమందు ఫలశూన్యమగును.

మధ్యేనుపాతా త్సర్వత్ర ద్రేక్కాణేపి విచింతయేత్।
గృహవ త్తుర్యభాగేపి నవాంశాదా వపి స్వయమ్॥ ౧౫

తా॥ వర్గమధ్యమములో త్రైరాశికము చేత ఫలమును తెలుసు కొనవలయును. ఈ ప్రకారముగ ద్రేక్కాణ, చతుర్థాంశ, నవాంశ, ద్వాదశాంశ త్రింశాంశాదులందు ఫలమును గ్రహింప వలయును.

సూర్యః కుజఫలం ధత్తే భార్గవస్య నిశాపతిః
త్రింశాంశకే విచింత్యైవ మత్రాపి గృహవ త్ఫలమ్॥ ౧౬

తా॥ త్రింశాంశములో సూర్యుడు కుజఫలమును, చంద్రుడు శుక్రఫలమును ఇచ్చెదరు. త్రింశాంశములో స్వగృహాఫలము వలెనే గ్రహించ వలయును.

తా॥ త్రింశాంశములో సూర్యుడు కుజఫలమును, చంద్రుడు శుక్రఫలమును ఇచ్చెదరు. త్రింశాంశములో స్వగృహాఫలము వలెనే గ్రహించవలయును.

వి॥ సూర్యునకు, చంద్రునకు త్రింశాంశమందు అధికారములేదు కనుక కుజఫలమునే రవి ఇచ్చును. శుక్రఫలమునే చంద్రుడు ఇచ్చును

## షడ్వర్గము – బలము

లగ్న హోరా దృగాణాంశ భాగ సూర్యాంశకా ఇతి॥
త్రింశాంశ సహితా శ్చైతే అత్ర వింశోపకాః క్రమాత్॥ ౧౭
రసనేత్రాబ్ధిపంచాశ్వి భూమయః, సప్తవర్గకే।

## సప్తవర్గము – బలము

నసప్తమాంశకే తత్ర విశ్వకాః పంచలోచనమ్। ౧౮
త్రియః సార్ధం ద్వయం సార్ధవేదా ద్వౌ రాత్రినాయకః।
స్థూలం ఫలం చ సంస్థాప్య తత్సూక్ష్మంచ తత స్తతః॥ ౧౯

తా॥ షడ్వర్గము :- లగ్నము, హోరా, ద్రేక్కాణము, నవాంశము, ద్వాదశాంశము, త్రింశాంశము అనునవి. వీనికి లగ్నమునకు 6 హోరకు 2 ద్రేక్కాణమునకు 4, నవాంశమునకు 5 ద్వాదశాంశమునకు 2 త్రింశాంశమునకు 1 వింశోపకబలము అని తెలియవలయును.

సప్తవర్గము :- సప్తమాంశముతో గూడిన షడ్వర్గమునకు సప్తవర్గమని పేరు. దీనికి లగ్నమునకు 5 హోరకు 2 ద్రేక్కాణమునకు 3 సప్తాంశమునకు 2½ నవాంశమునకు 4½ ద్వాదశాంశమునకు 2, త్రింశాంశమునకు 1 వింశోపక బలమని తెలియవలయును. ఇది స్థూలము. సూక్ష్మబలమును అనుపాతముచే గ్రహించవలయును.

వి॥ షడ్వర్గములందు మొత్తము బలము 20, సప్తవర్గమందు మొత్తము బలము 20 అగును.

## దశవర్గము - బలము

దశవర్గా దిగంశాద్యాః కలాంశాః షష్టిభాగకాః।
త్రియం క్షేత్రస్య విజ్ఞేయాః పంచ షష్ట్యంశకస్యచ॥ ౨౦
సార్ధైకభాగా శ్శేషాణాం విశ్వకాః పరికీర్తితాః॥

తా॥ దశవర్గము :- సప్తవర్గములో దశాంశము, షోడశాంశము, షష్ట్యంశము కలిపిన షోడశవర్గమగును, దశవర్గమందు లగ్నమునకు 3 హోరకు 1½, ద్రేక్కాణమునకు 1½, సప్తాంశమునకు 1½, నవాంశమునకు 1½, దశాంశమునకు 1½, ద్వాదశాంశమునకు 1½, షోడశాంశమునకు 1½, త్రింశాంశమునకు 1½, షష్ట్యాంశమునకు 5 వింశోపకబలము అని గ్రహించవలయును.

వి॥ షడ్వర్గమందు 6 వర్గములకు, 20, బలము, సప్తవర్గమందు 7 వర్గములకు 20 బలము, దశవర్గమందు 10 వర్గములకు 20 బలము అని చెప్పబడినది.

## షోడశ వర్గము - బలము

అథ వక్ష్యే విశేషేణ బలం వింశోపకాహ్వయమ్॥ ౨౧
క్రమాత్ షోడశవర్గాణాం క్షేత్రాదీనాం పృథక్ పృథక్॥
హోరా త్రింశాంశ దృక్కాణే కుచంద్రదశకః క్రమాత్॥ ౨౨
కలాంశస్య ద్వయం జ్ఞేయం త్రయం నవాంశకస్య చ।
క్షేత్రే సార్ధంచ త్రితయం వేదాః షష్ట్యంశకస్య హి॥ ౨౩
అర్ధ మర్ధం తు శేషాణాం హ్యేతత్ స్వీయ ముదాహృతమ్॥
పూర్ణం వింశోపకం వింశో ధృతిః స్యా దధిమిత్రకే॥ ౨౪
మిత్రే పంచదశ ప్రోక్తం సమే దశ ప్రకీర్తితమ్।
శత్రౌ సప్తా ధిశత్రౌ చ పంచవింశోపకం భవేత్॥ ౨౫

తా॥ అనంతరము షోడశవర్గములకు వింశోపకబలము చెప్పబడుచున్నది.

| | | | | | |
|---|---|---|---|---|---|
| (1) | లగ్నమునకు | 3½ | (9) | షోడశాంశమునకు | 2 |
| (2) | హోరకు | 1 | (10) | వింశాంశమునకు | ½ |
| (3) | ద్రేక్కాణమునకు | 1 | (11) | చతుర్వింశాంశమునకు | ½ |
| (4) | చతుర్థాంశమునకు | ½ | (12) | భాంశమునకు | 1/2 |
| (5) | సప్తాంశమునకు | ½ | (13) | త్రింశాంశమునకు | 1 |
| (6) | నవాంశమునకు | 3 | (14) | ఖవేదాంశమునకు | ½ |
| (7) | దశాంశమునకు | 1/2 | (15) | అక్షవేదాంశమునకు | 1/2 |
| (8) | ద్వాదశాంశమునకు | 1/2 | (16) | షష్ట్యంశమునకు | 4 |

మొత్తము 20 బలము, ఈ బలము స్వవర్గములందు 20 పూర్ణముగ నుండును. అనగా గ్రహము స్వక్షేత్రమందున్నప్పుడు లగ్నము (గ్రహమున్న రాశికి) నకు 3 1/2 చెప్పబడినందున దీనికి 3 1/2 గ్రహించవలయును. తనయొక్క షష్ట్యంశమందు గ్రహమున్నప్పుడు షష్ట్యంశబలము 4 వచ్చును. స్వనవాంశమందు గ్రహమున్నప్పుడు నవాంశ బలము 3 వచ్చును.

గ్రహము అధిమిత్ర వర్గములందున్నప్పుడు 18, మిత్రవర్గము లందున్నప్పుడు 15, సమవర్గములందున్నప్పుడు 10, శత్రువర్గములందు న్నప్పుడు 7, అధిశత్రు వర్గములందున్నప్పుడు 5 మాత్రము వర్గవింశోపక బలముండును.

## వింశోపకబలస్పష్టీకరణము

వర్గవిశ్వాః స్వవిశ్వఘ్నాః పున ర్వింశతి భాజితాః।
విశ్వోపకోపయోగ్యం తత్పంచోనం ఫలదో న హి॥ ౨౬
తదూర్ధ్వం స్వల్పఫలదం దశోర్ధ్వం మధ్యమం స్మృతమ్॥
తిధ్యూర్ధ్వం పూర్ణఫలదం బోధ్యం సర్వం ఖచారిణామ్॥ ౨౭

తా॥ క్షేత్రాది వర్గములందు స్వవర్గమునకు చెప్పిన వింశోపక బలమును అధిమిత్రాదివర్గములకు చెప్పబడిన వింశోపకబలముచే గుణించి 20చే భాగించగ వచ్చులబ్ధము అధిమిత్రాది వర్గసంబంధమైన వింశోపక బలమగును. అట్టి స్పష్టబలమును బట్టి ఫలము చెప్పుటకు వీలగును గ్రహము యొక్క వర్గవింశోపక బలము 5 కంటె తక్కువగనున్నచో నిష్ఫలము అనగా ఆ గ్రహము తానీయవలసిన ఫలితము నీయజాలదని భావము. 5 నుండి 10 వరకు స్వల్పఫలప్రదము, 10 నుండి 15 వరకు మధ్యమ ఫలప్రదము. 15 నుండి 20 వరకు సంపూర్ణ ఫలప్రదమని గ్రహించవలయును.

వి॥ గ్రహము యొక్క షోడశవర్గములందు ఆ గ్రహము స్వక్షేత్రమందున్నప్పుడు 3 1/2 బలము అధిమిత్ర క్షేత్రమందున్న ప్పుడు 3-9 అగును. మిత్రక్షేత్రమందున్నప్పుడు 2-37-30 అగును. సమక్షేత్రమందున్నప్పుడు 1-45 అగును. శత్రుక్షేత్రమందున్నప్పుడు 1-18-30, అధిశత్రుక్షేత్రమందున్నప్పుడు 0-52-30 వచ్చును. ఈ విధముగ హోరా ద్రేక్కాణాదులకు గూడ లెక్కకట్టి మొత్తము కలిపి చూచుకొనగా గ్రహము యొక్క బలము స్పష్టముగ తెలియును.

అథా న్యదపి వక్ష్యేహం మైత్రేయ త్వం విధారయ।
ఖేటాః పూర్ణఫలం దద్యుః సూర్యాద్యా త్సప్తమకే స్థితాః॥ ౨౮
ఫలాభావం విజానీయాత్ సమే సూర్యనభశ్చరే।
మధ్యేనుపాతాత్ సర్వత్ర హ్యుదయాస్త విశోపకాః॥ ౨౯

తా॥ ఓ మైత్రేయ! నీకు మరియొక విషయమును గూడ చెప్పు చుంటిని. వినుము. సూర్యునకు సప్తమ రాశిలో నుండు గ్రహములు పూర్ణ ఫల ప్రదులు. సూర్యునితో సమానముగనున్నప్పుడు నిష్ఫలులు. మధ్యయందనుపాతముచే బలమును నిర్ణయించవలయును. దీనిని ఉదయాస్త వింశోపక బలమందురు.

వి॥ సూర్యునకు గ్రహమునకు దూరము 180 భాగలున్నప్పుడు పూర్ణఫలము 1 అగును. సూర్యునకు గ్రహమునకు దూరము "౦" అయినచో ఫలము శూన్యము. కనుక 180 భాగలమధ్యలో నున్నప్పు డెంత? అని త్రైరాశికముచే తెలుసుకొను వలయును.

వర్గవింశోపకం జ్ఞేయం ఫల మస్య ద్విజర్షభ।
యచ్చ యత్ర ఫలం బుధ్వా తత్ఫలం పరికీర్తితమ్॥ ౩౦॥
వర్గవింశోపకం చాదా వుదయాస్త మతః పరమ్।
పూర్ణం పూర్ణేఽతి పూర్ణంస్యాత్ సర్వదైవం విచింతయేత్। ॥౩౧॥
హీనం హీనేతి హీనం స్యాత్ స్వల్పేల్పాత్యల్పకం స్మృతమ్॥
మధ్యం మధ్యేతి మధ్యం స్యాత్ యావదన్యతశాస్త్రితిః॥ ౩౨॥

తా॥ ఓ మైత్రేయా! వర్గవింశోపక బలము యొక్క ఫలమును తెలుసుకొనుటకు ముందు బలమును నిర్ణయించుకొనవలయును. బలాను సారము ఫలమును చెప్పవలయును. బలము పూర్ణము, మధ్యమము, అల్పము అని 3 రకములు. మరియు గ్రహోదయాస్త బలమును గూడ తెలుసుకొన వలయును.

పూర్ణమధ్యాల్ప వింశోపక బలమందు గూడ రెండు విధ ములు గలదు. ఎట్లనగా :- పూర్ణబలములో 17 1/2 నుండి 20 వరకు అతిపూర్ణము, 15 నుండి 17 1/2 వరకు పూర్ణము. మధ్యబలములో

10 నుండి 12 1/2 వరకు మధ్యమము 12 1/2 నుండి 15 వరకు అతి మధ్యమము. అల్పబలములో 5 నుండి 7 1/2 వరకు అతిస్వల్పము 7 1/2 నుండి 10 వరకు స్వల్పము. తత్తద్బలాను సారము గ్రహముల యొక్క సమస్త దశలందు ఫలమునూహించి చెప్పవలయును. హీన మందు "0" నుండి 2 1/2 వరకు అతిహీనము 2 1/2 నుండి 5 వరకు హీనమని గ్రహించవలయును.

వి॥ వర్గవివేకము అను ఈ యధ్యాయమందు వర్గములను బట్టి విచారణ చేయదగిన విషయములు, గ్రహముల యొక్క వింశోపక బలమును బట్టి గ్రహదశాఫలములను చెప్పువిధానము తెలియ చేయ బడినది.

షోడశవర్గములందాయా వర్గములకు చెప్పబడిన ప్రత్యేక భావ ముల నాయాకుండలులను బట్టి ఫలమును నిర్దుష్టముగ చెప్పుట కవకా శముండును. రాశి చక్రమును బట్టి, భావచక్రమును బట్టి తన్వాది ద్వాదశ భావవిచారణ చేయుచున్నట్లు, ఆయా ప్రత్యేక భావముల నాయా యంశకుండలు లందుగల గ్రహస్థితి ననుసరించి గూడ ఫల విచారణ చేయుట ప్రాచీన సంప్రదాయమై యున్నది, పుత్రభావమును విచారణ చేయునపుడు జన్మకుండలియందుగల గ్రహసంబంధములను బట్టి యేవిధముగ విచారణ జరుపబడునో ఆ విధముగనే పుత్రపౌత్రాది విచారణను సప్తమాంశను బట్టి చేయవలయునని చెప్పుటచేత సప్త మాంశ చక్రమును గూడ విచారణచేసి సంతాన విషయమును చెప్ప వలయును. మాతాపితృ విచారణ చేయునపుడు మాతృభావమునుబట్టి, పితృభావమును బట్టి జన్మకుండలిలో నే విధముగ విచారణ జరుపబడునో, అట్టి విచారణను ద్వాదశాంశము నుండి మాతృపితృ విచారణచేసి ఫలమును నిర్ణయించ వలయును. ఇతర భావములను కూడ ఆయా అంశములను బట్టి చెప్పవలయును.

## భావములకు కేంద్రాది సంజ్ఞలు

అథాన్యదపి వక్ష్యామి మైత్రేయ శృణు సువ్రత।
లగ్నాచ్చతుర్థాస్త వియత్తాం కేంద్రసంజ్ఞా విశేషతః॥ ౩౩
ద్విపంచరంధ్రలాభానాం జ్ఞేయం పణఫరాభిధమ్।
త్రిషష్ఠభాగ్యరిఃఫానా మాపోక్లిమ మితి ద్విజ॥ ౩౪
లగ్నాత్పంచమభాగ్యస్య కోణసంజ్ఞా విధీయతే॥
షష్ఠాష్టవ్యయభావానాం దుస్థసంజ్ఞా త్రికసంజ్ఞకా॥ ౩౫
చతురస్రం తుర్యరంధ్రం కథయంతి ద్విజోత్తమ।
వ్యస్థాదుపచయర్క్షాణి త్రిషడాయాంబరాణి హి॥ ౩౬

తా॥ మరియొక విశేషమును చెప్పుచుంటిని. ఓ మైత్రేయ! సావధానముగ వినుము.

(1) లగ్న చతుర్థ సప్తమ, దశమభావములకు కేంద్రమని, (2) ద్వితీయ, పంచమ, అష్టమలాభ భావములకు పణపరమనియు, తృతీయ షష్ఠభాగ్యవ్యయములకు అపోక్లిమ మనియు,సంజ్ఞలుగలవు. 4లగ్నము నుండి పంచమ, నవమభావములకు కోణమనియు, 5 షష్ఠాష్టమవ్యయ భావములకు దుస్థానములని. త్రికములనియు, 6 లగ్నమునుండి (తను భావమునుండి) తృతీయ, షష్ఠ, దశమ, ఏకాదశ భావములకు ఉపచయములని సంజ్ఞలు గలవు.

వి॥ మేషాదిద్వాదశ రాశులందు లగ్నమేరాశిలో నుండునో దానికి తనుభావమని పేరు. దాని నుండి వరుసగ 12 భావములుండును. జాతకుని యొక్క జన్మసమయమునకు గాని, ప్రశ్నలగ్న సమయము నకుగాని ముహూర్తాది లగ్నసమయమునకుగానిఏ రాశియందులగ్నము ఎంత భుక్తమగునో ఆరాశ్యాదికమునను భావమధ్యమములేక లగ్న భావ మధ్యమ మని వ్యవహరింపబడును భావస్పుట గణిత పద్ధతి ననుస రించి తను భావమొకప్పుడు ఒకే రాశిలో నుండును. ఒకప్పుడు రెండు రాశులందుండును. కొన్ని దూర ప్రాంతములందు 2 భావములోకే

రాశియందుండును. ఈ విషయము భావస్ఫుటగణితము వలన తెలియగలదు. ప్రతిభావము యొక్క ఆరంభాంత్యములను లెక్కకట్టి మేషాది రాశులందే యే భాగలిప్తాదులతో ప్రారంభమై యే యే రాశులందే యే భాగలిప్తాదులతో సమాప్తమగుచున్నదో తెలుసుకొని భావనిర్ణయమును చేయవలయును. ఈ విధముగ నిర్ణయించిన భావములలో మొదటిది తను భావము, రెండవది ధనభావము, మూడవది విక్రమభావము, నాలుగవది మాతృభావము; ఐదవది పుత్రభావము ఆరవది శత్రుభావము, ఏడవది కళత్రభావము, ఎనిమిదవది ఆయుర్భావము, తొమ్మిదవది భాగ్యభావము, పదవది రాజ్యభావము, పదునొకండవది లాభభావము, పండ్రెండవది వ్యయభావము అనుబడును.

తనుభావము నుండి 90 భాగల దూరములో చతుర్థభావము, 180 భాగల దూరములో సప్తమభావము, 270 భాగల దూరములో దశమభావముండును. కనుక ఈ నాలుగు స్థానములకు కేంద్రములని పేరు పెట్టబడినది.

వీని తరువాత 2, 5, 8, 11 స్థానములకు పణఫరమని, 3,6,9, 12, స్థానములకు ఆపోక్లిమ మని పేరు పెట్టబడెను.

6, 8, 12 భావములకు, దుష్టస్థానములని, త్రికమనియు. 3, 6. 10, 11 స్థానములకు ఉపచయములని సంజ్ఞ చెప్పబడినది.

5, 9 భావములకు కోణమని సంజ్ఞ చెప్పబడినది, ఈ సంజ్ఞలలో 3వ స్థానమునకు ఆపోక్లిమమని, ఉపచయమని, 6వ స్థానమునకు ఆపోక్లిమము, దుస్థానము, ఉపచయమని, 10వ స్థానమునకు కేంద్రమని, ఉపచయమని సంజ్ఞాద్వయ, సంజ్ఞాత్రయములు సిద్ధించుటచే దేనిని ప్రధానముగ గ్రహించవలయునని సందేహము కలుగక మానదు. అట్టి సమయమున గ్రంథకర్తలు పణ ఫరముల నుద్దేశించి ఫలమును చెప్పినచో పణఫరముగను, ఉపచయము నుద్దేశించి ఫలమును చెప్

నచో ఉపచయముగను; కేంద్రము నుద్దేశించి ఫలమును చెప్పినచో కేంద్రముగను గ్రహించవలయును.

ఈ విషయమునే "విద్యామాధవీయ వ్యాఖ్య"లో "విష్ణుశర్మ" యీ క్రింది విధముగ వివరించినాడు.

"నను క్వచి దుపచయ పణఫర సంజ్ఞా ద్వయసన్నిపాతాత్ క్వచి దుపచయపణపర త్రికోణాది సంజ్ఞాత్రయ సన్నిపాతాత్ కిన్నిబంధన మిదం ఫలం గ్రాహ్య మితి సంశయ స్స్యాత్ న, యదా పణపర త్వేన ఫలం నిర్దిశ్యతే తదాపణపరమేవ యదా తూపచయత్వేన తదోపచయం యదా త్రికోణత్వేన తదా త్రికోణమేవే॥తి

తరువాత ఉపచయ రాశి సంజ్ఞలు నిత్యములు కావని కొందరభిప్రాయ పడిరి. దీని విషయమై;

"గర్గవాక్యము :-
అథో పచయసంజ్ఞా స్యాత్ త్రిలాభరిపుకర్మణామ్।
న చే ద్భవంతి దృష్టా స్తే పాపస్వామిశత్రుభిః॥

అనగా 3, 6, 10, 11 స్థానములు పాపులచేగాని, స్వాధిప శత్రుగ్రహములచేగాని చూడబడనప్పుడు ఉపచయ సంజ్ఞ గలవగును. పాపులచేగాని, స్వాధిప శత్రువులచేగాని చూడబడినప్పుడు 3,6,10, 11 స్థానములు పచయములు కాజాలవని భావము. కాని ఈ అభిప్రాయముతో వరాహమిహిరాదులేకీ భవించలేదు.

వరాహుడు "బృహజ్జాతకము"లో
"ఉపచయా న్యరికర్మలాభ।
దుశ్చిక్య పంజ్ఞిత గృహాణి న నిత్యమేకే॥ యని చెప్పెను.

సత్యాచార్యుడు :-
దశమై కాదశ షష్ఠ తృతీయ సంజ్ఞాని జన్మ లగ్నభ్యామ్।
ఉపచయభవనాని స్యుః శ్శేషా ణ్యపచయాఖ్యాని॥ అనియు,

యవనేశ్వరుడు :-

షష్ఠం తృతీయం దశమం చ రాశి మేకాదశం చోపచయర్ష మాహు॥

అనియు చెప్పి 3, 6, 10, 11 స్థానముల కుపచయ సంజ్ఞను నిత్యముగనే చెప్పియుండిరి.

## ద్వాదశ భావ నామములు

తను ర్ధనం చ సహజో బంధు పుత్రారయస్తథా।
యువతి రంధ్రధర్మాఖ్యం కర్మలాభవ్యయాః క్రమాత్॥ 32

తా॥ 1 తను భావము 2 ధనభావము 3 సహజభావము 4 బంధుభావము 5 పుత్రభావము 6 అరిభావము 7 కళత్రభావము 8 రంధ్ర (ఆయుర్భావము) భావము 9 ధర్మభావము 10 కర్మభావము 11 లాభభావము 12 వ్యయభావము అని భావములు 12 గలవు.

సంక్షేపేణైతదుదితం అన్య ద్బుద్ధ్యనుసారతః।
కించి ద్విశేషం వక్ష్యామి యథా బ్రహ్మముఖా చ్ఛ్రుతమ్॥ 33

తా॥ ఇంతవరకు సంక్షేపముగ నీశాస్త్ర విషయమును చెప్పి యుంటిని. విశేషించి బుద్ధి బలముచే తెలుసుకొనవలయును. నేను బ్రహ్మముఖము నుండి వినిన మరియొక విశేషమును చెప్పుచుంటిని.

నవమేఽపి పితుర్జ్ఞానం సూర్యాచ్చ నవమేఽథవా।
యత్కించి ద్దశమే లాభే తత్సూర్యా ద్దశమే భవే॥ 34

తా॥ నవమభావము నుండి పితృవిషయమును విచారించ వల యును. అదే విధముగ సూర్యుని నుండి నవమభావము వలన పితృవిష యమును విచారించవలయును. లగ్నాత్తు 10, 11 భావముల వలన ఏ విషయములు విచారణ చేయబడునో సూర్యుని నుండి 10, 11 భావముల వలన ఆ విషయములను విచారించవలయును.

తుర్యే తనౌ ధనే లాభే భాగ్యే యచ్చింతనం చ తత్।
చంద్రా త్తుర్యే తనౌ లాభే భాగ్యే తచ్చింతయే ద్ధ్రువమ్॥ 40

తా॥ తను, ధన, చతుర్థ భాగ్య లాభ భావముల వలన యే విషయములు విచారించబడునో చంద్రుని నుండి కూడ తను. ధన. చతుర్థ, భాగ్య, లాభముల వలన నా విషయములను విచారించ వలయును.

లగ్నా ద్దుశ్చిక్యభవనే యత్కుజా ద్విక్రమేఽఖిలమ్।
విచార్యం షష్ఠభావస్య బుధా త్షష్ఠే విలోకయేత్॥ ౪౭

తా॥ లగ్నాత్తు తృతీయ భావమువలన విచారింపబడు విషయములను, కుజుని నుండి తృతీయము వలన గూడ విచారించవలయును. లగ్నాత్తు షష్ఠము నుండి బుధునకు షష్ఠమునుండి షష్ఠభావ ఫల విచారణ చేయవలయును.

పుత్రస్య చ గురోః పుత్రే జాయాయా స్సప్తమే భృగోః।
అష్టమస్య వ్యయస్యాపి మందా న్మృత్యో వ్యయే పి చ॥ ౪౮

తా॥ లగ్నాత్పంచమము వలన, గురునకు పంచము వలన పుత్రభావ ఫలములను, సప్తమమునుండి, శుక్రునకు సప్తమము నుండి కళత్రభావ విషయమును,లగ్నమునకు 8, 12 భావములనుబట్టి విచారించ దగు విషయములను శనినుండి 8, 12 భావములవలనగూడ విచారించ వలయును.

యద్భావా ద్యత్ఫలం చింత్యం తదీశా త్తత్ఫలం విదుః।
జ్ఞేయం తస్య ఫలం తద్ధి తత్ర చింత్యం శుభాఽశుభమ్ ౪౯

తా॥ ఏ భావము నుండి యే ఫలము విచారింప దగినదో ఆ భావాధిపతిని బట్టి గూడ ఆ ఫలమును విచారించవలయును.

వి॥ భావయంతి ఉద్పాదయంతి నృణాం శుభాశుభఫలానీతి భావాః॥యద్వా భావయంతి నిరూపయంతి శుభాశుభాని ఏభి రితి వా రాశయః॥ శుభాశుభజ్ఞానాయ జ్యోతిర్విద్భిః కల్పితాః తన్వాది సంజ్ఞితాః క్షేత్రవిశేషాః॥

అనగా మనుష్యాదులకు శుభాశుభఫలములను కలిగించుననియుని, లేక, వీనిచేత శుభాశుభములు నిరూపితములగు చున్నవని యర్థముగల వ్యుటచే భావములని చెప్పబడుచున్నవి. మేషాదిరాశులు శుభాశుభ జ్ఞానము కొరకు తన్వాదిభావసంజ్ఞలు గలవిగ జ్యోతిశ్శాస్త్రజ్ఞుల చేత కల్పింపబడిన క్షేత్రవిశేషములు. ఇక్కడ క్షేత్ర విశేషములనుటచేత మేషాదిరాశులకువలె తన్వాదిభావములు 30 భాగలు సమప్రమాణమైనవి కావని స్పష్టమగుచున్నది మేషాదిద్వాదశ రాశులు 30 భాగలు సమప్రమాణములుగలవి. ఏ ప్రదేశమందైనను వాని ప్రమాణములలో భేదముండదు. గాని భావములట్లుగాక కొన్ని ప్రదేశములందు, 30 భాగలకంటె అధిక ప్రమాణముతోను, కొన్ని ప్రదేశములందు 30 భాగలకంటె తక్కువ ప్రమాణముతోను కూడియుండును. కనుక భావాక్రాంత ప్రదేశమునకే క్షేత్రవిశేషమని చెప్పబడినది.

జన్మించిన సమయమునకు లగ్నసాధనమును, దశమలగ్న సాధనమును చేసినచో లగ్నమునుండి 6 రాశుల (180భా) దూరములో సప్తమభావము. దశమభావమునకు 6 రాశుల వెనుక చతుర్థభావము వచ్చును. లగ్నచతుర్థముల మధ్య ద్వితీయ తృతీయ భావములు, చతుర్థ సప్తముల మధ్య పంచమ షష్ఠభావములు, సప్తమ దశమ భావముల మధ్య అష్టమనవమ భావములు, దశమ, లగ్నముల మధ్య ఏకాదశ వ్యయభావములు వచ్చును. జన్మకాలమునకు లగ్నమందెన్ని భాగములు భుక్తమైనవో అదియే తను భావమధ్యమము. తను భావ మధ్యమము నుండి 180 భాగల దూరములో సప్తమభావ మధ్యము ముండును. ఇట్లే జన్మసమయమునకు సాధించబడిన దశమ లగ్నము దశమ భావమధ్యమముగ గ్రహించవలయును. దీనికి 180 భాగల వెనుక చతుర్థ భావమధ్యమముండును. చతుర్థ భావ మధ్యమము నుండి తను భావమధ్యమము తీసివేయగ వచ్చిన శేషమును 6 చే భాగింపగవచ్చిన లబ్ధమునకు షష్ఠాంశమనిపేరు. ఈ షష్ఠాంశమును

తను భావమధ్యమమునకు కలుపగ తను భావముయొక్క అంతము, ధన భావముయొక్క ప్రారంభమగును. దీనిని తను ధనభావ సంధి యందురు. దీనికి మరల షష్ఠాంశము కలుపగ ధనభావ మధ్యమము వచ్చును. ధనభావ మధ్యమములో షష్ఠాంశమును కలిపినచో ధన భావాంతమగును. ఇదియే తృతీయ భావారంభము, దీనికి షష్ఠాంశ మును చేర్చగ తృతీయ భావమధ్యమము వచ్చును. దీనిలో షష్ఠాంశ మును కూడగ తృతీయ భావాంతము వచ్చును. ఇది చతుర్థభావారంభ మగును. దీనిలో తిరిగి షష్ఠాంశమును కలుపగ చతుర్థ భావమధ్యమము రాగలదు. ఇటుపైన సప్తమభావములో నుండి చతుర్థభావమును (అనగా సప్తమభావ మధ్యమము - చతుర్థభావ మధ్యమము) తీయగ మిగిలిన రాశ్యాదికమును 6చే భాగింప షష్ఠాంశమువచ్చును. వెనుకటి వలె యీ షష్ఠాంశమును చతుర్థభావము నుండి కలుపుతు పంచమ, షష్ఠభావములను సాధించవలయును. ఈ విధముగ గణితమును చేసి తన్వాది సప్తమభావము వరకు సాధించిన భావారంభ భావమధ్య, భావాంత్య రాశ్యాదికమునకు 6 రాశులు కలుపగ సప్తమభావమధ్య మము నుండి తను భావమువరకుగల అరు భావములు సంధులతోను, భావమధ్యమములతోను వచ్చును. భావస్ఫుటగణితో దాహరణమును చూచినచో బోధపడగలదు.

భావసాధనచేసి యాయాభావములను బట్టి తత్తద్భావోక్త ఫల ములను విచారణ చేయవలయును.

ఇతి బృహత్పరాశరహోరాశాస్త్రే వర్గవివేకాధ్యాయోనామ సప్తమః॥

ఇది బృహత్పరాశర హోరాశాస్త్రమందు వర్గ వివేకాధ్యాయమను సప్తమాధ్యాయము ముగిసెను.

## దృష్టి భేద కథ నా ధ్యా య ము -౮

అథ మేషాదిరాశీనాం చరాదీనాం పృథక్ పృథక్।
దృష్టిభేదం ప్రవక్ష్యామి శృణుత్వం ద్విజసత్తమ॥ ౧

రాశయోభిముఖం విప్ర తథా పశ్యంతి పార్శ్వభే।
యథా చరః స్థిరా నేవం స్థిరః పశ్యతి వై చరాన్ ॥ ౨
ద్విస్వభావో వినా త్మానం ద్విస్వభావాన్ ప్రపశ్యతి।
వమీపస్థం పరిత్యజ్య ఖేటా స్తత్రగతా స్తథా॥ ౩
చరేషు సంస్థితాః ఖేటాః పశ్యంతి స్థిరసంగతాన్।
స్థిరేషు సంస్థితా ఏవం పశ్యంతి చరసంస్థితాన్॥ ౪
ఉభయస్థాస్తు సూర్యాద్యాః పశ్యంత్యుభయసంస్థితాన్।
నికటస్థం వినా ఖేటాః పశ్యంతి త్యయ మాగమః॥ ౫

తా॥ ఈ అధ్యాయమందు పరాశరుడు రాశిదృష్టిని చెప్పుచున్నాడు :

చర, స్థిర, ద్విస్వభావ సంజ్ఞలుగల మేషాది రాశులకు దృష్టి భేదమును చెప్పుచున్నాను.

మేషాది రాశులు తమకభిముఖముగనున్న రాశులను, పార్శ్వములందున్న రాశులను చూచును. చరరాశులగు మేష, కర్కాట, తుల, మకరములు తమకు సమీపమందున్న స్థిరరాశులను వదలి, మిగిలిన స్థిరరాశులను చూచును. స్థిరరాశులగు వృషభ, సింహ, వృశ్చిక కుంభములు తమకు సమీపమందున్న చరరాశులను వదలిమిగిలిన చరరాశులను చూచును. ద్విస్వభావరాశులగు మిథున కన్యా ధనుర్మీనములు, తమను వదలి మిగిలిన ద్విస్వభావరాశులను చూచును. రాశులకువలె రాశిస్థగ్రహములు గూడ పైవిధముగనే చూచును. చరరాశిగత గ్రహములు సమీపస్థిరరాశిని వదలి, మిగిలినస్థిరరాశులను, స్థిరరాశిగత గ్రహములు సమీప చరరాశిని వదలి మిగిలిన చరరాశులను, ద్విస్వభావగత గ్రహములు తామున్న రాశిని వదలి మిగిలిన ద్విస్వభావ రాశులను చూచును.

వి॥ జైమినీ సూత్రములలో ప్రథమాధ్యాయ ప్రథమ పాదమందు 2, 3, 4 సూత్రములలో నీ రాశి దృష్టి విషయము చెప్పబడినది

అభిపశ్యంతి ఋక్షాణి 1-1-2

పార్శ్వభేచ 1-1-3

తన్నిష్ఠాశ్చతద్వత్ 1-1-4

ఈ సూత్రములకు వెంకటేశ్వరవృత్తిలో వివరణము ఇవ్వబడినది.

"ఏకో రాశి రాశిత్రయం పశ్యతీత్యర్థ స్సంపద్యతే। పార్శ్వరాశీ చ చరే క్రమేణ పంచమైకాదశౌ వ్యుత్క్రమేణ తృతీయనవమౌ। స్థిరే వ్యుత్క్రమేణ పంచమైకాదశౌ। క్రమేణ। తృతీయనవమా వితివేదితవ్యం। ఉభయరాశౌతు పార్శ్వ రాశీ చతుర్థదశమౌ ఏవం చరే సంముఖో ష్టమః పంచమైకాదశౌ చ పార్శ్వరాశీ స్థిరే క్రమేణ షష్ఠ స్సంముఖః వ్యుత్క్రమేణ వ ఏవాష్టమః పార్శ్వరాశీ క్రమేణ తృతీయనవమౌ వ్యుత్క్రమేణ తా వేవైకాదశ పంచమౌ। ఉభయరాశౌ సప్తమ స్సంముఖః చతుర్థదశమౌ పార్శ్వరాశీ॥ ఏవ మేవవృద్ధా అప్యేతత్సూత్రే వ్యాచఖ్యుః,

ఉభయా నుభయః పశ్యే చ్చరాం స్థాస్నుస్థిరాం శ్చరః।
సమీపసంస్థితం రాశిం త్యక్త్వా త్రీం స్త్రీ వ్యతా క్రమమ్ ॥ఇతి॥
చరం వినా ధనం స్థాస్ను స్థిరం మంత్యం వినా చరః॥

యుగ్మం స్వేన వినా యుగ్మం పశ్యతీ త్యయ మాగమః॥ ఇతి దాస్యార్థః, ఏతేషు మేష శ్చరః సమీపస్థం వృషభం త్యక్త్వా సింహం వృశ్చికం కుంభం పశ్యతి॥ కర్కాటక స్సమీపస్థం సింహం పరిత్యజ్య వృశ్చికం కుంభం వృషభం చ పశ్యతి॥ తులా సమీపస్థం వృశ్చికం త్యక్త్వా కుంభం వృషం సింహం చ। పశ్యతి, మకరః కుంభం పరిత్యజ్య వృషం సింహం వృశ్చికం చ పశ్యతి॥ వృషో వ్యుత్క్రమతః సమీపస్థం మేషం పరిత్యజ్య మకరం తులాం కర్కాటం చ పశ్యతి। సింహాదయోపి వ్యుత్క్రమత స్సమీ పస్థాన్ కర్కాటకాదీన్ పరిత్యజ్య మేషాదీం శ్చరాన్ పశ్యంతి॥మిథునాదయోద్విస్వభావరాశయో స్వం వినా కన్యాదీం శ్చ త్రీం స్త్రీనుభయా పశ్యంతి॥ ఇతి

దీని భావమేమనగా :- ఒకరాశి తననుండి రెండుపార్శ్వ రాశులను, ఒక అభిముఖరాశిని మొత్తము మూడింటిని చూచును.

1. చరరాశులకు (బేసిరాశులకు) క్రమముగ 5, 11 రాశులు పార్శ్వరాశులు, 8వరాశి అభిముఖరాశియగును. సరిరాశులగు చర

రాశులకు వ్యుత్క్రమముగ 3, 9 రాశులు పార్శ్వరాశులు, 6వ రాశి సంముఖరాశియగును.

2. సమ రాశులగు స్థిరరాశులకు వ్యుత్క్రమముగ 5, 11 రాశులు పార్శ్వరాశులు, 8వరాశి అభిముఖరాశియగును. బేసిరాశులగు స్థిర రాశులకు క్రమముగ 3, 9 రాశులు పార్శ్వరాశులు 6వ రాశి అభి ముఖరాశియగును.

3. ద్విస్వభావ రాశులకు 7వ రాశి సంముఖరాశి, 1, 10 రాశులు అభిముఖరాశులు యగును.

I బేసిరాశి చరరాశియగు మేషము, తుల తమనుండి 5, 8, 11 స్థానములను చూచును. మేషము వృషభమును, తుల వృశ్చికమును చూడదు.

II సరిరాశి చరరాశియగు కర్కటకము మకరము తమ నుండి వ్యుత్క్రమముగ 3, 6, 9 స్థానములను చూచును. కర్కటకము సింహమును, మకరము కుంభమును చూడదు.

III సరిరాశి స్థిరరాశి యగు వృషభము, వృశ్చికము తమనుండి వ్యుత్క్రమముగ 5, 8, 11 స్థానములను చూచును. వృషభము మేషమును, వృశ్చికము తులను చూడదు.

IV బేసిరాశి స్థిరరాశియగు సింహము, కుంభము తమనుండి క్రమ ముగ 3. 6, 9 స్థానములను చూచును. సింహము కర్కటకమును, కుంభము మకరమును చూడదు.

V ద్విస్వభావరాశులగు మిథున, కన్యా, ధనుర్మీనములు తమనుండి 4, 7, 10 స్థానములను చూచును.

పై అభిప్రాయమునే "జ్యోతిష ఫలరత్నమాల'లో శ్రీకృష్ణ మిశ్రుడు సూక్ష్మముగ ఒక శ్లోకములో చెప్పినాడు.

"చరా స్థిరారాన్ పంచమరంధ్రలాభాన్।
స్థిరాస్తు షష్ఠం నవమం తృతీయం।

చతుర్థ మేషూరణ దారభావాన్
తదోభయస్థాః ప్రవిలోకయంతి॥

ఈ శ్లోకములో చరరాశులు 5, 8, 11 రాశులను, స్థిరరాశులు 3, 6, 9 రాశులను, ద్విస్వభావ రాశులు 4, 7, 10 రాశులను క్రమ గణనతో చూచునని చెప్పినాడు. సరిబేసి రాశులందు క్రమవ్యుత్క్ర మభేదములను చెప్పలేదు,

ఆయా రాశులందున్న గ్రహములుగూడ రాశులవలె నాయా రాశులను, ఆయారాశులందున్న గ్రహములను చూచును. ఇది రాశి దృష్టి యనబడును.

## దృష్టి చక్రన్యాసము

దృష్టిచక్ర మహం వక్ష్యే యథావత్ బ్రహ్మణోదితమ్॥
యస్య విజ్ఞానమాత్రేణ దృష్టిభేదః ప్రకాశ్యతే॥ ౧॥
ప్రాచి మేషవృషౌ లేఖ్యౌ కర్కసింహౌ చ దక్షిణే॥
తులాళీ పశ్చిమే విప్ర మృగకుంభౌ తథోత్తరే॥ ౨।
ఈశకోణే తు మిథునం వాయవ్యే కన్యకాం తథా॥
నైరృత్యాం చాప మాలిఖ్య వహ్నికోణే ఝషం లిఖేత్ ౩।
ఏవం చతుర్భుజాకారం వృత్తాకార మథాపివా।
దృష్టిచక్రం ప్రవిన్యస్య తతో దృష్టిం విచారయేత్॥ ౪

తా॥ పూర్వము బ్రహ్మచేత చెప్పబడిన దృష్టిచక్రము చెప్పబ డుచున్నది. ఈ చక్రమును తెలుసుకొనినచో దృష్టిభేద విషయము సుబోధకము కాగలదు.

చతుర్భుజాకారముగగాని, వృత్తాకారముగ గాని చక్రన్యాస మును దిక్కులనువేసి, వానియందు తూర్పులో మేష,వృషభములను దక్షిణమందు కర్కటక సింహములను, పశ్చిమమందు తుల, వృశ్చిక ములను, ఉత్తరమందు మకర కుంభములను వేయవలయును. ఈశాన్య మందు మిథునమును,వాయవ్యమందు కన్యను,నైరృతియందుధనుస్సును

ఆగ్నేయమందు మీనమును వ్రాసుకొనవలయును. ఈ విధముగ చక్ర న్యాసమును చేసినచో రాశి దృష్టి స్పష్టముగ బోధపడగలదు.

టీ॥ పై శ్లోకములను బట్టి చక్రవిన్యాసమును చేసినచో భేదము గలుగుచున్నది. దీనికి పాఠాంతరము గలదు.

ప్రాచ్యా మజవృషౌ దేయౌ కర్కసింహౌ వుదగ్దిశి।
ప్రతీచ్యాం క్రమశో వాచ్యాం తులాలీ నక్రకుంభకౌ॥
ఈశానే మిధునం కోణే కన్యాం వాయవ్యకోణకే।
ధనుర్విలిఖ్య నైరృత్యా మాగ్నేయ్యాం విలిఖేజ్ఝషమ్॥

మరిగొుక పాఠము :—

పూర్వం మేషవృషౌ లేఖ్యౌ కర్కసింహౌ చ దక్షిణే।
తులాలీ వరుణే విప్ర నక్రకుంభౌ తథోత్తరే॥
అగ్నికోణే తు మిధునం నైరృత్యా మంగనాం ద్విజ।
వాయవ్యాం ధనుషం లేఖ్య మీశాన్యాం చ ఝషం లిఖేత్॥

ఈ పాఠద్వయమునుబట్టి చక్రన్యాసమును చేసినచో రాశులకు దిగ్భేదము చెప్పబడినట్లు గనబడుచున్నది. క్రింద పాఠమును బట్టి చక్రన్యాసము వేయబడుచున్నది.

## అపసవ్యగణనము





పై రెండు విధముల చక్రములను బట్టి మేషాదిరాశి దృష్టిని స్పష్టముగ తెలుసుకొనవచ్చును. ఒక్కొక్క రాశి మూడు రాశులను చూచునను విషయము రేఖల ద్వారా నిరూపింపబడినది.

సూచన :- రాశి దృష్టులను చెప్పి గ్రహదృష్టులను చెప్పు చున్నాడు.

అధిక పాఠము :-

హోరాశాస్త్రే భిన్నదృష్టిః ఖేటానాం చ పరస్పరమ్।
త్రిదశే చ త్రికోణే చ చతురస్రే చ సప్తమే॥
శని ర్దేవగురు ర్భౌమః పరేచ క్రమితేక్షితాః॥
పాదార్ధం త్రిపదం పూర్ణం వదంతి గణకా జనాః॥

శనేః :- శనిః పాదం త్రికోణేషు చతురస్రే ద్విపాదకమ్॥
త్రిపాదం సప్తమే విప్ర త్రిదశే పూర్ణమేవ హి॥

గురోః :- చతురస్రే గురుః పాదం సప్తమే చ ద్విపాదకమ్॥
త్రిపాదం త్రిదశే విప్ర పూర్ణం పశ్యతి కోణభే॥

కుజస్య :- సప్తమే పాద మేకం తు ద్విపాదం త్రిదశే ద్విజ।
త్రిపాదం చ త్రికోణేషు భౌమః పూర్ణం చతురస్రకే॥

అన్యేషాం :- అన్యేషాం త్రిదశే పాదం ద్విపాదం చ త్రికోణకే।
చతురస్రే త్రిపాదం చ పూర్ణం పశ్యతి సప్తమే।
ఏవం రీత్యా వివీక్ష్యంతే గ్రహా రవ్యాదయో ద్విజ॥
పూర్వం పంక్తి ర్యథా గ్రాహ్య తథా గ్రాహ్యంచ పూర్వకమ్॥

ఈ పై శ్లోకములు బృహత్పరాశరహోరా సారాంశమను బొంబాయి ముద్రిత గ్రంథములోనివి. మిగిలిన రెండు గ్రంథములందు ఈ శ్లోకములు లేవు. ప్రకరణ సందర్భమును బట్టి వీనినిక్కడ వివరించ వలసినది.

తా॥ హోరాశాస్త్రమందు గ్రహములకు దృష్టి వేరువేరుగ చెప్పబడినది. 3, 10 రాశులకు 5, 9 రాశులకు, 4, 8 రాశులకు, సప్త

మమునకు శని గురు కుజుల యొక్క, ఇతర గ్రహముల యొక్క దృష్టి యందు భేదము చెప్పబడుచున్నది.

సూర్యాది సర్వగ్రహములు 3, 4, 5, 7, 8, 9, 10 రాశులను చూచెదరు. గాని వీక్షణమునందు పాదదృష్టి, అర్ధదృష్టి, త్రిపాదదృష్టి, సంపూర్ణదృష్టి యని తారతమ్యముగలదు.

శని :- 5, 9 రాశులను పాదదృష్టితోను, 4, 8 రాసులను అర్ధదృష్టితోను, సప్తమమును త్రిపాదదృష్టితోను, 3, 10 రాశులను సంపూర్ణదృష్టితోను చూచును.

గురుడు :- 4, 8 రాశులను పాదదృష్టితోను. సప్తమమును అర్ధదృష్టితోను, 3, 10 రాశులను త్రిపాదదృష్టితోను, 5, 9 రాశులను పూర్ణదృష్టితోను చూచును.

కుజుడు :- సప్తమమును పాదదృష్టితోను, 3, 10 స్థానములను అర్ధదృష్టితోను, 5, 9 స్థానములను త్రిపాదదృష్టితోను, 4, 8 రాశులను పూర్ణదృష్టితోను చూచును.

ర, చం, బు, శు :- 3, 10 రాశులను పాదదృష్టితోను, 5, 9 రాశులను అర్ధదృష్టితోను, 4 8 రాశులను త్రిపాదదృష్టితోను, సప్తమమును సంపూర్ణదృష్టితోను చూచెదరు.

వి॥ గ్రహదృష్టి విషయమై: బృహజ్జాతకములో వరాహ మిహిరుడు;

త్రిదశ త్రికోణ చతురస్ర సప్తమా
న్యవలోకయంతి చరణాభివృద్ధితః॥
రవిజా మరేజ్య రుధిరాః పరే చ యే
క్రమశో భవంతి కిల వీక్షణేధికాః॥

అను శ్లోకమందు రవ్యాది సమస్త గ్రహములు 3, 10 స్థానములను పాదదృష్టితోను, 5, 9 స్థానములను అర్ధదృష్టితోను, 4,8 స్థాన

ములను త్రిపాదదృష్టితోను, 7వ స్థానమును సంపూర్ణ దృష్టితోను చూచెదరు. శని 3, 10 స్థానములను పాదదృష్టితో చూచుచున్నను సర్వగ్రహముల కంటె ఫలమునిచ్చునపుడు వీర్యాధికుడగును. గురుడు 5, 9 స్థానములను అర్ధదృష్టితో చూచుచున్నను సర్వగ్రహములకంటె ఫలమునిచ్చునపుడు వీర్యాధికుడగును. కుజుడు 4, 8 స్థానములను త్రిపాదదృష్టితో చూచుచున్నను సర్వగ్రహముల కంటె ఫలమునిచ్చు టలో వీర్యాధికుడగును. సర్వగ్రహములు సప్తమమును చూచునప్పుడు సంపూర్ణ దృష్టితో చూచును, సమానఫలమును ఇవ్వగలరు. ఈ అభిప్రాయము "జాతకపారిజాతము"లో వైద్యనాథ దీక్షితునిచే చెప్పబడినదని కొందరభిప్రాయము. జాతక పారిజాతములో

పాదేక్షణం భవతి సోదరమానరాశ్యో రర్ధం త్రికోణయుగలే ఽఖిలఖేచరాణామ్।
పాదోనదృష్టినిచయ శ్చతురస్ర యుగ్మే సంపూర్ణదృ గ్బల మనంగగృహే వదంతి॥

శని రతిబలశాలీ పాదదృగ్వీర్యయోగే।
సురకులపతిమంత్రీ కోణదృష్టౌ శుభ స్స్యాత్।
త్రితయచరణదృష్ట్యా భూకుమారః సమర్థః।
సకలగగనవాసాః సప్తమే దృగ్బలాఢ్యాః॥

అను శ్లోకములందు పై అభిప్రాయమును తెలిపియుండెను.

కాని "సారావళి" లో

సంపశ్యంతి స్థానాత్ సదా గ్రహా శ్చరణవృద్ధిత స్సర్వే।
త్రిదశ త్రికోణ చతురస్ర సప్తమానాం ఫలం క్రమేణైవ॥

అని పాదాభివృద్ధితో గూడినదృష్టిని చెప్పి,తరువాత శ్లోకమందు

పూర్ణం పశ్యతి రవిజ స్తృతీయదశమం త్రికోణ మపి జీవః।
చతురస్రం భూమిసుతో ద్యూనం చ సితార్కశశిబుధాః క్రమశః॥

అని శని 3, 10 స్థానములను, గురుడు 5, 9 స్థానములను, కుజుడు 4, 8 స్థానములను, రవి, చంద్ర, బుధ శుక్రులు సప్తమమును సంపూర్ణ

ముగ చూచెదరు. అని త్రిదశ, త్రికోణ, చతురస్రములందు శని గురు కుజులకు సంపూర్ణదృష్టిని చెప్పియుండెను.

భట్టోత్పలుడు బృహజ్జాతక వ్యాఖ్యలో.

"తృతీయదశమస్థాన్ గ్రహాన్ రాశీన్వా శనైశ్చరః పశ్య త్యన్యేభ్యో గ్రహేభ్యోధిక ఫలప్రదో భవతి।పరిపూర్ణం పశ్యతీత్యర్థః।ఏవం త్రికోణ స్థాన్ జీవః।చతురస్రగాన్ భౌమః సప్తమస్థాన్ సూర్యచంద్రబుధశుక్రాః।ఏతచ్చ బహూనతరాణామా చార్యాణాం మతమ్ తథా చ భగవాన్ గార్గిః॥
దుశ్చిక్యదశగాన్ సౌరి స్త్రికోణస్థా న్బృహస్పతిః ।
చతురష్టమగాన్ భౌమః శేషా స్సప్తమసంస్థితాన్॥
భవంతి వీక్షణే నిత్య ముక్తాధికఫలప్రదాః ॥

అని 3, 10 స్థానములను శని. 5, 9 స్థానములను గురుడు 4, 8 స్థానములను కుజుడు పరిపూర్ణదృష్టితో చూచెదరను యభిప్రాయము బహు సంమతమైనదని చెప్పినాడు.

ఈ భట్టోత్పలుని యభిప్రాయము నే సరియైన దానినిగ భావించి "దివాకర దైవజ్ఞుడు" కేశవీయ జాతకపద్ధతి ప్రౌఢమనోరమావ్యాఖ్య లో నిట్లు తెలిపియుండెను.

యత్తు కేనచి త్ప్రలపితం బృహజ్జాతకే "వీక్షణేధికా" ఇత్యుక్తేః రవిజాదీనాం త్రిదశాది స్థానే అన్యగ్రహాపేక్షయా వీక్షణే అధిక్యమాత్రం నతు సంపూర్ణత్వం తదానతి పద్ధత్యుక్తం విశేషదృగానయన మసంగత మార్షగ్రంథానుక్తత్వా దితి॥ తచ్చిన్త్యం॥ పరాశరజాతకే విశేషదృగానయనస్యోక్తత్వాత్॥
తథాచపరాశరవాక్యమ్॥

శరవేదాః శరామాశ్చ తిథయో యోజితాః క్రమాత్।
శనిదేవేజ్యభౌమానా మేవం దృష్టిః స్మృటా భవేత్॥

సారావల్యామపి॥

'పూర్ణం పశ్యతి రవిజ స్తృతీయదశమ' ఇత్యాదిః బృహజ్జాతకటీకాయా ముక్తం వ్యాఖ్యానం చేదృశంతృతీయదశమస్థితాన్ గ్రహరాశీన్పశ్య త్యన్యగ్రహేభ్యోఽధిక

ఫలప్రదో భవతి పరిపూర్ణం పశ్యతీత్యర్థః॥ తస్మాద్విశేషదృక్ప్రతిపాదన మార్షమూలక మితి సర్వ మవదాతమ్॥ ఇతి॥

అనగా కొందరు బృహజ్జాతకములో "వీక్షణేధికాః" (వీక్షణ మందధిక ఫలప్రదులు) అనుటచేత శని గురు కుజులకు క్రమముగ త్రిదశ త్రికోణ చతురస్ర స్థానములందు ఇతర గ్రహాపేక్షయా వీక్షణమందాధిక్యమేగాని సంపూర్ణదృష్టిని చెప్పుటకువీలు లేదుగనుక "జాతకపద్ధతి" యందు శని గురు కుజులకు చెప్పబడిన విశేషదృష్టి సంస్కారము అసంగతమైనది ఆర్షగ్రంథ విరోధముగలదియని చెప్పుచున్నారు. ఈ అభిప్రాయము సరియైనది కాదు. ఏలననగా "పరాశరహోర"లో స్పష్టదృష్టికథన"మందు శని గురు కుజులకు విశేషదృష్టి సంస్కారము చెప్పబడుటచేత, "సారావళి"యందు "పూర్ణంపశ్యతి" అను శ్లోకమందు శని గురు కుజులకు త్రిదశాది స్థానములందు సంపూర్ణదృష్టి చెప్పబడుటచేత "బృహజ్జాతక" టీకలో ఉత్పలుఁడు గూడ సంపూర్ణ దృష్టినే యంగీకరించి యుండుటచేత శని గురు కుజులకు త్రిదశాది స్థానములందు సంపూర్ణదృష్టినే యంగీకరించవలయుననియు, వారికి విశేషదృష్టి సంస్కారమును చేయువలయునను భావమును స్పష్టీకరించెను. ఈ విషయమై; మరికొన్ని సంమతి వాక్యములు గూడ ప్రాచీన గ్రంథములందు లభించుచున్నవి.

"సత్కృత్యముక్తావలి"లో

తృతీయదశమా వర్కిః పశ్య న్పూర్ణఫలప్రదః।
త్రికోణకే గురుశ్చైవ చతుర్థాష్టమగాన్ కుజః॥

"జాతకచంద్రిక"లో

పాదే పాదచతుష్టయం రవిసుతః పాదద్వయే గీష్పతిః।
పాదోనేఽవనిజః పరంతు పరవ న్నాన్యత్ర దృష్టిః క్వచిత్॥

ఈ ప్రమాణ వాక్యములను బట్టి శని 3, 10 లను, గురుడు 5, 9 లను

కుజుడు 4, 8 లను సంపూర్ణ దృష్టితో చూచెదరు. పూర్ణ ఫలమును ఇచ్చెదరు.

రాహుదృష్టి విషయమై "సత్కృత్యముక్తావళి" యందు

సుతమదనవమాంత్యే పూర్ణదృష్టిః సురారేః యుగళదశమగాశౌ దృష్టిహ(?)త్రయార్థః సహజరిపుచతుర్థే స్వష్టమే చార్ధదృష్టిః స్థితిభవన ముపాంత్యం నైవ దృశ్యం హి రాహో॥

రాహువునకు 5,7,9,12 స్థానములందు పూర్ణదృష్టి. 2,10 స్థానములందు త్రిపాదదృష్టి. 3 4,6,8 స్థానములందర్ధదృష్టియుగలదు. 1, 11 స్థానములందు దృష్టిలేదు. అని భావము. దీనియందు పాదదృష్టి చెప్పబడలేదు.

జాతకపారిజాతము "ఇంగ్లీషు వ్యాఖ్యలో శ్రీ సుబ్రహ్మణ్య శాస్త్రిగారు "పరాశర" వచనముగ పై శ్లోకమును స్వల్ప భేదముతో నుదహరించిరి.

సుతమదనవమాంత్యే పూర్ణదృష్టి స్తమస్య।
యుగళదశమగేహే చార్ధదృష్టిం వదంతి। 2, 10 [illegible]
సహజరిపువివత్యన్ పాదదృష్టిం మునీంద్రా 3, 6 [illegible]
విజభవన ముపేతో లోచనాంధః ప్రదిష్టః॥

ఈ శ్లోకములో 5,7,9,12 స్థానములందు పాదదృష్టి చెప్పబడినది. 1వ స్థానమందు దృష్టి లేదు. ఈ రెండు శ్లోకములోనే విషయమును చెప్పుచున్నను, మొదటి శ్లోకములో పాదదృష్టిని చెప్పలేదు. రెండవ శ్లోకములో త్రిపాదదృష్టితో పాటు 4,8,11 స్థానముల విషయము గూడ చెప్పబడలేదు.

"బొంబాయిలో ముద్రింపబడిన "పరాశరహోరా సారాంశము"లో గల దృష్టిభేద కథనాధ్యాయములోగల "గ్రహదృష్టి" శ్లోకములందుగల విషయము మిగిలిన గ్రంథములలోగల విషయముతో భేదించుచున్నది.

ఎట్లనగా :-

3, 10 స్థానములందు శనికి పూర్ణ దృష్టి, గురునకు త్రిపాదదృష్టి, కుజునకు అర్ధ దృష్టి, రవి చంద్ర బుధ శుక్రులకు పాదదృష్టియు.

5, 9 స్థానములందు గురునకు పూర్ణదృష్టి, కుజునకు త్రిపాద దృష్టి, రవి చంద్ర బుధ శుక్రులకర్ధదృష్టి, శనికి పాదదృష్టియు,

4, 8 స్థానములందు కుజునకు పూర్ణదృష్టి, రవి చంద్ర. బుధ శుక్రులకు త్రిపాదదృష్టి, శనికి అర్ధదృష్టి, గురునకు పాదదృష్టియు.

7వ స్థానమందు రవి చంద్ర బుధ శుక్రులకు సంపూర్ణ దృష్టి, శనికి త్రిపాద దృష్టి, గురునకర్ధ దృష్టి, కుజునకు పాదదృష్టియు గలదని చెప్పబడెను.

మతాంతరములో :-

3, 10 స్థానములందు శని తప్పమిగిలిన గ్రహములు పాదదృష్టి గలవారు.

5, 9 స్థానములందు గురుడుతప్ప మిగిలిన గ్రహములు అర్ధదృష్టి గలవారు.

4, 8 స్థానములందు కుజుడుతప్ప మిగిలిన గ్రహములు త్రిపాద దృష్టి గలవారు.

7వ స్థానమందు రవ్యాది సమస్త గ్రహములు పూర్ణదృష్టి గలవారు. అని తెలియుచున్నది.

పర్యవసానముగ :-

శనికి 3,7,10 స్థానములందు, గురునకు 5, 7, 9 స్థానములందు, కుజునకు 4,7,8 స్థానములందు పూర్ణదృష్టియు, రవి చంద్ర బుధ శుక్రులకు మాత్రము సప్తమమందు పూర్ణదృష్టియు చెప్పబడినది.

ఇతి శ్రీ బృహత్పరాశరహోరాశాస్త్రే దృష్టిభేదకథనాధ్యాయోనామాష్టమః ॥౮॥

ఇది బృహత్పరాశర హోరాశాస్త్రమందు
దృష్టిభేదకథనాధ్యాయము అను
అష్టమాధ్యాయము ముగిసెను.

## సూ తి కా ధ్యా య ము ॥౯॥

సూచన :- ఈ అధ్యాయము బృహత్పరాశర హోరాసారాంశమందుగాని, శ్రీసీతారామ్ ఝా హిందీవ్యాఖ్యాన సహితబృహత్పరాశర హోరాశాస్త్రమందుగాని ఉదహరించలేదు. దేవచంద్ర ఝా విరచిత హిందీ వ్యాఖ్యానసహిత బృహత్పరాశర హోరాశాస్త్రమందు గలదు. జాతక గ్రంధములందీయధ్యాయము ప్రత్యేకముగ చెప్పబడినందునదీనిని వివరించితిని.

పరాశర ఉవాచ :-

అథాహం సూతికాధ్యాయం వక్ష్యామి శృణు సువ్రత।
పురా ప్రసంగవశతో బ్రహ్మణా కథితం యథా॥ ॥౧॥

యంత్రైః స్పష్టతరో వేద్యో జన్మకాల స్తథా పునః।
సాధ్యాః స్పష్టఖగా శ్చైవం లగ్నం సాధ్యం యథోదితమ్ ॥౨॥

లగ్నద్వాదశభావేషు గ్రహాః స్థాప్యా దివాజనౌ।
సూర్యో రాత్రౌ సూర్యపుత్రో జనకౌ పరికీర్తితౌ ॥౩॥

తథైవ సితచంద్రౌ తు విజ్ఞేయౌ మాతృసంజ్ఞకౌ।
తయో ర్మధ్యే బలీ య స్స్యా త్తస్య గేహే జని ర్భవేత్ ॥౪॥

తా॥ ఓ మైత్రేయ! పూర్వమందు ప్రసంగవశమున బ్రహ్మచే చెప్పబడిన సూతికాధ్యాయమును చెప్పుచున్నాను. వినుము. యంత్రముల సహాయములో జన్మకాలమును స్పష్టమైన దానిని తెలుసుకొనవలయును. ఆ స్పష్టమైన జనన సమయమునకు రవ్యాది గ్రహముల యొక్క స్పష్టమైన స్థితులను, స్వదేశీయములైన లగ్నప్రమాణములను గ్రహించి జన్మలగ్నమును సాధించుకొనవలయును. పూర్వమందు చెప్పిన ప్రకారము లగ్నాది ద్వాదశభావములను సాధించి, ఆయా భావములందు గ్రహముల యొక్క స్థితులను ఏర్పరచ వలయును. పగటియందు జన్మించిన వారికి సూర్యుడు పితృకారకుడు, రాత్రి

యందు జన్మించిన వారికి శని పితృకారకుడు. పగలు జన్మించిన వారికి శుక్రుడు మాతృకారకుడు రాత్రి జన్మించినవారికి చంద్రుడు మాతృకారకుడు అగుచున్నారు. జాతకుని జన్మసమయమునకు పితృకారకుడు బలవంతుడైనచో పితృగృహమందు, మాతృకారకుడు బలవంతుడైనచో మాతృగృహమందు (మాతుల, మాతామహాది మాతృవర్గ గృహమందు) జాతకుడు జన్మించునని చెప్పవలయును.

## మార్గమందు జన్మయోగము

నీచరాశిగతాః సౌమ్యాః గ్రహదృష్టి వివర్జితాః।
చంద్రో యది భవే ల్లగ్నే పధి జన్మ వినిర్దిశేత్ ॥ 3 ॥

తా॥ శుభగ్రహములు నీచరాశులందుండి యేగ్రహములచేతను చూడబడకుండయుండగ, లగ్నమందు చంద్రుడుండెనేని మార్గమధ్యమమున జన్మించును.

వి॥ జాతక తత్త్వసూత్రములందు స్వల్పభేదము చెప్పబడినది.

సూ॥ "సౌమ్యా స్సర్వే నీచగాః వృక్షనదీప్రాకారాదిషు జన్మ॥" అనియు
"నీచగేషు శుభేషు చంద్రేంగే గ్రహామాత్రాదృష్టేఽటవ్యాం జన్మ॥"

అను సూత్రములందు సర్వశుభగ్రహములు నీచలలోనుండగ వృక్ష. నదీ, ప్రాకారాదుల సమీపమందు జన్మించుననియు, సర్వశుభ గ్రహములు నీచలలో నుండగ, లగ్నమందు చంద్రుడుండి యే ఒక్క గ్రహముచేతను చూడబడకుండెనేని అడవియందు జన్మించునని చెప్పవలయును.

అడవిని గ్రహించుటచేత, నిర్జనప్రదేశములు, దుర్గమప్రదేశములను గూడ చెప్పవచ్చును.

సారావళియందు 9వ అధ్యాయములో;

ప్రాకార తరు నదీషు చ సూతి ర్నీచాశ్రితై స్సౌమ్యైః।
నేక్షంతే లగ్నేందూ యద్యేకపా మహాటవ్యామ్॥ అనియు గలదు.

## సూతికాగృహదీపజ్ఞానము

సబలో భౌమదృష్టశ్చ స్వక్షేత్రాదిషు సంస్థితః।
సూర్యో యదా తదా జ్ఞేయం బహుదీపాన్వితం గృహమ్ ॥౬॥

తా॥ సూర్యుడు బలవంతుడై తన యొక్క ఉచ్చ, స్వక్షేత్ర, మూలత్రికోణములందుండి కుజునిచే చూడబడెనేని సూతికాగృహము అనేక దీపములతో కూడియుండును.

వి॥ సారావళియందు;

బలవతి సూర్యే దృష్టే బహూన్ ప్రదీపాన్ వదే త్కుపుత్రేణ।
అని చెప్పబడినది.

జాతక తత్వ సూత్రములందు వేరొకవిధముగ చెప్పబడినది.

సూ :- సబలేఽర్కే భౌమదృష్టే బహుదోషగృహే జన్మ।
అనగా పై యోగమందు బుట్టినవాడు బహుదోషయుక్తమైన గృహమందు జనన మొందునని చెప్పబడినది. గ్రంథాంతరములందీ విషయము చెప్పబడనందున "బహుదోషగృహే" అను పదమునకు బదులు "బహుదీపగృహే" యని యుండుట సమంజసమనితోచుచున్నది.

## అంధకారమందు జననము

శ్లో॥ జలభాంశ గత శ్చంద్ర శ్చతుర్థే భవనే భవేత్।
యుక్తో మందేన వా దృష్టోఽంధకారే జాయతే జనిః॥ ॥౭॥

తా॥ జనన సమయమునకు చంద్రుడు జలరాశ్యంశగతుడై చతుర్థమందుండి శనిచే చూడబడినను, కూడినను అంధకారమందు జనన మగునని చెప్పవలయును.

వి॥ సారావళియందు విశేషము :

సౌరాంశేఽప జలాంశే చంద్రేఽర్కజ సంయుతేఽధవా హిబుకే।
తద్దృష్టే వా కుర్యా త్తమసి ప్రసవం న సందేహః॥

అనగా చంద్రుడు జలరాశ్యంశలందుగాని, శనన్యంశములందుగాని యుండి శనిచే చూడబడినను, కూడినను, చంద్రుడు చతుర్థమం

దుండి శనిచే చూడబడిగాని, కూడబడిగాని యున్నచో అంధకార మందు జననమని చెప్పవలయునని భావము.

బృహజ్జాతకములో;

మందర్క్షాంశే శశిని హిబుకే మందదృష్టేఽబ్జగే వా।
తద్యుక్తే వా తమసి...... ...... ...... ...... ...... ।

భట్టోత్పలుడు దీనివ్యాఖ్యలో నిట్లు విశదపరచెను.

"శశిని చంద్రే యత్ర తత్ర రాశౌ మందర్క్షాంశే శనైశ్చరస్య నవభాగే మకర కుంభయో రన్యతమాంశకస్థే తమస్యంధకారే సూతికాశయనం వక్తవ్యమ్॥ హిబుకే లగ్నా చ్చతుర్థచంద్రే అంధకార ఏవ శయనమ్।యత్ర తత్రావస్థితే। చంద్రే మందేన సౌరేణ దృష్టేంధకార ఏవ॥ అబ్జగే వేతి। అబ్జరాశి అత్రి। కర్కటకమీనౌ ద్వౌ విజ్ఞేయౌ మకరకుంభయో రుక్తత్వాత్।మందర్క్షాంశ ఇత్యాదినేతి తేన యత్ర తత్ర రాశౌ కర్కటకనవాంశస్థే చంద్రే తమస్యంధకార ఏవ।మీన నవాంశ కస్థే వా తమస్యంధకార ఏవ।తద్యుక్తే వేతి।తదితి సౌరః పరామృశ్యతే।యత్ర తత్రా వస్థితే చంద్రే సౌరయుక్తేంధకార ఏవ।ఏవం నిషేకకాలే నారీశయన మపి। సర్వేష్వేతేషు యదార్కదృష్ట శ్చంద్రమా భవతి తదాంధకారాభావః। యస్మాద్యవనేశ్వరః। "సౌరాంశకస్థే శశిని ప్రలగ్నే జలే జలాఖ్యాంశక మాశ్రితే వా।స్వాంశ స్థితే కేంద్రగతేర్కజేవా జాత స్తమిస్రే యది నార్కదృష్టః।

పై వివరణమునకు అర్థము

(1) చంద్రుడు జన్మకాలమందే రాశియందున్నను శనియొక్క నవాంశములను పొందినప్పుడు, (2) చంద్రుడు చతుర్థమందున్నను, (3) చంద్రుడే రాశియందున్నను శనిచే చూడబడుచున్నప్పుడు (4) చంద్రుడే రాశియందున్నను కర్కట, మీననవాంశములందున్నప్పుడు (5) చంద్రుడే రాశియందైనను శనితో కూడియున్నప్పుడు అంధకార మందు జననమని చెప్పవలయును. ఈ యోగములు పట్టినప్పుడు చంద్రుడు సూర్యునిచే చూడబడనేని అంధకారమందు జననమని చెప్పుటకు వీలులేదు. అని భావము.

"స్కాంధహోర"లో

సౌరాంశకేపి సౌరేణ దృష్టే సౌరేణ వా యుతే।
జలాంశకేవి వా చంద్రే వేశ్మస్థో వ్రిసవో యది।
తదా శయన మాఖ్యేయ మంధకారే న సంశయః।
ఇందు సూర్యేణ దృష్ట శ్చే త్తైజస్యేవ తదా దిశేత్। అవియు,

"బృహత్ప్రాజాపత్యము"లో;

సౌరాంశకస్థ సౌరేణ దృష్టః సౌరయుతోఽపివా।
జలరాశౌ జలాంశస్థే యదీందు ర్వేశ్మని స్థితః।
తదా శయన మాచక్ష్వ తస్యా స్తమసి నారద।
స ఇందు సూర్యదృష్ట శ్చే త్తైజస్యేవ తదా దిశేత్। అవియు గలదు.

## సూతికాగృహస్థదీపాది జ్ఞానము

శ్లో॥ యస్మిన్ భాగే భవే త్సూర్య స్తత్ర దీపం వదే త్సుధీః।
లగ్నా ద్వర్తి స్తథా చంద్రా త్తైలం వాచ్యం మనీషిభిః। ।౮।
చరేఽర్కే చంచలో దీపః స్థిరస్థే తు స్థిరో భవేత్।
ద్విభే స్థితి ర్ద్వయో ర్జ్ఞేయా సూర్యస్థవశతో బుధైః॥ ।౯।

తా॥ సూర్యుడు జనన సమయమందే భాగమందుగలడో దీపమూ భాగమందుగలదని చెప్పవలయును. లగ్నమునుబట్టి దీపపు ఒత్తె విషయమును, చంద్రునిబట్టి తైలవిషయమును చెప్పవలయును. సూర్యుడు చరరాశిలో నుండెనేని దీపము చంచలము గనున్నదనియు, స్థిరరాశియందుండెనేని స్థిరముగ నొక ప్రదేశమందున్నదనియు, సూర్యుడు ద్విస్వభావరాశిలో నుండెనేని చరభాగమందు చంచలము గను, స్థిరభాగమందు స్థిరముగనున్నదనియు జన్మకాల సూర్యునిబట్టి చెప్పవలయును.

వి॥ సూర్యుడు జననకాలమునను యే రాశియందుగలడో ఆ రాశి యే దిక్కునకు సంబంధించినదో తెలుసుకొని దీపమూ దిక్కుగనుండునని చెప్పవలయును. ఈ విషయమె సారావళిలో:

ద్వాదశభాగచ్ఛన్నే వాసగృహేఽవస్థితే సహస్రాంశౌ।
దీప శ్చాస్థిరాదిషు తథైవ వాచ్యః ప్రసవకాలే॥

సూతికాగృహమును ద్వాదశ భాగములుగ విభజించి మేషము మొదలుగ లెక్కపెట్టగ సూర్యుడున్న రాశి యే దిక్కుకలదో ఆ దిశను దీపముండునని చెప్పవలయును.

మేష వృషభములు తూర్పు, మిధునము ఆగ్నేయము, కర్కటక సింహములు దక్షిణము కన్య నైరృతి, తులవృశ్చికములు పశ్చిమము, ధనుస్సు వాయువ్యము, మకరకుంభములు ఉత్తరము, మీనము ఈశాన్యము అని తెలియువలయును.

లగ్నమునుబట్టి దీపవర్తి జ్ఞానమును గురించి "భట్టోత్పలు" డిట్లు వివరించెను.

"లగ్నారంభే తత్షణదత్తా వర్తి రాదేశ్యా మధ్యే అర్ధదగ్ధా వర్తిః లగ్నావసానే వర్తిదాహో వాచ్యః॥ అంతరేఽనుపాతః॥"

లగ్న ప్రారంభమందైనచో అప్పుడే వర్తి వేయబడినదని, మధ్యయందైన సగము కాలినదనియు, లగ్నాంతమందైనచో వర్తి కాలిపోయి చివర భాగములో నున్నదని తెలుసుకొనవలయును. లగ్నము యొక్క మధ్య భాగలందైనచో అను పాతమువలన తెలుసుకొనవలయును.

సారావళిలో కూడ ,

యావ ల్లగ్నా దుదితం వర్తి ర్దగ్ధా తు తావతీ భవతి।

అనుటవలన లగ్న ప్రమాణము 30 భాగలకు దీపవర్తి ప్రమాణమును సరిచూచుకొని యెన్నిభాగలు భుక్తమైనవో యన్నవవంతు వర్తి కాలినదని గ్రహించవలయును.

చంద్రునిబట్టి తైలవిషయమును నిర్ణయించ వలయుననుటచేత;

సారావళిలో ;

దీపః పూర్ణే పూర్ణ శ్శశిని క్షీణే క్షయస్తు తైలస్య॥

చంద్రుడు పూర్ణుడైనచో దీపములో తైలము పూర్తిగయున్న దనియు, క్షీణుడైనచో తైలము క్షీణించినదనియు గ్రహించవలయును. ఈ అభిప్రాయము సరియైనది కాదని భట్టోత్పలుడీ క్రింద విధముగ వివరించెను.

"దీపః పూర్ణే పూర్ణ శ్శశిని క్షీణే క్షయస్తు తైలస్య॥ అనుసారావళీ వాక్యమునుబట్టి నిర్ణయించదలచినచో॥ యద్యేవం తదమావాస్యాయాం సర్వేషా మంధకారే ప్రసవో భవతి। తస్మా దయుక్త మేతత్॥

అమావాస్యయందు చంద్రుడు సంపూర్ణ క్షీణుడగుటచేత అమావాస్యయందు జన్మించిన వారందరు అంధకారములోనే జన్మించ వలసియుండును. అది సంభవముకాదు కనుక పై అభిప్రాయము సరియైనదికాదు.

"యత్ర రాశౌ చంద్రమాః వ్యవస్థిత స్తత్ర యది రాశిప్రారంభే స్థితో భవతి తదా దీపభాజనం స్నేహేన పూర్ణం వక్తవ్యమ్। యత రాశ్యవసానే స్థిత స్తత్రి స్నేహాక్తమ్॥ మధ్యప్రాప్తే ఽర్ధమ్॥ అన్యత్రానుపాతా దితి॥

ఏ రాశియందు చంద్రుడున్నను రాశి ప్రారంభములో యున్నచో దీపమందు తైలము పూర్ణముగ నుండును. రాశ్యంతమందున్నచో తైలము పూర్తిగ క్షీణించును. మధ్య భాగలందను పాతముచే తెలుసు కొనవలయునని వివరించెను. ఈ అభిప్రాయము సరియైనదిగ తెలియు చున్నది.

జన్మ సమయమునకు సూర్యుడు చరరాశియందున్నప్పుడు దీపము స్థిరముగ లేదనియు, స్థిరరాశియందున్నచో నొకచోట స్థిరముగ నుంచబడినదనియు, ద్విస్వభావ రాశియందున్నచో దీపమున్న చోటు నుండి తీయుటకు తగియుండుననియు, చెప్పవలయును.

మరియు రవి అగ్నితత్త్వ రాశులందుండెనేని విద్యుద్దీపమనియు లేక పెద్ద దీపమనియు చెప్పవచ్చును. చరాది రాశులందు పూర్వోక్త ఫలమునే చెప్పవలయును.

శ్లో॥ శీర్షా చ్ఛీర్షోదయే వాచ్యః పాదాత్ పృష్ఠోదయే మతః।
కరా త్తదుభయే జ్ఞేయః ప్రసవ స్సర్వదేహినామ్॥

తా॥ జన్మలగ్నము శీర్షోదయమైనచో శిరస్సుతో జనన మగునని, పృష్ఠోదయ రాశియైనచో పాదములతో జననమగుననియు, ద్విస్వభావరాశియైనచో చేతులతో జననమగుననియు చెప్పవలయును.

వి॥ సారావళిలో :

శీర్షోదయే విలగ్నే మూర్ధ్నా ప్రసవో స్యథోదయే చరణై:।
ఉభయోదయే చ హస్తై శ్శుభదృష్టే శోభనో ఽన్యథాకష్టః॥

అను శ్లోకములో జన్మలగ్నమును శుభులు చూచినేని సుఖప్రసవమని, పాపులు చూచినేని కష్టప్రసవమని విశేషము చెప్పబడెను.

ఈ విషయమును విచారించునప్పుడు జన్మ లగ్నమును బట్టి మాత్రమేగాక లగ్నము యొక్క నవాంశ, ద్వాదశాంశ రాశుల యొక్క సంబంధమునుబట్టి గూడ విచారించి చెప్పవలయును.

"జాతకతత్త్వసూత్రము" లో

సూ॥ శీర్షోదయాంశేఽంగే మూర్ధతః ప్రసవ ఉభయోదయాంశే హస్తతో ఽన్యథాపాదతః॥ అని గలదు.

ప్రసవవిషయమై :-

సూ॥ లగ్నచంద్రాన్యతరతో బంధ్వస్తగేషు క్రూరేషు మాతుః కష్టమ్॥

లగ్నమునుండిగాని, చంద్రుని నుండిగాని 4,7 భావములందు పాపగ్రహములున్నచో తల్లికి ప్రసవము కష్టమగును. శుభులున్నచో

సుఖప్రసవము గలుగును. మిశ్రిమముగ నున్నచో నీమత్కష్టమును చెప్పవలయును.

(1) లగ్నచంద్రులకు కుజ సంబంధము సంపూర్ణముగ గలిగి నప్పుడు శస్త్రచికిత్సాదులవలన ప్రసవము గలుగుచున్నది. శని సంబంధమున్నప్పుడు కాలవిలంబము గలుగుచున్నది. శని కుజ సంబంధమున్నప్పుడు ఎక్కువ కాలము ప్రసవబాధను పొందిన పిమ్మట శస్త్రచికిత్సవలన ప్రసవము గలుగుచున్నది.

2. చంద్రునకుగాని లగ్నమునకుగాని 4,7 రాసులందు పాప బాహుళ్యమున్నప్పుడు బలవత్తరమైన దోషమును చెప్పవలయును. చంద్రునితో కలసినప్పుడు తక్కువ దోషమును చెప్పవలయును.

3. లగ్నమునకు గాని చంద్రునకుగాని 4వ యింటిలో 3పాప గ్రహములున్నప్పుడు 7వ యింటిలో 3పాపగ్రహములున్నప్పుడు కష్ట ప్రసవమగును.

4. చంద్రుడు జన్మలగ్నమునుండి 4వ యింటిలో నీచయుండుండగ పాపులచే చూడబడినను, రాశ్యంశములందు నీచనుపొంది పాపులతో కూడినను, చూడబడినను కష్టప్రసవమగును.

5. లగ్నమునకు 4వ యింటి అధిపతి నీచలోనుండగ, 4వ యింటిలో క్షీణచంద్రుడుండి పాపులచే చూడబడినను కష్టప్రసవమగును. పై యోగములు పట్టినప్పుడు గురుడు చంద్రునిగాని, చతుర్థమునుగాని సంపూర్ణదృష్టితో చూచినచో కించిత్కష్టప్రసవమగును.

శ్లో॥ కేంద్రస్థగ్రహయోగాద్వా లగ్నరాద్వా బలాధికాత్।
ద్వారం వాచ్యం తు గేహస్య దిగీశక్రమతః సదా ॥౧౧॥

తా॥ జన్మలగ్నమునకు కేంద్రరాసులలో గల గ్రహములలో నే గ్రహము బలముగ నుండునో ఆ గ్రహమును బట్టిగాని, బలయుక్త

మైన లగ్నమునుండిగాని ప్రసూతిగృహముయొక్క ద్వారమును చెప్ప వలయును. ఏదిగధిపతి బలముగ నుండునో ఆ దిక్కునందు ద్వార ముండునని తెలుసుకొనవలయును.

వి॥ గ్రహములకు దిగాధిపత్యవిషయమై "ప్రాచ్యాదీశా రవిసిత కుజరాహుయమేందు సౌమ్యవాక్పతయః" అను ప్రమాణమునుబట్టి రవితూర్పునకు శుక్రుడు ఆగ్నేయమునకు కుజుడు దక్షిణమునకు రాహువు నైరృతికి, శనిపశ్చిమమునకు చంద్రుడు వాయవ్యమునకు బుధుడుత్తరమునకు గురుడీశాన్యమునకు దిగధిపతులగుచున్నారు.

మరియు జన్మలగ్నము యేద్వాదశాంశమును పొందినదో అట్టి ద్వాదశాంశమును బట్టిగూడ ద్వారనిర్ణయమును చేయవలయునను యీ క్రింద ప్రమాణమును బట్టి తెలియుచున్నది.

"లగ్నే యో ద్వీరసాంశ స్తదభిముఖం సూతికాగృహే ద్వారమ్"

ద్వాదశాంశమే దిగ్రాశియగునో తదభిముఖముగ ద్వారముగల సూతికాగృహమందు జననమగునని చెప్పవలయునని భావము.

### ఉపసూతికా జ్ఞానము.

శ్లో॥ లగ్నచంద్రాంతరాలస్థ గ్రహై స్స్యు రుపసూతికాః।
దృశ్యాదృశ్యవిభాగాద్యాం బహి రంతశ్చ తాః స్మృతాః ॥౧౨॥
స్వర్గాదౌ ద్విగుణా జ్ఞేయా వక్రోచ్చే త్రిగుణా మతాః।
యత్రోభయస్య సంప్రాప్తి స్త్రైగుణ్యం తత్ర వై సకృత్ ॥౧౩॥
పాపైస్తు విధవా జ్ఞేయాః శోభనై స్సధవాః స్మృతాః।

తా॥ జన్మలగ్నమునకు చంద్రునకు మధ్య యెన్నిగ్రహము లుండునో ఆ సంఖ్యకు సరిపడు ఉపసూతికలుండునని చెప్పవలయును. (ఉపసూతికలనగా ప్రసవసమయమున సహాకారులుగనుండు స్త్రీజన మనిభావము)

దృశ్యచక్రమందు గ్రహములున్న యెడల వెలుపలభాగమందు ఉపసూతికలు కలరనియు, అదృశ్యచక్రమందు గ్రహములున్న యెడల సూతికాగృహముయొక్క లోపలభాగమందు పసూతికలు కలరనియు చెప్పవలయును. (సప్తమభావభోగ్యాంశములనుండి లగ్నభుక్తాంశముల పర్యంతము దృశ్యచక్రము, లగ్నభోగ్యాంశములనుండి సప్తమభావభుక్తాంశముల పర్యంతము అదృశ్యచక్రమనబడును.)

గ్రహములు తమయొక్క స్వక్షేత్ర, స్వనవాంశములందున్నచో ద్విగుణితసంఖ్యలోను, వక్రమందు, ఉచ్చయందున్నచో త్రిగుణిత సంఖ్యలోను ఉపసూతికలుండగలరు.

గ్రహస్థితివశముచే ద్వైగుణ్య. త్రైగుణ్యముల ప్రాప్తి కలిగిన పుడు ఒకపర్యాయము త్రైగుణ్యమునే గ్రహించి ఉపసూతికాసంఖ్యను గ్రహించవలయును.

పాపగ్రహములున్న యెడల విధవాస్త్రీలుండగలరని, శుభగ్రహములున్నయెడల సుమంగళీ స్త్రీలుండెదరనియు తెలుసుకొనవలయును. (సుమంగళీ స్త్రీలనగా భర్తలుగల స్త్రీలని గ్రహించవలయును)

వి॥ ప్రసవసమయ పరిజ్ఞానమును బట్టి ప్రసవకాలమందు సహకరించు జనముయొక్క సంఖ్యను, తెలుసుకొను విధానము చెప్పబడినది.

లగ్నచంద్రులయొక్క మధ్యగల రాసులలో నున్న గ్రహములను బట్టి సంఖ్యానిర్ణయమును చేయువిధానములో ఏదైనవొక గ్రహము స్వక్షేత్రమందున్నప్పుడు రెట్టింపుచేసి చెప్పవలయును. వక్రిమందుగాని ఉచ్చయందుగాని యున్నప్పుడు మూడురెట్లు చేసి చెప్పవలయును. ఒకప్పుడు స్వక్షేత్రగత గ్రహము వక్రించినచో మూడురెట్లు చెప్పవలయునుగాని, స్వక్షేత్రమునకు రెట్టింపు, వక్రిమునకు మూడురెట్లు యనిరెండు పర్యాయములు సంఖ్యను చెప్పకూడదు. మూడురెట్లు మాత్రమునే గ్రహించ వలయును.

ఈ విషయమై హోరాశాస్త్రము - రుద్రవివరణములో నిట్లు గలదు.

"లగ్నా ద్యావ చ్చంద్రం స్థితా గ్రహాః గృహ్యంతే॥ నచంద్రా ల్లగ్నావధి స్థితాః॥ తత్ర చంద్రే సప్తమా దుపరి స్థితే సతి కేచిత్ అదృశ్యార్ధస్థితాః గ్రహాః కేచిత్ దృశ్యార్ధస్థా శ్చ సంభవంతి తత్ర అదృశ్యార్ధస్థితైః। ప్రసవోపయోగిన్యః సూతికాగృహాంతస్థా ఉపసూతికా వాచ్యాః। దృశ్యార్ధస్థితైః సూతికా గృహాత్ బహిస్థ్సితా వాచ్యాః। ఉచ్చాది గతత్వేన తాసాం ద్విత్రిగుణత్వం చ శత్రునీచాదిగతై రనుపయో గిత్వం చ వక్తవ్యమ్।పరే అన్యధా ఇతి।పరే దృశ్యాదృశ్యే చ క్రార్ధే ఆంత ర్బహి స్థితా ఉపసూతికా స్స్యు రితి వదంతి।తధా చ జీవశర్మా:-
ఉదయశశిమధ్యసంస్థై ర్గ్రహైః స్యు రుపసూతికా స్తత్ర।
ఉదగర్ధగతై ర్బాహ్యా దక్షిణగై రంతరే జ్ఞేయాః।
ఇతి।అత్ర పూర్వ ఏవ పక్షః శ్రేయాన్। తధా చోక్త మాచార్యేణ

స్వల్పజాతకే :-

శశిలగ్నాంతరసంస్థ గ్రహతుల్యాః సూతికా శ్చ వక్తవ్యాః।
ఉదగర్ధేఽభ్యంతరగా బాహ్య శ్చక్రస్య దృశ్యార్ధే।ఇతి।
అత్ర ఉపసూతికా మై స్త్రైహై శ్చిద్ధిశ్యంతే తత్త ద్గ్రహ తుల్యా జాతి వర్ణ వయో రూపాశ్చ వక్తవ్యాః।

అనగా లగ్నభోగ్యాంశము నుండి చంద్ర భుక్తాంశము వరకు గల గ్రహములనే గ్రహించవలయును. చంద్ర భోగ్యాంశము నుండి లగ్న భుక్తాంశమువరకుగల గ్రహములను గ్రహించరాదు. చంద్రుడు సప్తమ భావమునుదాటి పై భావములలో నున్నప్పుడు కొన్ని గ్రహములు అదృశ్యార్ధమందు, కొన్ని గ్రహములు దృశ్యార్ధమందు సంభవించును. అదృశ్యార్ధమందున్న గ్రహములనుబట్టి ప్రసవమునకు సహాకరించుజనము సూతికాగృహాంతర్భాగమందు, దృశ్యచక్రార్ధ మందుగల గ్రహములనుబట్టి సూతికా గృహమునకు వెలుపల భాగ మందు యుండగలరని చెప్పవలయును. ఆయాగ్రహములుచ్చాది స్థితి

నొందినప్పుడు ద్వితిగుణత్వమును, శత్రునీచాది స్థలములందున్నప్పుడను పయోగిత్వమును చెప్పవలయును. ఈ విషయమై కొందరు వేరుగ చెప్పియున్నారు.

ఎట్లనగా :-

దృశ్యచక్రమందు గ్రహములున్నప్పుడు సూతికాగృహాంతర్భాగమనియు, అదృశ్యచక్రమందు గ్రహములున్నప్పుడు సూతికాగృహబహిర్భాగమనియు తెలిపియున్నారని "జీవశర్మ" యొక్క వాక్యము నుదహరించి యీ పక్షములలో మొదటి పక్షమే సరియైనదని చెప్పుచు, "లఘుజాతక" మందుగల వరాహ వాక్యము నుదహరించెను.

## శరీరమందు చిహ్నజ్ఞానము

శ్లో॥ కాలాంగే యత్ర భౌమార్కౌ తత్ర జ్ఞేయం తిలాదికమ్ ॥౧౪॥
శనిరాహూ స్థితౌ యత్ర తత్ర శ్యామల మాదిశేత్।
లగ్నే చంద్రారశుక్రాశ్చే చ్చిహ్నం శిరసి సంస్థితమ్ ॥౧౫॥

తా॥ సూర్యుడు కుజుడు కాలపురుషాంగ భాగములలో మేషాది రాశులందే రాశియందు గలరో ఆ రాశికి సరిపడిన శరీరాంగమందు పుట్టుమచ్చలుండునని చెప్పవలయును. ఏ రాశియందు శని రాహువు లుండెదరో ఆ రాశికి సరిపడు అంగమందు నల్లనిపుట్టుమచ్చ యుండు నని చెప్పవలయును. లగ్నమందు చంద్ర కుజ శుక్రులున్న యెడల శిరస్సునందు మచ్చయుండునని చెప్పవలయును.

శ్లో॥ శుక్రేఽస్తే నిధనే రాహుః వామకర్ణే ఽథ మస్తకే।
గురు శ్శుక్రోఽథవా భౌమో యది ద్యూనే వ్యవస్థితః ॥౧౬॥
తదా చిహ్నం భవే న్మూర్ధ్ని గ్రహవర్ణానుసారతః।

తా॥ శుక్రుడు సప్తమమందు, రాహువు అష్టమందున్నచో యెడమ చెవియందుగాని, శిరస్సునందుగాని చిహ్నముండును. గురుడు

గాని, శుక్రుడుగాని, కుజుడుగాని సప్తమములో నున్నచో శిరస్సునందు గ్రహావర్ణాను రూపమైన చిహ్నముండును.

శ్లో॥ చంద్రోవా క్షితిజో లగ్నేఽథవా శుక్రో భవే ద్యది।
ద్వాదశాబ్దే తదా చిహ్నం శీర్షే స్యా న్నాత్ర సంశయః॥
త్రికోణస్థార్కిభౌమాభ్యాం గుదే లింగేఽపి వా దిశేత్ ॥౧౮॥

తా॥ చంద్రుడుగాని, కుజుడుగాని, శుక్రుడుగాని లగ్నమందున్నచో పండ్రెండవ సంవత్సరమందు శిరస్సునందు చిహ్నము గలుగును. 5, 9 భావములందు కుజ శనులున్నచో గుదమునందుగాని, మర్మాంగమందుగాని, చిహ్నమును చెప్పవలయును.

శ్లో॥ సుఖే లగ్నేఽథవా మంద త్రికోణే భార్గవో యది।
మృత్యుస్థౌ బుధదేవేజ్యౌ జఠరే తత్సమాదిశేత్ ॥౧౯॥

తా॥ 1, 4 లలో శని, 5, 9 లో శుక్రుడు, 8వ యింటిలో బుధ గురువులున్నచో జఠరమందు (పొట్ట) మచ్చయుండును.

శ్లో॥ శుక్రార్కరాహవ శ్చైత్స్యుః సుఖే లగ్నేఽథవా కుజే।
తదా చిహ్నం భవే న్నూనం వామపాదే విశేషతః ॥౨౦॥

తా॥ రవి శుక్ర రాహువులు కుజుడు లగ్న చతుర్థములందే కైనన్నచో ఎడమ కాలునందు మచ్చలుండును.

వి॥ చతుర్థమందు రవి శుక్ర రాహువులుగాని లగ్నమందు కుజుడుగాని యున్నను, కుడిపాదమందు మచ్చలుండునవియు చెప్పవలయును.

శ్లో॥ శుక్రో లగ్నేష్టమే రాహు శ్చిహ్నం వామశ్రుతౌ శిశోః॥
జీవో లగ్నే మదే రాహు స్తదా వామభుజే వదేత్ ॥౨౧॥

లగ్నమందు శుక్రుడు, అష్టమమందు రాహువున్నప్పుడు శిశువునకు ఎడమ చెవియందు. లగ్నమందు గురుడు, సప్తమమందు రాహువున్నప్పుడు ఎడమ భుజమందు మచ్చలుండునని చెప్పవలయును.

శ్లో అష్టమే రజనీనాథో వ్యయస్థౌ గురుభార్గవౌ।
మదస్థౌ మందమాహేయౌ తదా చిహ్నం భుజద్వయే ।౨౨।

అష్టమమందు చంద్రుడు, వ్యయమందు గురు శుక్రులు, సప్తమమందు కుజ శనులున్నప్పుడు రెండు చేతులందు చిహ్నములుండునని చెప్పవలయును.

శ్లో॥ శుక్రో ధనేశ కర్మస్థౌ సైంహికేయశనైశ్చరౌ।
అష్టమే దివసాధీశో నాభౌ చిహ్నం తదా దిశేత్ ॥౨౩॥

తా॥ ధనస్థానమందు శుక్రుడు, దశమమందు శని రాహువులు, అష్టమమందు సూర్యుడున్నచో నాభియందు మచ్చలుగలవాడగును.

వి॥ ద్వితీయ భావమందు శుక్రుడు, అష్టమమందు సూర్యుడుండుట సంభవము కాదని చెప్పదగియున్నది. ప్రమాణాంతరము లభించక పోవుటచేత నీ విషయమై వివరణ వ్రాయలేను.

శ్లో శుక్రభౌమౌ తృతీయస్థౌ ద్వితీయే రజనీపతిః।
దశమే భవనే మంద శ్చిహ్నం కటిగతం భవేత్ ॥౨౪।

తా॥ కుజ శుక్రులు మూడవ యింటిలోను, చంద్రుడు రెండవ యింటిలోను, శని పదవయింటిలో నున్నచో కటిప్రదేశమందు చిహ్నములుండును.

శ్లో త్రిషడాయే యదా సౌమ్యో వ్యయే వాచస్పతి ర్భవేత్।
సహజే చ భవే త్కావ్య స్తదా చిహ్నం హృది స్థితమ్। ।౨౫।

తా। బుధుడు 3, 6, 11లో నుండగ, గురుడు 12లో నుండగ శుక్రుడు 3వ యింట నున్నచో హృదయ స్థానమందు మచ్చలుండును.

పితృపరోక్ష జనన జ్ఞానము

శ్లో॥ లగ్నే మందోమదే భౌమ శ్చంద్రో లగ్నం న పశ్యతి।
బుధశుక్రాంతరే చంద్రః పరోక్షే స్యాజ్జనిః పితుః॥ ౨౬

తా॥ లగ్నమందు శని యున్నప్పుడుగాని, సప్తమమందు కుజు డున్నప్పుడుగాని, లగ్నమును చంద్రుడు చూడనప్పుడుగాని, చంద్రుడు బుధ శుక్ర మధ్యగతుడైనప్పుడుగాని జాతకుడు తండ్రి దగ్గరలేనప్పుడు జన్మించును.

శ్లో॥ అష్టమే నవమే వాపి చరభే యది భాస్కరః।
పరోక్షే జన్మ జాతస్య పితుస్స్యా న్నాత్ర సంశయః॥ ౨౭
కర్మభావం వినా ద్వ్యర్క్యే చరభే యది భాస్కరః।
లగ్నం చంద్రో న పశ్యే చ్చేత్ దూరసంస్థః శిశోః పితా॥ ౨౮

తా॥ సూర్యుడు జన్మలగ్నము నుండి అష్టమ భావమందుగాని నవమభావము దుగాని యున్నప్పుడు, ద్విశ్వచక్రమందుదశమ భావము నందు గాక మిగిలిన భావములందెక్కడైనను చరరాశియందు డగ లగ్నమును చంద్రుడు చూడనిచో తండ్రి దూర ప్రాంతమందుండగ జాతకుడు జన్మించునని చెప్పవలయును.

1. చంద్రుడు జన్మలగ్నమును చూడని యెడల తండ్రి దగ్గర లేని సమయమందు జాతకుడు జన్మించును. తండ్రి స్వదేశమందుండి పరోక్షముగ నుండెనా? పరదేశమందుండెనా? యను విషయమై; బృహజ్జాతక వ్యాఖ్యాతయగు "భట్టోత్పలుడు" తన వ్యాఖ్యలో నిట్లు వివరించెను.

బృ. జా- జన్మవిధానాధ్యాయము 1, 2 శ్లో॥

"దివాకరే చరభే చరరాశిస్థే మధ్యా ద్దశమస్థానాత్ భ్రష్టే పతితే ఏకాదశ ద్వాదశస్థే నవమాష్టమస్థానస్థే పితు ర్విదేశస్థస్య అన్యదేశగతస్య జాతః॥ చంద్ర మపి లగ్న మపశ్యత్యేష యోగో నాన్యథా॥

అనగా జన్మలగ్నమును చంద్రుడు చూడకుండయుండగ, సూర్యుడు చరరాశియైన, అష్టమ నవమ, ఏకాదశ ద్వాదశ స్థానము లందే భావములందున్నను ఆ జాతకుడు తండ్రి ఇతర దేశమందుండగ జన్మించెనని చెప్పవలయును.

(3) "చంద్రే ప్రసవలగ్న మపశ్యతి అర్కే స్థిరరాశిస్థే మధ్యా ద్భ్రష్టే స్వదేశ స్థస్యైవ పితుః పరోక్షే జాతః"

అనగా చంద్రుడు జన్మలగ్నమును చూడకుండ యుండగ, సూర్యుడు స్థిరరాశియైన అష్టమ, నవమ ఏకాదశ స్థానములందే భావ ములో నున్నను జాతకుని తండ్రి స్వదేశమందు పరోక్ష (దగ్గర లేని సమయ) మందు జాతకుని జననమని తెలుసుకొనవలయును.

"అస్మిన్నేవ యోగే ద్విస్వభావస్థేర్కే మధ్యాద్భ్రష్టే స్వదేశ పరదేశయో ర్మధ్యేవస్థితస్య పరోక్షే జాతః॥ అర్థాదేవ చంద్రే ప్రసవలగ్న మపశ్యతి అర్కే చరరాశిస్థే స్థిరరాశిస్థేవా ద్విస్వభావరాశిస్థితేవా మధ్యాద్భ్రష్టేపివా పితుః స్వదేశ స్యైవ పరోక్షే జాత ఇతి వక్తవ్యమ్॥

(పై యోగమునందే సూర్యుడు అష్టమ,నవమ,ఏకాదశ,ద్వాదశ భావములలో ద్విస్వభావమైన రాశియందున్నచో స్వదేశపరదేశము లకు మధ్యయందు తండ్రి యుండునని చెప్పవలెను. దీనివలన తెలియు చున్నదేమనగా చంద్రుడు జన్మలగ్నమును చూడనప్పుడు, సూర్యుడు చరస్థిర ద్విస్వభావరాశులలో, అష్టమ, నవమ, ఏకాదశ, ద్వాదశము లందెక్కడున్నను, తండ్రి స్వదేశమందుండగ పరోక్షమున శిశువు జన్మించునని చెప్పవలయును.

ఈ యభిప్రాయమే "సారావళి"లో
హోరా మనీక్షమాణే శశిని పరోక్షస్థితే పితరి జాతః।
మేషూరణాగతేవా చరభే భానౌ విదేశగతే॥ అనుశ్లోకములో చెప్పబడినది.
రెండవ శ్లోక వ్యాఖ్యలో

"మందే సౌరే ఉదయస్థే లగ్నగతే పితుః పరోక్షస్య జాతః॥ అథవా కుజే జన్మలగ్నా దస్తం సప్తమం స్థానం సమాగతే ప్రాప్తే పితుః పరోక్షస్య జాత ఇతి॥ స్థితేవాంతరితి॥ శశినాథే చంద్రే శశాంకసుతశుక్రయో ర్మధ్యస్థే శశాంకసుతో బుధః శుక్రో భార్గవః అనయో ర్మధ్యస్థితే చంద్రా దేకో ద్వాదశేఽన్యో ద్వితీయే అథవై కస్మి న్రాశౌ మధ్యభాగేతు చంద్రః స్థితః అద్యంతభాగయో ర్బుధశుక్రౌ తథాపి మధ్యస్థః ఏవంవిధే యోగే పితుః పరోక్షస్య జాతః॥

(అనగా శని లగ్నగతుడైనప్పుడుగాని, కుజుడు సప్తమమందున్నప్పుడుగాని, చంద్రుడు బుధ శుక్ర మధ్యస్థుడైనప్పుడుగాని (చంద్రునకు 12వ రాశిలోనొక గ్రహము 2వ రాశిలోనొక గ్రహముండుటగాని, ఒకే రాశియందు చంద్రునకు వెనుక భాగలలోనొక గ్రహము, ముందుభాగలలోనొక గ్రహముగాని యున్నప్పుడు) తండ్రి దగ్గరలేనప్పుడు జాతకుడు జన్మించునని చెప్పవలయును.

బృహజ్జాతక రుద్రవివరణములో;

"అత్ర పితృపారోక్ష్య విషయే చత్వారో యోగా ఉక్తాః భ్రిష్టశబ్దేన గగన మధ్యా దవరోహణం వివక్షితమ్। తచ్చ దినార్ధా త్ప్రభృతి నిశార్ధపర్యంతం మధ్య లగ్నాత్ వ్యుత్క్రమేణ పాతాలపర్యంత మితి యావత్॥ పాతాలలగ్న భవన స్థానం చతుర్థం, తస్మాత్ వ్యుత్క్రమేణ షట్సు రాశిషు అరోహణస్థానేషు భ్రిష్టతా వ సంభవతీ త్యవసేయమ్॥

("మధ్యాద్భ్రష్టే దివాకరే" అనుచోట భ్రష్టశబ్దమును ప్రయోగించుటచే ఆకాశ మధ్యమును నుండి(లేక దశమలగ్నమునుండి) అవరోహణమని గ్రహించవలయును. అది దినార్ధము నుండి రాత్ర్యర్ధ పర్యంతమగును. మధ్యలగ్నము (దశమలగ్నము) నుండి వ్యుత్క్రమముగ చతుర్థభావపర్యంతము అని భావము. చతుర్థ లగ్నము గృహ స్థానము, దానినుండి వ్యుత్క్రమముగ దశమ భావము వరకు ఆరోహణ సంబంధమైన భావములు గనుక వీనియందు భ్రష్టత్వము సంభవించదని గ్రహించవలయునని భావము)

ఇట్లనుటచేత అష్టమ, నవమ భావములను మాత్రమే గ్రహించుటకు వీలగును, గాని భట్టోత్పలుడు చెప్పినట్లు ఏకాదశ, ద్వాదశ భావములను గ్రహించుట కవకాశములేదు. పరాశర వాక్యమందు "కర్మభావం వినాదృశ్యే" అనుటచేత దృశ్యచక్రమందు దశమ భావము మాత్రమే విదిలి వేయబడినందున ఏకాదశ వ్యయభావములకు నిషేధము లేనందున భట్టోత్పలుని యభిప్రాయము పరాశర సమ్మతముగ నున్నది. కానివృద్ధయవనాదులు అష్టమనవమ భావములను మాత్రమే గ్రహించినట్లు తెలియుచున్నది.

వృద్ధయవనుడు :-

వాచ్యం శిశో ర్జన్మ పితుః పరోక్షే క్షపాకరః పశ్యతి చేన్న లగ్నమ్।
చరస్థితే ఽర్కేఽష్టమ ధర్మగే వా విదేశసంస్థే పితరీహ వాచ్యమ్॥

శుకజాతకమందు

చరరాశిగతే భానౌ నవమాష్టమ సంస్థితే।
శిశోః పితా విదేశస్థో లగ్నం చంద్రేణ నేక్షితమ్॥

"హోరాప్రదీపము"లో

న వీక్షితేందా వుదయః శిశోః పితా పరోక్షగ స్స్యా చ్చరభే విదేశగః॥
స్థిరే స్వదేశే ద్వితనౌ పథిస్థో ధర్మాష్టగో వాపి దివాకర స్తథా॥

యని, పై గ్రంథములందు అష్టమ, నవమ భావములందు మాత్రమే రవియుండవలయునని చెప్పబడినది. మహాదేవుని "జాతక తత్త్వసూత్రము" లందు సూతికాతత్త్వము 2వ సూత్రములో;

స్థిరేఽర్కేఽష్ట మాంశాయాన్త్యే చంద్రేణ చాదృష్టేంగే స్వదేశస్థపితుః పరోక్షం జన్మ। అని అష్టమ, నవమ, ఏకాదశ, వ్యయ భావములందు యెందైనను సూర్యుడుండ వలయునని తెలిపియుండెను.

## పితృసౌఖ్య హానికరయోగములు

శ్లో॥ రాత్రౌ జన్మ యదా యస్య భౌమయుక్త శ్శనైశ్చరః।
చరస్థః పరదేశే తు తాతస్య నిధనం వదేత్॥ ౨౯॥

తా॥ రాత్రియందు జననమొందిన వానికి చరరాశి గతుడైన శని కుజునితో చేరినయెడల పరదేశమందున్న తండ్రికి మరణము గలుగును.

అష్టమే వా వ్యయే పాపా లగ్నేశో బలసంయుతః।
సుఖేఽథ నవమే వాపి రోగయుక్త స్తదా పితా॥ ౩౦॥

తా॥ జన్మలగ్నాధిపతిబలవంతుడై చతుర్థనవమములందుండగ, అష్టమ వ్యయములందు పాపులున్నచో జాతకుని జన్మ సమయమందు తండ్రి రోగయుక్తుడగును.

వి॥ రాత్రియందు జననమైనచో పితృకారకుడు శనియగుటచే వానికి కుజ సంబంధముచేత చరరాశిస్థితిచేత పితృమరణము చెప్పబడి నది. ఈ విధముగ పగలు జననమైనయెడల పితృకారకుడు రవియగుటచే రవికి చరరాశిస్థితిగలిగి కుజ సంబంధముగలిగినచో పితృమరణము గలుగునని చెప్పవలయును.

ఈ విషయమై "సారావళి"లో

ద్యునిశో రర్కాసితయోః కుజేన సందృష్టయోః పితా వ్యభవత్।
చరరాశౌ పరదేశే యుక్తేక్షితయో స్తు తత్ర మృతః॥ అను శ్లోకములో
రవిశనులకు కుజయుతి మాత్రమేగాక దృష్టికూడ గ్రహించబడెను.

"శుకజాతక"మందు కూడ

సూర్యమందౌ చరస్థౌ భౌమేన యుతవీక్షితౌ।
పరదేశే పితా తస్య మృతో వాచ్యో వినిశ్చయాత్॥ అని చెప్పబడినది.

శ్లో॥ లగ్నస్థం సబలం సూర్యం శనిభౌమౌ ప్రపశ్యతః।
జన్మకాలే తదా తస్య రోగయుక్తః పితా భవేత్॥ ౩౧॥

తా॥ బలవంతుడైన సూర్యుడు లగ్నమందుండి కుజ శనులిద్దరి చేత చూడబడనేని జాతకుని జన్మసమయమందు తండ్రి రోగముతో కూడినవాడై యుండును.

శ్లో॥ చతుర్థే దశమే వాపి శనిభౌమార్క-జేవరాః
శుభసంబంధహీనా శ్చేత్ తదా పితృసుఖం నహి॥ ౩౨॥

తా॥ చతుర్థమందుగాని, దశమ మందుగాని రవి కుజ శనులుండి శుభసంబంధము లేనివారైనచో జాతకునకు పితృసుఖము లేదని చెప్పవలయును.

వి॥ హోరారత్నమందు దహరించిన "శుకజాతకము"లో

భాగ్యబంధుగతౌ పాపౌ లగ్నేశే బలవర్జితే।
సూతికాలే పితా దుఃఖీ శిశో రంబా త్వరఃఫగే॥

అని 4, 9 భావములందు రెండు పాపగ్రహములుండగ, లగ్నాధిపతి బలహీనుడైనచో జనన కాలమునకు తండ్రి దుఃఖములో నుండును. రెండు పాపగ్రహములు 8, 12 భావములందున్నచో తల్లి దుఃఖములో నుండునని చెప్పబడినది.

తండ్రి రోగార్తుడగుననుటకు విశేషముగ:

అర్కాంశకస్థితే మందే అర్కేణైవ నిరీక్షితే।
జన్మకాలే పితా రోగీ కుజదృష్టేఽథవా యుతే॥ అని

జన్మకాలమందు శని రవి యొక్క నవాంశమందుండి రవితో గాని, కుజునితో గాని కూడినను, చూడబడినను, తండ్రి రోగార్తుడగు నని, శని రవ్యంశమును పొందినప్పుడు గూడ యీ యోగమును చెప్ప వలయునని విశేషించెను.

పితృబంధన యోగవిషయమై "సారావళి"లో
పంచమ నవమ ద్యూనే పాపై రర్కాత్తు పాపసంపృష్టైః।
బద్ధః పితాన్యదేశే రాశివశా త్స్వేథవా మార్గే॥

రవికి 5, 7, 9 భావములందు (స్థానములందు) పాపులుండి, పాపులచే చూడబడినేని, తండ్రి విదేశములందు ఇతరులచే బంధింపబడినవాడగును. చరస్థిర ద్విస్వభావరాశులనను సరించి విదేశ, స్వదేశ, మార్గముల యందని చెప్పవలయును.

వరాహమిహిరుడు;

క్రూరర్క్షగతా వశోభనౌ సూర్యా ద్ద్యూననవాత్మజస్థౌ తౌ,
బద్ధస్తు పితా విదేశగః స్వే వా రాశివశా దథో పథి॥

అను శ్లోకమందు రెండు పాపగ్రహములను అర్థము వచ్చునట్లు చెప్పుటచేత రాహు కేతువులను గ్రహించలేదని తెలియుచున్నది. "సారావళి"యందు "పాపైః" అని బహువచన ప్రయోగముండుటచే రాహు కేతువులను గూడ గ్రహించినట్లు బోధపడుచున్నది.

ఇతి శ్రీ బృహత్పరాశర హోరాశాస్త్రే సూతికాధ్యాయోనామ నవమః ॥౯॥
ఇది శ్రీ బృహత్పరాశర హోరాశాస్త్ర మందు సూతికాధ్యాయమను
నవమాధ్యాయము ముగిసెను. ॥౯॥

## అరిష్టాధ్యాయము ॥౧౦॥

పరాశర ఉవాచ,

ఆదౌ జన్మాజ్ఞతో విప్ర రిష్టాఽరిష్టం విచారయేత్,
తత స్తన్వాదిభావానాం జాతకస్య ఫలం వదేత్॥ ౧

తా॥ పరాశరులు చెప్పుచున్నారు.

ఓ మునిశ్రేష్ఠా! ప్రథమముగ జన్మలగ్నమునుబట్టి తాత్కాలిక గ్రహస్థితి సంబంధాదులవలన జాతకుని యొక్క అరిష్టములను, అరిష్ట భంగములను విచారించవలయును. పిమ్మట యా జాతకుని యొక్క తన్వాది ద్వాదశభావ ఫలములను గురించి బాగుగ యోచించి చెప్ప వలయును.

చతుర్వింశతివర్షాణాం యావ ద్గచ్ఛన్తి జన్మతః।
జన్మారిష్టం తు తావత్స్యా దాయుర్దాయం న చిన్తయేత్॥ ౨॥

తా॥ జననాది ఇరువది నాలుగు సం॥రములు పూర్తియగు పర్యంతము జన్మారిష్టము గలుగును. కనుక ఇరువది నాలుగు సం॥రముల పర్యంతమూ యుర్దాయము నిర్ణయించుట శక్యముకాదు.

షష్ఠాష్టరిఃఫగ శ్చంద్రః క్రూరైః ఖేటైశ్చ వీక్షితః।
జాతస్య మృత్యుద స్సద్య స్త్వష్టవర్షై శ్శుభేక్షితః॥ ౩॥

తా॥ జనన సమయమందు చంద్రుడు లగ్నమునుండి 6, 8, 12 భావములలో నెచ్చటనైన నుండి నైసర్గిక పాపులగు రవి, కుజ, శని, రాహు, కేతువులచే చూడబడినచో జాతకునకు సద్యఃకాలమందు అరిష్టముగలుగును. శుభగ్రహములచే కూడ చూడబడుచున్న యెడల ఎనిమిది సం॥రముల వరకు ఆయుర్దాయము పట్టును.

శశివన్మృత్యుదా సౌమ్యా శ్చే ద్వక్రాః క్రూరవీక్షితాః।
శిశో ర్జాతస్య మాసేన లగ్నే సౌమ్యవివర్జితే॥ ౪॥

తా॥ జన్మలగ్నము శుభగ్రహముల సంబంధము (సంబాధ పంచకము లేక సంబంధ త్రయము) లేనిదై యుండగ, శుభగ్రహములగు బుధ, గురు, శుక్రులు చంద్రునివలె 6,8,12 స్థానములలో వక్రించియుండగ, పాపులగు రవి, కుజ, శని; రాహు, కేతువులచే చూడబడిరేని యట్టి సమయమున జన్మించిన శిశువున కొక మాసమాయుర్దాయముపట్టును.

యస్య జన్మని ధీస్థా స్స్యుః సూర్యార్కిచన్ద్రభూమిజాః।
తస్య త్వాశు జనిత్రీచ భ్రాతాచ నిధనం వ్రజేత్॥ ౫॥

తా॥ జన్మలగ్నము నుండి పంచమ భావమందు రవి,శని,చంద్ర, కుజులున్నచో యాజాతకుని జననానంతరము శీఘ్రకాలములో తల్లి, సోదరుడు మరణించును.

పాపేక్షితో యుతో భౌమో లగ్నగో న శుభేక్షితః।
మృత్యుద స్త్వష్టమస్థోపి సౌరేణార్కేణ వా యుతః॥ ౬॥

తా॥ లగ్నమందు శుభగ్రహ వీక్షణములేని కుజుడు పాపులతో కూడినను, చూడబడినను, మరియు లగ్నమునకెనిమిదవ భావమందు రవితోగాని, శనితోగాని కుజుడు కలిసియున్నను. శిశువునకు శీఘ్రముగ మరణము సంభవించును.

చన్ద్రసూర్యగ్రహే రాహుశ్చంద్రసూర్యయుతో యది।
సౌరిభౌమేక్షితం లగ్నం పక్షమేకం న జీవతి॥ ౭॥

తా॥సూర్య, చంద్రుల గ్రహణ సమయమందులేక రాహువు, రవి చంద్రులతో కలసియున్న సమయమందుగాని శని, కుజులచే చూడబడు లగ్నమందు జన్మించు శిశువునకు 15 దినములా యుర్దాయము పట్టును.

వి॥ ఇట్టి యోగమందు బుట్టినవారికి రవి, చంద్రులకు రాహు సంబంధము 5 భా॥ల లోపుగ నుండవలయును. అంతకుమించిన దూరమున్నపుడు ఆయుర్దాయము బలముగ పట్టుచున్నది. మరియు రవి రాహువులుగాని, చంద్ర రాహువులుగాని కలసినప్పుడు, రాహువు రవికి, చంద్ర రాహువులు కలసినపుడు రాహువు చంద్రునకు అభిముఖముగ సంచరించుచుండవలయును. రవి చంద్ర భాగలనుదాటి వెనుకగనున్నప్పుడు కూడ యీ యోగము పట్టుటలేదని యను భవమువలన తెలియుచున్నది.

ఉదాహరణమునకు :- మకరలగ్నము, వృశ్చికమందు శని, వృషభమందు చంద్ర రాహువులు గలరు. ఈ జాతకములో లగ్నమును శని చూచుచుండెను. చంద్రుడు వృషభములో 15 భాగలోను, రాహువు వృషభములో 5 వ భాగలోనుగలరు. ఇక్కడ చంద్ర

రాహువులకు రాశిస్థితి మాత్రముగలదుగాని అరిష్టమును కలిగించుటకు తగిన సంబంధము లేదు. కనుక నీజాతకునకట్టి యరిష్టము సంభవించ లేదు.

కర్మస్థానే స్థితః సౌరిః శత్రుస్థానే కలానిధిః।
క్షితిజః సప్తమస్థానే సహ మాత్రా విపద్యతే॥ ॥౮॥

తా॥ జన్మలగ్నము నుండి దశమ భావమందు శని, శత్రుభావమందు చంద్రుడు సప్తమ భావమందు కుజుడు ఉన్నయెడల నా శిశువు తల్లితోకూడ శీఘ్రముగ మరణించును

లగ్నే భాస్కరపుత్రశ్చ నిధనే చంద్రమా యది।
తృతీయస్థో యదా జీవః స యాతి యమమన్దిరమ్॥

తా॥ జన్మలగ్నమందు శని, అష్టమమందు చంద్రుడు, తృతీయమందు గురుడు ఉండినేని యా సమయమున జన్మించిన శిశువు శీఘ్రముగ మరణించును.

హోరాయాం నవమే సూర్యః సప్తమస్థః శనైశ్చరః।
ఏకాదశే గురుః శుక్రో మాసమేకం స జీవతి॥ ॥౧౦॥

తా॥ జన్మలగ్నమందుగాని, నవమమందుగాని రవియుండగ, సప్తమ భావమందు శనియుండి, ఏకాదశమందు గురుడుగాని, శుక్రుడుగాని యున్నచో నా శిశువు 30 దినములు జీవించును.

వ్యయే సర్వే గ్రహా నేష్టాః సూర్యశుక్రేందురాహవః।
విశేషాన్నాశకర్తారో దృష్ట్యా వా భంగకారిణః॥ ॥౧౧॥

తా॥ ద్వాదశ భావమందు సర్వగ్రహములు అరిష్టకారకులగుదురు. సూర్య, శుక్ర, చంద్ర రాహువులు విశేషించి నష్టమును చేయుదురు. కాని యీ సూర్యాది గ్రహముల యొక్క దృష్టి యరిష్టభంగమును చేయును.

పాపాన్వితః శశీ ధర్మే ద్యూనలగ్నగతో యది।
శుభైరవీక్షితయుతః సద్యో మృత్యుప్రదః శిశోః॥ ॥౧౨॥

తా॥ పాపగ్రహములతో కూడిన చంద్రుడు లగ్న, సప్తమ, భాగ్యభావములలో నుండగ, శుభగ్రహవీక్షణ యుతులులేక పోయినచో శిశువునకు మరణము సంభవించును.

సన్ధ్యాయాం చన్ద్రహోరాయాం గండాంతే విధనాయవై ॥
ప్రత్యేకం చంద్రపాపైశ్చ కేన్ద్రగైః స్యాద్వినాశనమ్॥ ౧౩॥

తా॥ సంధ్యాకాలమందు జననమై, జన్మలగ్నము చంద్రహోరను పొంది, గండాంతమందు జన్మించిన శిశువు శీఘ్రముగ మరణించును. నాలుగు కేన్ద్రములలో నుండైనను చంద్ర, రవి, కుజశనులు (క్షీణ చంద్రునితో పాపగ్రహములగు రవి, కుజ శనులు 4 గురు) ఉన్నచో శిశువునకు శీఘ్రముగ మరణము సంభవించును.

వి॥ "వరాహమిహిరుడు" తన బృహజ్జాతకములో మొదటి యోగమును గురించి "సంధ్యాయాం హిమదీధితి హోరా పాపై ర్భాంత్యగతైర్నిధనాయ॥" అని చెప్పిన శ్లోకములో పాపగ్రహములగు రవి, కుజ, శనులు తామున్న రాశిలో తొమ్మిదవ నవాంశములో నుండవలెనని చెప్పినాడు. మహర్షి "గండాంతము"ను చెప్పినాడు.

రవేస్తు మండలార్ధాస్తాత్ సాయంసంధ్యా త్రినాడికా।
తథైవార్ధోదయాత్ పూర్వం ప్రాతస్సంధ్యా త్రినాడికా॥ ౧౪॥

సూర్యమండలార్ధాస్తమయము నుండి తరువాత 3 ఘడియలకాలమునకు సాయం సంధ్యయనియు, సూర్యమండలార్ధోదయమునకు పూర్వము 3 ఘడియల కాలము ప్రాతస్సంధ్యయనబడును.

చక్రపూర్వాపరార్ధేషు క్రూరసౌమ్యేషు కీటభే।
లగ్నగే నిధనం యాతి నాత్ర కార్యా విచారణా॥ ౧౫॥

రాశిచక్ర పూర్వార్ధమందు (దశమ భావమునుండి చతుర్థభావ పర్యంతముగల 6 రాశులు) క్రూర గ్రహములగు రవి కుజ శనులుండి, చక్రము యొక్క అపరార్ధమందు (చతుర్థభావము మొదలు దశమ

భావపర్యంతము) శుభగ్రహములగు బుధ గురు, శుక్ర. పూర్ణచంద్రు లుండగ, కర్కటకము లగ్నమైనచో నా జాతకుడు శీఘ్రముగ మరణించును.

వి॥ "వరాహమిహిరుడు" "బృహజ్జాతకము"లో

వక్రోస్య పూర్వాపరభాగగేషు క్రూరేషు సౌమ్యేషు చ కీటలగ్నే।
శీఘ్రం వినాశం సముపైతి జాతః॥  అనెడి 8 అధ్యాయము 2 శ్లోకములో

పరాశరునిచే చెప్పబడిన భావమును యథాతథముగ చెప్పియున్నాడు. ఈ శ్లోకవ్యాఖ్యానములో "భట్టోత్పలుడు" కీటశబ్దమునకు కర్కటక వృశ్చికములని వివరించి బాదరాయణ వచనమును నుదహరించెను.

పూర్వాపర భాగ గతైః శుభాశుభైః రలిని కర్కటే లగ్నే।
జాతస్య శీఘ్రమరణం వద్యః కథయన్తి యవనేంద్రాః॥

వ్యయశత్రుగతైః క్రూరైః ర్మృత్యుర్ద్రవ్యగతైః రపి॥
పాపమధ్యగతే లగ్నే సత్యమేవ మృతిం వదేత్॥  ౧౬॥

తా॥ క్రూర గ్రహములగు రవి కుజ శని రాహు కేతు క్షీణ చంద్రులు జన్మలగ్నమునుండి షష్ఠవ్యయభావములలోగాని, ద్వితీయాష్టమభావములలోగాని యున్నచో మృత్యువుగలుగును. జన్మలగ్నమునకు యిరుపార్శ్వములందు పాపగ్రహములున్నను నిశ్చయముగ మరణము సంభవించును.

లగ్నసప్తమగాః పాపాః చంద్రోఽపి క్రూరసంయుతః।
యదా త్వవీక్షితః సౌమ్యైః శీఘ్రం మృత్యుర్భవేత్తదా॥  ౧౭॥

లగ్న సప్తమములలో పాపులుండి చంద్రుడు కూడ పాపగ్రహములతో కలసియుండి శుభగ్రహములచే చూడబడనివాడైనచో శీఘ్రముగ మృత్యువు గలుగును.

వి॥ వరాహమిహిరుడు "బృహజ్జాతకము"8 వ అధ్యాయ శ్లోకములో

పాపా వుదయాస్తగతౌ క్రూరేణ యుతశ్చ శశీ।
దృష్టశ్చ శుభైర్న యదా మృత్యుశ్చ భవే దచిరాత్॥ అని

పరాశరుల యభిప్రాయమునే వ్యక్తపరచినాడు.

ఇచ్చట చంద్రుడు రవితో కలయుటకంటె కుజ, శనులతో కలయుట ముఖ్యము. లగ్నసప్తమములలో పాపులుండగ, చంద్రుడు వేరొక ప్రదేశమందు పాపగ్రహముతో (కుజ, శనులలో నెవరితోనైనను) కలసియుండుట చేత నచిరకాలములో మరణము సంభవించునని నుట యుక్తము.

క్షీణే శశి లగ్నస్థే పాపైః కేన్ద్రాష్టసంస్థితైః।
యో జాతో మృత్యు మాప్నోతి స విప్రేశః న సంశయః॥ ౧౮॥

ఓ విప్రశ్రేష్ఠుడా! క్షీణచంద్రుడు లగ్నమందు, పాపగ్రహములగు రవి, కుజశనులు(రాహు కేతువులు) కేంద్రములందుగాని, అష్టమమందు గాని, (కేంద్రాష్టమములలోగాని) యుండగ బుట్టిన శిశువు శీఘ్రముగ మరణించును.

వి॥ ఈ యోగమందు కూడ శుభగ్రహవీక్షణముండ రాదని గ్రహించుట యుక్తము.

పాపయో ర్మధ్యగ శ్చన్ద్రో లగ్నాష్టాన్త్యసప్తగః।
అచిరా న్మృత్యు మాప్నోతి యో జాత స్స శిశు స్తదా॥ ౧౯॥

తా॥ చంద్రుడు పాపగ్రహ మధ్యగతుడై లగ్న, అష్టమ, వ్యయ, సప్తమ భావములలో నున్నచో శీఘ్రముగ శిశువు మరణించును.

వి॥ లగ్నమందు చంద్రుడున్నప్పుడు 2, 12 భావములలోను, 7వ యింటిలో నున్నప్పుడు 6 8 భావములలోను, అష్టమభావములో నున్నప్పుడు 7, 9 భావములలోను, 12వ భావములో నున్నప్పుడు 1, 11 భావములలోను ప్రత్యేక పాపగ్రహములు మాత్రమే యుండ

వలయును. లగ్నమునకుగాని, చంద్రునకుగాని ఏ శుభగ్రహ వీక్షణ మున్నను ఈ యోగమునకు భంగముగలుగును.

> పాపద్వయ మధ్యగతే చంద్రే లగ్నసమాశ్రితే।
> సప్తాష్టమేన పాపేన మాత్రా సహ మృత శ్శిశుః॥ ౨౦॥

తా॥ చంద్రుడు లగ్నభావమందుండి పాపగ్రహములు 2, 12 భావములలో నుండగ, 7, 8 భావములలో పాపగ్రహములున్నచో తల్లితోకూడ శిశువు మరణించును.

వి॥ ఈ శ్లోకమందు మాతృమరణము కూడ నిరూపింపబడినది. ఈ యోగము పట్టినప్పుడు మాతృకారక, భావాధిప, భావములకు ఏ శుభగ్రహ వీక్షణమున్న ఉండరాదు.

భట్టోత్పలుడు మాత్రము బృహజ్జాతక వ్యాఖ్యలో నిట్లు వ్రాసినాడు.

> "అథ నిర్దిష్టయోగస్థ శ్చేచ్చంద్రమాః శుభై ర్దృశ్యతే బలిభి స్తదా తస్యైవ మరణం న మాతు రితి॥

అనగా పూర్వోక్త యోగమందు చంద్రునకు బలవంతులైన శుభులయొక్క దృష్టియున్నచో మాతృమరణము సంభవించదని, జాతకుడు మాత్రము మరణించునని యు వ్రాసియున్నాడు. కొన్ని జాతకములలో నిట్టి యోగము సంభవించినప్పుడు ఇతరులచే పోషింపబడుటయో, లేక దత్తత యోగమును పొందుటయో సంభవించుచున్నది. కనుక అనుభవముచే నీ యోగము బాగుగ పరిశీలింపదగియున్నది.

> శనైశ్చరార్కభౌమేషు రిఃఫధర్మాష్టమేషు చ।
> శుభై రవీక్ష్యమాణేషు యో జాతో నిధనం గతః॥ ౨౧॥

తా॥ జన్మలగ్నము నుండి శని, రవి, కుజులు క్రమముగ 12, 9, 8 భావములలో నుండి, శుభగ్రహ వీక్షణము లేనివారైన యెడల శిశువు శీఘ్రములో మరణించును.

యద్ద్రేక్కాణే చ జామిత్రే యస్య స్యాద్దారుణో గ్రహః।
క్షీణచంద్రో విలగ్నస్థో సద్యో హరతి జీవితమ్॥ ౨౨॥

జనన సమయమున సప్తమభావ ద్రేక్కాణమందు పాపగ్రహముండగ, లగ్నమందు క్షీణచంద్రుడున్నచో శిశువు శీఘ్రముగ మరణించును.

ఆపోక్లిమస్థితా సర్వే గ్రహా బలవివర్జితాః।
షణ్మాసం వా ద్విమాసం వా తస్యాయుః సముదాహృతమ్॥ ౨౩॥

సర్వగ్రహములు బలహీనములై ఆపోక్లిమ (3,6,9,12) స్థానములలో నున్నచో నా శిశువునకు 2 మాసములుగాని 6 మాసములుగాని ఆయుర్దాయముపట్టును.

## —: మాతృకష్టవిచారము :—

త్రిభిః పాపగ్రహైః సూతౌ చంద్రమా యది దృశ్యతే।
మాతృనాశో భవేత్తస్య శుభదృష్టే శుభం భవేత్॥ ౨౪॥

తా॥ జనన సమయమున చంద్రుడు రవి, కుజ, శనులు 3 గ్గురిచే చూడబడుచుండగ, శుభగ్రహవీక్షణము లేనియెడల మాతృమరణము శీఘ్రములో జరుగును. శుభగ్రహ వీక్షణముండెనేని శుభముచే కూరుననియు, తల్లికి అరిష్టములు మాత్రము గలుగుననియు చెప్పవలయును.

ధనే రాహు ర్బుధః శుక్రః సౌరి స్సూర్యో యదా స్థితః।
తస్య మాతు ర్భవే న్మృత్యు ర్మృతే పితరి జాయతే॥ ౨౫॥

తా॥ జన్మలగ్నమునకు ద్వితీయములో రాహు, బుధ, శుక్ర, శని, సూర్యులున్నచో తల్లికి మరణముగలుగును. తండ్రి మరణానంతరము జననమగును.

శ్లో॥ పాపా త్సప్తమరంధ్రస్థే చంద్రే పాపసమన్వితే।
బలిభిః పాపకైర్ద్రుష్టే జాతో భవతి మాతృహా॥ ౯౬॥

తా॥ పాపగ్రహముసుండి 7, 8 స్థానములలో నెండైనను చంద్రుడుండి పాపగ్రహముతో చేరినను, బలవంతులైన పాపగ్రహములచే చూడబడినను జాతకుని తల్లికి మరణము కలుగును.

శ్లో॥ ఉచ్చస్థో వాథ నీచస్థః సప్తమస్థో యదా రవిః।
పానహీనో భవే ద్బాలం అజాక్షీరేణ జీవతి॥ ౯౭॥

తా॥ జన్మలగ్నము నుండి సప్తమమందు రవి యుచ్ఛగతుడైనను, నీచగతుడైనను, మాతృస్తన్యము లేనివాడై, మేకపాలతో జీవించును.

(మాతృస్తన్యము లేనివాడై అన్యక్షీరములచే పోషింపబడునని భావము)

శ్లో॥ చంద్రా చ్చతుర్థగః పాపో రిపుక్షేత్రే యదా భవేత్।
తదా మాతృవధం కుర్యాత్ కేంద్రే యది శుభో న చేత్॥ ౯౮॥

తా॥ చంద్రునకు చతుర్థములో శత్రుక్షేత్రమునందు పాపగ్రహముండగ, కేంద్రములందు శుభులు లేనిచో మాతృమరణము సంభవించును.

(చంద్రునకు కేంద్రములందు అని గ్రహింపవలయును.)

శ్లో॥ ద్వాదశే రిపుభావే చ యదా పాపగ్రహో భవేత్।
తదా మాతు ర్భయం విద్యా చ్చతుర్థే దశమే పితుః॥ ౯౯॥

తా॥ జనన లగ్నమునుండి షష్ఠభావమందుగాని, ద్వాదశ (వ్యయ) భావమందుగాని పాపగ్రహమున్నచో తల్లికి కష్టముకలుగును. జననలగ్నము నుండి చతుర్థభావములోగాని, దశమ భావములోగాని పాపగ్రహమున్నచో తండ్రికి కష్టముకలుగును.

శ్లో॥ లగ్నే క్రూరో వ్యయే క్రూరో ధనే సౌమ్య స్తథైవ చ।
సప్తమే భవనే క్రూరః పరివారక్షయంకరః॥ ౧౦౦॥

తా॥ లగ్నమందొక పాపగ్రహము, వ్యయమందొక పాపగ్రహము, ధనభావమందు శుభగ్రహము, సప్తమభావమందొక పాపగ్రహము ఉన్నచో పరివారక్షయముగల జాతకుడగును.

శ్లో॥ లగ్నస్థే చ గురౌ సౌరే ధనే రాహౌ తృతీయగే।
ఇతి చేజ్జన్మకాలే స్యాన్మాతా తస్య న జీవతి॥ ౩౧

తా॥ జన్మలగ్నమందు గురుడు, ధనభావమందు శని, తృతీయభావమందు రాహువుగల జాతకునకు తల్లి శీఘ్రముగా మరణించును.

శ్లో॥ క్షీణచంద్రాత్ త్రికోణస్థైః పాపైః సౌమ్యవివర్జితైః॥
మాతా పరిత్యజేద్బాలం షణ్మాసాచ్చ న సంశయః॥ ౩౨॥

తా॥ జన్మ సమయమునకు చంద్రుడు క్షీణచంద్రుడై యుండగ, వానికి త్రికోణ రాశులలో పాపులుండి శుభగ్రహ సంబంధము లేనివారయ్యేనేని యా జాతకుడు జననాది ఆరు మాసముల పిమ్మట తల్లిచే విడువబడును.

శ్లో॥ ఏకాంశకస్థౌ మందారౌ యత్ర కుత్ర స్థితౌ యదా।
శశికేంద్రగతౌ తౌ వా ద్విమాతృభ్యాం న జీవతి॥ ౩౩॥

తా॥ శని, కుజుడు ఏకాంశ (ఒకేనవాంశ) మందు, ఎచ్చటనున్నను, అట్టి శని కుజులు చంద్రునకు కేంద్రములో నున్న యెడల నా జాతకుడు ఇద్దరు తల్లులు గలవాడయ్యును జీవించడు.

(ఒక తల్లి జననము నిచ్చునది. రెండవది పోషణనిచ్చునది.)

## అథపితృకష్టవిచారః

## (పితృకష్ట విచారణము)

శ్లో॥ లగ్నే మందో మదే భౌమః షష్ఠస్థానే చ చంద్రమాః।
ఇతి చేజ్జన్మకాలే స్యాత్ పితా తస్య న జీవతి॥ ౩౪॥

తా॥ లగ్నమందు శని, సప్తమభావమందు కుజుడు, షష్ఠభావమందు చంద్రుడు ఉన్నయెడల నా జాతకుని తండ్రి మరణించును.

శ్లో॥ లగ్నే జీవో ధనే మందరవిభౌమబుధా స్తథా।
వివాహసమయే తస్య బాలస్య మ్రియతే పితా॥ ౩౫॥

తా॥ లగ్నమందు గురుడు, ద్వితీయ భావమందు రవి కుజ బుధ శనులు కూడియుండిరేని యా జాతకుని వివాహసమయమందు తండ్రి మరణించును.

శ్లో॥ సూర్యః పాపేన సంయుక్తో హ్యథవా పాపమధ్యగః।
సూర్యా త్సప్తమగః పాప స్తథా పితృవధో భవేత్॥ ౩౬

తా॥ సూర్యుడు పాపగ్రహములతో కూడినను, పాపగ్రహ మధ్య గతుడైనను, సూర్యునకు సప్తమములో పాపగ్రహమున్నను, పితృమరణము గలుగును. (పాపగ్రహములగు కుజ శనులను మాత్రమే గ్రహించవలెను. మరియు రవికి ముందు శని, వెనుక కుజుడుండుట ముఖ్యముగ తెలియవలెను)

శ్లో॥ సప్తమే భవనే సూర్యః కర్మస్థో భూమినందనః।
రాహు ర్వ్యయే చ యస్యైవ పితా కష్టేన జీవతి॥ ౩౭

తా॥ సప్తమభావమందు సూర్యుడు, దశమమందు కుజుడు, వ్యయమందు రాహువుగల జాతకునకు తండ్రి కష్టముతో జీవించును.

శ్లో॥ దశమస్థో యదా భౌమః శత్రుక్షేత్రసమాశ్రితః।
మ్రియతే తస్య జాతస్య పితా శీఘ్రం న సంశయః॥ ౩౮

తా॥ కుజుడు దశమములో శత్రుక్షేత్రమందుండెనేని యా జాతకుని తండ్రి శీఘ్రముగ మరణమును పొందును.

శ్లో॥ రిపుస్థానే యదా చంద్రో లగ్నస్థానే శనైశ్చరః।
కుజశ్చ సప్తమే స్థానే పితా తస్య న జీవతి॥ ౩౯॥

తా॥ జన్మలగ్నమునుండి షష్ఠభావములో చంద్రుడు, లగ్నమందు శని, సప్తమమందు కుజుడు ఉన్నయెడల నా జాతకునకు తండ్రి జీవించడు.

శ్లో॥ భౌమాంశకస్థితే భానౌ శనినా చ విరీక్షితే।
ప్రాగ్జన్మనో నివృత్తిః స్యాత్ మృత్యుర్వాపి శిశోః పితుః॥ ౪౦॥

తా॥ సూర్యుడు కుజనవాంశమును పొంది, శనిచే చూడబడుచుండెనేని, జాతకుని జననమునకు పూర్వము తండ్రి విరక్తుడై గృహమును విడచును. లేదా మరణమును పొందును.

శ్లో॥ చతుర్థే దశమే పాపౌ ద్వాదశే చయదా స్థితౌ।
పితరం మాతరం హత్వా దేశాద్దేశాంతరం వ్రజేత్॥ ౪౧॥

తా॥ చతుర్థ భావమందుగాని, ద్వాదశభావమందుగాని యిద్దరు పాపగ్రహములున్నచో నా జాతకుడు మాతాపితరులను పోగొట్టుకొని, దేశాంతరము వెళ్ళిపోవును.

వి॥ (మాతాపితరులను విడచి దేశాంతర గతుడగునని కూడ చెప్పవచ్చును.)

శ్లో॥ రాహుంజీవౌ రిపుక్షేత్రే లగ్నే వాథ చతుర్థకే।
త్రయోవింశతిమే వర్షే పుత్ర స్తాతం న పశ్యతి॥ ౪౨॥

తా॥ రాహువు, గురుడు లగ్నమందుగాని, చతుర్థమందుగాని శత్రుక్షేత్రగతులై యుండిరేని, జాతకుడు తన యొక్క 23వ సం॥ర మందు తండ్రిని విడచును.

(ఇట్టి యోగమందు 23వ సం॥రములో పితృమారకము జరుగుననియు కూడ చెప్పవచ్చును.)

శ్లో॥ భానుః పితా చ జంతూనాం చంద్రో మాతా తథైవ చ।
పాపదృష్టియుతో భానుః పాపమధ్యగతోఽపివా॥ ౪౩॥
పితృరిష్టం విజానీయాత్ శిశో ర్జాతస్య నిశ్చితమ్।
భావోః షష్ఠాష్టమస్థైః పాపైః సౌమ్యవివర్జితైః॥
శుభభావగతై ర్వాపి పితృరిష్టం వినిర్దిశేత్॥ ౪౪॥

తా॥ సర్వజంతువులకు సూర్యుడు జనకుడు. చంద్రుడు జనని. సూర్యుడు పాపదృష్టిగలవాడైనను, పాపగ్రహ మధ్యగతుడైనను, తండ్రి కరిష్టముగలుగును. సూర్యునకు 6, 8 స్థానములలో పాపులుండి శుభగ్రహ సంబంధములేనిచో పితరిష్టము గలుగును. లేక రవికి 4వ భావమందు పాపగ్రహములున్నను పితరిష్టముగలుగును.

ఇత్యరిష్టాధ్యాయః

## అరిష్టభంగాధ్యాయము ॥౧౧॥

పరాశర ఉవాచ।

శ్లో॥ ఇత్యరిష్టం మయా ప్రోక్తం తద్భంగం చాపి కథ్యతే।
యత్సమాలోచ్య జాతానాం రిష్టాఽరిష్టం వదే ద్బుధః॥ ౧॥

తా॥ ఓ మైత్రేయా! నాచే అరిష్ట విషయము చెప్పబడినది. ఇప్పుడరిష్టభంగము చెప్పబడుచున్నది. జాతకులకు అరిష్టములను, అరిష్టభంగములను బాగుగ నాలోచించి ఫలములను చెప్పవలెను. అని పరాశరులు పలికిరి.

శ్లో॥ ఏకోఽపి జ్ఞార్యశుక్రాణాం లగ్నాత్కేంద్రగతో యది।
అరిష్టం నిఖిలం హంతి తిమిరం భాస్కరో యథా॥ ౨॥

తా॥ జన్మలగ్నమునకు కేంద్రములలో గురు బుధ శుక్రులలో నెవ్వడైనను బలవంతుడై యుండెనేని సర్వారిష్టములను, సూర్యుడు చీకటిని పోగొట్టినట్లు పోగొట్టును.

ఏక ఏవ బలీ జీవో లగ్నస్థో రిష్టసంచయమ్।
హన్తి పాపక్షయం భక్త్యా ప్రణామ ఇవ శూలినః॥ ౩॥

తా॥ లగ్నమందు గురుడు సంపూర్ణ బలుడై యుండెనేని, భక్తితో నమస్కరించబడిన శివుడు పాపములను హరించినట్లు సర్వారిష్టములను, హరించును.

శ్లో॥ ఏక ఏవ విలగ్నేశః కేంద్రసంస్థో బలాన్వితః।
అరిష్టం నిఖిలం హంతి పినాకీ త్రిపురం యథా॥ ४॥

తా॥ జన్మలగ్నాధిపతి సంపూర్ణ బలవంతుడై కేంద్రమందున్న యెడల, ఈశ్వరుడు త్రిపురాసురుని సంహరించినట్లు సర్వారిష్టములను హరించును. జాతకునకు అరిష్టములు నివారించును.

శ్లో॥ శుక్లపక్షే క్షపాజన్మ లగ్నే సౌమ్యనిరీక్షితే।
విపరీతం కృష్ణపక్షే తథా రిష్టవినాశనమ్॥ ౫॥

తా॥ శుక్లపక్షమందు రాత్రి జన్మించినపుడు, కృష్ణపక్షమందు పగలు జన్మించినపుడు, లగ్నము శుభగ్రహములచే చూడబడెనేని సర్వారిష్టములు నివారించును.

శ్లో॥ వ్యయస్థానే యదా సూర్య స్తులాలగ్నే తు జాయతే।
జీవే త్స శతవర్షాణి దీర్ఘాయు ర్బాలకో భవేత్॥ ౬॥

తా॥ జన్మలగ్నము తులారాశియై వ్యయభావములో సూర్యు డుండెనేని యా జాతకుడు నూరు సం॥రములు జీవించును.

శ్లో॥ గురుభౌమౌ యదా యుక్తౌ గురుదృష్టోఽథవా కుజః।
హత్వాఽరిష్ట మశేషం చ జనన్యాః శుభకృ ద్భవేత్॥ ౭॥

తా॥ గురు కుజులు కలసియున్నను. కుజుడు గురునిచే చూడబడుచున్నను, సర్వారిష్టములు నివారించును. తల్లికి సుఖముచేకూరును.

శ్లో॥ చతుర్థదశమే పాపః సౌమ్యమధ్యే యదా భవేత్।
పితుః సౌఖ్యకరో యోగః శుభైః కేంద్రత్రికోణగైః॥ ౮॥

తా॥ చతుర్థ, దశమములలో పాపగ్రహముండి, శుభగ్రహముల మధ్యలో నుండగ, కేంద్ర త్రికోణములలోనితర శుభగ్రహములున్నయెడల, తండ్రికి సుఖము చేకూరును.

శ్లో॥ సౌమ్యాంతరగతైః పాపైః శుభైః కేంద్రత్రికోణగైః।
సద్యో నాశయతేఽరిష్టం తద్భావోత్థఫలం న తత్।

తా॥ పాపగ్రహములు శుభగ్రహమధ్యగతులై, కేంద్రత్రికోణములలో శుభులున్న యెడల యరిష్టములన్నియు నశించును. మరియు పాపగ్రహము లే భావమందుండదగో యా భావ సంబంధమైన దోష ఫలములు గూడ నశించును.

ఇతి బృహత్పారాశర హోరాశాస్త్రే అరిష్టభంగాధ్యాయః ॥౧౧॥
ఇది బృహత్పారాశర హోరాశాస్త్రమందరిష్టభంగాధ్యాయము ముగిసెను.॥౧౧

## భావవివేకాధ్యాయః ॥౧౨॥

మైత్రేయ ఉవాచ :-

శ్లో॥ అరిష్టం తత్ప్రభంగంచ శ్రుతం త్వత్తో మయా మునే।
కస్మాద్భావాత్ ఫలం కిం కిం విచార్య మితి మే వద॥ ౧

తా॥ ఓ మహర్షీ! నీ వలన యరిష్టములను. యరిష్టభంగములను వినియుంటిని. ఇప్పుడు ఏఏ భావముల వలన నేయే ఫలములను విచారించవలెనను. విషయమును నాకు తెలియజేయుము. అని మైత్రేయుడు పరాశరులను ప్రశ్నించెను.

పరాశర ఉవాచ;

శ్లో. దేహం రూపం చ జ్ఞానం చ వర్ణం చైవ బలాబలమ్,
సుఖం దుఃఖం స్వభావం చ లగ్నభావా న్నిరీక్షయేత్. ౨

పరాశరులు చెప్పుచున్నారు.

తా॥ లగ్న (తను) భావమువలన జాతకుని యొక్క దేహము, రూపము, జ్ఞానము, వర్ణము, బలము, దౌర్బల్యము, సుఖము, దుఃఖము, స్వభావము ఈ విషయములను విచారించవలెను.

శ్లో. ధనధాన్యం కుటుంబాంశ్చ మృత్యుజాల మమిత్రకమ్,
ధాతురత్నాదికం సర్వం ధనస్థానా న్నిరీక్షయేత్. ౩

తా॥ ద్వితీయ (ధన) భావమువలన, ధనము, ధాన్యము, కుటుంబము, మృత్యువు, శత్రువు, ధాతువులు, రత్నాదికము మొదలగు వానిని విచారించవలెను.

శ్లో. విక్రమం భృత్యభ్రాత్రాది చోపదేశ ప్రయాణకమ్,
పిత్రోర్వై మరణం విజ్ఞో దుశ్చిక్యా చ్చ నిరీక్షయేత్. ౪

తా॥ తృతీయ (సహజ) భావమువలన పరాక్రమము, సేవకులు, సోదర, సోదరీవర్గము, సన్నిహిత ప్రదేశ ప్రయాణము, పితృమరణము, వీనిని తెలుసుకొనవలెను.

శ్లో॥ వాహనాన్యథ బంధూంశ్చ మాతృసౌఖ్యాదికాన్యపి।
నిధిం క్షేత్రం గృహం చాపి చతుర్థా త్పరిచింతయేత్॥ ౫

తా॥ చతుర్థ భావమువలన, వాహనములు, బంధువులు, మాతృ సౌఖ్యాదికము, (తల్లియొక్క ఆరోగ్యము, ఆయుర్దాయము మొదలగునవి) నిధులు, క్షేత్రములు (భూములు) గృహములు మొదలగు వానిని పరిశీలించవలెను.

శ్లో॥ యంత్రమంత్రౌ తథా విద్యాం బుద్ధేశ్చైవ ప్రబంధకమ్।
పుత్రరాజ్యాపభ్రంశాదీన్ పశ్యేత్ పుత్రాలయా ద్బుధః॥ ౬

తా॥ పుత్ర (పంచమ) భావమువలన యంత్రములు, మంత్రదీక్ష, విద్య, బుద్ధి, ప్రబంధరచనాదికము, పుత్రులు, రాజ్యలాభము, పదవీచ్యుతి మొదలగు విషయములను పరీక్షించవలెను.

శ్లో॥ మాతులాంతకశంకానాం శత్రూంశ్చైవ వ్రణాదికాన్।
సపత్నీమాతరం చాపి షష్ఠభావా న్నిరీక్షయేత్॥ ౭

శ్లో॥ షష్ఠ భావమువలన మేనమామలు, మృత్యుశంక, శత్రువులు, వ్రణములు, రోగములు సవతితల్లి, ఈ విషయములను పరీక్షించవలెను.

శ్లో॥ జాయా మర్గప్రయాణం చ వాణిజ్యం నష్టవీక్షణమ్।
మరణం చ స్వదేహస్య జాయాభావా న్నిరీక్షయేత్ ౮

తా॥ జాయా (సప్తమ) భావమువలన, భార్య, మార్గప్రయాణము, వాణిజ్యము, నష్టవస్తు విషయము, ఆత్మమరణములను విచారించవలెను.

శ్లో॥ ఆయూరణం రిపుం చాపి దుర్గం మృతధనం తథా।
గత్యనూకాదికం సర్వం పశ్యే ద్రంధ్రా ద్విచక్షణః॥ ౯

తా॥ అష్టమ భావమువలన ఆయువు, రణము, దుర్గము, మృతధనము, గత్యనూకాదికము(మరణము, లోకాంతరగమనము.లోకాంతరాగమనము మొదలగు విషయములు) ఇత్యాదులను విచారించవలెను

శ్లో॥ భాగ్యం శ్యాలం చ ధర్మం చ భ్రాతృపత్న్యాదికాం స్తథా।
తీర్థయాత్రాదికం సర్వం ధర్మస్థానా న్నిరీక్షయేత్॥ ౧౦

తా॥ తొమ్మిదవ భావమువలన భాగ్యము, భార్యాసోదరుడు, ధర్మము, సోదరుల భార్యలు, వారియొక్క శుభాశుభములు, తీర్థయాత్రలు మొదలగు సర్వవిషయములను విచారించవలెను.

శ్లో॥ రాజ్యం చాకాశవృత్తించ మానం చైవ పితు స్తథా।
ప్రవాసస్య ఋణస్యాపి వ్యోమస్థానా న్నిరీక్షయేత్॥ ౧౧

తా॥ దశమ భావమువలన, రాజ్యము, ఆకాశవృత్తాంతము, గౌరవము, కీర్తి, పితృసుఖము, ప్రవాసము, ఋణములను పరీక్షించవలెను.

వి. పితృవిషయమును నవమభావమువలన విచారించవలెనని కొందఱి మతము.

శ్లో॥ నానావస్తుభవస్యాపి పుత్రజాయాదికస్య చ।
ఆయం వృద్ధిం పశూనాం చ భవస్థానా న్నిరీక్షయేత్॥ ౧౨

తా॥ ఏకాదశభావమువలన, వివిధ వస్తువులయొక్క సంపత్తిని పుత్రునిభార్య, ఆదాయము, పశువృద్ధి వీనిని తెలుసుకొనవలయును.

శ్లో॥ వ్యయం చ వైరివృత్తాంత రిఃఫ మంత్యాదికం తథా।
వ్యయా చ్చైవ హి జ్ఞాతవ్య మితి సర్వత్ర బుద్ధిమాన్॥ ౧౨

తా॥ వ్యయభావమువలన, ధనవ్యయము, శత్రువులయొక్క వృత్తాంతము, రిఃఫము జన్మాంతమందలి విషయములను తెలుసుకొనవలయును.

భావఫలశుభా ఽశుభవివేచనము.

శ్లో॥ యో యోభావః శుభై ర్యుతో దృష్టో భావో వా పతిదృష్టయుక్।
యువా ప్రబుద్ధో రాజ్యస్థః కుమారో వాపి యత్పతిః॥ ౧౩
తదీక్షణవశా త్తత్తద్భావసౌఖ్యం వదే ద్బుధః।
యద్యద్భావపతి ర్నష్ట త్రికేశాద్యై శ్చ సంయుతః॥ ౧౪
భావం న వీక్షతే సమ్యక్ సుప్తో వృద్ధో మృతో ఽథవా।
పీడితో వాఽస్య భావస్య ఫలం నష్టం వదే ద్బుధః॥ ౧౫

తా॥ ఏయే భావములు శుభగ్రహాములచేగాని, తమయధిపతులచేగాని, కలసిగాని, చూడబడుచుగాని యుండునో ఆ భావములకు వృద్ధి గలుగును. మరియు భావాధిపతి యౌవన, ప్రబుద్ధ, కుమారావస్థలను బొంది తన భావమును చూచినను, భావాధిపతి భావము నుండి దశమ స్థానమందున్నను, అట్టివానిచే భావము చూడబడినను నాభావము వృద్ధిపొందును. ఆ భావమువలన జాతకుడు సుఖమును పొందును.

ఏభావాధిపతి బలహీనుడైగాని, షష్ఠాష్టమవ్యయాధిపతులతో కలసిగాని, దుష్టస్థానములలోనుండిగాని భావమును చూచునో, యా భావమునకు వృద్ధికలుగదు. మరియు భావాధిపతి సుప్త, వృద్ధ, మృత పీడితములనెడి యవస్థలను బొంది తన భావమును చూచినచో నా భావము నష్టమైనదని చెప్పవలయును.

ఇతి బృహత్పరాశర హోరాశాస్త్రే - భావవివేకాధ్యాయః ॥౧౨॥
ఇది బృహత్పరాశర హోరాశాస్త్రమందు భావవివేకాధ్యాయము ముగిసెను.౧౨

## అథ తనుభావాధ్యాయః॥ ౧౩॥

శ్లో॥ సపాపో దేహపోఽష్టారివ్యయగో దేహసౌఖ్యహృత్।
కేంద్రే కోణే స్థితోఽఙ్గేశః సదా దేహసుఖం దిశేత్॥ ౧

తా॥ తను భావాధిపతి పాపగ్రహములతో కూడినను, షష్ఠాష్టమ వ్యయ భావములోనున్నను దేహసుఖమును నశింపచేయును. కేంద్ర కోణములలో నున్నచో దేహసుఖమును కలిగించును.

శ్లో॥ లగ్నపోఽస్తంగతో నీచే శత్రుభే రోగకృద్భవేత్।
శుభాః కేంద్రత్రికోణస్థా సర్వరోగహరాః స్మృతాః॥ ౨

తా॥ లగ్నాధిపతి యస్తమించినను, నీచ, శత్రుస్థానములలోనున్నను, రోగములు కలుగును. శుభగ్రహములు జన్మలగ్నము నుండి కేంద్ర త్రికోణములలో నున్నయెడల సర్వరోగములను హరింతురని చెప్పబడెను.

శ్లో॥ లగ్నే చంద్రే ఽథవా క్రూరగ్రహైర్దృష్టేఽథవా యుతే।
శుభదృష్టివిహీనే చ జంతోర్దేహసుఖం న హి॥ ౩

తా॥ జన్మలగ్నముగాని, చంద్రుడుగాని క్రూరగ్రహములచే చూడబడినను, కలసియున్నను, ఏ శుభగ్రహము చేతను చూడబడకుండెనేని యా జాతకునకు దేహసుఖముండదు.

శ్లో॥ లగ్నే సౌమ్యే సురూపః స్యాత్ క్రూరే రూపవివర్జితః।
సౌమ్యఖేటైర్యుతే దృష్టే లగ్నే దేహసుఖాన్వితః॥ ౪

తా॥ లగ్నమందు శుభగ్రహమున్నచో రూపవంతుడగును. పాపగ్రహమున్నచో కురూపి యగును. లగ్నము శుభగ్రహములతో కూడినను, చూడబడినను దేహసౌఖ్యము గలవాడగును.

శ్లో॥ లగ్నేశో జ్ఞో గురుర్వాఽపి శుక్రో వా కేంద్రకోణగః।
దీర్ఘాయుర్ధనవాన్ జాతో బుద్ధిమాన్ రాజవల్లభః॥ ౫

తా॥ లగ్నాధిపతి, బుధుడు, గురుడు, శుక్రుడు వీరిలో నెవరైనను కేంద్రకోణములలో నున్నచో నా జాతకుడు దీర్ఘాయువు, ధనము, బుద్ధి వైశద్యము ప్రభుప్రీతి గలవాడగును.

వి॥ కొందఱి యభిప్రాయములో లగ్నాధిపతి కేంద్రకోణములలో నుండెనేని దీర్ఘాయువును, బుధుడుండెనేని ధనమును గురుడు డెనేని బుద్ధివైశద్యమును శుక్రుడుండెనేని ప్రభుప్రీతిని పొందునని చెప్పవలె ననుచున్నారు.

శ్లో॥ లగ్నేశే చరరాశిస్థే శుభగ్రహనిరీక్షితే।
కీర్తిశ్రీమాన్ మహాభోగీ దేహసౌఖ్యసమన్వితః॥ ౬

తా॥ లగ్నాధిపతి చరరాశియందుండి శుభగ్రహములచే చూడ బడినచో నా జాతకుడు కీర్తి, ధనము, భోగము, దేహసౌఖ్యము గల వాడగును.

శ్లో॥ బుధో జీవోఽథవా శుక్రో లగ్నే చంద్రసమన్వితః।
లగ్నాత్కేంద్రగతో వాఽపి రాజలక్షణసంయుతః॥ ౭

తా॥ జన్మలగ్నమందు బుధుడుగాని, శుక్రుడుగాని చంద్రునితో కలసి యున్నను, లేక లగ్నమునుండి కేంద్రములలోనున్నను రాజలక్షణములు గలవాడగును.

శ్లో॥ వసౌరే వకుజే వాపి లగ్నే మేషే వృషే హరౌ।
రాశ్యంశసదృశే గాత్రే స జాతో నాలవేష్టితః॥ ౮

తా॥ మేష, వృషభ, సింహములలో నేదైననొకటి లగ్నమై యందు కుజుడుగాని, శనిగానియున్నచో నా రాశినవాంశములకు సరిపడు అంగము నాలవేష్టితమై యుండగ, జన్మించును.

శ్లో॥ చతుష్పదగతో భానుః శేషే వీర్యసమన్వితాః।
ద్విస్వభావగతా జాతౌ యమలౌ ఏతి నిర్దిశేత్॥ ౯

తా॥ సూర్యుడు చతుష్పాదరాశి యందుండగ, మిగిలిన సర్వగ్రహములు బలము కలవై ద్విస్వభావరాశులలో నున్నచో యమల (కవలల) జననము నని తెలియదగినది.

శ్లో॥ రవీందూ ఏకభావస్థా వేకాంశక సమన్వితౌ।
త్రిమాత్రా చ త్రిభి ర్మాసైః పిత్రా భ్రాత్రా చ పోషితః॥ ౧౦

తా॥ జననసమయమందు రవిచంద్రులు ఏకభావగతులై, ఒకే నవాంశములో నుండిరేని యా జాతకుడు ముగ్గురు తల్లులచేత మూడు మాసముల పర్యంతము పోషింపబడినవాడై, పిమ్మట తండ్రిచేత, సోదరునిచేత పోషింపబడును.

శ్లో॥ ఏవం చంద్రాచ్చ విజ్ఞేయం ఫలం జాతకకోవిదైః॥
అథ జాతశరపాంగే వ్రణచిహ్నాదికం బ్రువే॥ ౧౧

తా॥ పై విధముగ చంద్రలగ్నమునుండి కూడ ఫలములను విచారించవలయును. అనంతరమందు జాతకునియొక్క శరీరావయవములందు గలుగు వ్రణాది చిహ్నములను చెప్పుచున్నాను.

శ్లో॥ శిరో నేత్రే తథా కర్ణౌ నాసికే చ కపోలకౌ।
హనూ ముఖం చ లగ్నాద్యా తనౌ వాద్యదృగాణకే॥ ౧౨

తా॥ జన్మలగ్నప్రథమద్రేక్కాణమందు (రాశియొక్క మొదటి 10 భాగలలోపున) జన్మించినపుడు లగ్నము శిరస్సు 2, 12 భావములు నేత్రములు 3, 11 లు కర్ణములు 4, 10 లు నాసికలు, 5, 9 లు కపోలములు 6, 8 లు హనువులు 7 ముఖముగ తెలియదగినది.

శ్లో॥ మధ్యద్రేక్కాణగే లగ్నే కంఠోంऽసౌ చ భుజౌ తథా।
పార్శ్వే చ హృదయే క్రోడే నాభిశ్చేతి యథాక్రమమ్॥ ౧౩

తా॥ జన్మలగ్నము మధ్యద్రేక్కాణమైనపుడు (ద్వితీయద్రేక్కాణమైనపుడు) లగ్నముకంఠము. 2, 12లు భుజశిరస్సులు 3, 11 లు

పార్శ్వములు, 5, 9లు హృదయము 6, 8లు క్రోడము (రొమ్ము) 7 నాభిప్రదేశముగ తెలియదగినది.

శ్లో॥ వస్తి ర్లింగగుదే ముష్కౌ హ్యూరూ జానూ చ జంఘకే।
పాద శ్చేత్యుదితై ర్వామ మంగం జ్ఞేయం తృతీయకే॥ ౧౪

తా॥ జన్మలగ్నము తృతీయ ద్రేక్కాణమైనపుడు లగ్నము వస్తి కడుపు (మూత్రాశయము) 2, 12 లు లింగము, గుదము, 3,11 లు అండకోశములు, 4, 10లు తొడలు 5, 9 జానువులు 6, 8 జంఘములు 7 పాదములుగ తెలియదగినది.

లగ్నమునకు వెనుక 6 భావములు వామభాగమును, ముందు 6 భావములు దక్షిణభాగమును తెలుపును. లగ్నపరార్ధము, 2, 3, 4, 5, 6 భావములు, సప్తమభావపూర్వార్ధము దక్షిణ (కుడి) భాగమును, సప్తమభావ ద్వితీయార్ధము, 8, 9, 10, 11, 12, లగ్న పూర్వార్ధము వామ (ఎడమ) భాగమును తెలుపును,

శ్లో॥ యస్మి న్నంగే స్థితః పాపః వ్రణం తత్ర సమాదిశేత్।
వియతం సబుధైః క్రూరైః సౌమ్యై ర్లక్ష్మ వదే ద్బుధః॥ ౧౫

తా॥ జననకాలమున పాపగ్రహము లేరాసులలో నున్నదో యా రాసులకే యే యంగములు చెప్పబడినవో ఆయవయవములందు వ్రణములు, శస్త్రములవలన నేర్పడిన చిహ్నములు గలుగును. పాపులు బుధునితో చేరి యుండిరేని నిశ్చయముగ వ్రణాది చిహ్నములుండును. శుభగ్రహములున్న యంగములందు పుట్టుమచ్చలు వంటివిమాత్రముండును.

వి॥ శరీరములో వివిధాంగములపై గల చిహ్నములనుగాని, వ్రణాది జనిత చిహ్నములనుగాని తెలుసుకొనుటకు వరాహమిహిరాదులు ద్రేక్కాణములనుబట్టి శరీరాంగ విభాగమును యీ క్రింద విధముగ తెలిపి యున్నారు.

బృహజ్జాతకము, సూతికాధ్యాయము 24 శ్లో।

కం దృక్ఛ్రోత్ర నసా కపోలహనవో వక్త్రం చ హోరాదయః
స్తే కంఠాంసక బాహు పార్శ్వ హృదయ క్రోడాని నాభి స్తతః॥
వస్తిః శిశ్నగుదే తత శ్చ వృషణా వూరూ తతో జానునీ।
జంఘాంఘ్రీ త్యుభయత్ర వామ ముదితై ర్ద్రేక్కాణభాగై స్త్రిధా॥

భట్టోత్పలవ్యాఖ్య :-

అత్రైవ సూతికాధ్యాయే జాతస్య వ్రణమశకాదినిరూపణార్థ మంగప్రకరణ మారభ్యతే॥ తత్ర లగ్నప్రథమద్వితీయతృతీయద్రేక్కాణవశేన ప్రథమద్వితీయ తృతీయశరీరభాగ పరిచ్ఛేదః తత్ర శిరఃప్రభృతి మాపద్వక్త్రం ప్రథమోంగవిభాగః శిరోధస్తా ద్యావన్నాభి స్తావద్ద్వితీయః తదధస్తా త్తృతీయః॥ తేషా మంగవిభాగానాం రాశివిభాగం శార్దూలవిక్రీడితేనాహ :- కం దృగితి। త్రిభిః ప్రకారై స్త్రిధా త్రిభిః ద్రేక్కాణభాగై స్త్రిధా శరీరప్రవిభాగః॥ తత్ర లగ్నస్య ప్రథమద్రేక్కాణే ఉదయతి ప్రథమో మూర్ధాద్యంగవిభాగః ద్వితీయే ద్రేక్కాణే ఉదయతి కంఠప్రాగ్రో ద్వితీయోంగ విభాగః॥ తృతీయే ద్రేక్కాణే ఉదయతి వస్తి పూర్వక స్తృతీయః। తత్రాప్యంగవిభాగే వామ దక్షిణ పర్త్యయ జ్ఞానం కథ మిత్యత ఆహ।వామ ముదితై రితి।రాశిభి రుదితైః దృశ్యభాగావస్థితై ర్వామోంగవిభాగః లగ్నస్యోదిత భాగాః। తథా ద్వాదశై కాదశ దశమ నవమాష్టమాః।తథా సప్తమస్య రాశే ర్లగ్నో దిత తుల్యభాగాః। ఏష భాగ ఉదితః శేషోఽనుదితః అర్ధా దనుదితై రదృశ్యై ర్దక్షిణ ఇతి॥తత్ర లగ్నానుదిత భాగా స్తథా ద్వితీయ తృతీయ చతుర్థ పంచమ షష్ఠాః సప్తమరాశే ర్లగ్నోదిత తుల్యభాగాః। ఏవంస్థితే లగ్నప్రథమద్రేక్కాణోదయో లగ్నరాశిః కం శిరః కల్పనీయమ్।లగ్నా ద్ద్వితీయద్వాదశే దృశ్యక్షిణీ।తత్ర ద్వితీయో దక్షిణ మక్షి ద్వాదశో వామమ్।తృతీయైకాదశౌ శ్రోత్రే।తత్ర తృతీయో దక్షిణం ఏకాదశో వామమ్। చతుర్థదశమౌ నాసాపుటే। చతుర్థో దక్షిణమ్ దశమో వామమ్। పంచమనవమౌ కపోలౌ పంచమో దక్షిణః నవమో వామః।షష్ఠాష్టమౌ హనూ।షష్ఠో దక్షిణమ్। అష్టమో వామమ్। సప్తమో వక్త్రమ్ ముఖమ్। ఏవం రాశ్యాద్యుపలక్షితః ప్రథమోంగవిభాగః॥ తే కంఠాంసక ఇతి॥అథద్వితీయద్రేక్కాణోదయః కంఠాద్యే ద్వితీయేంగ విభాగే పరికల్ప్యః తద్యథా లగ్నం కంఠః గలకః ద్వితీయద్వాదశౌ స్కంధౌ తత్ర ద్వితీయో దక్షిణ స్కంధః ద్వాదశో

వామః తృతీయైకాదశౌ బాహూ తత్ర తృతీయో దక్షిణః ఏకాదశో వామః॥ చతుర్థ
దశమౌ పార్శ్వే తత్ర చతుర్థో దక్షిణం దశమో వామమ్ పంచమనవమౌ
హృద్భాగౌ। తత్ర పంచమో దక్షిణః నవమో వామః॥ షష్ఠాష్టమౌ క్రోడ ఉదరభాగౌ
షష్ఠో దక్షిణః అష్టమో వామః॥ సప్తమో నాభి రితి॥నాభిగ్రహణ ముదరోపలక్షణా
ర్థమ్॥ఏవం ద్వితీయోంగవిభాగః॥వస్తిః శిశ్నగుదే ఇతి॥లగ్నాద్రేక్కాణే తృతీయే
ఉదయతి తఏవ హోరాదయ స్తృతీయేంగవిభాగే పరికల్ప్యాః॥ తద్యథా।లగ్నం
వస్తిః వాభిలింగయో ర్మధ్యభాగః।ద్వితీయద్వాదశౌ శిశ్నగుదే।తత్ర ద్వితీయో
దక్షిణభాగః।ద్వాదశో వామః।తతోనంతరం తృతీయైకాదశౌ వృషణౌ।తృతీయో
దక్షిణః।ఏకాదశో వామః।చతుర్థదశమౌ ఊరూ।చతుర్థో దక్షిణః।దశమో వామః,
పంచమనవమౌ జానునీ।పంచమో దక్షిణః నవమో వామమ్ షష్ఠాష్టమౌ జంఘే
షష్ఠో దక్షిణజంఘా అష్టమో వామజంఘా సప్తమః పాదద్వయ మితి॥

దీనిభావము :-

ఈ సూతికాధ్యాయమందు జాతకుని శరీరమందు సంభవించు వ్రణమశకాది జ్ఞానము కొరకు అంగవిభాగము చెప్పబడుచున్నది. ఎట్లనగా:- ఏ రాశియందైనను ప్రథమద్రేక్కాణ మందు జన్మించినవారికి ద్వాదశరాశులు (భావములు) శిరః ప్రభృతి ముఖాంతమువరకు 12 అవయవభాగములగుచున్నవి. ద్వితీయద్రేక్కాణమందుజన్మించినవారికి కంఠప్రభృతి నాభిపర్యంతము 12 అవయవవిభాగములగుచున్నవి. తృతీయద్రేక్కాణమందు జన్మించినవారికి నాభికి క్రిందభాగము నుండి పాదాంతము అవయవభాగములగుచున్నవి ఈ భాగములలో లగ్నము యొక్క భోగ్య భాగములనుండి సప్తమము యొక్క భుక్త భాగాంతము వరకుగల రాశులు (భావములు) శరీరము యొక్క దక్షిణ(కుడి) భాగము. సప్తమ భోగ్యభాగములనుండి లగ్నభుక్త భాగల పర్యంతము వామ (ఎడమ) భాగముగ గుర్తించుకొనవలయును.

I. రాశి ప్రథమద్రేక్కాణమందు జననమైనచో: 1) లగ్నము శిరోభాగము, 2) 2వ భావము దక్షిణ నేత్రము, 12వ భావము వామ నేత్రము, 3) 3వ భావము కుడిచెవి11వభావము ఎడమచెవి, 4) నాలు

4వభావము దక్షిణనాసిక (కుడిముక్కు) పదవభావము వామనాసిక ఎడమముక్కు) 5) ఐదవభావము దక్షిణ కపోలము (కుడిదౌడ) తొమ్మిదవభావమువామ కపోలము (ఎడమదౌడ) 6) ఆరవభావము దక్షిణహనువు (కుడి పెలిదౌడ లేక బుగ్గల పై భాగము) ఎనిమిదవ భావము వామహనువు (ఎడమ పెలిదౌడ లేక బుగ్గలపైభాగము 7) సప్తమభావము ముఖము. (నోరు)

II. రాశి ద్వితీయ ద్రేక్కాణమందు జననమైనచో కంఠము నుండి నాభిపర్యంతము అంగవిభాగమును గ్రహించవలయును.

1) లగ్నముకంఠము 2) రెండవభావము కుడిభుజశిరస్సు, పం డెండవ భావము ఎడమభుజశిరస్సు, 3) మూడవభావము కుడిచెయ్యి, పద నొకండవభావము ఎడమచెయ్యి 4) చతుర్థభావము కుడి పార్శ్వము దశమభావము ఎడమపార్శ్వము, 5) ఐదవభావము హృదయముయొక్క కుడిభాగము, తొమ్మిదవభావము హృదయము యొక్క ఎడమభాగము, 7) ఆరవభావము కడుపుయొక్క కుడిభాగము 8వ భావము కడుపుయొక్క ఎడమభాగము 7) సప్తమభావమునాభి (బొడ్డు) అని తెలుసుకొనవలయును.

III. రాశి తృతీయ ద్రేక్కాణమందు జననమైనచో వస్తిప్రభృతి పాదాంతము శరీరాంగ విభాగమును గ్రహించ వలయును.

1 లగ్నము వస్తి (పొత్తికడుపు మూత్ర పురీషాశయ భాగము లేక నాభికి మర్మాంగమునకు మధ్యభాగము) ద్వితీయభావము మర్మాంగము, గుదము యొక్క దక్షిణభాగము, ద్వాదశము వీనియొక్క వామభాగము, తృతీయభావము దక్షిణవృషణము, ఏకాదశభావము వామవృషణము, (స్త్రీ విషయమై భట్టోత్పలుడీ రెండుభావములకు అంగములను తెలియచేయలేదు) చతుర్థభావము కుడితొడ, దశమ భావము ఎడమతొడ, పంచమభావము కుడిమోకాలు, నవమభావము

ఎడమమోకాలు, షష్ఠభావము కుడిపిక్కలు, అష్టమభావము ఎడమ పిక్కలు, సప్తమము పాదములు అని తెలుసుకొనవలయును. మరియు లగ్నము యొక్క ప్రథమద్రేక్కాణము రాశి ప్రథమద్రేక్కాణమైనచో 1, 2, 3 వరుసగ ద్రేక్కాణములను గ్రహించవలయును. లగ్నము యొక్క మొదటి ద్రేక్కాణము రాశి ద్వితీయ ద్రేక్కాణమైనచో 2 3, 1 అనియు, లగ్నప్రథమద్రేక్కాణము రాశి తృతీయ ద్రేక్కాణమైనచో 3, 2, 1 అనియు గ్రహించవలయును. వరాహమిహిరుడు "ఉదితద్రేక్కాణభాగైః" అనుటచేత లగ్నముయొక్క ఉదయము రాశియందే ద్రేక్కాణమైనను దానిని బట్టియే అంగవిభాగమును చేయవలయును. రాశి ప్రథమద్రేక్కాణమందు లగ్నముదయించినచో ప్రథమద్రేక్కాణాంగ విభాగము, రాశిద్వితీయ ద్రేక్కాణమందు లగ్నముదయించినచో ద్వితీయ ద్రేక్కాణాంగ విభాగము, రాశితృతీయద్రేక్కాణమందు లగ్నముదయించినచో తృతీయ ద్రేక్కాణాంగ విభాగము అని గ్రహించ వలయును.

ఉదాహరణమునకు లగ్నము మేషరాశియొక్క 5వ భాగమందుదయించినచో మేష ప్రథమ ద్రేక్కాణమందు లగ్నముదయించినది లగ్నప్రథమ ద్రేక్కాణము మేషములో 5 నుండి 15 వరకు, 16నుండి 26 భాగల వరకు లగ్నద్వితీయ ద్రేక్కాణము, మేషములో 26నుండి వృషభములో 5వ భాగమువరకు లగ్నతృతీయ ద్రేక్కాణము అని గ్రహించవలయును. ఇట్లు లగ్నము మేషముయొక్క 11వ భాగయందుదయించినచో 11 నుండి 21 భాగవరకు లగ్నప్రథమద్రేక్కాణమనియు 22 నుండి వృషభములో 1వ భాగవరకు లగ్నద్వితీయద్రేక్కాణమనియు, వృషభములో2 భాగనుండి 11వ భాగవరకు లగ్నతృతీయద్రేక్కాణమనియు గ్రహించవలయును. మేషముయొక్క 24వ భాగలో లగ్నమ దయించినపుడు మేషతృతీయ ద్రేక్కాణమందులగ్నము యొక్క ప్రథమ ద్రేక్కాణము మేషములో 24 భాగనుండి వృషభములో

8వ భాగవరకును, వృషభములో 4వ భాగనుండి 13 భాగ వరకు ద్వితీయ ద్రేక్కాణమును, వృషభములో 14 నుండి 23 భాగ వరకు లగ్నతృతీయ ద్రేక్కాణ మనియు గ్రహించి అంగవిభాగ మును చూచుకొన వలయును.

రుద్రవివరణములో నీ విషయమునుగురించి :-

అథచర చక్రేణ గాత్ర లక్షణం శార్దూలవిక్రీడితే నాహ :-

మూర్ధాదివక్త్రాంతం కంఠాదినాభ్యంతం, వస్త్యాదిపాదాంతం చ శరీరం త్రిధా విభజ్య త్రిష్వపి భాగేషు చరచక్రన్యాసః క్రియతే॥ తత్ర లగ్నభావస్య గంతవ్య మారభ్య సప్తమభావస్య గతభాగావధి చక్రార్ధ మదృశ్యమ్॥ సప్తమభావస్య గంతవ్యభాగ మారభ్య లగ్నగతభాగాంతం చక్రార్ధం దృశ్యమ్॥ తత్రా దృశ్యార్ధస్య దక్షిణాంగేషు యథోక్తేషు న్యాసః। దృశ్యార్ధస్య వామాంగేషు న్యాసః కర్తవ్యః। తత్ర ప్రథమం మూర్ధాద్యూర్ధ్వభాగన్యాస మాహ :-

1) కందృక్ర్ఛోత్రవసాకపోలహనవః వక్త్రం చ క్రమోత్క్రమాభ్యాం దక్షిణవామభాగయో ర్హోరాదయో భవంతీతి సంబంధః॥ హోరా లగ్నం తస్య గంతవ్య భాగః శిరసో దక్షిణార్ధం, ధనభావో దక్షిణదృష్టిః తృతీయో రాశిః దక్షిణ కర్ణః చతుర్థో దక్షిణనాసా। పంచమో దక్షిణకపోలః షష్ఠోదక్షిణహనుః సప్తమస్య గతం వక్త్రదక్షిణార్ధం।గంతవ్యభాగో వక్త్రవామార్ధం అష్టమో వామహనుః। నవమో వామకపోలః దశమో వామనాసా। ఏకాదశో వామకర్ణః। ద్వాదశో వామ దృష్టిః। లగ్నస్య గతభాగః శిరసో వామార్ధం॥ ఏవ మూర్ధాంగే లగ్నాదిచరచక్ర న్యాసః॥

2) అథ మధ్యమాంగే న్యాస మాహ :-

కంఠాంసకబాహుపార్శ్వహృదయక్రోడాని నాభిః॥తే హోరాదయః పూర్వవత్ క్రమోత్క్రమాభ్యాం దక్షిణవామభాగయో ర్భవంతీతి సంబంధః॥ కంఠస్య దక్షిణార్ధం లగ్నస్య గంతవ్యభాగః॥ వామార్ధం గతభాగః దక్షిణాంసో ద్వితీయరాశిః। వామాంసో ద్వాదశరాశిః॥ తృతీయైకాదశౌ దక్షిణవామబాహూ॥ చతుర్దశమౌ దక్షిణవామపార్శ్వే పంచమో హృదయదక్షిణభాగః। నవమో హృదయవామభాగః।

షష్ఠో జఠరస్య దక్షిణభాగః। అష్టమో జఠరస్య వామభాగః। సప్తమస్య గతార్ధం నాభే ర్దక్షిణభాగః॥ గంతవ్యార్ధం వామభాగః॥ ఇతి దేహమధ్యభాగే చరచక్రన్యాసః॥

3) అధఃకాయే చరచక్రన్యాస మాహ :- వస్తి రిత్యాదినా। హోరాదయ ఇత్య నువర్తతే। పూర్వవ ల్లగ్నం వస్తిః। ద్వితీయద్వాదశౌ శిశ్నగుదయో ర్దక్షిణవామ భాగౌ। తృతీయైకాదశౌ దక్షిణవామవృషణమణీ। చతుర్థదశమౌ దక్షిణవామోరూ। పంచమనవమౌ దక్షిణవామజానునీ। షష్ఠాష్టమౌ దక్షిణవామజంఘే। అస్తలగ్నస్య గతగంతవ్య భాగౌ దక్షిణవామపాదౌ। ఇత్యధః కాయే చరచక్రన్యాసః॥ ఉదితై ర్వ్యామం ఉదితై రనస్తమితై రాశిభిః॥ వామ మితిదక్షిణేతరం విలోమం చ యోజ నీయ మితి శేషః। వామశబ్ద స్యదక్షిణేతరార్ధవాచిత్వం విలోమార్థవాచిత్వ మప్యత్రా పేక్ష్యతే। అత ఉదితై ర్దృశ్యార్ధస్థైః వామభాగే ప్రతిలోమ ఇత్యర్థఃసిద్ధ్యతి। అతఏవా దృశ్యార్ధస్థైః దక్షిణభాగే క్రమేణచోక్తం భవతి। తథాచపూర్వం వ్యాఖ్యాతమ్। త్రిషుస్థానేషు న్యస్తేన చక్రేణకథం విశేషనిర్దేశ ఇత్యాశంకాయా మాహ :-

ద్రేక్కాణభాగై స్త్రిధా। లగ్నస్య ప్రథమద్రేక్కాణే సతి మూర్ధాద్యంగేషు। మధ్య ద్రేక్కాణే కంఠాద్యంగేషు। తృతీయ ద్రేక్కాణే వస్త్యాద్యంగేషు ఇతి త్రిధాన్యాసః కర్తవ్య ఇతికేచిత్॥

"బృహజ్జాతక" "రుద్రవివరణము" నకు తాత్పర్యము.

తా॥ చరచక్రము ననుసరించి శరీరలక్షణము (శరీరాంగ విభాగము) చెప్పబడుచున్నది. లగ్నముయొక్క మూడు ద్రేక్కాణములకు 1వ ద్రేక్కాణమునకు మూర్ధాదివక్త్రాంతము, 2వ ద్రేక్కాణమునకు కంఠాదినాభి పర్యంతము, 3వ ద్రేక్కాణమునకు వస్తి మొదలు పాదాంతము శరీరమును మూడుభాగములనుచేసి తన్వాది ద్వాదశ భావములకు సమన్వయించవలెను. లగ్నభావము యొక్క భోగ్యభాగముతో ప్రారంభించి సప్తమభావభుక్త భాగము వరకు గల చక్రార్ధమునకు "అదృశ్య" మనిపేరు. సప్తమ భావభోగ్యభాగము మొదలు లగ్న భావభుక్తభాగము వరకు గల చక్రార్ధమునకు "దృశ్య" మనిపేరు. అదృశ్య చక్రగతములైన ఆరు భావములకు శరీరాంగములలో దక్షిణ

భాగమందు గల యంగములను, దృశ్యచక్రగతములైన ఆరు భావము లను వామ భాగమందుగల యంగములను న్యాసము చేయవలయును.

1) మొదట మూర్ధాద్యంగ విభాగము చేయబడుచున్నది.

1) లగ్నము యొక్క భోగ్యభాగము శిరస్సు యొక్క కుడి భాగము, 2) రెండవభావము కుడికన్ను 3) మూడవ భావము కుడి చెవి 4) నాలుగవ భావము కుడిముక్కు 5) పంచమభావము కుడి చెక్కిలి 6) ఆరవభావము దక్షిణ హనువు 7) ఏడవ భావములో భుక్త భాగాంతము వక్త్రము యొక్క కుడిభాగము అని గ్రహించవలయును. ఏడవ భావము యొక్క భోగ్యభాగమునుండి 7 ఏడవభావము యొక్క భోగ్యభాగాంతము వరకు వక్త్రము యొక్క యెడమ భాగము 8) యెనిమిదవ భావము వామహనువు 9) తొమ్మిదవ భావము వామ కపోలము 10) దశమ భావము యెడమ ముక్కు 11) పదునొకండవ భావము యెడమ చెవి 12) పండ్రెండవ భావము యెడమకన్ను, లగ్న మందు గత భాగాంతము వరకు శిరస్సుయొక్క యెడమ భాగము. ఇది శరీరము యొక్క ఊర్ధ్వాంగ విభాగము నందు లగ్నాది చర చక్రన్యాసముగ గ్రహించవలయును.

2) శరీరమధ్యమాంగ విభాగము తెలుపబడుచున్నది.

లగ్నాది ద్వాదశభావములు వెనుకటివలె క్రమోత్క్రమము లచే కుడియెడమలగును. 1) లగ్నములో గంతవ్యభాగము కంఠము యొక్క దక్షిణభాగము 2) రెండవ భావము దక్షిణాంసము 3) మూడవ భావము దక్షిణ బాహువు 4) నాలుగవ భావము కుడి ప్రక్క 5వ భావము హృదయ దక్షిణభాగము 6) ఆరవభావము కడుపుయొక్క కుడిభాగము 7) సప్తమ భావముయొక్క గతభాగము (సప్తమ భావ భుక్త భాగాంతము) నాభికి దక్షిణ భాగము, గంతవ్యభాగము నాభి, వామ భాగము 8) ఎనిమిదవ భావము కడుపునకు ఎడమభాగము 9)

తొమ్మిదవ భావము హృదయ వామభాగము 10) పదవ భావము ఎడమ ప్రక్క 11) పదునొకండవ భావము ఎడమచెయ్యి (వామబాహువు) 12) పండ్రెండవ భావము వామాంసము, లగ్నభుక్తాంశము కంఠము యొక్క యెడమ భాగము. ఇది శరీరము యొక్క మధ్యమాంగవిభాగమందు చరచక్ర న్యాసముగ గ్రహించవలయును.

3) శరీరము యొక్క క్రిందభాగమునకు విభాగము తెలుపబడు చున్నది, 1) లగ్నభోగ్యభాగము వస్తి యొక్క కుడిభాగము 2) రెండవ భావము శిశ్నగుదముల కుడిభాగము 3) మూడవ భావము వృషణ యోనుల కుడిభాగము 4) నాలుగవ భావము కుడితొడ 5) పంచమ భావము దక్షిణ జానువు 6) ఆరవభావము దక్షిణజంఘము 7) ఏడవ భావముయొక్క గతభాగము కుడికాలు, ఏడవభావము యొక్కగంతవ్య భాగము ఎడమకాలు, 8) ఎనిమిదవ భావము వామజంఘము 9) తొమ్మిదవభావము వామజానువు 10) పదవభావము ఎడమతొడ 11) పదునొకండవ భావము వృషణ యోనుల యెడమభాగము 12) పండ్రెండవ భావము శిశ్నగుదముల వామభాగము, లగ్నభుక్తభాగము వస్తి యొక్క వామభాగము. ఇది శరీరము యొక్క క్రిందభాగమునకు చర చక్రన్యాసముగ గ్రహించవలయును.

పై విధముగ నిర్ణయించి, లగ్నముయొక్క ప్రథమ ద్రేక్కాణమైనచో మూర్ధాద్యంగములను, లగ్నము యొక్క మధ్యమ ద్రేక్కాణమైనచో కంఠాద్యంగములను, లగ్నము యొక్క తృతీయ ద్రేక్కాణమైనచో వస్త్యాద్యంగములను ద్వాదశభావములకు న్యాసమును చేయవలయునని కొందరను చున్నారు.

చక్రోదాహరణము

కుడి భాగము | | | ఎడమ భాగము

| నేత్ర | శిరస్సు | నేత్ర | చెవి |
|---|---|---|---|
| చెవి | అగ్ని ప్రథమ ద్రేక్కాణము | | నాసిక |
| నాసిక | | | కపోల |
| కపోల | హను | నోరు | హను |

కుడి భాగము | | | ఎడమ భాగము

| కుడి భుజము | కంఠము | ఎడమ భుజము | చెయ్యి |
|---|---|---|---|
| చెయ్యి | ద్వి - ద్రే | | ఎడమ పార్శ్వ |
| కుడి పార్శ్వ | | | హృదయ |
| హృదయ | కడుపు | బొడ్డు | కడుపు |

కుడి భాగము | | | ఎడమ భాగము

| ముష్కాంగ | పా.క | గుద | వృషణ |
|---|---|---|---|
| వృషణ | అగ్ని తృతీయ ద్రేక్కాణము | | తొడ |
| తొడ | | | మోకాలు |
| మోకాలు | పిక్కలు | పాదములు | పిక్కలు |

(పా-క = పొత్తికడుపు = వస్తి)

మేషాదిరాశులందు ప్రథమద్రేక్కాణజనితులకు 1వ చక్రము 2వ ద్రేక్కాణజనితులకు 2వ చక్రము 3వ ద్రేక్కాణజనితులకు 3వ చక్రమును గ్రహించవలయును. ఇది యొక మతముగ చెప్పబడినది.

మరియొక మతమును గురించి యీ క్రింది విధముగ వివరించెను.

"అన్యే పున రేవం వ్యాచక్షతే॥ ప్రథమద్రేక్కాణజాత శ్చేత్ స ప్రథమ ద్రేక్కాణో మూర్ధా ద్వితీయద్వాదశరాశ్యోః ప్రథమద్రేక్కాణౌ చక్షుషీ తృతీయై కాదశరాశ్యోః ప్రథమ ద్రేక్కాణౌ కర్ణౌ చతుర్థదశమయోః ప్రథమద్రేక్కాణౌ నాసికే పంచమనవమయోః ప్రథమద్రేక్కాణౌ కపోలౌ। షష్ఠాష్టమయోః ప్రథమ ద్రేక్కాణౌ హనూ। సప్తమస్య ప్రథమద్రేక్కాణో వక్త్రమ్॥

లగ్నమధ్యద్రేక్కాణః కంఠః। ద్వితీయద్వాదశ మధ్యద్రేక్కాణౌ వంసౌ। తృతీయైకాదశరాశి మధ్యద్రేక్కాణౌ బాహూ। చతుర్థదశమరాశి మధ్యద్రేక్కాణౌ పార్శ్వే। పంచమనవమరాశి మధ్యద్రేక్కాణౌ హృన్భాగౌ। షష్ఠాష్టమరాశి మధ్య ద్రేక్కాణౌ క్రోడభాగౌ। సప్తమరాశి మధ్యద్రేక్కాణో నాభిః॥

లగ్నాన్త్యద్రేక్కాణో వస్తిః। ద్వితీయద్వాదశ రాశ్యన్త్యద్రేక్కాణౌ శిశ్నగుదభాగౌ। తృతీయైకాదశ రాశ్యన్త్యద్రేక్కాణౌ వృషణముష్కౌ। చతుర్థదశమాంత్యద్రేక్కాణౌ వూరూ॥ పంచమనవమాంత్యద్రేక్కాణౌ జానునీ। షష్ఠాష్టమాంత్య ద్రేక్కాణౌ జంఘే। సప్తమరాశ్యంత్యద్రేక్కాణః పాదౌ। ఏవం ప్రథమద్రేక్కాణ జాతస్య॥"

అనగా రాశి ప్రథమ ద్రేక్కాణమందు జన్మించినచో లగ్న ప్రథమ ద్రేక్కాణము శిరస్సు, ద్వితీయ ద్వాదశ రాశుల ప్రథమద్రే క్కాణములు కుడి యెడమ నేత్రములు, తృతీయైకాదశ రాశుల ప్రథమ ద్రేక్కాణములు కుడియెడమ చెవులు, చతుర్థదశమ రాశుల ప్రథమ ద్రేక్కాణములు కుడి యెడమముక్కు రంధ్రములు, పంచమ నవమ ప్రథమద్రేక్కాణములు కుడియెడమ కపోలములు, షష్ఠాష్టమ ప్రథమ ద్రేక్కాణములు, హనువులు, సప్తమ ప్రథమ ద్రేక్కాణము ముఖము (నోరు). తరువాత రాశి మధ్యమ ద్రేక్కాణము కంఠము, ద్వితీయ ద్వాదశ రాశి మధ్యమ ద్రేక్కాణములు భుజశిరస్సులు, తృతీయైకాదశ రాశి మధ్యద్రేక్కాణములు బాహువులు, చతుర్థదశమ రాశిమధ్య ద్రేక్కాణములు ఉభయ పార్శ్వములు, పంచమ నవమ రాశిమధ్య

ద్రేక్కాణములు కుడియెడమ హృదయ భాగములు, షష్ఠాష్టమ రాశి మధ్య ద్రేక్కాణములు కుడియెడమ ఱొమ్ము భాగములు, (గతములో కడుపు యొక్క కుడియెడమ భాగములని వ్రాయబడెను.) సప్తమ రాశి మధ్యమద్రేక్కాణము నాభియని గ్రహించవలయును. రాశి యొక్క అంత్య ద్రేక్కాణము పొత్తికడుపు, ద్వితీయవ్యయ రాశుల అంత్య ద్రేక్కాణములు శిశ్నగుదములు, తృతీయైకాదశాంత్య ద్రేక్కాణములు వృషణయోన్యగ్ర భాగములు, చతుర్థదశమాంత్య ద్రేక్కాణములు కుడియెడను తొడలు, పంచమనవమాంత్య ద్రేక్కాణములు జానువులు, షష్ఠాష్టమాంత్య ద్రేక్కాణములు జంఘములు, సప్తమ రాశ్యాంత్య ద్రేక్కాణము పాదము. ఈ విధముగ ప్రథమ ద్రేక్కాణమందు జన్మించిన వారికి అంగవిభాగము చేయవలయును.

'మధ్యద్రేక్కాణ జాతశ్చేత్ లగ్నమధ్య ద్రేక్కాణో మూర్ధా ద్వితీయ ద్వాదశ మధ్యద్రేక్కాణౌ చక్షుషీ ఇత్యాది సప్తమరాశి మధ్యమద్రేక్కాణో వక్త్రమ్॥ లగ్నాంత్యద్రేక్కాణః కంఠః ఇత్యాది॥ లగ్నాది ద్రేక్కాణో వస్తి రిత్యాది ఏవం మధ్యమ ద్రేక్కాణ జాతస్య॥

రాశి మధ్య ద్రేక్కాణమందు జన్మించినచో మధ్యద్రేక్కాణము మొదలు శిరస్సు నుండి ద్వాదశ రాశులు ముఖాంతమువరకు, రాశ్యంత్య ద్రేక్కాణము మొదలు కంఠము నుండి ద్వాదశరాశులు నాభి పర్యంతమును, రాశి ప్రథమ ద్రేక్కాణము మొదలు వస్తినుండి ద్వాదశ రాశులు పాదాంతము వరకు గ్రహించవలయును. ఈ విధముగ మధ్యమద్రేక్కాణ జనితునకు గ్రహించవలయును.

'అంత్య ద్రేక్కాణ జాతశ్చేత్ లగ్నాంత్య ద్రేక్కాణో మూర్ధా, ఇత్యాది లగ్నాది ద్రేక్కాణః కంఠ ఇత్యాది। లగ్న మధ్యమద్రేక్కాణో వస్తిరిత్యాది పూర్వవత్॥ అయంపాఠః శ్రేయాన్॥'

రాశ్యంత్య ద్రేక్కాణమందు జన్మించినచో రాశ్యంత్యద్రేక్కాణము శిరస్సు మొదలుకొనియు, లగ్నప్రథమ ద్రేక్కాణము కంఠము

మొదలుకొనియు, లగ్నమధ్యము ద్రేక్కాణము మొదలు వస్తి నుండి పాదాంతము వరకు పూర్వము చెప్పినట్లు చూచుకొనవలయునని తత్త్వద్వాన ద్రేక్కాణములనుబట్టి వివరించెను.

పైన వ్రాసిన దానినిబట్టి రాశిప్రథమ ద్రేక్కాణమందు జనన మైనచో 1, 2, 3 చక్రములను, రాశిద్వితీయ ద్రేక్కాణమందు జనన మైనచో 2, 3, తరువాతరాశిలో 1వ ద్రేక్కాణమును గ్రహించి 1, 2, 3 చక్రములను, రాశి తృతీయ ద్రేక్కాణమందు జననమైనచో 3వ ద్రేక్కాణమును తరువాతరాశిలో 1, 2 ద్రేక్కాణములను గ్రహించి 1, 2, 3 చక్రములను తీసుకొని జాతకుల మూర్ధాది పాదాంతమువరకు అవయవ విభాగమును గ్రహించవలయును. (మేషాదిద్వాదశ రాశు లందు విభాగము స్థిరచక్రమనియు, దీనికి చరచక్రమనియు ఇది సాంప్ర దాయమనియు, ఇదిఉత్తమమైన పాఠమనియు "గుద్రుని" అభిప్రాయము.) పైన చెప్పబడిన స్థానవిశేషములందు గ్రహస్థితి వశముచే వ్రణచిహ్నా దులను తెలుసుకొను క్రమము చెప్పబడుచున్నది.

బృహజ్జాతకము 5వ అధ్యాయము 25 శ్లో॥

తస్మిన్ పాపయుతే వ్రణః శుభయుతే దృష్టే చ లక్ష్మాదిశేత్।
స్వర్క్షాంశస్థిరసంయుతే చ సహజః స్యా దన్యథా గంతుకః॥
మందేఽశ్మానిలజోఽగ్నిశస్త్ర విషజో భౌమే బుధే భూభువః।
సూర్యే కాష్ఠచతుష్పదేన హిమగౌ శృంగ్యబ్జజోఽన్యైః శుభైః॥ ఇతి॥

పురోక్తమైన ద్రేక్కాణాంగ విభాగమును గ్రహించి యేద్రేక్కాణమందు పాపగ్రహముండునో ఆ ప్రదేశమందు వ్రణముండు నవియు, శుభగ్రహయుతి దృష్టులున్నచో తిలకాదిచిహ్నములుండు నవిచెప్పవలెను. ఆ గ్రహము స్వక్షేత్ర, స్వాంశ, స్థిరరాశులందున్నచో జన్మముతోనే యుండునని, లేనియెడల జన్మించిన తరువాత కాలములో సంభవించునవియు చెప్పవలయును. వ్రణచిహ్నాదులకు కని కారణ

భూతుడైనచో రాళ్ళవలన, వాయువువలనయనియు, కుజుడైనచో అగ్నివలనలేక శస్త్రములవలనలేక విషాదులవలన యనియు. బుధుడైనచో భూసంబంధమైన హేతువులవలన వ్రణచిహ్నదులుండును. సూర్యుడైనచో కర్రలచేగాని, చతుష్పాద జంతువులచేగాని వ్రణాది చిహ్నములు సంభవించును. చంద్రుడైనచో కొమ్ములుగల ఆవులు, గేదెలు మొదలగు జంతువులచేత, జలమందు సంచరించు జంతువులచేత వ్రణాదిచిహ్నములు సంభవించును. ఇతరములైన శుభగ్రహములగు పూర్ణచంద్ర, పాపరహిత బుధ గురు శుక్రులచే సంభవించు చిహ్నములు శరీరసౌష్ఠవముగగాని, అలంకార ప్రాయముగగాని అదృష్ట సూచకములుగ నుండగలవు. వ్రణాదిచిహ్నములు సహజములనియు, ఆగంతుకములనియు తెలియచేయుటచేత నాగంతుక వ్రణాదులను తత్తద్దశాకాల విశేషములనుబట్టి తెలుపవలయును.

భట్టోత్పల వ్యాఖ్యానమును బట్టి లగ్నాది ద్వాదశరాశులకు అంగవిభాగము తెలుపబడినది. రుద్రవివరణములో నాయారాశులందు ద్రేక్కాణములకు అంగవిభాము తెలుపబడినది. భట్టోత్పలునియభిప్రాయములో రాశి ప్రథమ ద్రేక్కాణమందు లగ్నమైనచో ద్వితీయ రాశి (భావము) మొత్తము దక్షిణ నేత్రమనియు, ద్వాదశరాశి (భావము) మొత్తము వామనేత్రమను భావము స్ఫురించును. రుద్ర వ్యాఖ్యానములోగల రెండవ పద్ధతినిబట్టి రాశి ప్రథమ ద్రేక్కాణ మందు లగ్నమైనచో ద్వితీయరాశి ప్రథమ ద్రేక్కాణము దక్షిణనేత్రమగును. ద్వాదశరాశి ప్రథమ ద్రేక్కాణమువామ నేత్రమగును. గ్రహము ద్వితీయరాశి ప్రథమ ద్రేక్కాణమందుగాని, వ్యయరాశి ప్రథమ ద్రేక్కాణమందుగాని యున్నప్పుడే వ్రణాదిచిహ్నములను చెప్పవలయునుగాని ద్వితీయ తృతీయ ద్రేక్కాణములందు గ్రహమున్నప్పుడా ఫలమును చెప్పుటకవకాశముండదని గ్రహించవలసి యుండును.

గ్రంథాంతరోక్తవర్ణించిహ్నాది యోగములు :-

హోరారత్నమందు దహరించిన "జాతకముక్తావళి"లో

లగ్నాత్సప్తమగో భౌమః శుక్రో వాపి బృహస్పతిః।
చిహ్నం మూర్ధ్ని స్థితం జ్ఞేయం జాతకస్య న సంశయః

లగ్నమునకు ఏడవయింట కుజుడుగాని, శుక్రుడుగాని, గురుడుగాని యున్నచో శిరస్సునందు చిహ్నముండును.

"యదా శుక్రోథవా భౌమో లగ్నస్థోపి నిశాకరః।
ద్వాదశాబ్దే భవేత్తస్య మస్తకే వహ్నిదర్శనమ్॥

లగ్నమందు శుక్రుడుగాని, కుజుడుగాని, చంద్రుడుగానియున్నచో (12) పండ్రెండవ సంవత్సరమందు శిరస్సునందు అగ్నిసంబంధమైన చిహ్నముగలుగును.

'అష్టమేఽపి యదా రాహౌ శుక్రో వాపి తనుస్థితః।
వామకర్ణే భవేత్తస్య చిహ్నం లగ్నా ద్వినిశ్చితమ్॥

అష్టమమందు రాహువుండగ శుక్రుడు లగ్నమందుండెనేని యెడమచెవి యందు చిహ్నముండును.

"జాయాస్థానే యదా రాహుర్మంత్రీ వాపి తనుస్థితః।
వామే భుజే భవేచ్చిహ్నం లగ్నాచ్చైవ యథాక్రమమ్॥

సప్తమమందు రాహువు లగ్నమందు గురుడున్న యెడల యెడమ చేతియందు చిహ్నముండును.

ద్వాదశాష్టమగ శుక్రో మంత్రీ చ తనుసంస్థితః।
బాహ్వోశ్చిహ్నం విజానీయా జ్జన్మలగ్నా ద్విచక్షణః॥

అష్టమ ద్వాదశ భావములందు శుక్రుండగ, లగ్నమందు గురుడుండెనేని రెండు భుజములందు చిహ్నములుండును.

త్రిషడాయగతే భౌమే శుక్రో వాపి వ్యవస్థితః।
వామపార్శ్వే భవేచ్చిహ్నం భుజదేశ సమీపతః॥

శుక్రుడు కుజుడు 3, 6, 11 భావములందుండిరేని ఎడమచేతి సమీపమందు పార్శ్వభాగములో మచ్చయుండును.

బుధే మందే శల్లవేగ్నే కర్మగే వా దివాకరే ।
దక్షిణే పార్శ్వకే తస్య చిహ్నం జ్ఞేయం పరిస్ఫుటమ్॥

బుధశనులు లగ్నమందుండగ రవి దశమగతుడైనచో కుడి ప్రక్క భాగమందు చిహ్నముండును.

కుజే సౌమ్యే ఽథవా లగ్నే రాహుః షష్ఠత్రికోణగః॥
లింగే గుదే భవే చ్చిహ్నం తిలమాషాదికం స్ఫుటమ్॥

లగ్నమందు కుజుడుగాని, బుధుడుగాని యుండగ, రాహువు 5, 6, 9 భావములందుండెనేని లింగమందు గుదమందు తిల, మాష తుల్యమైన స్పష్టమైన చిహ్నముండును.

త్రికోణేపి భవే చ్ఛుక్రో జీవో సౌమ్యే మృతిస్థితే।
పాతాళే హిబుకే మందే కుక్షౌ చిహ్నం సమాదిశేత్॥

శుక్రుడు 5, 9 రాసులలోనుండగ, గురుబుధులు అష్టమమందుండగ శని చతుర్థభావమందుండెనేని కుక్షి (కడుపు) యందు చిహ్నములుండును.

ధనస్థానే యదా శుక్రో త్వష్టమేఽపి దివాకరే।
కర్మగౌ రాహుమందౌ చే న్నాభౌ చిహ్నం సమాదిశేత్॥

ధనస్థానమందు శుక్రుడుగాని, అష్టమమందు రవిగాని యుండగ, దశమమందు శనిరాహువులున్న యెడల నాభియందు చిహ్నములుండును.

కర్మగోపి యదా మంత్రీ ద్వితీయేపి నిశాకరః।
సహజే శుక్రరాహుభ్యాం కట్యాం చిహ్నం సమాదిశేత్॥

గురుడు దశమమందు, చంద్రుడు ద్వితీయమందుండగ, శుక్ర రాహువులు తృతీయమందుండిరేని కటిప్రదేశమందు చిహ్నముండును.

వ్యయస్థానే యదా మంత్రీ బుధోఽపి త్రిషడాయగః।
ధర్మస్థానే నిశానాథే గుదే గోలక మాదిశేత్॥

గురుడు వ్యయమందు, బుధుడు 3,6, 11 రాశులలో నెందైన నుండగ చంద్రుడు 9వ యింటిలో నున్నచో గుదమందు చిహ్నము లుండును.

పాతాళే శుక్రరాహుభ్యాం కుజే మందే తనుస్థితే,
గుల్ఫయోః పాదబాహుభ్యాం మత్స్యచిహ్నం సమాదిశేత్॥

చతుర్థమందు శుక్రరాహువులుండగ, లగ్నమందు కుజశను లుండిరేని గుల్ఫములందుగాని, పాదములందుగాని, హస్తములందు గాని మత్స్యరేఖారూప చిహ్నములుండును. గ్రంథాంతర రోక్తము లైన యితరయోగములను గూడ గ్రహించి తత్తద్విశేషములను చెప్పవలయును.

ఇతి బృహత్పరాశర హోరాశాస్త్రే తను భావఫలాధ్యాయః॥ ౧౩
ఇతి బృహత్పరాశరహోరాశాస్త్ర మందు తనుభావ ఫలాధ్యాయము ముగిసెను.

## ధనభావ ఫలాధ్యాయము ।౧౪।

పరాశర ఉవాచ :–

శ్లో॥ ధనభావఫలం వక్ష్యే శృణుత్వం ద్విజసత్తమ।
ధనేశో ధన భావస్థః కేంద్రకోణ గతోపివా॥ ౧॥
ధనవృద్ధికరో జ్ఞేయస్త్రి కస్థోధనహానికృత్,
ధనదస్స ధనేశాఖ్యః పాపో ధనవినాశకృత్॥ ౨॥

తా॥ ఓ ద్విజశ్రేష్ఠుడా! ధనభావఫలములను చెప్పుచున్నాను. వినుమని పరాశరులు పలికిరి. ధనాధిపతిధన స్థానమందున్నను, కేంద్రకోణము లందున్నను, ధనమును వృద్ధిచేయును. 6, 8, 12 భావములందు ధనాధిపతి యున్నచో ధనహానియగును. మరియు ధనస్థానమందు శుభగ్రహములున్నచో ధనము ప్రాప్తించును. పాపగ్రహములున్నచో ధననాశన మగును.

శ్లో॥ ధనాధిపో గురు ర్యస్య ధనభావగతో భవేత్।
భౌమేన సహితో వాపి ధనవాన్ స నరో భవేత్॥ ౩॥

తా॥ గురుడు ధనభావాధిపతియై ధనభావమందుండి కుజునితో గలసిన యెడల నా జాతకుడు విశేష ధనవంతుడగును.

వి॥ వృశ్చిక కుంభలగ్న జాతకులకు గురుడు ధనాధిపతి యగును. వృశ్చిక లగ్నమునకు లగ్నధనాధిపతులగు కుజ గురువులు ధనభావమందు కలయుట ధనయోగము. కుంభలగ్న జాతకులకు రాజ్యాధిపతి యగు కుజుడు ధనలాభాధిపతియగు గురునితో ధనస్థానమందు గలయుట ధనయోగము. ఈ రెండు యోగములలోను గురునికంటె కుజుడు వెనుకభాగలలో 6 భాగలకు లోపుగ నుండెనేని విశేషధనయోగము పట్టును. 6 భాగలకంటె ఎక్కువ వెనుక భాగలలో నుండెనేని సామాన్యధనయోగము పట్టును. కుజుడు గురునిదాటి పై భాగలలో నున్న యెడల ధనయోగము పట్టజాలదు.

శ్లో॥ ధనేశే లాభవస్థే లాభేశే వా ధనంగతే।
తావుభౌ కేంద్రకోణస్థౌ ధనవాన్ స నరో భవేత్ ౪॥

తా॥ ధనభావాధిపతి లాభభావమందు, లాభాధిపతి ధనభావమందు పరివర్తనము నొందినను, ధనలాభాధిపతులిద్దరు కలసి కేంద్రకోణములందున్నను జాతకుడు ధనవంతుడగును.

వి॥ ఈ శ్లోకమందు మొదటి పాదములో "వా" శబ్దమును ప్రయోగించుటచేత కొందరు ధనాధిపతి లాభమందున్నను, లాభాధిపతి ధనమందున్నను ధనయోగము గలుగునని చెప్పవలయును గాని, ధనలాభాధిపతుల పరివర్తనమును అర్థమును చెప్పుట యుక్తము కాదని చెప్పుచున్నారు, కాని ధనలాభాధిపతుల పరివర్తనముగల జాతకులకు ధనయోగము విశేషముగ గలుగుచున్నది. ధనాధిపతి లాభమందున్నప్పుడుగాని, లాభాధిపతి ధనభావమందున్నప్పుడు గాని సంభవించిన ధనయోగముకంటె పరివర్తనలో ధనయోగము విశేషముగనున్నది.

శ్లో॥ ధనేశే కేంద్రరాశిస్థే లాభేశే తత్త్రికోణగే।
గురుశుక్రయుతే దృష్టే ధనలాభము దీరయేత్॥ ॥

తా॥ ధనాధిపతి కేంద్రము లందెందైన నుండగ, లాభాధిపతి ధనాధిపతికి కోణరాశులలో నెక్కడనైనయుండి గురుశుక్రులతోగూడిగాని, చూడబడుచు గాని యున్నచో ధనలాభము గలుగునని చెప్పవలయును.

ఉదా :–వృషభలగ్నజాతకులకు ధనాధిపతియగు బుధుడు చతుర్థభావమందు శుక్రునితో కలసియుండగ, వానికి కోణరాశియగు మేషమందు గురుడుండెను. ఇట్టి గ్రహస్థితిలో ధనాధిపతియగు బుధునకు శుక్రయుతి గురువీక్షణము సంభవించును. మరియు ధనాధిపతికి కేంద్రస్థితి ధనాధిపతినుండి గురునకు కోణస్థితియు సంభవించును. బుధశుక్రుల యుతిలో శుక్రునకు వెనుకభాగలలో బుధుడుండ వలయును. లేనిపక్షమున ధనభావమునకు వృద్ధి సంభవించదన వచ్చును.

శ్లో॥ ధనేశో రిపుభావస్థో లాభేశ స్తద్గతో యది।
ధనాయౌ పాపయుక్తౌ వా దృష్టౌ నిర్ధన ఏవ సః॥

తా॥ ధనాధిపతి, లాభాధిపతి యిద్దఱు షష్ఠభావములోనుండగ, ధనలాభభావములు పాపగ్రహములతో గూడినను, చూడబడినను జాతకుడు ధనహీనుడగును.

వి॥ ధనలాభాధిపతులు నైసర్గిక శుభులైనను, నైసర్గిక పాపులైనను షష్ఠస్థితిదోషమని చెప్పబడినది. ధనలాభములను చూచెడి గ్రహములు, అందున్నగ్రహములు నైసర్గికపాపులగుట ముఖ్యము. వీరలకు అధిపత్య శుభమున్నను దోషమని చెప్పబడినది.

ఉదా:- మకరలగ్న జాతకులకు ధనలాభాధిపతులగు శనిగురులు నైసర్గికపాపులు. వీరలకు షష్ఠస్థితి పట్టుటదోషము. ధనలాభములలో రవి,క్షీణచంద్రులుండుట దోషము.రవికి చంద్రుడు దశమములో నున్నను, చంద్రుడురవికి చతుర్థములోనున్నను క్షీణచంద్రుడేయగుచుండును.

2) వృషభలగ్న జాతకులకు ధనాధిపతి బుధుడు, లాభాధిపతి గురుడు వీరిద్దరు షష్ఠములో నుండుటదోషము.(అష్టమాధిపతియగు గురునకు షష్ఠస్థితి ధనహానికి హేతువగును,) భాగ్యాధిపత్యముగల శని, ~~రాజ్యాధిపత్యముగల శని~~, వాహనాధిపత్యముగల రవి నైసర్గిక పాపులు. వీరు ధన లాభములందున్నను, చూచినను ధనహానికి (నిర్ధనత్వమునకు) కారణమనియు స్పష్టమగుచున్నది.

3. సింహలగ్నజాతకులకు ధనలాభాధిపతి బుధుడు షష్ఠములో నుండుటదోషము. పాపులగు కుజశనులు (కుజుడు 4,9లకు అధిపతి, శని 6, 7 లకు అధిపతి) 2, 11 లలో నుండుటగాని, చూచుటగాని ధన హానికి హేతువు. ఇట్లు గ్రహముల నైసర్గిక శుభాశుభత్వములను బట్టి భావఫలములనూహించవలయును.

శ్లో॥ ధనలాభాధిపౌ వస్తౌ పాపగ్రహసమన్వితౌ।
జన్మప్రభృతి దారిద్ర్యం భిక్షాన్నం లభతే నరః॥ ౭

తా॥ ధనలాభాధిపతులు అస్తమించి పాపగ్రహములతో కూడి యుండినచో జన్మప్రభృతి దరిద్రము నొంది, భిక్షాటనము చేత జీవించును.

వి॥ ధనలాభాధిపతులిద్దరు నైసర్గిక శుభులై అస్తమించి నైసర్గిక పాపులగు కుజ శని రాహు కేతు క్షీణచంద్రులతో కలసినప్పుడీ యోగము పట్టును.

ఉ :- వృషభలగ్న జాతకునకు బుధగురువులు ధనలాభాధిపతులు. వీరస్తమించి కుజాదిపాపులతో కలియవలయును. బుధ-కుజ-గురువులు, బుధ, గురు, శనులు బుధ-గురు-రాహువులు, బుధగురు కేతువులు, క్షీణచంద్ర బుధ, గురువులు, ఈ గ్రహయుతులు నిర్ధన యోగ హేతువులని తెలియుచున్నది. ఇట్లే యితర లగ్నములకు గూడ విచారించవలయును.

శ్లో॥ షష్ఠేఽష్టమే వ్యయే వాపి ధనలాభాధిపౌ యది।
లాభే కుజో ధనే రాహూ రాజదండా ద్ధనక్షయః॥ ౮

తా॥ ధనలాభాధిపతులు (నైసర్గిక శుభులుగాని, పాపులుగాని) 6, 8, 12 భావములందుండగ, 11వయింటకుజుడు 2వ యింటరాహు వున్నచో ప్రభుత్వదండనము వలన ధనవ్యయమగును.

ఉ॥ మేషలగ్నమునకు ధనలాభాధి పతులగు శుక్రశనులు 6, 8, 12 భావములలో నెచ్చటనైన యుండగ, కుంభము (లేక ఏకాదశ భావము)లో కుజుడు, వృషభం(లేక ధనభావం)లో రాహువున్నయెడల పై యోగము సిద్ధించును. వృషభ, కుంభములు ధనలాభ భావమధ్య మములు కానిపక్షమున, యా భావమధ్యమములే రాశియందు పడున్నో వానినే గ్రహించ వలయును. రాశిస్థితిచే వృషభ గతుడగు రాహువు ధనభావమునుండి వేరొక భావములోనికి మారినచో పై యోగము పట్టజాలదు.

శ్లో॥ లాభే జీవే ధనే శుక్రే ధనేశే శుభసంయుతే।
వ్యయే చ శుభసంయుక్తే ధర్మకార్యే ధనవ్యయః॥ ౯

తా॥ జన్మలగ్నమునుండి లాభభావమందు గురుడు, ధనమందు శుక్రుడుండగ, ధనాధిపతి శుభగ్రహముతో కలసియుండి, వ్యయ మందు శుభగ్రహమున్నచో ధర్మకార్యములను గురించి ధనవ్యయము జరుగును.

వి॥ ధనభావమందు శుక్రుడు, లాభమందుగురుడుండగ, ధనాధి పతి శుభపూర్ణచంద్రులలో నొకరితో కలసి యుండవలెను. బుధచంద్రు లలో నొకరు వ్యయమందుండవలయును.

శ్లో॥ స్వోచ్చస్థే ధనాధీశే జాతకో జనపోషకః।
పరోపకారీ ఖ్యాతశ్చ విఖ్యాతో ధనసత్తమః ౧౦

తా॥ ధనాధిపతి స్వక్షేత్ర, ఉచ్చస్థానములలో నుండెనేని జాత కుడు అనేకమంది జనులను పోషించువాడు, పరోపకారి, ఖ్యాతిగల వాడు అగును.

శ్లో॥ స్థితే పారావతాంశాదౌ ధనే శుభసంయుతే।
తద్గృహే సర్వసంపత్తి ర్వినాఽఽయాసేన జాయతే॥ ౧౧

తా॥ ధనాధిపతి శుభగ్రహయుతుడై పారావతాంశాద్యంశములను బొందినచో నాజాతకుడు అనాయాసముగ సర్వసంపదలను సంపాదించును.

శ్లో॥ నేత్రేశే బలసంయుక్తే శోభనాక్షో భవే న్నరః।
షష్ఠాష్టమవ్యయస్థే చ నేత్రవైకల్యవాన్ భవేత్॥ ౧౨

తా॥ నేత్రాధిపతి బలవంతుడైనచో అందమైన నేత్రములుగలవాడగును. నేత్రాధిపతి షష్ఠాష్టమ వ్యయభావగతుడైనచో నేత్రవైకల్యము గలవాడగును.

శ్లో॥ ధనేశే పాపసంయుక్తే ధనే పాపసమన్వితే।
పిశునోఽసత్యవాదీ చ వాతవ్యాధిసమన్వితః॥ ౧౩

తా॥ ధనభావము, ధనాధిపతి పాపగ్రహములతో కూడినచో, జాతకుడు పిశునుడు అసత్యము లాడువాడు, వాతవ్యాధిచేత పీడింపబడువాడు అగును.

ఇతి బృహత్పరాశరహోరాశాస్త్రే - ధనభావఫలాధ్యాయః ॥౧౪॥
ఇది బృహత్పరాశరహోరాశాస్త్రమందు ధనభావఫలాధ్యాయము ముగిసెను.

## అథసహజభావఫలాధ్యాయః ॥౧౫॥

శ్లో॥ అథ విక్రమభావస్య ఫలం వక్ష్యామి భో ద్విజ।
సహజే సౌమ్యయుగ్దృష్టే భ్రాతృమాన్ విక్రమీ నరః॥ ౧

తా॥ ఓ ద్విజుడా! ఇప్పుడు విక్రమ (సహజ) భావము యొక్క ఫలములను చెప్పుచుంటిని. తృతీయ భావము శుభగ్రహములతో కూడినను, చూడబడినను జాతకుడు సోదర సోదరీలు కలవాడు, పరాక్రమవంతుడు అగును.

శ్లో॥ సభౌమో భ్రాతృభావేశో భ్రాతృభావం ప్రపశ్యతి।
భ్రాతృక్షేత్రగతో వాపి భ్రాతృభావం వివర్ధిశేత్॥ ౨

తా॥ భ్రాతృస్థానాధిపతి కుజునితో కూడి భ్రాతృభావమును చూచి నను, భావములో నున్నను సోదర సోదరీలుండును.

శ్లో॥ పాపయోగేన తౌ పాపక్షేత్రయోగే న వా పునః।
ఉత్పాద్య సహజాన్ పశ్చాద్ విహంతారౌ న సంశయః॥ ౩

తా॥ సోదర భావాధిపతి, కుజుడు పాపగ్రహములతో కలసి, పాపక్షేత్రములందున్నచో సోదర నష్టమును కలిగింతురు.

శ్లో॥ స్త్రీగ్రహో భ్రాతృభావేశః స్త్రీగ్రహో భ్రాతృభావగః।
భగినీ స్యాత్, తథా భ్రాతా పుంగ్రహో పుంగ్రహో యది॥ ౪
మిశ్రే మిశ్రఫలం వాచ్యం బలాబల వివేకయాత్।
మృతౌ కుజతృతీయేశౌ సహోదరవినాశకౌ॥ ౫

తా॥ భ్రాతృస్థానాధిపతి స్త్రీ గ్రహమై, భ్రాతృభావమందు స్త్రీ గ్రహమున్నచో సోదరీలు గలవాడును, పురుష గ్రహమై, పురుష గ్రహము భావమందున్నచో సోదరులు గలవాడును అగును. మిశ్రమముగ నున్నచో (స్త్రీ పురుష గ్రహములతో భావము కూడి యున్నను, భావాధిపతి పురుష గ్రహమై స్త్రీ గ్రహములతో కలసినను, స్త్రీ గ్రహమై పురుష గ్రహములతో కూడినను) సోదర సోదరీ లుండెదరు. భావాధిప, భావస్థ గ్రహముల యొక్క బలమునను సరించి ఫల నిర్ణయమును చేయవలయును. అష్టమభావమందు తృతీయాధిపతి, సోదర కారకుడగు కుజుడున్నచో సోదర భావము నష్టమగును.

శ్లో॥ కేంద్రత్రికోణగే వాఽపి స్వోచ్చ మిత్ర స్వవర్గగే।
కారకే సహజేశే వా భ్రాతృసౌఖ్యం వివర్ధయేత్॥ ౬

తా॥ తృతీయాధిపతి, కారకుడగు కుజుడు ఇద్దరుగాని యొక్కడై నగాని కేంద్రత్రికోణములందుగాని స్వోచ్చ, మిత్ర, స్వవర్గము లను గాని పొంది యుండిరేని సోదర సుఖము కలుగును.

శ్లో॥ భ్రాతృభే బుధసంయుక్తే తదీశే చంద్రసంయుతే।
కారకే మందసంయుక్తే భగిన్యేకా గ్రజో భవేత్॥ ౭
పశ్చాత్సహోదరో౽ప్యేక స్తృతీయస్తు మృతో భవేత్।

తా॥ సోదర భావమందు బుధుడుండగ, భ్రాతృభావాధిపతి చంద్రునితోను, కారకుడగు కుజుడు శనితోను కలసియుండినేని జాతకునకు జ్యేష్ఠ సోదరియు, జాతకుని యనంతరమందు ఒక సోదరుడును, యుండును. వాని తరువాత జన్మించిన సోదరుడు నష్టమగును.

శ్లో॥ కారకే రాహుసంయుక్తే సహజేశే తు నీచగే। ౮
పశ్చాత్సహోదరాభావం పూర్వం తు త్రితయం వదేత్।

తా॥ భ్రాతృకారకుడగు కుజుడు రాహువుతో చేరియుండగ, భ్రాతృస్థానాధిపతి నీచగతుడైన నవో జాతకుని తరువాత సోదరులుండరు. (కనిష్ఠ సోదరులుండరు.) జాతకునకు 3 గురు జ్యేష్ఠ సోదరులుండురు.

శ్లో॥ భ్రాతృస్థానాధిపే కేంద్రే కారకే తత్త్రికోణగే॥ ౯
జీవేన సహితే చోచ్చే జ్ఞేయా ద్వాదశసోదరాః।
తత్ర జ్యేష్ఠద్వయం తద్వజ్జాతకాచ్చ తృతీయకమ్॥ ౧౦
సప్తమం నవమం చైవ ద్వాదశం చ మృతం వదేత్।
శేషాః సహోదరాః షడ్వై భవేయు ర్దీర్ఘజీవినః॥ ౧౧

తా॥ భ్రాతృస్థానాధిపతి కేంద్రమందుండగ, కారకుడగు కుజుడు వానికి (తృతీయాధిపతికి) త్రికోణ రాశులలో తన యుచ్చయందు గురునితో చేరినచో నా జాతకునకు 12 గురు సోదరులుందురు అందు జ్యేష్ఠ ద్వయము, జాతకుని తరువాత 3, 7, 9, 12 సోదరులు నష్టమగుదురు. మిగిలిన 6 గురు (జాతకునితో సహా) దీర్ఘాయువు గలవారగుదురు.

శ్లో॥ వ్యయేశేన యుతో భౌమో గురుణా సహితో౽పి వా।
భ్రాతృభావే స్థితే చంద్రే సప్తసంఖ్యాస్తు సోదరాః॥ ౧౨

తా॥ కుజుడు వ్యయాధిపతితో గాని, గురునితో గాని కలసియుండగ, తృతీయమందు చంద్రుడుండనేని 7 గురు సోదరులుందురు.

కొందరు "వ్యయాధిపతియగు గురునితో కుజుడు చేరియుండగ తృతీయమందు చంద్రుడుండగ" యని యర్థమును గ్రహించుచున్నారు.

శ్లో॥ భ్రాతృస్థానే శశియుతే కేవలం పుంగ్రహేక్షితే।
సహజా భ్రాతరో జ్ఞేయాః శుక్రయుక్తే క్షితేఽన్యథా॥ ౧౩

తా॥ భ్రాతృస్థానమందు చంద్రుడుండి కేవల పురుషగ్రహము లచే చూడబడెనేని సహజన్ములు పురుషులగుదురు. శుక్రవీక్షితుడైనచో సహజన్ములు స్త్రీలగుదురు.

శ్లో॥ అగ్రే జాతం రవి ర్హన్తి పృష్ఠే జాతం శనైశ్చరః।
అగ్రజం పృష్ఠజం హన్తి సహజస్థో ధరాసుతః॥ ౧౪

తా॥ తృతీయ భావమందు రవి యున్నచో జ్యేష్ఠ్య సోదర నష్టము గలుగును. తృతీయ భావమందు శనియున్నచో కనిష్ఠ సోదర నష్టముగలుగును. తృతీయ భావమందు కుజుడున్నచో జ్యేష్ఠ కనిష్ఠ సోదరుల కుభయులకు నష్టము గలుగును.

శ్లో॥ ఏతేషాం విప్రః యోగానాం బలాబలవివిర్ణయాత్।
భ్రాతౄణాం భగినీనాం వా జాతకస్య ఫలం వదేత్॥ ౧౫

తా॥ ఓ బ్రాహ్మణుడా! పూర్వోక్తములైన యోగముల యొక్క బలాబలములను బాగుగ యోచించి సోదర సోదరీల యొక్క సుఖాసుఖములను తెలుపవలయును.

వి॥ తృతీయ భావమందు రవి యున్నప్పుడు ఇతర పాపగ్రహ సంబంధ వీక్షణములు లేని పక్షమున, రవి భావమధ్యగతుడు కాకుండ భావారంభ భాంత్యములలో నున్నప్పుడును జ్యేష్ఠ సోదరనష్టము కలుగుటలేదు. రవి భావమధ్యమములో నున్నప్పుడు గూడ గురుని వీక్షణమున్నచో జ్యేష్ఠ సోదర నష్టము కలుగుట లేదని తెలియుచున్నది. శని తృతీయమందు స్వక్షేత్రోచ్చ రాశులలో నున్నప్పుడు భావమధ్య

గతుడైనను కనిష్ఠ సోదర నష్టము గలుగుటలేదు. ఇతర రాశులు తృతీయ భావమైయుండు శని యున్నప్పుడు శుభవీక్షణమున్నను కనిష్ఠ సోదర సోదరీనష్టము గనబడుచున్నది. కుజుడు తృతీయమందుగల జాతకులకు కనిష్ఠ సోదరవర్గమునకు మాత్రమే నష్టముగలుగుచున్నది. మరియు జాతకుని తరువాత 2, 3, సోదరనష్టములైన తరువాత కలిగిన కనిష్ఠ సోదర సోదరీల కాయుర్దాయము పట్టుచున్నది. కాని జాతకులకు జ్యేష్ఠ సోదరాది నష్టము కలుగుచున్నట్లులేదు ఇట్టి తృతీయ కుజున్న జాతకులకు సోదరవర్గమునకు మైత్రీభావము తక్కువగుచున్నది. వీర లకు సోదరాదులతో విరోధభావముండుట సంభవించునవియు చెప్ప వచ్చును. కుజుడు తృతీయభావమందున్న జాతకులకు కనిష్ఠ సోదరులకు 8 సం॥రముల వయస్సులోపలనే ఆయుర్భంగ మగుచున్నది 8 సం॥ర ములు దాటినచో నట్టి నష్టములుండవనియు గూడ యను భవమావలన తెలియుచున్నది. ద్రేక్కాణ చక్రరీత్యా గూడ సోదరభావ విచారణ మును చేయవలయును. లగ్న, ద్రేక్కాణ లగ్నమందేది బలమో దానిననుసరించి ఫలమును చెప్పవలయును.

ఇతి బృహత్పరాశరహోరాశాస్త్రే - సహజభావ ఫలాధ్యాయః ॥౧౫॥

ఇది బృహత్పరాశరహోరాశాస్త్రమందు - సహజభావఫలాధ్యాయము ముగిసెను.

## చతుర్థ భావ ఫలాధ్యాయః ॥౧౬॥

బృహత్పరాశరహోరాశాస్త్రమందు - చతుర్థభావఫలాధ్యాయము

పరాశర ఉవాచ :-

శ్లో॥ ఉక్తం తృతీయభావస్య ఫలం సంక్షేపతో మయా।
౧ మతభావఫలం చాథ కథయామి ద్విజోత్తమ॥

। పరాశరులిట్లు చెప్పుచున్నారు. ఓ ద్విజోత్తమ! నాచే వ్యయము సంగ్రహముగ తెలుపబడినది. అనంతరమందు సుఖభావఫలమును చెప్పుచుంటిని.

శ్లో॥ సుఖేశే పంచభావస్థే లగ్నేశే తద్గతేఽపివా।
తదృష్టే చ జాతస్య పూర్ణం గృహసుఖం వదేత్॥ ౧

తా॥ సుఖస్థానాధిపతి (చతుర్థభావాధిపతి) గాని' లగ్నాధిపతి గానిసుఖ భావమందుండి శుభులచే చూడబడెనేని జాతకులకు పంపూర్ణమైన గృహసౌఖ్యముచే కూరును.

శ్లో॥ స్వగేహే స్వాంశగే వోచ్చే సుఖస్థానాధిపో యది।
భూమియానగృహాదీనాం సుఖం వాద్యభవం తథా॥ ౨

తా॥ సుఖాధిపతి స్వక్షేత్ర, ఉచ్చ, స్వాంశలలో నున్నచో భూమి-వాహన-గృహాదుల సుఖమును, వాద్య పరికరములవలన సుఖమును పొందును.

శ్లో॥ కర్మాధిపేన సంయుక్తే కేంద్రే కోణే గృహాధిపే।
విచిత్రసౌధప్రాకారై ర్మండితం తద్గృహం వదేత్॥ ౪

తా॥ చతుర్థభావాధిపతి దశమాధిపతితో కలసి కేంద్రకోణము లందుండెనేని విచిత్ర సౌధముగలవాడగును.

వి॥ చతుర్థభావాధిపతి నైసర్గిక పాపియై దశమాధిపతితో కలసినప్పుడు, చతుర్థాధిపతిమంద గ్రహమై శీఘ్రగతి గ్రహముగు దశమాధిపతితో కలసినప్పుడు, చతుర్థ దశమాధిపతులు నీచరాశ్యంశలందున్నప్పుడు ఈ యోగఫలము సరిపడుటలేదు.

శ్లో॥ బంధుస్థానేశ్వరే సౌమ్యే శుభగ్రహయుతేక్షితే।
కళతే లగ్నసంయుక్తే బంధుపూజ్యో భవే న్నర॥ ౫

తా॥ చతుర్థ (బంధు) స్థానాధిపతి శుభుడై శుభగ్రహసంయోగ వీక్షణములుగలవాడై యుండగ, లగ్నమందు బుధుడున్నచో జాతకుడు బంధు పూజ్యుడగును.

శ్లో॥ మాతృస్థానే శుభయుతే తదీశే స్వోచ్చరాశిగే।
కారకే బలసంయుక్తే మాతుర్దీర్ఘాయురాదిశేత్॥ ౬

తా॥ మాతృ (చతుర్థ) స్థానము శుభగ్రహయుతమై, మాతృభావాధిపతి స్వక్షేత్రోచ్చ రాశులలో నుండి, మాతృకారకుడు బలవంతుడైనచో తల్లికి దీర్ఘాయువుగలుగును.

శ్లో॥ సుఖేశే కేంద్రభావస్థే తథా కేంద్రస్థితో భృగుః।
శశిజే స్వోచ్చరాశిస్థే మాతుః పూర్ణంసుఖం వదేత్॥ ౭

తా॥ సుఖ (చతుర్థ) భావాధిపతి, శుక్రుడు కేంద్రగతులై యుండగ, బుధుడు స్వోచ్చరాశియందుండెనేని తల్లికి సంపూర్ణమైన సుఖముగలుగును. (తల్లివలన సంపూర్ణ సుఖము గలుగునని మరియొక భావము.)

శ్లో॥ సుఖే రవియుతే మందే చంద్రే భాగ్యగతే సతి।
లాభస్థానగతో భౌమో గో-మహిష్యాదిలాభకృత్॥ ౮

తా॥ సుఖభావమందు రవి శనులుండగ, చంద్రుడు భాగ్యమందు, కుజుడు లాభమందుండెనేని గోవులు, మహిషములు మొదలగు పశువులు గలుగును. (పశుసంపద గలవారగుదురని తాత్పర్యము.)

శ్లో॥ చరగ్రహసమాయుక్తే సుఖే తద్రాశినాయకే।
షష్ఠే వ్యయే స్థితే భౌమే నరః ప్రాప్నోతి మూకతామ్॥ ౯

తా॥ సుఖభావము, సుఖభావాధిపతి చర (చంద్ర, బుధ, శుక్రులు) గ్రహములతో చేరియుండగ, కుజుడు 6, 8 భావములందుండెనేని జాతకుడు మూగివాడగును.

శ్లో॥ లగ్నస్థానాధిపే సౌమ్యే సుఖేశే నీచరాశిగే।
కారకే వ్యయభావస్థే సుఖేశే లాభసంగతే॥ ౧౦
ద్వాదశే వత్సరే ప్రాప్తే వాహనస్య సుఖం వదేత్।

తా॥ లగ్నాధిపతి శుభగ్రహమై యుండగ, సుఖాధిపతి నీచయందున్నప్పుడు, కారకుడు వ్యయమందుండగ, సుఖాధిపతి లాభమందున్నప్పుడు ద్వాదశ (12వ) సంవత్సరమందు వాహన ప్రాప్తి గలుగును.

వి॥ ఈ విషయమను భవములో నరిపడుటలేదు.

శ్లో॥ వాహనే సూర్యసంయుక్తే తుచ్చే తద్భావనాయకే॥ ౧౧
శుక్రేణ సంయుతే వర్షే ద్వాత్రింశే వాహనంభవేత్॥

తా॥ వాహనభావమందు సూర్యుడుండగ, వాహనాధిపతి తన యుచ్చరాశియందు శుక్రునితో కలసినచో జాతకుని 32వ సం॥రములో వాహన ప్రాప్తి గలుగును.

శ్లో॥ కర్మేశేన యుతే బంధునాథే తుంగాంశ సంయుతే। ౧౨
ద్విచత్వారింశకే వర్షే నరో వాహనభాగ్భవేత్॥

తా॥ బంధుస్థానాధిపతి తన యుచ్చాంశయందుండి, దశమాధిపతితో కూడియుండెనేని జాతకుని 42వ సం॥ర మందు వాహన ప్రాప్తి గలుగును.

శ్లో॥ లాభేశే సుఖరాశిస్థే సుఖేశే లాభసంయుతే। ౧౩
ద్వాదశే వత్సరే ప్రాప్తే జాతో వాహనభాగ్భవేత్॥
శుభం శుభత్వే భావస్య పాపత్వే ఫల మన్యథా॥ ౧౪

తా॥ లాభాధిపతి సుఖభావమందు, సుఖాధిపతి లాభభావమందు పరివర్తనము నొందినచో జాతకుని 12వ సం॥ర మందు వాహనప్రాప్తి గలుగును. భావమునకు శుభగ్రహ సంబంధమున్నచో శుభఫలమును, పాపగ్రహ సంబంధమున్నచో పాపఫలమును చెప్పవలయును.

వి॥ ఈ యధ్యాయమందు చెప్పబడిన మాతృసుఖ, వాహన లాభాది విషయములను, వానికి సంబంధించిన యోగములను ద్వాదశాంశ, షోడశాంశ చక్రములలో గల గ్రహస్థితులకు సమన్వయపరచి చూచుట యుక్తము. పరాశరులు వర్గవివేకాధ్యాయమందు "ద్వాదశాంశే తథా పిత్రోశ్చింతనం షోడశాంశకే" సుఖాఽసుఖస్య విజ్ఞానం వాహనానాం తథైవచ॥యని తెలిపియున్నారు. కనుక మాతృభావ వాహనభావవిచారణ చేయునపుడు భావచక్రముతో పాటు ద్వాదశాంశ, షోడశాంశ చక్రములను గూడ విమర్శించి ఫలనిర్ణయమును చేయవలయును.

ఇతి బృహత్పరాశరహోరాశాస్త్రే- చతుర్థ భావఫలాధ్యాయః॥ ౧౬
ఇది బృహత్పరాశరహోరాశాస్త్రమందు - చతుర్థభావ ఫలాధ్యాయము ముగిసెను.

## పంచమభావ ఫలాధ్యాయము ॥౧౭॥

పరాశర ఉవాచ :-

శ్లో॥ అథ పంచమభావస్య కథయామిఫలంద్విజ।
లగ్నపే సుతభావస్థే సుతపే చ సుతే స్థితే॥ ౧
కేంద్రత్రికోణసంస్థే వా పూర్ణం పుత్రసుఖం వదేత్।

తా॥ లగ్నాధిపతి పంచమాధిపతి కలసి పంచమభావమందున్నను లేక వీరిద్దరు కేంద్రకోణము లందున్నను, సంపూర్ణమగు పుత్రసుఖము చేకూరును.

వి॥ మేషలగ్న జాతకులకు రవికుజులు పంచమములో భావమధ్యగతులైనప్పుడు, సింహలగ్న జాతకులకు రవిగురువులు పంచమభావమందున్నప్పుడు, కర్కాటకలగ్న జాతకులకు చంద్రకుజులు పంచమభావ ప్రథమదళ భాగలలో నున్నప్పుడు కన్యాలగ్న జాతకులకు బుధశనులు మకరమందు (పంచమభావమందు) న్నప్పుడు కుంభలగ్న

జాతకులకు బుధశనులు మిథునమందు (పంచమభావమందు) న్నప్పుడు సంతానయోగములు పట్టుటలేదు. కనుక దీనిని అనుభవములో జాగ్రత్తగ పరిశీలించ వలయును.

శ్లో॥ షష్ఠాష్టమవ్యయస్థే తు సుతాధీశే త్వపుత్రతా॥ ౨
సుతేశేఽస్తంగతే వాఽపి పాపాక్రాంతే చ నిర్బలే।
తదా న జాయతే పుత్రో జాతో వా మ్రియతే ధ్రువమ్॥ ౩

తా॥ పంచమభావాధిపతి 6, 8, 12 భావములందెచ్చటనున్నను సంతానము కలుగదు. పంచమాధిపతి అస్తంగతుడైనను, పాపగ్రహముల సంబంధముగల వాడైనను, బలహీనుడైనను సంతానము కలుగనేరదు. ఒకప్పుడు కలిగినను నిలువదు. అనగా కలిగిన సంతానము నష్టమగునని భావము.

శ్లో॥ షష్ఠస్థానే సుతాధీశే లగ్నేశే కుజసంయుతే।
మ్రియతే ప్రథమాపత్యం కాకవంధ్యా చగేహినీ॥ ౪

తా॥ పంచమాధిపతి షష్ఠభావమందుండగ, లగ్నాధిపతి కుజునితోచేరి యున్నచో ప్రథమ సంతానము నష్టమగును. ఆ జాతకుని భార్య కాక వంధ్యయగును. అనగా తరువాత సంతానము లేనిదగునని భావము.

శ్లో॥ సుతాధీశో హి నీచస్థో వ్యయషష్ఠాష్టమస్థితః।
కాకవంధ్యా భవేన్నారీ సుతే కేతుబుధౌ యది॥ ౫

తా॥ పంచమాధిపతి నీచగతుడై 6, 8, 12 స్థానములందుండగ పంచమమందు బుధకేతువులుండిరేని యా జాతకుని భార్య "కాక వంధ్య" యగును.

వి॥ సింహ కన్యా ధనుర్లగ్నములకు మాత్రము పంచమాధిపతులు షష్ఠాష్టమ స్థితిగలవారగుదురని రాశిచక్రవశముచే తెలియును భావస్ఫుట వశముచే ఇతర లగ్నములకు కూడ సంభవించును.

మేషలగ్నమునకు పంచమభావాధిపతి రవియై తులయందున్నప్పుడు తులలో షష్ఠమభావముగాని అష్టమభావముగాని యుండవచ్చును. ఇట్లే యితర లగ్నములకు కూడ తెలుసుకొన వలయును.

శ్లో॥ సుతేశో నీచగో యత్ర సుతస్థానం న పశ్యతి।
తత్ర సౌరిబుధౌ స్యాతాం కాకవంధ్యాత్వ మాప్నుయాత్। ౬

తా॥ పంచమాధిపతి నీచగతుడై పంచమ భావమును వీక్షించక పంచమమందు బుధశనులుండిరేని యా జాతకుని భార్య "కాకవంధ్య" యగును.

శ్లో॥ భాగ్యేశో మూర్తివర్తీ చేత్ సుతేశో నీచగో యది।
సుతే కేతుబుధౌ స్యాతాం సుతం కష్టా ద్వినిర్దిశేత్॥ ౭

తా॥ భాగ్యాధిపతి లగ్నమందు, పంచమాధిపతి నీచయందు, పంచమమందు బుధకేతువులుండిరేని అతికష్టముతో పుత్రలాభము గలుగును.

శ్లో॥ షష్ఠాష్టమవ్యయస్థో వా నీచో వా శత్రురాశిగః।
సుతేశశ్చ సుతే యాతే కష్టా త్పుత్రం వినిర్దిశేత్॥ ౮

తా॥ పంచమ భావాధిపతి 6, 8, 12, 5 స్థానములందుగాని, నీచ, శత్రుక్షేత్రములందుగాని యున్నచో కష్టమువలన పుత్రలాభము గలుగును.

వి॥ కష్టశబ్దమున కర్థమేమనగా :- సంతానము నిమిత్తము చిరకాలము వివిధోపాయముల ద్వారా చేయబడు ప్రయత్నముల వలన సంతానము గలుగునని చెప్పుటయే కాని ప్రసవమందు కష్టమని చెప్పరాదు.

శ్లో॥ పుత్రభావే బుధక్షేత్రే మందక్షేత్రేఽథవా పునః।
మందే మాందియుతే దృష్టే కదా దత్తాదయః స్మృతాః॥ ౯

తా॥ పుత్రభావము బుధ శని క్షేత్రములలోనొకటియై అందు శనియుండి మాంది గ్రహముతో కలసినను, చూడబడినను అజాతకునకు దత్త పుత్రయోగము కలుగును.

వి॥ పంచమభావము బుధ శని క్షేత్రములై వానియందు శని యున్నను సంతానము గలుగును. మాంది గ్రహసంబంధ వీక్షణము లున్నప్పుడు మాత్రమే సంతానము గలుగుటలేదు. మరియు మాంది గ్రహసంబంధ వీక్షణములున్నప్పుడు గురు వీక్షణగలిగినప్పుడు దత్తత యోగము సంభవించిన తరువాత నౌరస సంతానము గలిగినవారు గలరు.

శ్లో॥ రవిచంద్రౌ యదైకస్థౌ వేకాంశక సమన్వితౌ।
త్రిమాత్రాభి రథో భ్రాత్రా ద్విపిత్రా పి చ పోషితః॥ ౧౦

తా॥ ఏ జాతకునకు రవి చంద్రుల కేకరాశ్యంశ స్థితిగలుగునో యట్టి జాతకుడు 3 గురు తల్లులచేత, సోదరునిచేత, యిద్దరు తండ్రుల చేత పోషింపబడు వాడగును.

వి॥ ఇద్దరు తండ్రులనుటవలన జనకతండ్రి, దత్తత చేసుకొనిన తండ్రి యని చెప్పవలసియున్నది.

శ్లో॥ పంచమే షడ్గ్రహై ర్యుక్తే తదీశే వ్యయరాశిగే।
లగ్నేశేందూ బలాఢ్యౌ చే త్తదా దత్తసుతోదయః॥ ౧౧

తా॥ పంచమభావమందారు గ్రహములుండగ, పంచమాధిపతి వ్యయములో నుండి, లగ్నచంద్రులు బలవంతులైనచో దత్తపుత్ర లాభముగలుగును.

శ్లో॥ సుతేశే చంద్రసంయుక్తే తద్ద్రేక్కాణగతేఽపివా।
తదా హి కన్యకోత్పత్తిం ప్రవదే ద్దైవచింతకః॥ ౧౨

తా॥ పంచమభావాధిపతి చంద్రునితో కూడినను. చంద్ర ద్రేక్కాణమందున్నను స్త్రీ సంతతి గలుగును.

శ్లో॥ సుతేశే చరరాశిస్థే రాహుణా సహితే విధౌ।
పుత్రస్థానం గతే మందే పరజాతం వదే ద్ధ్రువమ్॥ ౧౩

తా॥ పంచమాధిపతి చరరాశి యందుండగ, రాహువు చంద్రునితో కూడియుండగ, పంచమమునందు శని యున్నచో నా జాతకునకు పరపురుషుని వలన సంతానము గలుగును.

శ్లో॥ సుతే జీవజ్ఞశుక్రైశ్చ సబలై రవలోకితే।
భవంతి బహవః పుత్రాః సుతేశే హి బలాన్వితే॥ ౧౪

తా॥ పంచమము బలవంతులగు బుధ గురు శుక్రులచే చూడబడుచుండగ, పంచమాధిపతి బలవంతుడయ్యేనేని అధిక పురుషసంతానము గలవాడగును.

శ్లో॥ లగ్నా దష్టమగే చంద్రే లగ్నాదష్టమగే గురౌ।
పాపగ్రహై ర్యుతే దృష్టే పరజాతో న సంశయః॥ ౧౫

తా॥ లగ్నమున కష్టమభావమందు చంద్ర గురులుండి పాపగ్రహములతో కలసిగాని, చూడబడుచుగాని యుండిరేని జాతకునకు పరజాత సంతానముండును.

వి॥ ఈ శ్లోకములో జాతకుడు పరజాతుడగునని యర్థముతోచును గాని పుత్రభావమందు చెప్పబడుటచేత పుత్రుడు పరజాతుడగునని చెప్పుట యుక్తము.

పుత్రస్థానాధిపే స్వోచ్చే లగ్నాద్వా ద్విత్రికోణగే।
గురుణా సంయుతే దృష్టే పుత్రభాగ్య ముపైతి సః॥ ౧౬

తా॥ పుత్రస్థానాధిపతి తన యుచ్చయందుగాని, లగ్నమునుండి 2, 5, 9 భావములందుండి, గురునితో కూడినను, చూడబడినను పుత్రసుఖము (పుత్రభాగ్యము)ను పొందును.

చతుః పాపసంయుక్తే సుతే సౌమ్య వివర్జితే।
సుతేశే నీచరాశిస్థే నీచసంస్థో భవేచ్ఛిశుః॥ ౧౬

తా॥ పంచమభావము 3 లేక 4 పాపగ్రహములతో కూడి యుండి శుభసంబంధములేనిదై యుండగ, పంచమాధిపతి నీచ రాశి యందుండెనేని జాతకుని పుత్త్రుడు నీచస్థితి నొందును.

పుత్రప్రాప్తి, పుత్ర వియోగ సమయజ్ఞానము.

పుత్రస్థానంగతే జీవే తదీశే భృగు సంయుతే।
ద్వాత్రింశే చ త్రయస్త్రింశే వత్సరే పుత్ర సంభవః॥ ౧౭

తా॥ గురుడు పుత్రస్థానమందుండగ, పుత్రాధిపతి శుక్రునితో కలసియుండెనేని, జాతకునకు ముప్పదిరెండు లేక ముప్పది మూడవ సంవత్సరమందుగాని పుత్ర సంతానము గలుగును.

సుతేశే కేంద్ర భావస్థే కారకేణ సమన్వితే।
షట్త్రింశే త్రింశదబ్దేచ పుత్రోత్పత్తిం వినిర్దిశేత్॥ ౧౮

తా॥ పుత్రస్థానాధిపతి యగు గ్రహము కేంద్రములందుండి పుత్త్రకారకుని చేరియుండెనేని ముప్పది ఆరు సంవత్సరములోగాని ముప్పదియవ సంవత్సరమందుగాని జాతకునకు పుత్ర ప్రాప్తిగలుగును.

లగ్నాద్భాగ్య గతే జీవే జీవాద్భాగ్య గతే భృగౌ।
లగ్నేశే భృగుయుక్తే వా చత్వారింశే సుతం వదేత్॥ ౨౦

తా॥ లగ్నమునుండి భాగ్యభావమందు గురుడు, వానికి భాగ్య భావమందు (లగ్నమునకు పంచమమందు) శుక్రుడుండగ లగ్నాధిపతి శుక్రునితో చేరియుండెనేని నలుబదియవ సంవత్సరమందు పుత్త్ర ప్రాప్తిగలుగును.

పుత్రస్థానం గతే రాహౌ తదీశే పాపసంయుతే।
నీచరాశిగతే జీవే ద్వాత్రింశే పుత్రమృత్యుదః॥ ౨౧

తా॥ పుత్రభావమందు రాహువుండగ, పుత్రభావాధిపతి పాప గ్రహములతో కూడియుండగ, గురుడు నీచరాశి యందుండినేని ముప్పది రెండవ సంవత్సరమందు సంతాన నష్టము కలుగును.

జీవాత్పంచమగే పాపే లగ్నాత్పంచమగే పిచ।
షట్త్రింశేచ త్రయస్త్రింశే చత్వారింశే సుతక్షయః॥ ౨౨

తా॥ గురునినుండి, లగ్నమునుండి పంచమ స్థానమందు పాప గ్రహమున్నచో ముప్పది యారవ సం॥ మందు, ముప్పది మూడవ సం॥ మందు, నలుబది సం॥ మందు సంతాన నష్టముండును.

లగ్నేమాంది సమాయుక్తే లగ్నేశే నీచరాశిగే।
షట్పంచా శత్తమేబ్దేచ పుత్రశోక సమాకులః॥ ౨౩

తా॥ లగ్నము మాంది గ్రహముతో కూడియుండగ, లగ్నాధిపతి తన యొక్క నీచరాశిని పొందినచో ఏబదియారవ (56) సం॥ మందు పుత్రశోకము గలుగును.

చతుర్థే పాపసంయుక్తే వష్ఠభావే తథైవహి।
సుతేశే పరమోచ్చస్థే లగ్నేశేన సమన్వితే॥ ౨౪
కారకే శుభసంయుక్తే దశసంఖ్యాస్తు సూనవః॥

తా॥ చతుర్థమందు, షష్ఠమందు పాపులుండి, పంచమాధిపతి పరమోచ్చగతుడై లగ్నాధిపతితో కలసియుండగ, కారకుడు శుభ గ్రహయుక్తుడైనచో నా జాతకునకు పదిమంది సంతానముగలుగును.

పరమోచ్చగతే జీవే ధనేశే రాహు సంయుతే॥ ౨౫
భాగ్యేశే భాగ్యసంయుక్తే సంఖ్యాతా నవసూనవః॥

తా॥ గురుడు పరమోచ్చగతుడై యుండి, ధనాధిపతి రాహువుతో కూడియుండగ, భాగ్యాధిపతి భాగ్య భావమందున్నచో తొమ్మిది సంఖ్యగల సంతానము గలుగును.

పుత్రభాగ్యగతే జీవే సుతేశే బలసంయుతే। ౨౬
ధనేశే కర్మభావస్థే వసు సంఖ్యాస్తు సూనవః।

తా॥ లగ్నాత్తు పంచమమందుగాని నవమ మందుగాని గురుడు బలవంతుడై యుండగ, ధనాధిపతి దశమ భావమందుండెనేని ఎనిమిది మంది సంతానము గలుగును.

పంచమాత్పంచమే మందే సుతస్థే చ తదీశ్వరే।
సూనవస్సప్త సంఖ్యాశ్చ ద్వితర్భేయ మతా భవేత్। ౨౬

తా॥ లగ్నమునుండి భాగ్యస్థానమందు శనియుండగ, భాగ్యాధిపతి పంచమ మందున్నచో సప్త సంఖ్యాక సంతానము గలుగును, ద్వితీయ గర్భమందు కవలపిల్లలు కలుగును.

విత్తేశే పంచమస్థానే సుతస్థేచ సుతాధిపే।
జాయంతే షట్సుతాస్తేష్వతేషాంచ త్రిప్రజామృతిః॥ ౨౭

తా॥ కుటుంబాధిపతి పంచమమునుండి పంచమాధిపతితో కూడియున్నచో ఆరుగురు సంతానము కలిగి, ముగ్గురు నష్టమగుదురు.

లగ్నాత్పంచమగే జీవే జీవాత్పంచమగేశనా।
సుతభేపాప సంయుక్తే పుత్రమేకం వినిర్దిశేత్। ౨౮

తా॥ లగ్నమునుండి పంచమ భావమందు గురుడు, గురునకు పంచమ భావమందు ఇతర పాపగ్రహములతో శని యుండగ, పంచమ భావము ఇతర పాపగ్రహములతో కూడిన యెడల ఒక పుత్రుడు మాత్రమే కలుగునని చెప్పవలయును.

పంచమే పాపసంయుక్తే జీవాత్పంచమగే శనౌ।
పత్న్యంతరే పుత్రలాభం కళత్ర త్రయభాగ్ భవేత్। ౩౦

తా॥ పంచమభావము పాపగ్రహములతో కూడియుండగ, గురునకు పంచమమందు శనియున్నచో మరియొక భార్యయందు సంతానము కలుగునవనియు, ముగ్గురు భార్యలుండగల రనియు చెప్పవలయును.

పంచమే పాపసంయుక్తే జీవాత్పంచమగేశనౌ।
లగ్నేశే ధనభావస్థే సుతేశే భౌమ సంయుతః
జాతం జాతం శిశుంహంతి దీర్ఘాయుశ్చ వ్యయం భవేత్। ౩౨

తా॥ పంచమభావము పాపగ్రహయుక్తమై, గురునకు పంచమమందు శని యుండగ, లగ్నాధిపతి ధనస్థానమందుండి కుజునితో పంచమాధిపతి కలిసినచో కలిగిన సంతాన మంతయు నష్టమగును, సంతతి లేనివాడై జాతకుడు దీర్ఘాయువుగల వాడగును.

వి॥ పంచమభావము వలన పుత్రులు, పౌత్రులు, విద్య, రాజ్యము, దేవతానుగ్రహము, బుద్ధివైశద్యము విద్య, యంత్రములు మంత్రానుష్ఠానము, భార్యా (స్త్రీ) మూలక భాగ్యప్రాప్తి, మంత్రిత్వము మొదలగు అనేక ముఖ్యాంశములు తెలుసు కొనవలయును. పంచమభావము, భావాధిపతి, భావస్థగ్రహము, భావవీక్షకులు వీరి యొక్క బలాబలమును బట్టియు, "పుత్ర పౌత్రాదికానాం వై చింతనం సప్తమాంశకే" అను పరాశర వచనానుసారము "సప్తమాంశ" గ్రహకుండలిలో గల గ్రహస్థితిని బట్టియు ఈ భావమును విచారించవలయును.

సంతాన సంబంధమైన, విద్యావిషయకమైన కొన్ని యోగము లిందుదహరింపబడుచున్నవి. సంతాన సంబంధములైన యోగములు:-

1. పంచమభావస్థ గ్రహములనుబట్టి, భావాధిపతి, కారకుడు, పంచమభావ వీక్షకునిబట్టి భావశుభాశుభములను ముందుగ తెలుసు కొనవలయును.

2. పంచమభావము, భావాధిపతి, భావస్థగ్రహము, కారకుడు, వీక్షకుడు పురుష రాశ్యంశములందుగాని, పురుష గ్రహసంబంధములు గాని గలిగియున్నయెడల పురుష సంతానమును, స్త్రీ రాశ్యంశము

లందుగాని, స్త్రీ గ్రహసంబంధములుగాని కలిగియున్న యెడల స్త్రీ సంతతిని, మిశ్రమముగ నున్నయెడల స్త్రీ పురుష సంతతులను చెప్ప వలయును.

3. సాధారణముగ బహుపుత్ర రాశులు పంచమ భావమై అందు బహు సంతాన ప్రదగ్రహములగు రవిరాహుగురువులున్నచో బహుళ సంతానము కలుగును. అల్ప సంతాన రాశులగు కర్కట, వృశ్చిక, మీనములందు బహుపుత్ర ప్రదగ్రహములున్నచో మధ్యమమైన సంతానము కలుగును.

4. స్త్రీ గ్రహములగు చంద్ర శుక్రులు స్త్రీ రాశ్యంశములందుండి రాహు సంబంధము కలిగినచో విశేష స్త్రీ సంతతిని, అల్పపుత్ర సంతతిని కలిగించెదరు. ఈ స్త్రీ గ్రహములు పురుష రాశ్యంశము లందుండి రాహువుకు సంబంధము కలవారైనప్పుడు స్త్రీ పురుష సంతానములు సమముగ నుండును.

5. పురుష రాశులందు నపుంసక గ్రహములుండి పుంసాంశము లను పొందినచో అల్పపురుష సంతానమును, స్త్రీ రాశులందుండి స్త్రీ నవాంశములను పొందినచో అల్ప స్త్రీ సంతానమును కలిగించును. రవితో కలసి అస్తమించినచో సంతానము లేకపోవుటగాని, కలిగినష్ట పోవుటగాని సంభవించును.

6. సప్తమాంశ చక్రమును గూడ పై విధముగ పరిశీలించి జన్మ లగ్నము బలమైనచో జన్మలగ్నమునుండి, సప్తమాంశ లగ్నము బలమైనచో సప్తమాంశ లగ్నమును బట్టియు సంతానమును నిర్ణ యించవలయును.

7. వంశవిచ్ఛేదయోగములుపట్టినప్పుడు స్త్రీ సంతానమును చెప్పవలయును.

8. పంచమమందు బుధ శనులలో నెవరైనయుండి వారికి శుభ సంబంధము లేనప్పుడు విలంబముగ సంతానము కలుగుననిగాని లేక సంతానముండదనిగాని చెప్పవలయును. ఈ బుధ శనులకు భావమధ్య స్థితిగలిగి గురు దృష్టియుండెనేని సంతానము గలుగును. గురుదృష్టితో కుజదృష్టి గూడయుండి మూండి గ్రహసంబంధమున్నచో ఒక సంతానము మాత్రము గలిగి కొంతవయస్సు దాటిన పిమ్మట సంతానము నష్టమగును.

9, నపుంసక రాశులందుగాని తన యొక్క నీచరాశి యందుగాని లగ్నాధిపతి యుండగ, పంచమ మందు కుజుడున్నచో గర్భధారణ జరిగి నష్టమగుననియు, శని రాహువులు పంచమములో నుండి పురుషాంశములను పొందినచో కాలవిలంబముతో పురుష సంతానము కలుగుననియు, స్త్రీ నవాంశములందున్నచో స్త్రీ సంతతి మాత్రమే గలుగుననియు, నపుంసక నవాంశములందున్నచో దత్త పుత్రాది యోగములు గలుగుననియు చెప్పవలయును.

10. చతుర్థమందొక పాపగ్రహముండగ, సప్తమమందు శుక్రుడు దశమమందు చంద్రుడున్నచో సంతానము లేనివాడగును పంచమమందు 'శుక్రుడు' రవితో కలసి అస్తమించినచో సంతానముండదు. వీరికి గురు దృష్టిసంపూర్ణముగయుండి లగ్నాధిపతి బలవంతుడైనచో సంతానము కష్టము మీాద, విలంబముగ గలుగును.

11. భాగ్యాధిపతి లగ్నమునుండి 5,7 రాశులందున్నచో సంతానము గలుగును. చంద్ర లగ్నమునుండి భాగ్యాధిపతి గూడ చంద్రునకు 5, 7 రాశులందున్నచో సంతానము గలుగును. భాగ్యాధిపతి శుభుడైనచో నిస్సంశయముగ గలుగును. పాపుడైనచో సంతాననష్టము గూడ యుండును.

పుత్రభావమునకుగాని, పుత్రభావ ద్రేక్కాణమునకుగాని, సప్తమాంశమునకుగాని కుజ శని సంబంధమున్నచో భావనష్టమును చెప్పవలయును. తారక భావాధిపతులకు గూడ కుజ శని సంబంధమున్న యెడల సంతాన ప్రాప్తి లేదని చెప్పదగును.

పుత్రభావ విచారణలో "సారావళి" యందు "పుత్రచింత"ను గురించిన వివరములు :–

i ఏకతమే గురువర్గే తదిరాశా వౌరసో భవేత్పుత్రః।
లగ్నాచ్చంద్రా దథవా బలయోగా ద్వీక్షితేఒపివా సౌమ్యైః॥

లగ్నచంద్రులలో నెవరు బలవంతులో వానినిబట్టి భావస్ఫుట రీతిచే వచ్చిన పంచమభావము శుభషడ్వర్గము గలదైనను, గురు వర్గము గలదైనను, ఔరసపుత్రుడు గలుగుననియు, లేక పంచమ భావమును సంపూర్ణ శుభగ్రహములు చూచినను ఔరసపుత్రుడు కలుగుననియు చెప్పవలయును. (ఔరసపుత్రుడనగా తన భార్యయందు తన వలన కలిగిన సంతానమని భావము)

ii సౌరర్తే సౌరగణో బుధదృష్టో గురుకుజా ర్కాదృగ్హీనః।
క్షేత్రజపుత్రం జనయతి బౌధోపి గణో రవిజ దృష్టః॥

పంచమభావము శని క్షేత్రమై ఆ భావము యొక్క శని షడ్వర్గము బుధునిచే చూడబడుచు, గురు కుజ రవుల దృష్టి లేనిదైనచో క్షేత్రజ పుత్రుడు గలవాడగును. ఇట్లే పంచమభావము బుధక్షేత్రమై ఆ భావము యొక్క బుధ షడ్వర్గము శనిచే చూడబడుచు, గురు కుజ రవి దృష్టి లేనిదైనచో క్షేత్రజ పుత్రుడు కలవాడగును.

మకరము పంచమ భావమైనప్పుడు రాశి, 1వ ద్రేక్కాణము, 7వ సప్తమాంశము, 1,2 నవాంశములు, 1,2 ద్వాదశాంశములు, 4వ త్రింశాంశము శని వర్గములగును. కుంభము పంచమ భావమైనప్పుడు

రాశి, 1వ ద్రేక్కాణము, 1వ సప్తమాంశము, 4,5 నవాంశములు 1,12 ద్వాదశాంశములు, 2వ త్రింశాంశము శని వర్గములగును. వీనికి బుధ దృష్టియుండవలెనని భావము. పుత్రస్థానము. మకరమై 1వ ద్రేక్కాణమునుగాని, 7వ సప్తమాంశమునుగాని, 1. లేక 2వ నవాంశమును గాని, లేక 2వ ద్వాదశాంశమును పొందినప్పుడుగాని 4వ త్రింశాంశమును పొందినప్పుడుగాని మకరమునకు సప్తమమగు కర్కాటమందు బుధుడుండి ఆయావర్గములను పొందినప్పుడు తత్తద్గణము (వర్గము)ను చూచును. ఇట్లే బుధక్షేత్ర, బుధగణమును గూడ చూచుకొనవలయును.

ఈ స్థితి గలిగినప్పుడు క్షేత్రజపుత్రుడు కలుగును.

(స్వభార్యయందు పరబీజమువలన జన్మించినవాడు క్షేత్రజుడు)

iii, iv మాందం సుతర్క్ష మిందుర్నిరీక్షితే యదిశనైశ్చరేణయుతమ్।
దత్తకపుత్రో శ్చత్రిః క్రీతస్య బుధేనదైవంస్యాత్॥

iii పుత్రస్థానము శనిక్షేత్రమై శనియుండి చంద్రునిచే చూడబడినచో దత్తపుత్రునుగలవాడగును.

iv బుధునిచే చూడబడెనేని క్రీతపుత్రుడు గలవాడగును. (ఇతర గ్రహదృష్టిలేనప్పుడు మాత్రమే చెప్పవలయును) ఇతరుల సంతానమును తెచ్చుకొని పెంచబడినవాడు దత్తుడనబడును. ధనమునిచ్చి తీసుకొని రాబడినవాడు క్రీతుడనబడును.

v సప్తమ భాగే కోణే సౌరయుతే పంచమే సహా తపనే।
కృత్రిమపుత్రం వింద్యాచ్ఛేషగ్రహ దర్శనాన్ముక్తే॥

పంచమభావము యొక్క సప్తమాంశము కుజాధిపత్యముగలదై శనితో కూడియుండి ఇతర గ్రహముల దృష్టిలేక యుండెనేని కృత్రిమ పుత్రుడుగలవాడగును. (కృత్రిమ పుత్రుడనగా మాతాపితరులచే నివ్వబడక స్వయముగ పొందబడినవాడు కృత్రిమ పుత్రుడు.)

vi. వర్గే పంచమ రాశౌ పాపే సూర్యేణ చాత్ర సంయుక్తే ।
లోహితదృష్టే వాచ్యో జాతస్య హి బీజజః పుత్రః ॥

(సూతోధమప్రభవః) పాఠాంతరము.

పంచమ భావమందొకవర్గము శని వర్గమైయుండి రవితో కలసి కుజునిచే చూడబడనేని బీజజుడను పుత్రుగల వాడగును. (బీజజుడనగా విధిప్రకారము వివాహితగాని భార్యయందు స్వబీజోత్పన్నుడు బీజజుడనబడును) లేక (అధమజాతి స్త్రీయందు బుట్టినవాడు అనిపాఠాంతరము)

vii. చంద్రే భౌమాంశ గతేఽస్థే మందావలోకితే భవతి ।
గూఢోత్పన్నః పుత్రశ్చేన్యగ్రహ దర్శనాభావే ।

పంచమమందు చంద్రుడుండి కుజాంశమును (కుజసప్తమాంశ మనుటయుక్తము) పొంది శనిచే చూడబడుచు, ఇతర గ్రహదృష్టిలేని వాడైనచో గూఢోత్పన్న పుత్రుడుగలవాడగును. గూఢోత్పన్నుడనగా గృహమందుగల పరపురుషునివలన రహస్యముగ తన భార్యయందు బట్టినవాడు)

viii. తస్మిన్నేవచ భౌమే శనివర్గస్థే నిరీక్షితే రవిణా ।
పురుషస్య భవతి పుత్రోఽపవిద్ధ ఇతి కరుణముని వచనాత్ ।

పంచమ భావమందు కుజుడుండి శని వర్గమును పొంది రవిచే చూడబడనేని అపవిద్ధపుత్రుడు గలవాడగును. (తల్లిదండ్రులచే విడువబడి తనచే గ్రహించబడిన వాడపవిద్ధుడనబడును.)

ix. శనివర్గస్థే చంద్రే శనియుక్తే పంచమే సదాభవనే ।
శుక్ర రవిభ్యాం దృష్టే పుత్రః పౌనర్భవో భవతి ॥

చంద్రుడు శని షడ్వర్గములలో నేదైననొక వర్గమునుపొంది, పంచమభావమందు శనితో గూడినవాడై రవి శుక్రులచే చూడబడనేని యా జాతకునకు పౌనర్భవుడను పుత్రుడుగలవాడగును. (పౌనర్భవుడనగా మారుమనువుగల స్త్రీయందు పుట్టినవాడు)

x చూడాయదార్క నక్షత్రకలాథ తస్యైవ పంచమే గేహే।
రవిదృష్టేవ్యథ సహితే కానీన స్సంభవతి పుత్రః॥

పంచమ భావమందు శనియుండి శనియొక్క పాదకాంశగతుడై యుండగ, పంచమభావము రవితో కూడినను చూడబడినను కానీనుడను పుత్రుడుగలవాడగును. (కానీనుడనగా వివాహముకాక పూర్వమే కన్యావస్థలో స్త్రీకి పుట్టినవాడు).

ని॥ "చూడాయదార్కసత్వా త్కాలా ద్యతస్యైవ పంచమే భవనే" పాఠాంతరము.

xi వర్గే రవిచంద్రమసో స్సుత గేహే చంద్రసూర్య సంయుక్తే।
శుక్రేణదృష్టమాత్రే పుత్రః కథితస్సహోఢశ్చ॥

పంచమ భావము సూర్యుని యొక్క లేక చంద్రుని యొక్క వర్గములను పొందియుండగ అందు రవిగాని చంద్రుడుగాని యుండి శుక్రునిచే చూడబడినచో సహోఢుడను పుత్రుడుగల వాడగును.

సహోఢుడనగా వివాహ సమయమునకు తల్లి యొక్క గర్భమందున్న శిశువు, గర్భమును ధరించిన స్త్రీని వివాహ మాడినవాడు, ఆమెకు కలిగిన పుత్రుని పుత్రునిగ స్వీకరించువాడని భావము.

ఇక్కడ పంచమభావమందు రవియుండి శుక్రునిచే చూడబడవలయునని గలదు. సప్తమ దృష్టిగాక విశేష దృష్టిని గ్రహించి నప్పుడుగాని లేక యితర వర్గాంశములందుగాని యని గ్రహించవలసి యుండునని తోచుచున్నది. మేషము లగ్నమైనప్పుడు పంచమభావము సింహనవాంశ మందుండగ అందురవి యున్నాడనుకొనుము. శుక్రుడు మిథునగతుడై కుంభ నవాంశమందున్నప్పుడు పంచమభావ నవాంశ ముగు సింహమును అందున్న సూర్యుని నవాంశమందు శుక్రుడు సప్తమ

దృష్టితో చూచును. ఇట్లే ఇతర వర్గములందూహించవలయు నని సూచరించుచున్నది.

xii శుక్రనవాంశే తస్మిన్ శుక్రేణ నిరీక్షితే త్వపత్యాని।
దాసీ ప్రభవాని వదేచ్చంద్రా దపికేచి దాచార్యాః॥

పుత్రభావమందైన నవాంశములలో నొకటి శుక్రాధిపత్యము గలదై శుక్రునిచే చూడబడెనేని దాసీపుత్రులు గలవాడగును. ఇట్లే చంద్రుని నుండియు తెలియ దగినదని కొందరి మతము.

పై శ్లోకములందు 12 రకముల పుత్రయోగములు తెలుపబడినవి. రాశిలేక భావచక్రరీతిచే పై యోగములు పట్టినను, సప్తమాంశ చక్రమందు గూడ పై యోగ లక్షణములు గోచరించినప్పుడే నిశ్చయముగ చెప్పవలయును.

మరియు అనపత్యయోగములు, వంశ విచ్ఛేదయోగములు, సంతాన నష్టయోగములు మొదలగు విశేషములను గ్రంథాంతముల నుండి తెలుసుకొనవలయును.

పరాశరుని మతములో పంచమభావమునుబట్టి విద్యను విచారించవలయును. మరియు "విద్యాయాం వేద బాహ్వంశే" అను వచనమునుబట్టి "చతుర్వింశాంశ" చక్రమునుబట్టి గూడ విద్యా విచారణను చేయవలయును. మతాంతరములందు ద్వితీయ, చతుర్థభావములు గూడ విద్యను తెలుపుభావములుగ చెప్పబడినవి. నాచే వ్రాయబడిన "భావార్థ రత్నాకర" ఆంధ్రవ్యాఖ్యలో విద్యావిచారణ విపులముగ వ్రాయబడినది. దానిని చూడవలయును.

ఇతి శ్రీ బృహత్పరాశరహోరాశాస్త్రే పంచమభావఫలాధ్యాయః ॥౧౬॥
ఇది శ్రీ బృహత్పరాశరహోరాశాస్త్రమందు పంచమభావఫలాధ్యాయము ముగిసెను.

## షష్ఠభావ ఫలాధ్యాయః ౧౮

శ్లో॥ అథ విప్రః ఫలం వక్ష్యే షష్ఠభావ సముద్భవమ్।
దేహే రోగవ్రణాద్యం తత్ శ్రూయతా మేకచేతసా॥ ౧॥

పరాశరుడిట్లు చెప్పుచున్నాడు.

తా॥ ఓ ద్విజశ్రేష్ఠా! షష్ఠభావసంబంధమైన రోగములు వ్రణములు మొదలగు ఫలములను చెప్పుచుంటిని. సావధానచిత్తుడవై వినుము.

శ్లో॥ షష్ఠాధిపః స్వగేహే వా దేహే వా వ్యష్టమే స్థితః।
తదా వ్రణో భవే ద్దేహే షష్ఠరాశిసమాశ్రితే॥ ౨॥

తా॥ జన్మలగ్నమునుండి షష్ఠభావాధిపతి స్వక్షేత్రమందుగాని, లగ్న, షష్ఠ, అష్టమములందుగాని యుండెనేని దేహమందు వ్రణములు కలుగును.

ఏవం పిత్రాదిభావేశా స్తత్తత్కారక సంయుతాః।
వ్రణాధిప యుతాశ్చాపి షష్ఠాష్టమయుతా యది॥ ౩॥
తేషా మపి వ్రణం వాచ్య మాదిత్యేన శిరోవ్రణమ్॥

తా॥ పైన చెప్పిన విధముగ పితృమాతృసోదరాది భావాధపతులు ఆయాకారకులతో గూడి షష్ఠాష్టమము లందుండిరేని వ్రణాది దోషములు గలవారగుదురు. పిత్రాదిభావాధిపతులు షష్ఠాధిపతియగు రవితో కూడి షష్ఠాష్టమములందుండిరేని శిరోవ్రణము గలుగునని చెప్పవలయును.

ఇందునా చ ముఖే కంఠే భౌమేన జ్ఞేన నాభిమ॥ ౪॥
గురుణా నాసికాయాంచ భృగుణా నయనే పదే।
శనినా రాహుణా కుక్షౌ కేతునా చ తథా భవేత్॥ ౫॥

తా॥ చంద్రునితో గూడినచో ముఖమందు, కుజునితో గూడినచో కంఠమందు, బుధునితో కూడినచో నాభియందు, గురుసంబంధము గలిగినచో నాసికయందు, శుక్రునితో కలిసినచో నయనములందు

శనితో చేరినప్పుడు పాదములందు, రాహుకేతువులతో కూడినచో కుక్షి(కడుపు)యందు వ్రణములు గలుగును.

వి॥ జన్మలగ్నాదిభావాధిపతులు షష్ఠాధిపత్యముగల రవ్యాది గ్రహములతో కలిసి షష్ఠ అష్టమ భావము లందుండిరేని యా యాస్థానములందు వ్రణములు గలవారగుదురు. లేక ఆయా అవయవ సంబంధములైన రోగములు గలవారగుదురు.

"సర్వార్థ చింతామణి"లో షష్ఠాధిపతికి కర్మభావస్థితి గూడ చెప్పబడినది.

షష్ఠేశ్వరే క్రూరయుతే విలగ్నే రంధ్రస్థితే వా వ్రణద శ్శరీరే।
కర్మస్థితే తాదృశ ఖేచరేంద్రే వ్రణప్రదోఽంగే శుభదృష్టియోగే॥
పిత్రాదిభావా దపి యోజనీయం భావేశ తత్కారక దృష్టియోగాత్।

అనుచోట, షష్ఠాధిపతి కర్మస్థానమందుండి క్రూరగ్రహములతో కూడినను, శుభదృష్టి గలిగినను, వ్రణప్రదు డగునని తెలిపియుండెను. పిత్రాదిభావములను గూడ విచారించునప్పుడీ విధముగనే విచారించి ఫలమూహించవలయు ననెను.

శ్లో॥ లగ్నాధిపః కుజక్షేత్రే బుధభే యది సంస్థితే।
యత్ర కుత్ర స్థితో జ్ఞేన వీక్షితో ముఖరుక్ప్రదః॥

తా॥ లగ్నాధిపతి కుజక్షేత్రములందుగాని బుధక్షేత్రములందు గాని యుండి బుధునిచే చూడబడెనేని ముఖరోగము గలవాడగును.

వి॥ జాతకతత్త్వసూత్రములందు రోగభావము 82వ సూత్రములో;

కుజర్క్షే అంగేశే జ్ఞయుతే ముఖరోగః అని

కుజక్షేత్రములందు లగ్నాధిపతి బుధునితో కలిసియుండిన ముఖరోగము సంభవించునని చెప్పియుండెను.

## కుష్ఠరోగయోగములు

శ్లో॥ లగ్నాధిపౌ కుజజ్ఞౌ చంద్రేణ యది సంయుతౌ।
రాహుణా శనినా సార్ధం కుష్ఠం తత్ర వినిర్దిశేత్॥ ౧।

తా॥ కుజుడుగాని, బుధుడుగాని లగ్నాధిపతులై చంద్రునితో కూడియుండగ వారికి శనిరాహువుల కలయిక గలిగినప్పుడు కుష్ఠవ్యాధి వచ్చును.

వి॥ కుజ చంద్ర శని రాహువులు లేక బుధ చంద్ర శని రాహువులు కలిసియుండవలయును.

శ్లో॥ లగ్నాధిపం వినా లగ్నే స్థిత శ్చేత్తమసా శశీ।
శ్వేతకుష్ఠం తదా కృష్ణకుష్ఠం చ శనినా సహ॥ ౨॥
కుజేన రక్తకుష్ఠం స్యా త్తత్రదేవం విచారయేత్॥

తా॥ లగ్నాధిపతితో సంబంధములేని చంద్రుడు రాహువుతో కలసి లగ్నమందుండనేని శ్వేతకుష్ఠవ్యాధి కలుగును. శనితో చేరిన యెడల కృష్ణకుష్ఠవ్యాధిని, కుజునితో చేరినచో రక్తకుష్ఠవ్యాధిని, కలిగించును.

వి॥ "జాతకపారిజాత"మందు 6 అ 86 శ్లో॥లో;
హిత్వా లగ్నపతిం విలగ్నసహితే వ్యర్వ్యేషు కుష్ఠం వదే
న్నీలం భానుసుతే తు చండకిరణే రక్తం సితం భూమిజే।
మందేన క్షితిజేన వా యది యుతే కర్క్యంత్యవక్రాంశకే।
చంద్రే శోభనయోగ దృష్టిరహితే కుష్ఠం వదే ద్దేహినామ్॥

లగ్నాధిపతి కాక యితరయే పాపగ్రహములైనను లగ్నమందున్నప్పుడు, శనియైనచో నీలకుష్ఠము' సూర్యుడున్నచో రక్తకుష్ఠమును, కుజుడున్నచో శ్వేతకుష్ఠమును, కలిగించును. ఈ యోగమందు చంద్రుడు కర్కటము యొక్క అంత్యనవాంశమందుగాని, మకరనవాంశమందు గాని యుండు కుజునితోగాని శనితోగాని లేక యిద్దరితోగాని కలిసి

శుభగ్రహయుతిదృష్టులు లేనివాడై యుండవలయును. చంద్రునకే శుభగ్రహముతో నైనను సంబంధత్రయములో నేదికలిగినను, ఈ యోగమును చెప్పకూడదని తాత్పర్యము.

గ్రంథకర్త యీ యోగమును చెప్పుటలో సాధారణముగ చెప్పినట్లు తోచుచున్నది. లగ్నమందొక పాపగ్రహముండి చంద్రుడు మీన మకరాంశములో నుండి శుభదృష్టి లేనంతమాత్రమున యీ యోగము అనుభవములో ఫలించుటలేదు. (ఒక మేషలగ్న జాతకులకు లగ్నమందు శని మకరములో చంద్రుడుండి మీనాంశము నొందెను. ఆజాతకునకు ఏ విధమైన రోగమును లేదు). గ్రంథాంతరములో నీ యోగమును గురించి, ఇట్లు గలదు.

"దైవజ్ఞాభరణము"లో

లగ్నాధీశేందుపుత్రౌ క్షితితనయవిశానాయకౌ క్వాపి సంస్థౌ।
యుక్తౌ స్వర్భానునా వా యది భవతి నరః కేతునా శ్వేతకుష్ఠీ।
ఆదిత్యే భౌమయుక్తే తదను శనియుతే రక్తకుష్ఠాఖ్యకుష్ఠీ।
సార్కే లగ్నాధినాథే వ్యయరిపునిధనస్థానగే తాపగండః॥

అనగా లగ్నాధిపతి బుధునితో కలసియుండగ కుజచంద్రులు కూడ ఎక్కడైనను కలిసియుండగ వీరికి రాహుకేతువులతో సంయోగముండెనేని శ్వేతకుష్ఠము గలుగును. రవికుజశనులు కలిసినప్పుడు రక్తకుష్ఠము గలుగుననియు, లగ్నాధిపతి రవితో కలసి 6, 8, 12 స్థానములందుండెనేని తాప గండము గలుగుననియు చెప్పవలయును. (రవికి ముందుభాగలలో కుజుడు వానికిముందుభాగలలో శని యుండవలయునని గ్రహించవలయును. క్రమభంగమైనచో యోగముకలుగనేరదు).

చంద్రో మేషే వృషే వా కుజశనిసహితః శ్వేతకుష్ఠీ నరోగో
దైత్యేజ్యార్కేందుమందాస్త్రిమిథునవగతాః కర్కటాళిస్థితా వా।
అంగే హిమ్యేవ హీనే పరమకలుషకృద్రక్తకుష్ఠీ నరస్స్యాత్।
వాగీశో భార్గవో వా యది రిపుగృహగో మూర్తిగైః క్రూరఖేటైః॥

1. మేషమందుగాని వృషభమందుగాని చంద్రుడు కుజశనులతో కూడియుండెనేని శ్వేతకుష్ఠము గలుగును. శుక్ర, కుజ చంద్ర శనులు కర్కాటక, వృశ్చిక, మీనరాశులలో నెందైన నుండగ లగ్నములో శుభగ్రహములు లేనప్పుడును, ద్వితీయాధిపతిగాని, శుక్రుడుగాని షష్ఠ భావమందుండగ లగ్నమునకు సంపూర్ణ శుభవీక్షణము లేనప్పుడు పాపగ్రహములు లగ్నములో నుండుట చేత కుష్ఠవ్యాధి సంభవించును.

"చంద్రేణ వాథ శిఖినాపివ కుత్ర సంస్థా
లగ్నేశ సౌమ్యధరణీతనయాః స్థితా శ్చేత్।
గుహ్యే వదంతి సితకుష్ఠరుజం బుధారౌ
లగ్నేపి వా యది తదాతు తథైవ కుష్ఠః॥

లగ్నాధిపతి, బుధుడు, కుజుడు యీ ముగ్గురు చంద్రునితోగాని, కేతువుతోగాని కలసి యొక్కడుండినను గుహ్యమందు శ్వేతకుష్ఠముండును. కుజబుధులు లగ్నమందున్నను కుష్ఠవ్యాధి కలుగునని చెప్పవలయును.

లగ్నాధిపబుధౌ యత్ర సూర్యాంగారక సంస్థితౌ।
జాతస్య రక్తకుష్ఠం తు శీర్షే కర్ణేఽపి వా భవేత్॥

లగ్నాధిపతి, బుధుడు వీరిద్దరు రవికుజులతో కలసి యొక్కడున్నను, శిరస్సునందుగాని, చెవియందుగాని రక్తకుష్ఠము కలుగును.

## గండాది రోగయోగములు

లగ్నే షష్ఠేశమాలికౌ రవిణా యది సంయుతౌ॥ ౯।
జ్వరగండః కుజే గ్రంధిః శస్త్రవ్రణ మథాపి వా॥
బుధేన పిత్తం గురుణా రోగాభావం వినిర్దిశేత్॥ ౧౦

తా॥ లగ్నాధిపతి షష్ఠాపతి రవితో కూడియుండిరేని జ్వరగండ మును, కుజునితో చేరినప్పుడు గ్రంధులు లేక శస్త్రభయము వ్రణ

ములు గలుగును. బుధునితో చేరియుండిరేని పిత్తదోషజనితవ్యాధు లుండును. గురునితో కలిసిరేని రోగములేకుండ మంచి ఆరోగ్యముతో నుండును.

ప్లీహః శుక్రేణ శనినా వాయునా సంయుతో యది।
గండ శ్చాండాలతో నాభౌ తమః కేతుయుతే భయమ్॥ ౧౧॥

తా॥ లగ్నాధిపషష్ఠాధిపతులు శుక్రునితో కూడిరేని స్త్రీ మూలక వ్యాధులు, శనితో కూడినచో వాత జనిత వ్యాధులు గలుగును. రాహువుతో చేరినచో చండాలునివలన భయమును, కేతువుతో కూడినచో నాభియందు రోగమును కలిగించును.

శ్లో॥ చంద్రేణ గండః సలిలైః కఫశ్లేష్మాదినా భవేత్।
ఏవం పిత్రాదిభావానాం తత్తత్కారకయోగతః॥ ౧౨
గండం తేషాం వదే దేవ మూహ్య మత్ర మనీషిభిః॥

తా॥ లగ్నషష్ఠాధిపతులు చంద్రునితో కూడిరేని జలముచేత, కఫశ్లేష్మాదిదోషములచేత, గండములు గలుగును. ఈ విధముగ పిత్రాది భావములకు గూడ తత్తద్భావకారక సంబంధముచేత ఫలమూహించ వలయును.

## రోగప్రాప్తి సమయము

శ్లో॥ రోగస్థానగతే పాపే తదీశే పాపసంయుతే। ౧౩
రాహుణా సంయుతే మందే సర్వదా రోగసంయుతః॥

తా॥ షష్ఠస్థానమందు పాపగ్రహముండి, షష్ఠాధిపతి మరియొక పాపగ్రహముతో కలసియుండగ శని రాహువుతో కలసిన యెడల సర్వదా రోగవంతుడగును.

వి॥ నైసర్గిక పాపులగు రవికుజశని రాహువులలో షష్ఠమందొక పాపగ్రహముండి, షష్ఠాధిపతితో నొక పాపగ్రహము కలిసియుండగ,

శనిరాహువులిద్దరు ఒకే రాశియందుండిరేని సర్వదా రోగవంతుడగును.

శ్లో॥ రోగస్థానగతే భౌమే తదీశే రంధ్రసంయుతే। ౧౪
షడ్వర్షే ద్వాదశే వర్షే జ్వరరోగీ భవే న్నరః॥

తా॥ షష్ఠమందు కుజుడుండగ, షష్ఠాధిపతి అష్టమమునందుండెనేని 6 లేక 12వ సం॥రమందు జ్వరముచే విశేషముగ పీడింపబడును.

శ్లో॥ షష్ఠస్థానగతే జీవే తద్గ్రహే చంద్రసంయుతే॥ ౧౫
ద్వాత్రింశే కోనవింశేఒబ్దే కుష్ఠరోగం వినిర్దిశేత్।

తా॥ షష్ఠభావమందు గురుచంద్రులు కలిసియున్నచో 19 లేక 22వ సం॥ర మందు కుష్ఠవ్యాధి సంక్రమించును.

శ్లో॥ రోగస్థానం గతో రాహుః కేంద్రే మాందిసమన్వితే। ౧౬
లగ్నేశే నాశరాశిస్థే షడ్వింశే క్షయరోగతా॥

తా॥ రోగస్థానమందు రాహువుండగ, ఏదైననొక కేంద్రమందు మాందియుండి, లగ్నాధిపతి యష్టమస్థానమందుండెనేని 26 వ సం॥ర మందు క్షయవ్యాధి గలుగును

శ్లో॥ వ్యయేశే రోగరాశిస్థే తదీశే వ్యయరాశిగే॥ ౧౭
త్రింశద్ద్వాత్రింశకోనవర్షే గుల్మ రోగం వినిర్దిశేత్॥

తా॥ షష్ఠవ్యయాధిపతులు పరివర్తనమును పొందినచో 29 లేక 30వ సం॥రమందు గుల్మరోగముచే పీడింపబడును.

వి॥ మరియొక యోగమును గురించి "జాతకతత్వ సూత్రములలో శత్రుభావము 98వ సూత్రము.

'కర్కాలి ఘటాంశే చంద్రే శనియుతే గుల్మరోగః॥"

చంద్రుడు కర్కాటక, వృశ్చిక, కుంభ నవాంశములందుండి శనితో కూడినచో" గుల్మరోగము కలుగును.

శ్లో॥ రిపుస్థానగతే చంద్రే శనినా సంయుతే సతి। ౧౮
పంచపంచాశదబ్దేషు రక్తకుష్ఠం వినిర్దిశేత్।

తా॥ శనిచంద్రులు కలసి షష్ఠభావమందున్నచో 55వ సం॥ర మందు రక్తకుష్ఠవ్యాధి గలుగును.

శ్లో॥ లగ్నేశే లగ్నరాశిస్థే మందే శత్రుసమన్వితే। ౧౯॥
ఏకోనషష్టివర్షేతు వాతరోగార్దితో భవేత్॥

తా॥ శనిలగ్నాధిపతియై లగ్నమందు శత్రుగ్రహముతో గూడి నచో 59వ సం॥రమందు వాతరోగముచే పీడింపబడును.

వి॥ శనికి శత్రువులగు రవిచంద్రకుజాలలో చంద్రసంబాధము ముఖ్యముగ చెప్పదగినది.

శ్లో॥ రంధ్రేశే రిపురాశిస్థే వ్యయేశే లగ్నసంస్థితే। ౨౦
చంద్రే షష్ఠేశ సంయుక్తే వసువర్షే మృగాద్భయమ్॥

తా॥ అష్టమాధిపతి షష్ఠమందు, వ్యయాధిపతి లగ్నమందుండగ, చంద్రుడు షష్ఠాధిపతితో కూడినచో 8వ సం॥ర మందు మృగభీతి గలుగును.

శ్లో॥ షష్ఠాష్టమగతో రాహు స్తస్మా దష్టగతే శనౌ। ౨౧
జాతస్య జన్మతో విప్ర। ప్రథమేచ ద్వితీయకే।
వత్సరేఽగ్నిభయం తస్య త్రివర్షే పక్షిదోషభాక్॥ ౨౨

తా॥ రాహువు జన్మలగ్నమునుండి 6, 8 రాశులలో నొకచోట నుండగ, వాని కష్టమమందు శనియున్నచో ప్రథమద్వితీయవత్సరము లందగ్నిభయమును, మూడవవత్సరమందు పక్షిదోషమును పొందును.

వి॥ లగ్నషష్ఠములందు శనిరాహువులున్నను, తృతీయాష్టమము లందు శనిరాహువులున్నను ఈ యోగము పట్టును.

శ్లో॥ షష్ఠాష్టమగతే సూర్యే తద్వ్యయే చంద్రసంయుతే।
పంచమే నవమే ౽బ్దే తు జలభీతిం వినిర్దిశేత్॥ ౨౩

తా॥ జన్మలగ్నమునుండి సూర్యుడు 6, 8 రాశులలో నెందైన నుండగ వానికి వ్యయమందు చంద్రుడున్నచో 5 లేక 9 సం॥రమందు జలభయము(జలగండము)ను పొందును.

శ్లో॥ అష్టమే మందసంయుక్తే రంధ్రా ద్వ్యాదశే కుజః।
త్రింశాబ్దే దశమేబ్దే వా స్ఫోటకాది వినిర్దిశేత్॥ ౨౪

తా॥ జన్మలగ్నమునుండి అష్టమమందు శనియుండగ అష్టమమునకు వ్యయమందు కుజుడున్నచో 10వ సం॥రమందు లేక 30వ సం॥రమందు స్ఫోటకాదిరోగములు వచ్చును.

వి॥ జన్మలగ్నమునుండి 7వ యింటియందు కుజుడు, యెనిమిదవ యింటియందు శనియుండి శుభగ్రహసంబంధ వీక్షణములు లేనివారైనప్పుడు, కుజశనులకు గురునవాంశస్థితిలేనప్పుడు ఈ యోగముగలుగుచుండును. వయః పరిమితియందు భేదము గనబడుచున్నది.

"బృహత్పరాశర హోరాసారాంశము"లో పాఠాంతరము

శ్లో॥ అష్టమే మందసంయుక్తే రంధ్రాత్ప్రా ద్వ్యదశే కుజః।
త్రింశాబ్దంతు దశేఽష్టేతు స్ఫోటకాది వినిర్దిశేత్॥

అష్టమమందు శనియుండగ, కుజుడు, 7, 8 భావములందొందైన నున్నచో 8 లేక 10 లేక 30 సం॥రమందు స్ఫోటకాది రోగభయము గలుగును.

శ్లో॥ రంధ్రేశే రాహుసంయుక్తే తదంశే రంధ్రకోణగే।
ద్వావింశేఽష్టాదశే వర్షే గ్రంధిమేహాది పీడనమ్॥ ౨౫

తా॥ అష్టమాధిపతి రాహువుతో కూడియుండగ, అష్టమాధిపతి నవాంశమందు అష్టమమునకు 5, 9 రాశులందున్నచో 18 లేక 22 సం॥రములందు గ్రంధులవలన మేహమువలన పీడింపబడును.

శ్లో॥ లాభేశే రిపుభావస్థే తదీశే లాభరాశిగే।
ఏకత్రింశే ఇవేదబ్దే శత్రుమూలా ద్ధనవ్యయః॥ ౨౬

తా॥ లాభస్థానాధిపతి శత్రుభావమందు శత్రుభావాధిపతి లాభస్థానమందున్నచో 31వ సం॥రమందు శత్రుమూలమున ధననష్టమగును.

వి॥ బృ. ప. హో. సారాంశమందు "ఏకత్రింశైకచత్వారి" అను పాఠముగలదు. "గణేశదత్త పాఠకులు" కూడ నీ పాఠమును గ్రహించిరి. అనగా 31 లేక 41వ సం॥ర మందు శత్రుమూలమున ధననష్టము కలుగునని గ్రహించవలయును.

శ్లో॥ సుతేశే రిపుభావస్థే షష్ఠేశే గురుసంయుతే।
వ్యయేశే లగ్నభావస్థే తస్య పుత్రో రిపు ర్భవేత్॥ ౨౭

తా॥ పుత్రస్థానాధిపతి శత్రుభావమందుండి, శత్రుభావాధిపతి గురునితో కలసియుండగ, వ్యయాధిపతి లగ్నగతుడైనచో జాతకునకు పుత్రుడు శత్రువగును.

శ్లో॥ లగ్నేశే షష్ఠరాశిస్థే తదీశే షష్ఠరాశిగే।
దశమైకోనవింశేఽబ్దే శునకా ద్భీతి రుచ్యతే॥ ౨౮

తా॥ లగ్నాధిపతి షష్ఠభావమందుండి షష్ఠాధిపతితో చేరినచో 10 లేక 19 సం॥రమందు శునకములవలన భీతిగలుగును.

ఇతి శ్రీ బృహత్పరాశరహోరాశాస్త్రే షష్ఠభావఫలాధ్యాయః ॥౧౮॥
ఇది శ్రీ బృహత్పరాశరహోరాశాస్త్రమందు షష్ఠభావఫలాధ్యాయము ముగిసెను.

## జాయాభావఫలాధ్యాయః ॥౧౮॥

పరాశర ఉవాచ :-

శ్లో॥ జాయాభావఫలం వక్ష్యే శృణు త్వం ద్విజసత్తమ।
జాయాధిపే స్వభే స్వోచ్చే స్త్రీసుఖం పూర్ణ మాదిశేత్॥ ౧

తా॥ ఓ ద్విజశ్రేష్ఠా! సప్తమభావఫలమును చెప్పుచున్నాను. వినుమని పరాశరుడు చెప్పుచున్నాడు. సప్తమభావాధిపతి స్వక్షేత్ర మందుగాని, ఉచ్చయందుగాని యున్నచో సంపూర్ణమైన స్త్రీసుఖము గలవాడగును.

శ్లో॥ కళత్రపో వినా స్వర్క్షం వ్యయషష్ఠాష్టమస్థితః।
రోగిణీం కురుతే నారీం తథా తుంగాదికం వినా॥ ౨

తా॥ కళత్రస్థానాధిపతి స్వక్షేత్ర స్వోచ్చరాశులుగాక షష్ఠాష్టమ వ్యయములందుండెనేని జాతకుని భార్య అనారోగ్యవతి యగును.

వి॥ మేషమునకు శుక్రుడు, వ్యయమందున్నను, వృషభమునకు కుజుడు వ్యయమందున్నను, కర్కాటకలగ్నమునకు శని అష్టమమందు న్నను, సింహమునకు శని షష్ఠమందున్నను, వృశ్చికమునకు శుక్రుడు వ్యయమందున్నను, కళత్రము ఆరోగ్యవంతురాలుగ నుండునని చెప్ప వలయును. "అధిపః షడష్టరిఃఫేషు న శుభదః" అనుసూత్రానుసారము భావాధిపతి షష్ఠాష్టమవ్యయములలో నెందున్నను స్వక్షేత్రస్వోచ్చ రాశులందుండెనేని యాభావమునకు దోషములేదని పై దానిభావము.

శ్లో॥ సప్తమే తు స్థితే శుక్రే ఽతీవకామీ భవే న్నరః।
యత్ర కుత్ర స్థితే పాపయుతే స్త్రీమరణం భవేత్॥ ౩

తా॥ కళత్రకారకుడగు శుక్రుడు సప్తమస్థానమందున్నచో అతికాముకు డగును. శుక్రుడు పాపగ్రహములతో కలసి యెక్కడున్నను కళత్రహానిని చేయును.

వి॥ కళత్రకారకుడగు శుక్రుడు పాపగ్రహములగు రవి, కుజ, శని, రాహు, కేతువులతో కలిసినప్పుడు వారిద్దరిమధ్య దూరము 5 భాగములలోపుగ నుండుటయు, శుక్రునకు ముందుభాగములలో పాప గ్రహము లుండి ద్విస్వభావరాశులందున్నప్పుడీ యోగము అనుభవ మందు సరిపడుచున్నది. రవితో శుక్రుడ స్తమించి వెనుకభాగములలో నున్నపు డాలస్యవివాహయోగముగాని, కళత్రసౌఖ్యములేక కళత్ర ముతో విడిపోవుటగాని సంభవించుచున్నది.

శ్లో॥ జాయాధీశ శ్శుభై ర్యుక్తో దృష్టోవా బలసంయుతః।
తదాజాతోధనీ మానీ సుఖసౌభాగ్య సంయుతః॥ ४

తా॥ కళత్రభావాధిపతి బలవంతుడై శుభులతో కూడినను, చూడబడినను జాతకుడు ధనవంతుడు, గౌరవముగలవాడు, సుఖ సౌభాగ్యములుగలవాడు అగును.

వి॥ కళత్రభావాధిపతికి శుభగ్రహసంబంధ వీక్షణములుండుట వలన ధనము, సుఖము, గౌరవము, సౌభాగ్యము చేకూరునని చెప్ప వలయును. కళత్రము జాతకునకు ప్రధానమైనదగుటచే ఆ భావాధిపతి యొక్క శుభత్వమునుబట్టి జాతకునకు శుభఫలములు సంభవించునను భావము స్ఫురించుచున్నది.

శ్లో॥ నీచే శత్రుగృహేస్తే వానిర్బలేచ కళత్రపే।
తస్యాపి రోగిణీ భార్యా బహు భార్యోనరోభవేత్॥ ౫

తా॥ కళత్రాధిపతి నీచయందుగాని, శత్రుగృహమందుగాని, అస్తమించిగాని, బలహీనుడైగాని యున్నచో నట్టి జాతకునిభార్య రోగార్తురాలగును. మరియు జాతకుడు బహుభార్యలుః గలవాడగును.

వి॥ సప్తమాధిపతి నీచయందున్నను, శత్రుగృహమందున్నను, అస్తమించినను, నిర్బలుడైనను, వానికి శుభగ్రహసంబంధవీక్షణము లెంత మాత్రము లేనప్పుడే పై విధముగ చెప్పవలయును. ఏ ఒక్క శుభగ్రహ సంబంధవీక్షణములున్నను కూడ రోగవంతురాలగు భార్యకానేరదు. బహుభార్యాయోగములున్నప్పుడా యోగములకీ విషయము సహకరించును. సప్తమమందు గురుడుచ్చలో నుండి చంద్రుడు నీచలో నున్నను, శుక్రుడు సప్తమమందుచ్చలో నుండగ గురుడునీచలో నున్నను దోషము సంక్రమించదు.

శ్లో॥ మందభే శుక్రగేహేవా జాయాధీశే శుభేక్షితే।
స్వోచ్చగేతు విశేషేణ బహుభార్యో నరోభవేత్॥ ౬

తా॥ శనిక్షేత్రములగు మకర కుంభములందు గాని, శుక్రక్షేత్రములగు వృషభ తులలందుగాని సప్తమాధిపతియుండి శుభవీక్షితుడైనను లేక ఉచ్చయందున్నను జాతకుడు బహుభార్యలు గలవాడగును.

వి॥ కళత్రాధిపతియగు గ్రహమేదియైనను వృషభ తులా మకర కుంభములందుండి శుభగ్రహ వీక్షితుడైనచో బహుభార్యాయోగము గలుగును. మరియు ఈ శుక్ర శని క్షేత్రములందు సప్తమాధిపతి ఉచ్చయందున్నచో తప్పక బహుభార్యాయోగము గలుగును. అని తెలియు చున్నది. "విశేషేణ" అనుపదప్రయోగము చేత రెండు యోగములుగ యీ శ్లోకార్థమును గ్రహించవలసియున్నది.

వృషభలగ్న జాతకులకు సప్తమాధిపతియగు కుజుడు మకరమందుచ్చలోనుండి శుభవీక్షితుడైనప్పుడు, కర్కాటకలగ్న జాతకులకుసప్తమాధిపతియగు శని తులయందుచ్చలోనుండి శుభులచే చూడబడినప్పుడు తులాలగ్నజులకు సప్తమాధిపతియైన కుజుడు మకరమందుచ్చగతుడై శుభవీక్షితుడైనప్పుడు, మకరలగ్నజులకు సప్తమాధిపతి

చంద్రుడు శుక్రక్షేత్రమగు వృషభమందుచ్చలో నుండి శుభదృష్టిగల వాడై నప్పుడు, బహుభార్యాయోగము కలుగునని భావము.

శ్లో॥ వంధ్యాసంగో మదేభానౌ చంద్రే దాశసమప్రియా॥
కుజేరజస్వలాసంగో వంధ్యాసంగశ్చ కీర్తితః॥ ౬
బుధే వేశ్యా చ హీనాచ వణిక్స్త్రీ వా ప్రకీర్తితా।
గురౌ బ్రాహ్మణభార్యాస్యాద్గర్భిణీ సంగఏవచ ౭
హీనాచపుష్పిణీవాచ్యా మందరాహుఫణీశ్వరైః॥

తా॥ సప్తమభావమందు సూర్యుడున్నచో వంధ్యాసంయోగము, చంద్రుడున్నచో నా రాశి లక్షణములుగల స్త్రీ సంయోగము, కుజుడున్నచో రజస్వలా స్త్రీ సంయోగము, లేక వంధ్యాసంగము, కలుగును. బుధుడున్నచో వేశ్యాస్త్రీగాని, హీనజాతిస్త్రీగాని, వైశ్య స్త్రీగాని జాతకునితో పొత్తునొందును. గురుడు సప్తమభావమందున్నచో బ్రాహ్మణస్త్రీతోగాని, గర్భిణీ స్త్రీతోగాని సంయోగ మేర్పడును. సప్తమభావమందు శనిరాహుకేతువులలో నెవరున్నను, హీనజాతిస్త్రీగాని, రజస్వలాస్త్రీగాని యగును.

వి॥ ఈ పై శ్లోకములలో సప్తమభావస్థగ్రహములనుబట్టి పురుషునకు సంభవించు కళత్ర విషయము తెలుపబడినది. భార్యావిషయమై పైన చెప్పినట్లు ఫలమును యథాతథముగ చెప్పినచో ఫలితము లనుభవములోనికి వచ్చుటలేదు. పురుష జాతకములందుగాని, స్త్రీ జాతకములందుగాని పరాసక్త (వ్యభిచార) యోగములు పట్టినప్పుడు పరస్త్రీ, పరపురుష విషయమై పై ఫలములను చెప్పవలయును. స్త్రీ జాతక విషయమై వ్యభిచారలక్షణములు గోచరించినప్పుడు "గర్భిణీ సంగ" అనుదానికి తాను గర్భవతిగ నుండగ పరపురుష సాంగత్యము నొందుననుటయు, "పుష్పిణి" అనుచోట స్త్రీజాతకవిషయమై తాను రజస్వలై యుండగ పరసాంగత్య మొందుననియు సమన్వయించుకొనవల యును. పై శ్లోకములలో శుక్రుని సప్తమ భావస్థితఫలము చెప్పబడలేదు.

శ్లో॥ కుజో౽త్ర సప్తమే మందే వ్యాధిదౌర్బల్య సంయుతా॥ ౯
కఠినోర్ధ్వ కుచార్యేచ శ్రేష్ఠస్థూలోత్తమస్తనీ।
పాపే ద్వాదశ కామస్థే క్షీణ చంద్రస్తు పంచమే। ౧౦
జాతశ్చ భార్యావశ్యస్స్యా దితిజాతి విరోధకృత్॥

తా॥ సప్తమభావమందు కుజుడున్నచో యోగ్యమైన స్తనములు గల భార్యగలవాడు, శనియున్నచో వ్యాధిపీడితురాలు, బలహీనమైన శరీరము గలది, కఠినమైన ఊర్ధ్వకుచములు గలదియగుభార్య గలవాడు, గురుడు సప్తమభావమందున్న యెడల స్థూలములైన ఉత్తమ స్తనములు గల భార్యగలవాడగును. 7, 12 రాశులందు పాపగ్రహములుండగ, క్షీణచంద్రుడు పంచమములో నుండెనేని జాతకుడు భార్యావశ్యుడు, జాతివిరోధము గలవాడు అగును.

శ్లో॥ జామిత్రే మంద భౌమేచ తదీశే మందభూమిజే॥ ౧౧
వేశ్యావాజారిణీ వాపి తస్య భార్యా నసంశయః॥

తా॥ సప్తమభావము కుజశని క్షేత్రములలో నొకటియై యుండగ, సప్తమాధిపతి కుజ శని క్షేత్రములలో నొందైన నున్నచో జాతకునిభార్య, వేశ్యగాని, వ్యభిచారిణిగాని యగును.

వి॥ సప్తమభావము కుజక్షేత్రములగు మేషవృశ్చికము లందొకటియై సప్తమభావనవాంశము గూడ మేషవృశ్చికము లందొకటియై యుండగ, సప్తమభావాధిపతి కుజశని రాశ్యాంశములలో నొకరాశి యందున్నప్పుడు సంపూర్ణ శుభుడగు గురుని దృష్టి లేనప్పుడు మాత్రమే పై ఫలములను చెప్పవలయును.

తులాలగ్న జాతకులకు మేషములో మేషాంశముగాని, వృశ్చికాంశముగాని సప్తమభావమై యుండగ (సప్తమభావమధ్యమము మేషాంశముగాని, వృశ్చికాంశముగాని అగుచుండగ) భావాధిపతి

యగు కుజుడు శనిక్షేత్రములగు మకర, కుంభములందుగాని, మేష వృశ్చికములందుగాని యుండి గురుదృష్టిలేని వాడైనచో శశ తము వేశ్యగాని, వ్యభిచారిణిగాని యగును. అని చెప్పవలయును. వృషభ లగ్నజాతకులకు సప్తమభావము వృశ్చిక రాశ్యంశముల నొందియుండగ భావాధిపతియగు కుజుడు వృశ్చిక, మకర, కుంభ మేష రాశ్యంశముల నొంది గురుని దృష్టిలేనివాడైనచో పై ఫలములను చెప్పవలయును.

ఈ విధముగ కర్కాటక సింహలగ్న జాతకులకు సప్తమభావ, భావాధిపతులకు తత్తద్రాశి నవాంశ సంబంధమున్నప్పుడు మాత్రమే పై ఫలములను చెప్పవలయును. భావ, భావాంశ భావాధిపతుల కెవ్వరి కైనను గురు సంబంధమున్నచో పై ఫలములను చెప్పరాదు.

శ్లో॥ భౌమాంశకగతే శుక్రే భౌమక్షేత్ర గతేఽథవా॥ ౧౨
భౌమయుక్తే చ దృష్టేవా భగచుంబన భాగ్భవేత్॥

తా॥ శుక్రుడు కుజక్షేత్ర గతుడై కుజాంశమును పొందియుండగ కుజునియొక్క యుతి వీక్షణములు గల వాడైనచో భగచుంబనమును చేయువాడగును.

వి॥ జాతకతత్వసూత్రములు, సప్తమభావము 61వసూత్రములో;

"భృగ్వస్తే శౌభౌమర్క్షే భగచుంబనశీలః" యని శుక్రసప్తమా ధిపతులలిద్దరు కుజక్షేత్రవర్తులైనప్పుడు భగచుంబనయోగము చెప్ప బడినది.

శ్లో॥ మందాంశకగతే శుక్రే మందక్షేత్ర గతేఽపిచ॥ ౧౩
మందయుక్తే చదృష్టేచ శిశ్న చుంబన తత్పరః॥

తా॥ శుక్రుడు శనినవాంశగతుడై శనిక్షేత్రమందుండి శని యొక్క సంబంధవీక్షణములున్నప్పుడా జాతకుడు శిశ్నచుంబన పరా యణుడగును.

శ్లో॥ దారేశే స్వోచ్ఛరాశిస్థే మదేశుభ సమన్వితే। ౧౪
లగ్నేశో బల సంయుక్తః కళత్ర స్థానసంయుతః
తద్భార్యా సద్గుణోపేతా పుత్ర పౌత్రప్రవర్ధనీ ౧౫

తా॥ సప్తమాధిపతి స్వోచ్ఛరాశియందుండి, సప్తమము శుభ గ్రహయుక్తమై యుండగ, లగ్నాధిపతి బలవంతుడై సప్తమమందు న్నచో నా జాతకునిభార్య సద్గుణములు గలది, పుత్ర పౌత్రాదుల వృద్ధి గలదియునగును.

శ్లో॥ కళత్రే తత్పతౌ వాపి పాపగ్రహ సమన్వితే।
భార్యా హానిం వదేత్తస్య విస్ఫులేచ విశేషతః॥ ౧౬

తా॥ కళత్రభావముగాని, సప్తమభావాధిపతిగాని పాపగ్రహ ముతో కూడినచో నట్టి జాతకునిభార్యకు హానిని చెప్పవలయును. భావ భావాధిపతులు బలహీనులైనను భార్యాహానిని చెప్పవలయును.

వి॥ కళత్రభావ మధ్యమము అనగా జన్మలగ్న నవాంశమునుండి 54వ నవాంశమందు కుజ, శని, రాహు, కేతువులలో నెవరైనను౦డ్రి సప్తమాధిపతి వున్న నవాంశమందో త పాపగ్రహమున్నచో భార్యా హానిని చెప్పవచ్చును. ఈ సందర్భములో గురుదృష్టి యున్నచో హాని కలుగదు.

శ్లో॥ షష్ఠాష్టమ వ్యయస్థానే మదేశో దుర్బలోయది।
నీచరాశిగతో వాపి దారనాశం వినిర్దిశేత్॥ ౧౭॥

తా॥ సప్తమభావాధిపతి బలహీనుడై 6, 8, 12 భావములందు గాని, తనయొక్క నీచరాశినిగాని పొందియున్నచో నా జాతకునకు కళత్రహానియగును.

తా॥ పైనచెప్పిన యోగము స్వతంత్రమైన యోగముకాదు. ఈ యోగముతోపాటు, కుటుంబాష్టమ భావములందుపాపులున్నప్పుడే

కళత్ర హానిని చెప్పవలయును. లేక పై స్థానములందున్న సప్తమాధిపతికి 2, 8, 12 భావములందు పాపులున్నను కళత్రహాని చెప్పవలయును.

శ్లో॥ కళత్ర స్థానగే చంద్రే తదీశే వ్యయరాశిగే।
కారకో బలహీనశ్చ దారసౌఖ్యం నవిద్యతే॥ ౧౮॥

తా॥ చంద్రుడు కళత్ర స్థానమందుండగ, సప్తమాధిపతి వ్యయమందుండి, కారకుడగు శుక్రుడు బలహీనుడైనచో భార్యాసుఖముండదు.

: ద్వ్యాది కళత్రయోగములు :

శ్లో॥ సప్తమేశే స్వనీచస్థే పాపర్క్షే పాపసంయుతే।
సప్తమేక్లీబరాశ్యంశే ద్విభార్యో జాతకో భవేత్॥ ౧౯॥

తా॥ సప్తమ భావాధిపతి నీచరాశియందు గాని, పాపరాశియందుండి పాపగ్రహముతో గూడియున్నను, సప్తమభావము నపుంసకరాశ్యంశములను పొందినను, జాతకుడు ఇద్దరు భార్యలు కలవాడగును.

శ్లో॥ కళత్రస్థానగే భౌమే శుక్రే జామిత్రగే శనౌ।
లగ్నేశే రంధ్రరాశిస్థే కళత్ర త్రయవాన్ భవేత్॥ ౨౦॥

తా॥ సప్తమభావమందు కుజ శుక్ర శనులుండగ లగ్నాధిపతి అష్టమస్థానమందున్నచో ముగ్గురు భార్యలు గలవాడగును.

శ్లో॥ ద్విస్వభావ గతే శుక్రే స్వోచ్చే తద్రాశినాయకే॥
దారేశే బలసంయుక్తే బహుదార సమన్వితః॥ ౨౧

తా॥ శుక్రుడు ద్విస్వభావ రాశులలో నెందైనను౦డగ, ఆ భావాధిపతి తనయొక్క ఉచ్చరాశి యందుండి, సప్తమాధిపతి బలవంతుడైనచో అనేక భార్యలు గలవాడగును.

వి॥ ద్విస్వభావ రాశియగు మిథునమందు శుక్రుడుండగ బుధుని ఉచ్చస్థితి కన్యలో సంభవించదు. కన్య, ధనుర్మీనములలో శుక్రుడు

న్నప్పుడు కన్యలో బుధశుక్రకు లుండుటయు, ధనుర్మీనములలో శుక్రుడున్నప్పుడు తద్రాశి నాధుడగు గురుడుచ్చలో నుండుటసంభవించును.

## వివాహ సమయ పరిజ్ఞానము.

శ్లో॥ దారేశే శుభరాశిస్థే స్వోచ్చస్వర్క్ష గతో భృగుః॥
పంచమే నవమేఽబ్దేతువివాహః ప్రాయశోభవేత్॥ ౨౨

తా॥ సప్తమాధిపతి శుభగ్రహరాశియందుండగ, శుక్రుడు తన యొక్క స్వక్షేత్రోచ్చరాశులలో నెందైన నున్నచో నా జాతకునకు 5 లేక 9 సం॥రము వయస్సులో వివాహమగును.

శ్లో॥ దారస్థానం గతే సూర్యే తదీశే భృగుసంయుతే।
సప్తమై కాదశే వర్షే వివాహః ప్రాయశో భవేత్॥ ౨౩

తా॥ సప్తమభావమందు సూర్యుడుండగ, సప్తమాధిపతి శుక్రునితోకూడియున్నచో 7 లేక 11 సం॥రమందు వివాహము కాగలదు.

శ్లో॥ కుటుంబ స్థానగే శుక్రే దారేశే లాభరాశిగే।
దశమే షోడశాబ్దేవా వివాహః ప్రాయశోభవేత్। ౨౪

తా॥ ద్వితీయ స్థానమందు శుక్రుడుండగ, సప్తమాధిపతి లాభభావమందుండెనేని ఆ జాతకునకు 10 లేక 16వ సం॥ర మందు వివాహమగును.

శ్లో॥ లగ్నకేంద్రగతే శుక్రే లగ్నేశే మందరాశిగే।
వత్సరై కాదశే ప్రాప్తే వివాహం లభతేనరః॥ ౨౫

తా॥ శుక్రుడు లగ్నకేంద్రమందుండగ, లగ్నాధిపతి శనిక్షేత్రమందున్నయెడల 11వ సంవత్సరమందు జాతకునకు వివాహమగును.

శ్లో॥ లగ్నాత్కేంద్రగతే శుక్రే తస్మాత్కామగతేశనౌ।
ద్వాదశై కోనవింశేచ వివాహః ప్రాయశోభవేత్॥ ౨౬

తా॥ శుక్రుడు లగ్నము నుండి కేంద్రము లందెచ్చటనైన నుండగ, వానికి సప్తమ కేంద్రమందు శనియున్నచో 12 లేక 19వ సం॥ర మందు వివాహమగును.

శ్లో॥ చంద్రా జ్జామిత్రగే శుక్రే శుక్రాజ్జామిత్రగే శనౌ।
వత్సరేఽష్టాదశే ప్రాప్తే వివాహం లభతేనరః॥ ౨౭

తా॥ చంద్రునకు సప్తమమందు శుక్రుడు, శుక్రునకు సప్తమ మందు శనియున్నయెడల 18వ సం॥ర మందు వివాహమగును.

శ్లో॥ ధనేశే లాభరాశిస్థే లగ్నేశే కర్మరాశిగే।
అబ్దే పంచదశే ప్రాప్తే వివాహంలభతేనరః॥ ౨౮

తా॥ ధనాధిపతి లాభ భావమందు, లగ్నాధిపతి దశమ భావమందున్నచో 15వ సం॥ర మందు వివాహమగును,

శ్లో॥ ధనేశే లాభరాశిస్థే లాభేశే ధనరాశిగే।
అబ్దేత్రయోదశే ప్రాప్తే వివాహం లభతేనరః॥ ౨౯

తా॥ ధనాధిపతి లాభ భావమందు, లాభాధిపతి ధనభావమందున్నచో 13వ సం॥ర మందు వివాహమగును.

శ్లో॥ రంధ్రాజ్జామిత్రగే శుక్రే తదీశే భౌమ సంయుతే।
ద్వావింశే సప్తవింశేఽబ్దే వివాహం లభతేనరః॥ ౩౦

తా॥ అష్టమమునుండి సప్తమములోననగా ద్వితీయ భావమందు శుక్రుడుండగ, ద్వితీయాధిపతి కుజునితో కూడినయెడల 22 లేక 27 సం॥ర మందు వివాహమగును.

శ్లో॥ దారాంశకగతే లగ్ననాథే దారేశ్వరే వ్యయే।
త్రయోవింశేచ షడ్వింశే వివాహం లభతేనరః॥ ౩౧

తా॥ లగ్నాధిపతి సప్తమభావ నవాంశ యందుండి, సప్తమాధిపతి వ్యయమందున్నచో 23 లేక 26 సం॥ మందు వివాహమగును.

శ్లో॥ రంధ్రేశే దారరాశిస్థే లగ్నాంశే భృగుసంయుతే।
పంచవింశే త్రయస్త్రింశే వివాహం లభతే నరః॥ 32

తా॥ అష్టమాధిపతి సప్తమభావములో నుండగ, లగ్ననవాంశ మందు శుక్రుడున్నచో 25 లేక 33 సం॥ర మందు వివాహమగును.

శ్లో॥ భాగ్యాద్భాగ్యగతే శుక్రే తద్వ్యయే రాహుసంయుతే।
ఏకత్రింశత్త్రయస్త్రింశే దారలాభం వినిర్దిశేత్॥ 33

తా॥ భాగ్యస్థానమునుండి భాగ్యస్థానమగు పంచమమందు శుక్రుడుండగ, శుక్రునకు వ్యయమందు అనగా చతుర్థభావమందు రాహు వున్నచో 31 లేక 33 సం॥ర మందు భార్యాలాభము (వివాహము) కలుగును.

శ్లో॥ భాగ్యాజ్జామిత్రగే శుక్రే తద్ద్యూనే దారనాయకే।
త్రింశేవా సప్తవింశాబ్దే వివాహం లభతే నరః॥ 34

తా॥ భాగ్యస్థానమునుండి సప్తమమగు తృతీయ భావమందు శుక్రుడుండగ, వానికి సప్తమమగు భాగ్యస్థానమందు సప్తమాధిపతి యుండెనేని 30 లేక 27 సం॥రమందు వివాహమగును.

వి॥ పైన చెప్పబడిన యోగములుగల జాతకములందు ఆయా వయస్సులలో వర్తమాన కాలమందు వివాహములు జరుగుటలేదు, ఇప్పటికాలములో దేశ ధర్మ పరిస్థితులయొక్క పరిణామములవలన వివాహకాలములు భేదించుచున్నవని తోచుచున్నది.

## స్త్రీ మరణ సమయజ్ఞానము

శ్లో॥ దారేశే నీచరాశిస్థే శుక్రే రంధ్రారి సంయుతే।
అష్టాదశే త్రియస్త్రింశే వత్సరే దారనాశనమ్॥ 35

తా॥ సప్తమాధిపతి నీచరాశియందుండగ శుక్రుడు 6, 8 స్థానములందున్నచో 18 లేక 33వ సం॥రమందు భార్య మరణించును.

శ్లో॥ మదేశే నాశరాశిస్థే వ్యయేశే మదరాశిగే।
తస్య చైకోనవింశాబ్దే దారనాశం వినిర్దిశేత్॥

తా॥ సప్తమాధిపతి అష్టమమందుండగ, వ్యయాధిపతి సప్తమందున్న యెడల 21వ సం॥రమందు భార్య మరణించును.

శ్లో॥ కుటుంబ స్థానగో రాహుః కళత్రే భౌమసంయుతే।
పాణిగ్రహేచ త్రిదినే సర్పదష్టే వధూమృతిః॥ ౩౭

తా॥ కుటుంబ స్థానమందు రాహువు, సప్తమమందు కుజుడు గల జాతకునకు వివాహమైన 3వ దినమందు భార్య సర్పముచే కరువబడి మరణించును.

శ్లో॥ రంధ్రస్థానగతే శుక్రే తదీశే సౌరరాశిగే।
ద్వాదశైకోనవింశాబ్దే దారనాశం వినిర్దిశేత్॥ ౩౮

తా॥ అష్టమభావమందు శుక్రుడుండగ, అష్టమాధిపతి శనిక్షేత్రగతుడైనచో 12 లేక 19వ సం॥రమందు కళత్రము నష్టమగును.

శ్లో॥ లగ్నేశే నీచరాశిస్థే ధనేశే నిధనంగతే।
త్రయోదశేతు సంప్రాప్తే కళత్రస్య మృతిర్భవేత్॥ ౩౯

తా॥ లగ్నాధిపతి నీచయందుండగ ధనాధిపతి అష్టమములో నుండెనేని 13వ సం॥రమందు కళత్ర హానికలుగును.

శ్లో॥ శుక్రాజ్జామిత్రగే చంద్రే చంద్రాజ్జామిత్రగే బుధే।
రంధ్రేశే సుతభావస్థే ప్రథమందశమాబ్దికమ్॥ ౪౦
ద్వావింశే చ ద్వితీయంచ త్రయస్త్రింశే తృతీయకమ్॥
వివాహంలభతే మర్త్యో నాత్రకార్యా విచారణా॥ ౪౧

తా॥ శుక్రునకు సప్తమమందు చంద్రుడు, చంద్రునకు సప్తమమందు బుధుడుండగ, అష్టమాధిపతి పంచమమందున్న యెడల 10వ

సం॥రమందు ప్రథమ వివాహము 22వ సం॥రమందు ద్వితీయ వివాహము, 33వ సం॥రమందు తృతీయ వివాహము జరుగును.

శ్లో॥ షష్ఠే చ భవనే భౌమః సప్తమే రాహుసంస్థితః।
అష్టమేచ యదాసౌరిస్తస్య భార్యా న జీవతి॥ ౪౨

తా॥ షష్ఠమునందు కుజుడు, సప్తమునందు రాహువు, అష్టమమందు శనియున్నచో నట్టి జాతకుని భార్య మరణించును.

వి॥ ఈ యోగమందు కుజుడు ఋజుగతియందు, శని వక్రగతియందు ఉన్నప్పుడు సప్తమభావము పాపకర్తరిగలదై కళత్ర నష్టము నకు కారణమగునని కొందరి యభిప్రాయము. శని ఋజుగతిలోనున్నప్పుడు పాపకర్తరి సంభవించదనియు 7, 8 స్థానములందు రాహుశనులుండుటవలన కళత్రనష్టము చిరకాలమునకు సంభవించునని కొందరభిప్రాయము.

కళత్రభావమునకు సంబంధించిన మరికొన్ని యోగములు.

1. ద్వితీయ సప్తమాధిపతులు తమ నీచరాసులందుండి శుభులు కేంద్రకోణములందున్నచో ఒక్క వివాహమేయగును.

2. బుధుడు సప్తమమునందుండి శుభనవాంశము నొందినచో ఒక వివాహమేయగును.

3. లగ్నధనసప్తమాధిపతులు పాపగ్రహయుతులై యుండగ, సప్తమాధిపతి నీచ, శత్రు, క్షేత్రములందున్నప్పుడుగాని, అస్తమించినపుడుగాని 3 గురు భార్యలు గలవాడగును.

4. ద్వితీయాష్టమ భావములందుగాని, ద్వితీయ సప్తమములందుగాని పాపగ్రహములుండి, సప్తమము శుభగ్రహసంబంధములేనిదైనచో ద్వికళత్రయోగము పట్టును.

5. లగ్నసప్తమములందు సంపూర్ణ పాపులుండగ 2, 8 భావములందు గురుడుండెనేని ద్వికళత్ర యోగముపట్టును.

6. 1, 2, 7, 8 స్థానములందెవ్వరున్ననను 2 స్థానములందు పాపులుండి 2, 8 స్థానములకు గురు సంబంధమున్నచో ద్వికళత్ర యోగమునిచ్చును.

7. సప్తమమందు పాపులుండి లగ్నమందు శుభులున్నచో మధ్యమ వయస్సునందు ద్వికళత్ర యోగము గలుగును.

8. సప్తమాష్టమములందు పాపులుండి లగ్నధనభావములందు శుభులున్నచో అంత్యవయస్సునందు ద్వికళత్ర యోగముగలుగును.

9. లగ్నసప్తమములందుగాని, ద్వితీయాష్టమములందుగాని గురు శుక్రులుండగ 12వ యింటియందు పాపగ్రహద్వయమున్న జాతకులకు ద్వికళత్రయోగము పట్టుచున్నది.

10. సప్తమాధిపతి నీచరాశ్యాంశములందుండి, సప్తమములో బుధ శనులున్న జాతకులకు ప్రథమ కళత్రమునష్టమైన పిదప విధవా స్త్రీ సంబంధముగాని జాత్యంతర స్త్రీ సంబంధముగాని గలుగుచున్నది.

11. సప్తమాధిపతి శుక్రుడు నీచరాశ్యంశములందుండగ 2,7,8 స్థానములందు పాపగ్రహములున్న జాతకులకు వివాహానంతరము 8 సం॥రములలోపున ద్వికళత్రయోగము పట్టుచున్నది.

12. లగ్నసప్తమములకు కుజ రాహుసంబంధముండగ ద్వితీయమందు గురుడు, పంచమ భాగ్యములందు శుక్రుడున్న జాతకులకు ప్రథమ కళత్రము జీవించియుండగ, ద్వితీయ కళత్రయోగము పట్టుచున్నది.

13. సప్తమమందు పాపులుండి, భావాధిపతి, కారకుడు బలహీనులై యుండగ, 2, 8 స్థానములలో నెందైనను గురుడున్నచో ద్వికళత్ర యోగముపట్టును.

14. లగ్నసప్తమాధిపతులుచ్ఛగతులై యుండగ కారకుడు నీచరాశ్యంశములందున్నప్పుడు ద్వికళత్ర యోగముగలుగును.

15. సప్తమభావము, భావాధిపతి, భావస్థగ్రహము, కళత్ర కారకుడు పాపగ్రహసంబంధము గలవారైనచో ద్వికళత్రయోగము పట్టును.

16. సప్తమభావము, భావాధిపతి గురు సంబంధముగలవారై లగ్నాధిపతి బలవంతుడై కేంద్రకోణలాభములందున్నప్పుడు కళత్ర సౌఖ్యముండును.

17. లగ్నచతుర్థ సప్తమాధిపతులుగాని, కుటుంబ సప్తమాధిపతులుగాని గురునితోచేరి లగ్నాధిపతి కేంద్రకోణములందున్నప్పుడు కళత్ర సుఖముండును.

18. కళత్రస్థానాధిపతిగాని, శుక్రుడుగాని అస్తమించినపుడు సూర్యునకు వెనుకభాగలందుండగ గురునిచే చూడబడెనేని వయస్సు మీరిన పిమ్మట కళత్రలాభము, సుఖముగలుగును. సూర్యునకుముందు భాగలలో నున్నప్పుడు యౌవనసమయమందు కళత్రప్రాప్తి గలిగినను, కొంతకాలము దాటిన పిమ్మట కళత్ర సుఖముండును.

19. భావస్థగ్రహ, భావాధిపతులస్తమయము నొందియుండగ, వారికి శనిబుధ సంబంధమున్నచో వివాహమగుటకవకాశములుండవు.

20. భావాధిపకారకులునపుంసక షడ్వర్గములను పొందియుండగ, లగ్నసప్తమభావములలో శని బుధులున్న జాతకులకు వివాహమగుటకష్టము.

21. లగ్నసప్తమములందు బుధ శనులుండి లగ్నాధిపతి శుక్రుడు గురుషడ్వర్గములను పొందినచో మధ్యమవయస్సు దాటిన పిమ్మట వివాహమగును.

గ్రంథాంతరములందు దహరించిన యోగములను గూడ బాగుగ విచారించి సప్తమభావఫలములను నిర్ణయించవలయును. "నవమాంశే కళత్రాణా" మనుపరాశర వచనాను సారము పై యోగములను రాశి, నవాంశములందు రెండింటియందును చూడవలయును. రాశిచక్రమందు పై యోగములు సంభవించకపోయినను, నవాంశ చక్రమందు యథాతథముగ పట్టినచో నా యోగఫలములను చెప్పవచ్చును. సప్తమ భావవిచారణలో నవాంశమున కధిక ప్రాధాన్యమీయబడినది.

ఇతి బృహత్పరాశరహోరాశాస్త్రే జాయాభావఫలాధ్యాయః ॥౧౯॥

ఇది బృహత్పరాశరహోరాశాస్త్రమందు - జాయాభావఫలాధ్యాయము ముగిసెను.

## ఆయుర్భావ ఫలాధ్యాయము ॥౨౦॥

శ్లో॥ ఆయుర్భావ ఫలంచాథ కథయామి ద్విజోత్తమ।
ఆయుస్థానాధిపః కేంద్రే దీర్ఘమాయుః ప్రయచ్ఛతి॥ ౧

తా॥ ఓ ద్విజోత్తమ! ఆయుర్భావ ఫలమును చెప్పుచుంటిని. సావధానముతో వినుము. ఆయుస్థానాధిపతియగు గ్రహము లగ్నము నుండి కేంద్రములందున్నచో దీర్ఘాయువుగల జాతకుడగును.

శ్లో॥ ఆయుస్థానాధిపః పాపైస్సహైవాయుషి సంస్థితః।
కరోత్యల్పాయుషం జాతం లగ్నేశోఽప్యత్ర సంస్థితః॥ ౨

తా॥ ఆయుస్థానాధిపతిగాని, లగ్నాధిపతిగాని పాపులతో కలసి 8వ భావమందున్నయెడల జాతకుడల్పాయువు గలవాడగును.

వి॥ ఈ శ్లోకమందు "లగ్నేశోఽపి" అని చెప్పుటచే లగ్నాధిపతి గూడ అష్టమాధిపతితో కూడి అష్టమమందుండి పాపులతో చేరినయెడల జాతకున కల్పాయువు కలుగును. అష్టమాధిపతికి లగ్నాధిపతి

సంబంధమున్నప్పుడే అల్పాయువనే అర్థము "అపి" శబ్దమువలన గోచరించుచున్నది. కొన్ని జాతకములందు లగ్నాష్టమాధిపతులు కలియక పోయినను, అష్టమమందు పాపులతో కూడిన యష్టమాధిపతియున్నను, పాపులతో కూడిన లగ్నాధిపతియున్నను ఇతర శుభగ్రహబలములేనప్పుడు, చంద్రునకు శుభసంబంధములేనప్పుడు అల్పాయువు కలుగుచున్నది. లగ్నా త్కేంద్రములందుగాని, అష్టమ లగ్నాధిపతులకు కేంద్రములందుగాని శుభులున్నచో అల్పాయువు పట్టుటలేదు.

శ్లో॥ ఏవంహి శనినాచింతా కార్యా తద్వైద్విచక్షణైః।
కర్మాధిపేనచతథా చింతనం కార్యమాయుషః॥

తా॥ ఆయుష్కారకుడైన శనినిబట్టి, దశమాధిపతినిబట్టి గూడ పై విధముగ ఆయుర్విచారణను చేయవలయును.

వి॥ ఆయుష్కారకుడైన శనికి, దశమాధిపతికి పాపగ్రహ సంబంధము గలుగుట అల్పాయువునకు హేతువు, వీరిద్దరకు కేంద్రములందు శుభులున్నచో అల్పాయువు గలుగదు. ఆయుర్నిర్ణయమును లగ్న, అష్టమ, దశమాధిపతులనుబట్టి శనినిబట్టి నిర్ణయించవలయునని ముఖ్యభావము.

## దీర్ఘాయుర్యోగములు

శ్లో॥ షష్ఠేవ్యయేఽపి షష్ఠేశో వ్యయాధీశో రిపౌ వ్యయే।
లగ్నేష్టమే స్థితోవాపి దీర్ఘమాయుః ప్రయచ్ఛతి॥ ४

తా॥ షష్ఠాధిపతి షష్ఠవ్యయములందుగాని, వ్యయాధిపతి షష్ఠవ్యయములందుగాని, లగ్నాష్టమములందుగాని యున్నచో దీర్ఘాయుర్యోగమును చెప్పవలయును.

వి॥ 1. షష్ఠాధిపతి లగ్నాష్టమ షష్ఠవ్యయమందున్నను, అష్టమాధిపతి లగ్నషష్ఠవ్యయములందున్నను దీర్ఘాయువుకలుగును.

శ్లో॥ స్వస్థానే స్వాంశకే వాపి మిత్రేశే మిత్రమందిరే।
దీర్ఘాయుషం కరోత్యేవ లగ్నేశోఽష్టమపః పునః॥ ౫

తా॥ లగ్న చతుర్థ, అష్టమాధిపతులు స్వస్థానములందు గాని, స్వాంశములందుగాని యున్నచో దీర్ఘాయువుగలుగును.

వి॥ లగ్నాష్టమ, వాహనాధిపతులు లగ్న. అష్టమ వాహన స్థానములందుండి స్వనవాంశముల నొందినచో దీర్ఘాయువుగలుగును. మరియు స్వస్థానములందు లేకపోయినను కేంద్రకోణములందుండి స్వాంశగతులైనను దీర్ఘాయువుగలుగును.

శ్లో॥ లగ్నాష్టమప కర్మేశమందాః కేంద్రత్రికోణయోః।
లాభే వా సంస్థితాస్తద్వత్ దిశేయుర్దీర్ఘమాయుషమ్॥ ౬

తా॥ లగ్న, అష్టమ, దశమ భావముల కధిపతులు, ఆయుష్కారకుడగు శని కేంద్ర. త్రికోణలాభ భావములందున్నచో పూర్ణాయువు గలుగును.

శ్లో॥ ఏవం బహు విధావిద్వన్నాయుర్యోగాః ప్రకీర్తితాః।
ఏషుయోబలవాంస్తస్మాత్ పాక దాయురాదిశేత్॥ ౭

తా॥ పైవిధముగ ఆయుర్యోగములు బహువిధములు చెప్పబడినవి. అట్టి యోగములలో నేదిబలమైనయోగమో దానినను సరించి ఫలమును చెప్పవలయును.

వి॥ సర్వార్థ చింతామణిలో నుదహరింపబడిన కొన్ని దీర్ఘాయుర్యోగములు :-

శ్లో॥ చతురశ్రే శుభైర్యుక్తే లగ్నేశే శుభసంయుతే।
గురుణా దృష్టి సంయుక్తే పూర్ణమాయుర్వినిర్దిశేత్॥

4, 8 భావములందు శుభగ్రహములుండి, లగ్నాధిపతి శుభగ్రహములతో కూడినవాడై గురునిచే చూడబడెనేని దీర్ఘాయువు గలుగును.

రంధ్రేశ స్వరేణాపి యుతేవిలగ్న
నాథేరపౌ వా వ్యయరాశియుక్తే।
షష్ఠాధిపే వాయది లగ్నయుక్తే
దీర్ఘాయురస్యేతి శుభేక్షితే చ॥

లగ్నాధిపతి యష్టమాధిపతితో కూడియుండగ, రవివ్యయ మందున్నప్పుడుగాని, షష్ఠభావాధిపతి లగ్నగతుడై శుభగ్రహదృష్టి గలవాడైనప్పుడుగాని పూర్ణాయుర్యోగము గలుగును.

హోరారత్నమందు;

చతురాద్యైర్గ్రహైర్యుక్తే లగ్నే ద్విత్రిసుఖైః క్రమాత్।
చిరాయున్తత్ర జాతో యో జ్ఞానవా నర్థవాన్ భవేత్॥

నాలుగు లేక అంతకంటె ఎక్కువ గ్రహములు లగ్నమందు గాని, లగ్నమునుండి 4 రాశులలోపునగాని యున్నచో నా జాతకుడు దీర్ఘాయువు, జ్ఞానము, ధనముగలవాడగును.

వీరజాతకమందు

ఏకాంశ రాశగా లగ్నే యత విజ్ఞిచ భార్గవాః॥
ధర్మేశవిస్తదా జాతో బహ్వాయు ర్భోగ సంయుతః॥

బుధ గురు శుక్రులు లగ్నమందు ఏకరాశ్యంశగతులై యుండగ, శని 9వ యింటిలోనున్నచో దీర్ఘాయువు, భోగముకలుగును.

పూర్ణచంద్రస్సుహృద్భాగే లగ్నే లాభే యదాగతః।
బలాఢ్యే ధర్మపే మందే బహ్వా యుర్జాయతే తదా॥

పూర్ణచంద్రుడు మిత్రనవాంశగతుడై లగ్నమునగాని లాభ మందుగాని యుండగ, భాగ్యాధిపతి యగు శని బలవంతుడైనచో దీర్ఘాయువు కలుగును.

వి॥ వృషభ మిధునలగ్న జాతకులకు శని భాగ్యాధిపతి యగును. కొన్ని ప్రదేశములందు భావస్ఫుటముననుసరించి కర్కటక లగ్నజాత

కులకు గూడ కుంభమందు భాగ్యభావమధ్యమము సంభవించును. అట్టి సమయము లందు కర్కాటక లగ్నజులకు శని భాగ్యాధిపతి యగును.

లగ్నాత్ షష్ఠాష్టమే చంద్రే యది కేంద్రే బృహస్పతిః।
జాతో రోగ వినిర్ముక్తః శతం వర్షాణి జీవతి॥

లగ్నమునుండి 6, లేక 8వ భావమందు చంద్రుడుండగ గురుడు ఏదైనను కేంద్రమందున్నచో జాతకుడు ఆరోగ్యముగల వాడై నూరు సం॥రములు జీవించును.

షష్ఠ, అష్టమభావములందు చంద్రునకు నీచపట్టుటమంచిది గాదు, మరియు రవి ముక్తుడుగాని చంద్రుడు 6, 8లో నుండగ గురుడు కేంద్రములందున్నను పూర్ణాయువు కలుగనేరదు.

మృగవదన పశ్చిమార్థే నందన చంద్ర వంయుతే లగ్నే।
కేంద్రగతే సురేజ్యే జాతో జీవేచ్చ వర్షశతమ్॥

మకరము యొక్క ఉత్తరార్థము లగ్నమైయందు కుజ చంద్రులుండగ, గురుడు కేంద్రగతుడై యుండెనేని నూరు సం॥రము లాయుర్దాయముపట్టును.

స్వోచ్చే లగ్నే భృగుజే సౌమ్యే దృష్టేఽష్టమే చంద్రే।
సురమంత్రిణి కేంద్రగతే జాతః శతం జీవితో భవతి॥

లగ్నమందు శుక్రుడుచ్చలోనుండగ, అష్టమమునందు చంద్రుడుండి శుభవీక్షణగలవాడై యుండగ గురుడు కేంద్రగతుడయ్యె నేని నూరు సం॥రములు జీవించును.

ఈ యోగము మీనలగ్న జాతకులకు లగ్నమందు శుక్రుడు, ద్వితీయమందు బుధుడు, తులయందు చంద్రుడుండగ గురుడు కేంద్రవర్తియైనప్పుడు సంభవించును. చంద్రునకు, 6,7 భావములందు శుక్ర బుధులుండుటచేత అధియోగము గూడపట్టును. గురుని చతుర్థకేంద్ర స్థితియైనచో చంద్రునిపై గురుదృష్టి గూడయుండును. గురుడు సప్తమ

కేంద్రమందున్నప్పుడు గురుశుక్ర సమసప్తకము అరిష్టమును గూడ సూచించును, గురుని దశమకేంద్రస్థితి, లగ్నస్థితి స్వక్షేత్రస్థితియగుటచే దీర్ఘాయువుపట్టును.

చరాంశకస్థాః కవిమందభౌమాః
స్థిరాంశకస్థౌ రవి దేవపూజ్యౌ।
శేషౌతు యుగ్మ భవనాంశకసంప్రయుక్తౌ।
దీర్ఘాయురత్ర జననే పురుషో నృపాలః॥

కుజశుక్రశనులు చరనవాంశములందు, రవిగురువులు స్థిరనవాంశములందు, మిగిలిన చంద్ర, బుధులు ద్విస్వభావ నవాంశములందున్నచో నట్టి జాతకుడు దీర్ఘాయువు గలవాడై ప్రభువగును. రాశిచక్రమునందు గ్రహములేరాశియందైన నుండవచ్చును.

యదినైధనగో భౌమస్సార్కో హోరాంగతో ప్రసవకాలే।
కేంద్రే చాంగిరపూజ్యే ప్రాణిర్జాతోఽత్ర వర్షశతమ్॥

కుజుడు అష్టమములోనున్నను, లగ్నమందు రవి కుజులున్నను, కేంద్రమందు గురుడున్నచో పూర్ణాయువుగలిగి నూరు సం॥రములు జీవించును.

శ్లో॥ అష్టమాధిపతౌ కేంద్రే లగ్నేశే బలవర్జితే।
వింశద్వర్షాణ్య జీవేత్ ద్వాత్రింశత్పరమాయుషమే। ౮।

తా॥ అష్టమాధిపతి కేంద్రగతుడైయుండగ, లగ్నాధిపతి బలహీనుడైనచో 20 సం॥రములు జీవించును. ఇట్టిజాతకుల పరమాయువు 32 సం॥రములుగ గ్రహించవలయును. అనగా 20 సం॥రమునుండి 32 సం॥రములలోపుననే మరణము నొందునని భావము.

వి॥ యోగాయుర్దాయ విషయమై "యవనజాతక" మందు కొన్ని విశేష యోగములు గలవు.

హోరేశ్వరేఽర్క సంస్థే జన్మేశే సౌమ్యదృష్టినే।
కేంద్రగతైశ్చ పాపైర్జా తస్యా వింశతేర్నృపతి మృత్యుః॥

లగ్నాధిపతి సింహమందు సూర్యునితో కలిసియుండి జన్మరాశ్యధిపతి (చంద్ర రాశ్యధిపతియని భావము) శుభగ్రహదృష్టి లేనివాడై యుండగ, కేంద్రములందు పాప గ్రహములు మాత్రమే యున్నచో 20 సం॥రములు మాత్రమే జీవించును.

నీచాంశకస్థశ్చంద్రో వ్యష్టమసంస్థః క్షయాచ మునిశిర॥
కుజమందాభ్యాందృష్ట స్తస్యాయుః పంచవింశతిః పరమమ్॥

జన్మలగ్నము నుండి క్షీణచంద్రుడష్టమములో నుండి, నీచాంశగతుడై కుజశని వీక్షితుడయ్యేనేని 25 సం॥రములకాయువు పూర్తియగును.

1. మేషసింహ ధనుర్లగ్న జాతకులకు క్షీణచంద్రుడష్టమములో నుండగ నీచాంశస్థితి కలుగును. ఈ లగ్నజులకు అష్టమగతి చంద్రుని 5వ నవాంశము నీచాంశమగును.

2. వృషభకన్యా మకరలగ్నజులకు క్షీణచంద్రుడష్టమములో నుండగ 8వ నవాంశము నీచాంశమగును.

3. కర్కటక వృశ్చిక మీనలగ్నజులకు క్షీణచంద్రుడష్టమములో నుండగ 2వ నవాంశము నీచాంశమగును.

ని॥ పై విధముగనున్న చంద్రుడు కుజశనులచే చూడబడెనేని 25 సం॥రము లాయువుగలుగునని తెలుసుకొనవలయును.

భౌమే లగ్నంయాతే రవిమందౌ కేంద్రగౌ బలాద్రిక్తౌ।
అవింశ తేర్నృతి స్స్యాత్ భంగోవారోగియుక్తోవా॥

లగ్నమందు కుజుడుండగ బలహీనులగు రవి శనులు కేంద్రములందున్నచో నా జాతకుడు 20 సం॥రములు జీవించును. లేక 20 సం॥ర మందు శరీరభంగముగాని, రోగపీడగాని సంభవించును.

కుజరవియుక్తే లగ్నే చరరాశౌ మధ్య సంస్థితే జీవే॥
సుతధర్మ గతేచంద్రే జాతస్యా వింశతేర్మృతిర్న్యపతిః

చరరాశియైన లగ్నమందు కుజరవులు, దశమ కేంద్రమందు గురుడుండగ 5 లేక 9వ భావమందు చంద్రుడుండెనేని యా జాతకుడు 20 సం॥రములు జీవించును.

చంద్రాష్టమగైః పాపైః సౌమ్యైరాపోక్లిమస్థితైర్ఘన్య॥
విధనారిగతే చంద్రే తస్యాయుర్వింశతిః పరమమ్॥

షష్ఠమందుగాని అష్టమమందుగాని చంద్రుడుండగ వానికెనిమిదవ భావమందు పాపగ్రహములు, అపోక్లిమములందు శుభులున్న యెడల 20 సం॥రములాయువు పట్టును.

శ్లో॥ రంధ్రేశే నీచరాశిస్థే రంధ్రే పాపగ్రహైర్యుతే॥
లగ్నేశే దుర్బలే జంతురల్పాయుర్భవతి ధ్రువమ్॥　　　౯॥

తా॥ అష్టమాధిపతి నీచరాశియందుండి, అష్టమమందు పాప గ్రహములుండగ, లగ్నాధిపతి బలహీనుడైనచో నా జాతకుడల్పాయువు గలవాడగును.

శ్లో॥ రంధ్రేశే పాపసంయుక్తే రంధ్రే పాపగ్రహైర్యుతే।
వ్యయే క్రూరగ్రహాక్రాంతే జాతమాత్రం మృతిర్భవేత్॥　　　౧౦॥

తా॥ అష్టమాధిపతి, అష్టమవ్యయభావములు పాపాక్రాంతములైనచో జన్మించిన వెంటనే శిశువు మరణించును.

శ్లో॥ కేంద్రత్రికోణగాః పాపాః శుభాః షష్ఠాష్టగా యది।
లగ్నే నీచస్థరంధ్రేశో జాతస్సద్యో మృతో భవేత్॥　　　౧౧॥

తా॥ పాపగ్రహములన్నియు కేంద్రత్రికోణములందు, శుభ గ్రహములు 6, 8 భావములందు నుండగ, లగ్నమందష్టమాధిపతి గాని, నీచగ్రహము గాని యున్నచో శిశువు శీఘ్రముగ మరణించును.

వి॥ పై యోగము స్వల్పభేదముతో నీ క్రింద విధముగ చెప్పబడినది.

హోరారత్నమందు :-

పాపాస్త్రికోణకేంద్రే సౌమ్యాః షష్ఠాష్టమ వ్యయగతాశ్చ॥
సూర్యోదయే ప్రసూతః సద్యః ప్రాణాంస్త్యజతి జంతుః॥

తా॥ పాపులు కేంద్రకోణములందు, శుభులు 6, 8, 12స్థానములందుండగ సూర్యోదయ సమయమందు జన్మించిన శిశువు శీఘ్రముగ మరణించునని భావము.

సర్వార్థ చింతామణిలో "సద్యోమరణ యోగవిషయమై"

అద్యద్రుగాణే జామిత్రే యస్యస్యాద్దారుణో గ్రహః।
క్షీణే చంద్రే విలగ్నస్థే సద్యోహరతి జీవితమ్॥

సప్తమభావ ప్రథమద్రేక్కాణమందు క్రూరగ్రహముండగ, లగ్నమందు క్షీణచంద్రుడున్నచో శిశువు శీఘ్రములో మృతిపొందును.

విలగ్నాధిపతి ర్నీచే నిధనే వార్కగౌయది।
కృచ్ఛ్రేణ జీవితం విద్యాన్మృత ప్రాయోభవిష్యతి॥

లగ్నాధిపతి నీచయందుండగ రవి అష్టమభావమునందుండెనేని జీవముతో జన్మించుటయే కష్టము, మృతప్రాయుడగును.

పాపిష్ఠమృత్యో యదివావిలగ్నే జలస్థ లగ్నే శశివృశ్చికేవా।
సౌమ్యేషు కేంద్రాయ గతేషు సద్యోజాతస్య మృత్యుర్యవనోపదిష్టః॥

జన్మలగ్నమందుగాని సప్తమమునందుగాని శనియుండగ, జన్మలగ్నము జలరాశియై చంద్రుడు వృశ్చికములోనుండగ, శుభులు కేంద్రలాభములందున్నను శిశువు శీఘ్రముగ మరణించునని యవన మతము.

శ్లో॥ పంచమే పాపసంయుక్తే రంధ్రేశే పాపసంయుతే।
రంధ్రే పాపగ్రహైర్యుక్తే స్వల్ప మాయుః ప్రజాయతే॥ ౧౨॥

తా॥ పంచమాష్టమ, అష్టమాధిపతులు పాపగ్రహములతో కూడియుండిరేని అల్పాయువు గలుగును.

శ్లో॥ రంధ్రేశే రంధ్ర రాశిస్థే చంద్రే పాపసమన్వితే।
శుభదృష్టి విహీనేచ మాసాంతేచ మృతిర్భవేత్॥

తా॥ అష్టమాధిపతి అష్టమములోనుండగ, చంద్రుడు పాపగ్రహ యుతుడై శుభదృష్టిలేనప్పుడు పుట్టినశిశువు 1 నెల దినములు జీవించును.

వి॥ "సర్వార్థ చింతామణి" లో మరియొక యోగము.

రంధ్రే ధరాసూను దినేశ సౌరా జాతస్తు మృత్యుం సముపైతి మాసాత్॥ అష్టమమందు కుజ రవిశనులుండగ పుట్టిన శిశువు 1 నెల జీవించును.

"జాతకపారి జాతమందు"

అనన్య రవలోకితే బలిభిరత్ర మాసంశుభే
కళత్ర సహితేచ పాపవిజితే విలగ్నాధిపే॥

లగ్నాధిపతి పాపగ్రహముచే జయింపబడినవాడై యుండగ, సప్తమమందొక శుభగ్రహముండి సమస్త పాపగ్రహములచేత చూడబడనేని అట్టి యోగమందు బుట్టిన శిశువు 1 నెల జీవించును. ఈ యోగమందు పాపులతో కలసిన బుధుడుగాని, క్షీణచంద్రుడుగాని సప్తమగత శుభుని చూచునప్పుడు పాపులుగ పరిగణింపవలయును

## దీర్ఘాయుర్యోగములు

శ్లో॥ లగ్నేశే స్వోచ్చ రాశిస్థే చంద్రే లాభసమన్వితే।
రంధ్ర స్థానగతే జీవే దీర్ఘ మాయుర్న సంశయః॥ ౧౪॥

తా॥ లగ్నాధిపతి తనయుచ్చయందుండి, చంద్రుడేకాదశమందుండి, అష్టమమందు గురుడుండగ జన్మించినవారు దీర్ఘాయువు గలవారగుదురు.

శ్లో॥ లగ్నేశోతిబలీ దృష్టః కేంద్ర సంస్థైః శుభగ్రహైః॥
ధనైస్సర్వ గుణైస్సార్ధం దీర్ఘమాయుః ప్రయచ్ఛతి॥ ౧౫

తా॥ లగ్నాధిపతి బలవంతుడై కేంద్రగతుడైన శుభులచేచూడ బడనేని జాతకుడు ధనములతోను, సద్గుణములతోను కూడినవాడై దీర్ఘాయువుగలవాడగును.

వి॥ పరాశరమహర్షి మారక భేదాధ్యాయమని వేరొకయధ్యాయమును చెప్పి అందు ఆయుర్విచారణ చేయుపద్ధతిని వివరించెను. విశేషవిచారణ అక్కడ చేయబడును.

ఇతి బృహత్పరాశరహోరాశాస్త్రే, అయుర్భావఫలాధ్యాయః ॥౨౦॥
ఇది బృహత్పరాశరహోరాశాస్త్రమందు ఆయుర్భావఫలాధ్యాయము ముగిసెను.

## భాగ్యభావఫలాధ్యాయః ॥౨౧॥

శ్లో॥ అథభాగ్యభవం విప్రఫలం వక్ష్యే ద్విజాగ్రతః।
సబలేభాగ్యపే భాగ్యేశాతో భాగ్యయుతో నరః॥ ౧

సూ॥ ఓ ద్విజోత్తమ! ఇప్పుడు భాగ్యభావసంబంధఫలమును చెప్పుచుంటిని. అని పరాశరుడు మైత్రేయునకీ విధముగ చెప్పుచున్నాడు.

తా॥ భాగ్యాధిపతి బలవంతుడై భాగ్యభావమందున్న యెడల జాతకుడు భాగ్యవంతుడగును.

శ్లో॥ భాగ్యస్థానగతే జీవే తదీశే కేంద్ర సంస్థితే।
లగ్నేశే బలసంయుక్తే బహుభాగ్యయుతో భవేత్॥ ౨

తా॥ గురుడు భాగ్యస్థానమందుండి భాగ్యాధిపతి కేంద్రమందుండగ, లగ్నాధిపతి బలవంతుడైనచో నాజాతకుడు విశేషభాగ్యము గలవాడగును.

శ్లో॥ భాగ్యేశే బలసంయుక్తే భాగ్యే భృగుసమన్వితే।
లగ్నాత్కేంద్రగతే జీవే పితాభాగ్య సమన్వితః॥ ౩

తా॥ భాగ్యాధిపతి బలవంతుడై శుక్రుడు భాగ్యభావమందుం

డగ, గురుడు లగ్నమునుండి యేదైననొక కేంద్రమందుండెనేని యా జాతకుని తండ్రి భాగ్యవంతుడగును.

శ్లో॥ భాగ్యస్థానాత్ ద్వితీయేవా సుఖేభౌమ సమన్వితే।
భాగ్యేశే నీచరాశిస్థే పితానిర్ధన ఏవహి॥ ౪

తా॥ భాగ్యస్థానము నుండి 2వ యింటగాని 4వ యింటగాని కుజుడుండగ, భాగ్యాధిపతి నీచరాశిగతుడైనచో నా జాతకుని తండ్రి ధనహీనుడగును.

వి॥ జన్మలగ్నమునుండి దశమమందుగాని, వ్యయమందుగాని కుజుడుండగ, భాగ్యాధిపతి నీచలోనున్నచో నా జాతకుని తండ్రి ధనహీనుడగును. ఈ యోగమున్నప్పుడు భాగ్యస్థానములో లగ్నాధిప, యున్నచో కొంతకాలము మాత్రమే జాతకుని తండ్రి ధనహీనుడగుచున్నాడు. జాతకుని మధ్యమ వయస్సునుండి జాతకుని తండ్రికి ధనయోగముపట్టుచున్నది.

శ్లో॥ భాగ్యేశే పరమోచ్చస్థే భాగ్యాంశే జీవసంయుతే।
లగ్నాచ్చతుష్టయే శుక్రే తత్పితాదీర్ఘ జీవనః॥ ౫

తా॥ భాగ్యాధిపతి పరమోచ్చగతుడై యుండగ, భాగ్యభావ నవాంశమందు గురుడుండి, లగ్నమునుండి ఏదైననొక కేంద్రమందు శుక్రుడున్నయెడల యాజాతకునితండ్రి దీర్ఘాయుర్దాయముగలవాడగును.

శ్లో॥ భాగ్యేశే కేంద్రభావస్థే గురుణావనిరీక్షితే॥
తత్పితావాహనైర్యుక్తో రాజావాతత్సమోపివా॥ ౬

తా॥ భాగ్యాధిపతి కేంద్రగతుడై గురునిచే చూడబడెనేని యా జాతకుని తండ్రి వాహనములుగలవాడు, ప్రభువు లేక ప్రభుతుల్యుడును అగును.

వి॥ కేంద్రగతుడైన భాగ్యాధిపతి కస్తమయదోషమున్నప్పుడు గురుదృష్టియున్నను ఈ యోగము ఫలించదు.

శ్లో॥ భాగ్యేశే కర్మభావస్థే కర్మేశే భాగ్యరాశిగే।
కర్మేశాచ్చ ధనాఢ్యశ్చ కీర్తిమాంస్తు పితాభవేత్॥ ౭

తా॥ భాగ్యాధిపతి దశమభావమందు, దశమాధిపతి భాగ్య మందున్నను, దశమాధిపతి నుండి భాగ్యరాజ్యాధిపతులు పరివర్తనము నొందినను జాతకుని తండ్రి కీర్తిమంతుడు, ధనాఢ్యుడును అగును.

వి॥ "సౌమ్యేక్షితేధనాఢ్యశ్చ" అని దేవచంద్రఝా వ్యాఖ్యా సహిత గ్రంథములో పాఠభేదముగలదు. భాగ్యరాజ్యాధిపతులు పరివర్తనమొంది శుభులచే చూడబడినచో తండ్రి ధనము, కీర్తిగల వాడని భావము.

శుభయోగేధనాఢ్యశ్చ" యని గణేశదత్త వ్యాఖ్యా గ్రంథ ములోగలదు.

## పితృభక్తి యోగము

శ్లో॥ పరమోచ్చాంశగే సూర్యే భాగ్యేశే లాభసంస్థితే॥
ధర్మిష్ఠోన్నృప వాత్సల్యః పితృభక్తోభవేన్నరః॥ ౮

తా॥ సూర్యుడు పరమోచ్చభాగయందుండగ, భాగ్యాధిపతి లాభభావమందుండెనేని యాజాతకుడు ధర్మవర్తనముగలవాడు, ప్రభు వులయభిమానముగలవాడు, తండ్రిని పూజించువాడును అగును.

శ్లో॥ లగ్నాత్త్రికోణగే సూర్యే భాగ్యేశే సప్తమస్థితే।
గురుణా సహితే దృష్టే పితృభక్తి సమన్వితః॥ ౯

తా॥ లగ్నమునుండి 5, 9 భావములందు సూర్యుడుండగ, భాగ్యాధిపతి సప్తమభావగతుడై గురునిచే చూడబడినచో నా జాత కుడు పితృభక్తిగలవాడగును.

శ్లో॥ భాగ్యేశే ధనభావస్థే ధనేశే భాగ్యరాశిగే।
ద్వాత్రింశద్వర్షతో భాగ్యం వాహనం కీర్తి సంభవః॥ ౧౦

తా॥ భాగ్యాధిపతి ధనభావమందు, ధనాధిపతి భాగ్యభావ

మందు పరివర్తనమును పొందినచో 32 సం॥రముల తరువాత జాత కుడు భాగ్యమును, వాహనమును, కీర్తిని సంపాదించును.

శ్లో॥ లగ్నేశే భాగ్యరాశిస్థే షష్ఠేశేన సమన్వితే।
అన్యోన్య వైరం బ్రువతే జనకః కుత్సితో భవేత్॥ ౧౧

తా॥ లగ్నాధిపతి షష్ఠాధిపతితో కూడి భాగ్యభావమందున్నచో తండ్రి కుమారులకు శత్రుత్వముండును. తండ్రి కుత్సితుడగును.

వి॥ పితృవిరోధయోగములనుగూర్చి "సర్వార్థచింతామణి"లో
పితుష్షష్ఠాష్టమే జాతః పితృద్వేష్యో భవేన్నరః॥

తండ్రియొక్క జన్మలగ్నమునుండి 6, 8 రాశులందు పుట్టిన జాతకుడు పితృద్వేషముగలవాడగును.

శ్లో॥ కర్మాధిపేన సహితో విక్రమే శోఽపినిష్బలః।
భాగ్యపో నీచమూఢస్థో యోగో భిక్షవ ప్రదః॥ ౧౨

తా॥ దశమాధిపతితో కూడినతృతీయాధిపతిబలహీనుడై యుండగ భాగ్యాధిపతి తన నీచయందుండుటగాని, అస్తమించుటగాని సంభవించి నచో నీయోగమందుబుట్టినవాడు భిక్షాటనమును చేయును.

వి॥ జాతకతత్వ సూత్రములందు;

సూ॥ మేషేచంద్రే భౌమదృష్టేభిక్షుకః॥

మేషమందు చంద్రుడుండి కుజునిచే చూడబడెనేనిభిక్షుకు డగును. (ఈ యోగమందు కుజుడు కన్యాతులలయందుండుటవలన సరిపోవుచున్నది. మకరకుజుడయినచో ఈ యోగము సరిపడుట లేదు)

## పితృమరణ యోగములు

శ్లో॥ షష్ఠాష్టమ వ్యయేభానూ రంధ్రేశే భాగ్యసంయుతే।
వ్యయేశే లగ్నరాశిస్థే షష్ఠేశే పంచమే స్థితే॥
జాతస్య జననాత్పూర్వం జనకస్య మృతిర్భవేత్ ౧౩

తా॥ సూర్యుడు 6,8,12. భావములందుండగ, అష్టమాధిపతి

భాగ్యమందు, వ్యయాధిపతి లగ్నమందు షష్ఠాధిపతి పంచమమందుండి లేని యట్టి జాతకుని జననమునకు పూర్వమే తండ్రి మరణించును.

వి॥ జాతకతత్త్వ సూత్రములందు మరియొక యోగము కలదు.

సూ॥ తుర్యే ఖేవా మందారార్కయోగే జన్మతః ప్రాక్ పిత్రు మరణమ్॥ చతుర్థమందుగాని దశమమందుగాని రవికుజశనులు కలిసి యున్నయెడల జాతకుని జననమునకు పూర్వము తండ్రిమరణించును. ఇక్కడ "మందరార్క" అని గ్రహక్రమము చెప్పుటచే శనికి వెనుక కుజుడు వానికి వెనుక రవియుండవలయునను భావము గోచరించుచున్నది.

శ్లో॥ రంధ్రస్థావగతే సూర్యే రంధ్రేశే భాగ్యగే సతి। ౧౪
జాతస్య ప్రథమాబ్దేతు పితుర్మరణ మాదిశేత్॥

తా॥ అష్టమభావమందు సూర్యుడుండగ అష్టమమాధిపతినవమ భావమందున్నచో జాతకుని ప్రథమ సం॥రమందు తండ్రిమరణించును.

శ్లో॥ వ్యయేశే భాగ్యరాశిస్థే నీచాంశే భాగ్యనాయకే॥ ౧౫
తృతీయే షోడశేవర్షే జనకస్య మృతిర్వదేత్॥

తా॥ వ్యయాధిపతి నవమభావమందుండగ, భాగ్యభావాధిపతి నీచాంశములోనున్నచో నా జాతకుని 3 లేక 16వ సం॥రమందు తండ్రి మరణించును.

శ్లో॥ లగ్నేశే నాశరాశిస్థే రంధ్రేశే భానుసంయుతే॥ ౨౧
ద్వితీయే ద్వాదశేవర్షే పితుర్మరణ మాదిశేత్।

తా॥ లగ్నాధిపతి అష్టమభావమందుండగ, అష్టమాధిపతి రవితో కలసి అస్తమించినచో నా జాతకుని 2 లేక 12వ సం॥రమందు తండ్రి మరణించును.

శ్లో॥ భాగ్యాద్రంధ్రగతే రాహౌ భాగ్యాద్భాగ్యగతే రవౌ॥ ౧౬
షోడశేఽష్టాదశేవర్షే జనకస్య మృతిర్వదేత్।

తా॥ భాగ్యస్థానమునుండి అష్టమములో రాహువు, భాగ్య

భావమునుండి భాగ్యభావమందు సూర్యుడుగల జాతకుని యొక్క 16 లేక 18వ సం॥రమందు తండ్రి మరణించును.

వి॥ చతుర్థభావమందు రాహువు, పంచమభావమందు రవి యుండవలయునని భావము.

శ్లో॥ రాహుణావహితే సూర్యే చంద్రాద్భాగ్యగతే శనౌ॥ ౧౮
సప్తైకోన వింశాబ్దే తాతస్య మరణం ధ్రువమ్।

తా॥ రవి రాహువులు కలసియుండగ, చంద్రునకు భాగ్యభావమందు శనియున్నచో నాజాతకునియొక్క 7 లేక 19వ సం॥రమందు తండ్రి మరణించును.

శ్లో॥ భాగ్యేశే వ్యయరాశిస్థే వ్యయేశే భాగ్యరాశిగే। ౧౯
వేదాబ్ధి మితవర్షాచ్చ పితుర్మరణ మాదిశేత్॥

భాగ్యాధిపతి వ్యయభావమందుండగ, వ్యయాధిపతి భాగ్యభావమందున్నచో జాతకుని 44వ సం॥రమందు తండ్రి మరణించును.

శ్లో॥ రవ్యంశేష స్థితే చంద్రే లగ్నేశే రంధ్ర సంయుతే॥ ౨౦
పంచత్రింశైక చత్వారింశ ద్వర్షే మృతిః పితుః॥

తా॥ చంద్రుడు రవి నవాంశమందుండగ లగ్నాధిపతి అష్టమములో నుండెనేని యాజాతకుని 35 లేక 41వ సం॥రమందు తండ్రి మరణించును.

శ్లో॥ పితృస్థానాధిపే సూర్యే మందభౌమ సమన్వితే॥ ౨౧
పంచాశ ద్వత్సరే ప్రాప్తే జనకస్య మృతిర్భవేత్।

తా॥ పితృస్థానాధిపతి యగు సూర్యుడు కుజశనులతో కూడి యుండెనేని జాతకుని 50వ సం॥రమందు తండ్రికి మరణముకలుగును.

వి॥ సింహరాశియందు భాగ్యభావమధ్యమముగల జాతకులకే యోగమును చెప్పవలయును.

శ్లో॥ భాగ్యాత్సప్తమగే సూర్యే భ్రాతృసప్తమ గస్తమః॥
షష్ఠే పంచవింశాబ్దే పితుర్మరణ మాదిశేత్।

తా॥ భాగ్యభావమునుండి షష్ఠమములో సూర్యుడుండగ, తృతీయ భావమునుండి సప్తమభావములో రాహువున్న జాతకునకు 6 లేక 26వ సం॥రములో తండ్రి మరణించును.

తా॥ పితృభావ మధ్యమమున కారు రాశుల దూరములో రవియు, తృతీయ భావమధ్యమమున కారు రాశుల దూరములో రాహువు ఉండవలయునను భావము వ్యక్తమగుచున్నది.

శ్లో॥ రంధ్ర ణామిత్రగే మందే మందాజ్ఞామిత్రిగేరవౌ॥
త్రింశైక వింశేషడ్వింశే జనకస్య స్మృతిర్భవేత్॥ ౨౩

తా॥ అష్టమమునకు సప్తమములో శనియుండగ, శనికి సప్తమమందు సూర్యుడున్న జాతకునకు 21, 26 లేక 30సం॥ములందు పితృ మరణము కలుగును.

శ్లో॥ భాగ్యేశే నీచరాశిస్థే తదీశే భాగ్యరాశిగే॥ ౨౪
షడ్వింశేవాత్రియస్త్రింశే పితుర్మరణ మాదిశేత్।
ఏవం జాతస్యద్వైవజ్ఞోఫలం జ్ఞాత్వావినిర్దిశేత్॥ ౨౫

తా॥ భాగ్యాధిపతి నీచయందుండగ, ఆస్థానాధిపతి భాగ్య రాశి యందున్నచో నట్టి జాతకుని 26 లేక 38 సం॥రమందు తండ్రికి మరణము గలుగును,

వి॥ 1) మేషలగ్న జాతకులకు దశమమందు గురుడు భాగ్యమందు శనియున్నప్పుడు 2) వృషభ లగ్నజాలకు మేషమందు శని,మకరమందు కుజుడున్నప్పుడు 3) మిధునలగ్న జాతకులకు భాగ్యభావాధిపతి యగు శనిమేషమందుండగ ఆస్థానాధిపతియగు కుజుడు భాగ్యభావమగు కుంభమందున్నప్పుడు 4) కర్కాటకలగ్న జాతకులకు భాగ్యభావాధిపతి యగు గురుడు మకరమందు నీచలోనుండగ, ఆ స్థానాధిపతియగు శని (మీనమందు) భాగ్యభావమందున్నప్పుడు 5) సింహలగ్నజాతకులకు భాగ్యస్థానాధిపతి కుజుడు కర్కాటకములో నుండగ చంద్రుడు మేషమందు భాగ్యభావములో నున్నప్పుడు 6) కన్యాలగ్నజులకు శుక్రుడు నీచలో నున్నప్పుడు ఆ భావాధిపతి భాగ్యభావమగు వృషభములో

నున్నప్పుడు (ఇక్కడ శుక్ర బుధులకు 9 రాశులదూరము సంభవము కాదు. బుధునకు 90 భాగల దూరములో శుక్రుడుండుట సంభవము కాదు ) 7) తులాలగ్న జాతకులకు భాగ్యభావాధిపతి బుధుడు మీన మందు నీచరాశిలో నుండగ గురుడు భాగ్యభావమగు మిధునమందు న్నప్పుడు 8) వృశ్చిక లగ్నజులకు భాగ్యాధిపతి చంద్రుడు లగ్నమందు నీచలో నున్నప్పుడు కుజుడు కర్కటకమందు భాగ్యభావములో నున్న ప్పుడు 9) ధనుర్లగ్నజులకు భాగ్యాధిపతి రవి నీచయందుండగ, నీచాధి పతియగు శుక్రుడు సింహమందు భాగ్యభావములో నున్నప్పుడు 10) మకర లగ్నమందు పుట్టినవారికి భాగ్యభావమగు కన్యకధిపతియగు బుధుడు నీచలోనుండగ, తదధిపతి కన్యలో (భాగ్యభావమందు) నున్న ప్పుడు 11) కుంభమునకు భాగ్యాధిపతియగు శుక్రుడు నీచలో నుండగ తదధిపతియగు బుధుడు భాగ్యములోనున్నప్పుడు 12) మీనలగ్న జాత కులకు భాగ్యాధిపతియగు కుజుడు నీచయందుండగ, తదధిపతియగు చంద్రుడు భాగ్యమగు వృశ్చికములో నున్నప్పుడు పై యోగములను చెప్పవలసి యుండును.

కొన్ని ప్రదేశములందు భావముల ప్రమాణములధికముగనుండును. కొన్ని ప్రదేశములందు భావముల ప్రమాణములు తక్కువగ నుండును. అందుచే గ్రహముల స్థితిని రాశియందుగాక భావరీత్యా గుర్తించి. భావమధ్యమములను గుర్తించి భావభావాధిపతులను నిర్ణయించుకొన వలయును. భావమధ్యమము యేరాశిలో నుండునో ఆ రాశ్యధిపతియే ఆ భావాధిపతి యని గ్రహించవలయును. కొన్ని సందర్భములలో నొకేరాశి యందు ప్రథమములో నొక భావమధ్యమము, అంత్య ములో రెండవ భావమధ్యమము పడును. అట్టి సమయములందు రెండు భావములకు ఆ రాశ్యధిపతియే భావాధిపతి యగును. సూక్ష్మపరిశీల నతో భావఫల విచారణ చేయవలయును, రాశిఫలము కంటె భావఫలము ముఖ్యము గనుక భావాంశములను బట్టియే ఫలవిచారణ చేయవలయు

వను భావముచేతనే పరాశరులీ పై యోగముల నన్నింటిని భావసంబం
ధముతో చెప్పినారు.

## భాగ్యోదయ సమయజ్ఞానము

శ్లో॥ పరమోచ్చాంశగే శుక్రే భాగ్యేశేన సమన్వితే।
భ్రాతృస్థానే శనియుతే బహుభాగ్యాధిపో భవేత్॥ ౨౬

తా॥ శుక్రుడు పరమోచ్చ గతుడై భాగ్యాధిపతితో కూడి
యుండగ, తృతీయ భావమందు శనియున్నచో నాజాతకుడు విశేష
భాగ్యము నొందును.

శ్లో॥ గురుణా సంయుతే భాగ్యే తదీశే కేంద్ర రాశిగే।
వింశద్వర్షాత్పరంచైవ బహుభాగ్యం వివర్ధితేత్॥ ౨౭

తా॥ భాగ్యభావమందు గురుడుండగ, భాగ్యాధిపతి యేదైన
నొక కేంద్రమందున్నచో 20 సం॥రములు దాటిన పిమ్మట విశేష
భాగ్యము నొందును.

శ్లో॥ పరమోచ్చాంశగే సౌమ్యే భాగ్యేశే భాగ్య రాశిగే।
షట్త్రింశాచ్చ పరంచైవ బహు భాగ్యం వివర్ధితేత్॥ ౨౮

తా॥ బుధుడు తనయొక్క పరమోచ్చలో నుండగ, భాగ్యాధి
పతి భాగ్యభావమందున్న యెడల 36 సం॥రముల తరువాత జాతకుడు
భాగ్యవంతుడగును.

శ్లో॥ లగ్నేశే భాగ్య రాశిస్థే భాగ్యేశే లగ్నసంయుతే।
గురుణా సంయుతే ద్యూనే ధనవాహన లాభకృత్॥ ౨౯

తా॥ లగ్నాధిపతి భాగ్యమందు, భాగ్యాధిపతి లగ్నమదుండగి,
సప్తమభావములో గురుడున్నచో నా జాతకుడు ధనవాహన లాభము
కల వాడగును.

శ్లో॥ భాగ్యస్థానగతే రాహౌ తదీశే శుభంగతే।
భాగ్యేశేశేదరాశిస్థే భాగ్య హీనో భవేన్నరః॥ ౩౦

తా॥ భాగ్యస్థానమునుండి భాగ్యస్థానమునందు రాహువుండగ, ఆ

స్థానాధిపతి అష్టమభావములో నుండి, భాగ్యాధిపతి నీచగతుడైనచో నా జాతకుడు భాగ్యహీనుడగును.

శ్లో॥ భాగ్య స్థానగతే మందే శశినా చ సమన్వితే।
లగ్నేశే నీచరాశిస్థే భిక్షాశనపరో భవేత్॥ ౩౧

తా॥ భాగ్యభావమందు శని చంద్రునితో కూడి యుండగ, లగ్నాధిపతినీచరాశి యందుండెనేని యా జాతకుడు భిక్షాశనమును చేయును.

వి॥ ఈ యోగములో "సమన్విత" శబ్దమును బట్టి శనిచంద్ర సమాగమమని గ్రహించవలయును.

"సమాగమశ్శ శాంకేన" అను సూర్యసిద్ధాంతవచనమును బట్టి చంద్రునితో యే గ్రహమునకు సంబంధము కలిగినను దానికి "సమాగమ" మని పేరు. ఈ రెండు గ్రహములకు పూర్వాపరాంతరము లేన ప్పుడు దక్షిణోత్తరాంతర మత్యల్పముగ నున్నప్పుడు సమాగమము గలుగును. సిద్ధాంతగణితముచే నీవిషయము సుబోధకము కాగలదు.

శ్లో॥ ఏవం భాగ్యఫలం విప్ర సంక్షేపాత్కథితం మయా।
లగ్నేశ భాగ్య భావేశ స్థిత్యాన్యదపి చిన్తయేత్॥ ౩౨

తా॥ ఓ ద్విజశ్రేష్ఠ! పై ప్రకారము భాగ్యభావఫలము నాచే సంక్షేపముగ తెలుపబడినది. లగ్నాధిప, భాగ్యాధిపతుల యొక్కస్థితి విశేషమును బట్టిఇతర విషయములనుగూడ విచారించి చెప్పవలయును

ఇతి బృహత్పరాశరహోరాశాస్త్రే భాగ్యభావఫలాధ్యాయః ॥౨౧॥

ఇది బృహత్పరాశరహోరాశాస్త్రమందు - భాగ్యభావఫలాధ్యాయము ముగిసెను.

## దశమ (కర్మ) భావ ఫలాధ్యాయము ॥౨౨॥

శ్లో॥ కర్మ భావఫలం చాథ కథయామి తవాగ్రతః।
శృణు మైత్రేయ తత్త్వేన బ్రహ్మా గర్గాది భాషితమ్॥ ౧

తా॥ ఓ మైత్రేయ! పూర్వములో బ్రహ్మ, గర్గుడు మొదలగు

వారిచే చెప్పబడిన దశమభావఫలమును చెప్పుచుంటిని. సావధానముగ వినుము.

శ్లో॥ బలే కర్మభావేశే స్వోచ్చేస్వాంశే స్వరాశిగే।
జాతస్తాతసుఖేనాఢ్యోయశస్వీ శుభకర్మకృత్॥ ౨

తా॥ బలవంతుడైన దశమాధిపతి స్వోచ్చ, స్వాంశ స్వక్షేత్రములందే యున్నను జాతకుడు పితృసుఖము, యశస్సు, శుభకర్మాసక్తి గలవాడగును.

వి॥ దశమాధిపతి శుభుడైనను పాపుడైనను స్వోచ్చస్వక్షేత్ర స్వాంశములనుపొందియున్నప్పుడు పై ఫలములను చెప్పవలయును. నైసర్గిక పాపగ్రహాలగు రవి, కుజ, క్షీణచంద్ర, శనులు దశమాధిపతులై పై స్థితిని పొందియున్నను భావమునకు శుభత్వమును చెప్పవలయును.

శ్లో॥ కర్మాధిపో బలో నశ్చేత్ కర్మ వైకల్య మాదిశేత్।
సైంహిః (రాహుః) కేంద్ర త్రికోణస్థో,జ్యోతిష్టోమాదియాగకృత్॥ ౩

తా॥ కర్మాధిపతి బలహీనుడైనచో సత్కర్మలను చేయుట కిష్టములేని వాడగును. రాహువు కేంద్ర త్రికోణములందున్నచో జ్యోతిష్టోమాదియాగములను చేయువాడగును.

వి॥ కర్మస్థానమును బట్టి, కర్మాధిపతినిబట్టి సత్కర్మలను చేయు విషయమును నిర్ణయించవలయును. కర్మ స్థానాధిపతి బలహీనుడైనచో సత్కర్మలను చేయని వాడగును. రాహువు కేంద్రకోణము లందున్నప్పుడు కర్మాధిపతి బలవంతుడైనప్పుడు మాత్రమే సత్కర్మలను చేయు వాడగును.

భారతీయమత ధర్మములననుసరించి, బ్రాహ్మణులు జ్యోతిష్టోమాదియాగములను చేయువారు. వీరిజాతక గ్రహస్థితి పైవిధముగ నున్నప్పుడీ విషయమును వారికి మాత్రము చెప్పవలయును. భిన్నమతస్థుల జాతకములందట్టి గ్రహస్థితి యున్నప్పుడు వారివారి మతము లందు గల ధర్మకర్మలనాచరించు వారగుదురని చెప్పవలయును

జ్యోతిష్టోమాది యాగములు పుత్రాత్యతిశయజనకములగుట చేత దీనినుప
లక్షణముగ గ్రహించి అన్యమతస్థులకు పుత్ర్యతిశయ జనకములగు
సత్కర్మల నాచరించు వారగుదురని చెప్పుట యుక్తముగ నుండును.

శ్లో॥ కర్మేశే శుభసంయుక్తే శుభస్థానగతే తథా।
రాజద్వారేవ వాణిజ్యే సదాలాభోఽన్యథాన్యథా॥ ౪

తా॥ దశమాధిపతి శుభగ్రహములతో కూడిదశమమునందున్న
యెడల ప్రభువువలనగాని వాణిజ్యమువలనగాని లాభముగలుగును.
లేని యెడల కలుగదు.

వి॥ దశమాధిపతి శుభగ్రహములతో కూడినను, శుభస్థాన
గతుడైనను రాజు (ప్రభుత్వము)వలన, లేక వాణిజ్యమువలన లాభము
కలుగుననుటచే జాతకునివృత్తి తెలియుచేయుబడినది. అనుభవములో
దశమాధిపతి, దశమభావము, దశమభావస్థగ్రహములు, శుభగ్రహము
లైగాని, పాపగ్రహములైగాని రవి, కుజ, చంద్రశుక్రనవాంశములను
అధికముగ పొందినచో నట్టివారు ప్రభుత్వమందు వృత్తిగలవారగును,
బుధ పూర్ణచంద్ర, శుక్రనవాంశములను పొందినచో వాణిజ్యము,
వాణిజ్యసంస్థలందు వృత్తిగలవారగు అగుదురు. కుజ, గురు, శనవాంశ
ములను సముదాయముగ పొందినవారు, స్వతంత్రులుగ, విద్యాజీవను
లుగ, భూమివలన జీవించువారుగనున్నారు. వృత్తి నిర్ణయించుట
చాలకష్టమైన విషయము. కొన్ని రాజసంబంధి యోగములు ప్రభుత్వో
ద్యోగయోగములు పట్టినవారికి భావ,భావస్థగ్రహ, భావాధిప
భావవీక్షకులయొక్క అంశములనన్నింటిని విచారించి అధికాంశములే
గ్రహమునకు సంబంధించి యుండునో విచారించి ఫలమూహించ
వలయును.

శ్లో॥ దశమే పాపసంయుక్తే లాభే పాపసమన్వితే।
దుష్కృతిం లభతే మర్త్యః స్వజనానాం విదూషకః॥ ౫

తా॥ దశమభావమందు పాపగ్రహములుండగ, లాభస్థానము

గూడ పాపులతో చేరియుండెనేని యాజాతకుడు దుష్టకర్మలనాచరించువాడు, బంధుజనమును ద్వేషించువాడు అగును.

వి॥ దశమైకాదశమములందున్న నైసర్గిక పాపగ్రహములు పాపనవాంశములను పొందినప్పుడు మాత్రము దుష్టకర్మల నాచరించువారగుదురు. శుభనవాంశములను పొందినవారై శుభగ్రహవీక్షణము గలవారైనచో సత్కర్మలను చేయువారగుదురు. ఈ ఫలవిచారణలో భావస్థగ్రహములయొక్క వర్గమును షష్ట్యంశములను గ్రహించి ఫలనిర్ణయమును చేయుటయుక్తము.

శ్లో॥ కర్మేశే నాశరాశిస్థే రాహుణా సంయుతే తథా।
జనద్వేషీ మహామూర్ఖో దుష్కృతిం లభతే నరః॥ ౯

తా॥ దశమాధిపతి అష్టమభావమందు రాహువుతో కలిసినచో నట్టి జాతకుడు ప్రజలచే ద్వేషింపబడువాడు, మహామూర్ఖుడు, దుష్టకర్మలను చేయువాడవగును.

వి॥ దశమాధిపతి ఋజుగతిగలవాడై రాహువునకభిముఖముగ నుండి రాశి ప్రథమ ద్రేక్కాణమందుగాని, భావమధ్యమమందుగాని యున్న జాతకులకీ యోగముగలుగుచుండును. దశమాధిపతి ఋజుగతిగలవాడై రాహువును దాటియున్నప్పుడీ యోగముఫలించుటలేదని తెలియుచున్నది.

శ్లో॥ కర్మేశే ద్యూనరాశిస్థే మందభౌమ సమన్వితే।
ద్యూనేశే పాప సంయుక్తే శిశ్నోదర పరాయణః॥ ౬

తా॥ కర్మాధిపతి సప్తమభావమందుండి కుజ శనియుతుడై యుండగ, సప్తమాధిపతి పాపగ్రహములతో కూడినయెడల శిశ్నోదర పరాయణుడగును.

శ్లో॥ తుంగరాశిం సమాశ్రిత్య కర్మేశే గురుసంయుతే।
భాగ్యేశే కర్మ రాశిస్థేపి మానైశ్వర్య ప్రతాపవాన్॥ ౭

తా॥ దశమాధిపతి యుచ్చరాశియందుండి గురునితో కూడి

యుండగ, భాగ్యాధిపతి దశమభావమందుండనేని యట్టి జాతకుడు గౌరవము, ఐశ్వర్యము, ప్రతాపముగలవాడగును.

శ్లో॥ లాభేశే కర్మరాశిస్థే కర్మేశే లగ్నసంయుతే।
తావుభౌ కేంద్ర గౌవాపి సుఖజీవన భాగ్భవేత్॥

తా॥ లాభాధిపతి కర్మభావమందు, కర్మాధిపతి లగ్నమందున్నప్పుడుగాని, దశమలాభాధిపతులు కేంద్రగతులైనప్పుడుగాని, సుఖజీవనమును చేయును.

శ్లో॥ కర్మేశే బలసంయుక్తే మీనే గురుసమన్వితే।
వస్త్రాభరణ సౌఖ్యాది లభతే నాత్రసంయుతః॥ ౧౦

తా॥ దశమాధిపతి బలవంతుడై మీనమందు గురునితో కూడియున్నచో వస్త్రములు, ఆభరణములు, సుఖము మొదలగునవి గలవాడగును.

వి॥ దశమలాభాధిపతులిద్దరు పాపసంబంధము లేనివారైనప్పుడు, కేంద్రములందున్నప్పుడు, బలవంతులైనప్పుడు, నీచశత్రుక్షేత్రాంశములను పొందక శుభస్థానములందున్నప్పుడు పై శుభయోగములను చెప్పవలయును.

## అశుభయోగము

శ్లో॥ లాభస్థానగతే సూర్యే రాహుభౌమ సమన్వితే।
రవిపుత్రేణ సంయుక్తే కర్మచ్ఛేత్తా భవేన్నరః॥ ౧౧

తా॥ సూర్యుడు లాభభావమందు కుజ రాహువులతోగాని, శనితోగాని కలిసియున్నచో నా జాతకుడు కర్మవిచ్ఛేదమును చేయువాడగును. అనగా కర్మభ్రష్టుడగును.

## సత్కర్మయోగములు

శ్లో॥ మీనేజీవే భృగుయుతే లగ్నేశే బలసంయుతే।
స్వోచ్ఛ రాశిగతే చంద్రే సమ్యగ్జ్ఞా నార్థవాన్ భవేత్॥ ౧౨

తా॥ మీనమందు గురు శుక్రులుకలసియుండి, లగ్నాధిపతి బలవంతుడై యుండగ, చంద్రుడు తన స్వక్షేత్రోచ్ఛ రాశిగతుడయ్యె నేని యోగ్యమైన జ్ఞానము, అర్థముగలవాడగును.

వి॥ లగ్నాధిపతి నీచ, శత్రురాశ్యంశములను పొందినప్పుడు, పాపగ్రహములతో సంబంధవీక్షణములు గలవాడైనప్పుడు, చంద్రుడు క్షీణచంద్రుడై దుస్థానములగు స్వక్షేత్రోచ్ఛ రాశులందున్నప్పుడు, పై యోగఫలము పూర్తిగ సిద్ధించదు.

శ్లో॥ కర్మేశే లాభరాశిస్థే లాభేశే లగ్నవంస్థితే।
కర్మరాశిస్థితే శుక్రే రత్నవాన్ స నరో భవేత్॥ ౧౩

తా॥ కర్మస్థానాధిపతి లాభమందు లాభస్థానాధిపతి లగ్నమందుండగ, దశమమందు శుక్రుడున్నచోనట్టి జాతకుడు రత్నములు, అమూల్యాభరణములు గలవాడగును.

శ్లో॥ కేంద్ర త్రికోణగే కర్మనాథే స్వోచ్ఛ సమాశ్రితే।
గురుణా సహితేదృష్టే స కర్మనహితో భవేత్॥ ౧౪

తా॥ దశమాధిపతి కేంద్రత్రికోణములందున్నను, తనయొక్క ఉచ్ఛ రాశియందున్ననులేక గురునితో కలిసినను చూడబడినను అట్టి జాతకుడు సత్కర్మలను చేయువాడగును.

వి॥ దశమభావాధిపతి యొక్క స్థితిసంబంధములు శుభముగ నున్నను, దశమభావము పాపగ్రహములతో కూడియున్నప్పుడు విఘ్నములను, కర్మల నాచరించుటలో విలంబమును సూచించును.

శ్లో॥ కర్మేశే లాభ భావస్థే లగ్నేశేన సమన్వితే।
కేంద్ర త్రికోణగే చంద్రే సత్కర్మ నిరతో భవేత్॥ ౧౫

తా॥ దశమాధిపతి లాభభావమందు లగ్నాధిపతితో కూడియుండగ, చంద్రుడు కేంద్రత్రికోణములందున్నయెడల సత్కర్మ నిరతిగల జాతకుడగును.

## దుష్టకర్మ యోగములు

శ్లో॥ కర్మస్థానగతే మందే నీచఖేచర సంయుతే।
కర్మాంశే పాపసంయుక్తే కర్మహీనో భవేన్నరః॥ ౧౬

తా॥ దశమభావమందు శనియున్నను, నీచగ్రహములున్నను, దశమభావాంశము పాపగ్రహములతో కూడినను జాతకుడు కర్మహీనుడగును.

శ్లో॥ కర్మేశే నాశరాశిస్థే రంధ్రేశే కర్మ సంస్థితే।
పాపగ్రహేణ సంయుక్తే దుష్కర్మ నిరతో భవేత్॥ ౧౭

తా॥ దశమాధిపతి అష్టమమందు, అష్టమాధిపతి దశమమందుండి పాపగ్రహములతో కూడినయెడల దుష్కర్మలనుచేయు వాడగును.

వి॥ అష్టమదశమాధిపతులు పరివర్తనలోనుండగ వీరిద్దరికి గురు దృష్టియున్నచో దుష్టకర్మల నాచరించుటలో తీవ్రత తగ్గును.

శ్లో॥ కర్మేశే నీచరాశిస్థే కర్మస్థే పాపఖేచరే।
కర్మభాత్కర్మగే పాపే కర్మవైకల్య మాదిశేత్॥ ౧౮

తా॥ దశమాధిపతి నీచరాశియందుండగ, కర్మస్థానమగు దశమము, దానికి దశమమగు సప్తమము పాపగ్రహములతో కూడి యున్నచో నా జాతకునకు కర్మవైకల్యము కలుగును.

## కీర్తి యోగములు

శ్లో॥ కర్మస్థానగతే చంద్రే తదీశేత త్రికోణగే।
లగ్నేశే కేంద్ర భావస్థే సత్కీర్తిసహితో భవేత్॥ ౧౯

తా॥ దశమమందు చంద్రుడుండగ, దశమాధిపతి చంద్రునకు త్రికోణరాశియందుండగ, లగ్నాధిపతి కేంద్రగతుడైనచో జాతకుడు సత్కీర్తి గలవాడగును.

శ్లో॥ లాభేశే కర్మ భావస్థే కర్మేశే బలసంయుతే।
దేవేంద్ర గురుణా దృష్టే సత్కీర్తి సహితో భవేత్। ౨౦

తా॥ లాభాధిపతి కర్మస్థానమందుండగ, బలవంతుడైన కర్మాధిపతి గురునిచే చూడబడినచో జాతకుడు సత్కీర్తి గలవాడగును.

శ్లో॥ కర్మ స్థానాధిపే భాగ్యే లగ్నేశే కర్మ సంయుతే।
లగ్నాత్పంచమగే చంద్రే ఖ్యాతకీర్తిః ప్రజాయతే॥ ౨౧

తా॥ కర్మస్థానాధిపతి భాగ్యమందు, లగ్నాధిపతి దశమమందు ఉండగ పంచమమందు చంద్రుడుండగ పుట్టినజాతకుడు సత్కీర్తిగల వాడగును.

వి॥ "పర్యార్థచింతామణి" దశమభావములో;

శశాంకే కేంద్ర సంయుక్తే గురుశుక్ర విరీక్షితే।
పారావతాది భాగస్థే సత్కీర్తి సహితో భవేత్॥

చంద్రుడు కేంద్రరాశులందుండి పారావతాద్యంశములను పొంది గురుశుక్రదృష్టి గలవాడైనచో సత్కీర్తి గలవాడగును.

తదీశే శుభసంయుక్తే శుభమధ్యగతేఽపివా।
శుభగ్రహాణా మంశేవా సత్కీర్తి సహితో భవేత్॥

దశమాధిపతి శుభగ్రహాయుక్తుడై శుభగ్రహామధ్యగతుడై శుభగ్రహాంశములను పొందినచో సత్కీర్తిగలవాడగును.

కీర్తిస్థానాధిపే సౌమ్యేస్వోచ్ఛ మిత్రస్వ వర్గగే।
సౌమ్య షష్ట్యంశగే వాపి సత్కీర్తి సహితో భవేత్॥

దశమాధిపతి శుభగ్రహమై స్వోచ్ఛమిత్ర స్వక్షేత్రములందేదైనుండి, శుభషష్ట్యంశమును పొందియున్నచో సత్కీర్తిగల వాడగును.

తదీశే దేవలోకస్థే సింహాసనగతేఽపివా।
బలపూర్ణే విలగ్నేశే సత్కీర్తి సహితో భవేత్॥

దశమాధిపతి దేవలోకాంశమునుగాని (దశవర్గమందు 7 స్వవర్గములు గలిగియుండుట) సింహాసనాంశమునుగాని (దశవర్గమందు 5 స్వ వర్గములను కలిగియుండుట) పొందియుండగ, లగ్నాధిపతి బల

వంతుడైనచో జాతకుడు సత్కీర్తి గలవాడగునని తెలిపియుండెను. కీర్తిని గురించి విచారించునప్పుడు చంద్రునిబలము ముఖ్యముగ చూడ వలయును. చంద్రునకు పాపసంబంధము, క్షీణత్వ, నీచరాశ్యంశస్థితి, రాహుగ్రస్తత్వము, శుభవీక్షణములేని పాపదృష్టి గలిగియున్నచో కీర్తిప్రతిష్ఠలకు భంగయోగమును చెప్పవలయును. చంద్రుడు సంపూర్ణ శుభుడై పాపసంబంధము గలవాడైనచో కీర్తిప్రతిష్ఠలు మధ్యమముగ నుండుట, లేక కీర్తిదాయకమైన శక్తియుక్తులు గలిగి తదనుగుణమైన ఖ్యాతినార్జించలేకపోవుటయు జరుగును. సంపూర్ణశుభుడగు చంద్రునకు సంపూర్ణశుభగ్రహసంబంధములు గలిగి లగ్నదశమాధిపతులు శుభ స్థానగతులైనప్పుడు విశ్వవిఖ్యాత జాతకులగుదురు.

శ్లో॥ ఇతి కర్మఫలం ప్రోక్తం సంక్షేపేణ ద్విజోత్తమ।
లగ్న కర్మేశ సంబంధా దూహ్యమన్యదపి వ్యయమ్॥

తా॥ ఓ ద్విజోత్తమ! పైవిధముగ కర్మభావఫలమును సంక్షేపముగ చెప్పియుంటిని. లగ్నదశమాధిపతులయొక్క సంబంధమువలన ఇతరములైన విషయములను స్వయముగనూహించి చెప్పవలయును.

ఇతి బృహత్పరాశరహోరాశాస్త్రే దశమ(కర్మ)భావఫలాధ్యాయః ॥౨౦॥
ఇది బృహత్పరాశరహోరాశాస్త్రమందు దశమ(కర్మ)భావఫలాధ్యాయము ముగిసెను.

## లాభ భావ ఫలాధ్యాయము ॥౨౧॥

శ్లో॥ లాభభావఫలం చాథ కథయామి ద్విజోత్తమ।
శ్రూయతాం జాతకో లోకే యచ్ఛుభత్వే సదామతీ॥ ౧

తా॥ ఓ ద్విజశ్రేష్ఠ! లోకమందు మనుష్యులు ఏ భావము శుభముగనున్నచో సర్వదా సుఖముగ నుండగలరో యట్టి లాభభావ ఫలమును చెప్పుచున్నాను. సావధానముగ వినుము :-

శ్లో॥ లాభాధిపో యదాలాభే తిష్ఠేత్కేంద్రత్రికోణయోః।
బహులాభం తదా కుర్యాదుచ్చే సూర్యాంశగోఽపివా॥ ౨

తా॥ జన్మలగ్నము నుండి లాభస్థానాధిపతి కేంద్రకోణము

లందున్నను, ఉచ్ఛయందుగాని, రవియొక్క నవాంశమును పొందిగాని యున్నచో నా జాతకుడు విశేషలాభమును పొందును.

వి॥ "సూర్యాంశగోఽపివా" అను దానికి అస్తమించుట యని కొందరనుచున్నారు.

శ్లో॥ లాభేశే ధనరాశిస్థే ధనేశే కేంద్రసంస్థితే।
గురుణాసహితేభావే గురులాభం వినిర్దిశేత్॥ ౫

తా॥ లాభాధిపతి ధనస్థానమందుండి, ధనాధిపతి కేంద్రమందుండగ, గురుడు లాభభావమందున్న యెడల విశేషలాభమును పొందును.

వి॥ "లాభేశే" అనుటకుబదులు "లగ్నేశే" యనుపాఠము దే.చం.మూ।గ్రంథమందు చూపబడినది. ఆపాఠమునుబట్టి లగ్నాధిపతి ధనస్థానమందుండవలయునని గ్రహించవలయును.

శ్లో॥ లాభేశే విక్రమేభావే శుభగ్రహ సమన్వితే।
షట్త్రింశే వత్సరే ప్రాప్తే సహస్ర ద్వయనిష్కభాక్॥ ४

తా॥ లాభాధిపతి తృతీయభావమందు శుభగ్రహములతో కూడియుండెనేని జాతకుని 36వ సం॥రమందు రెండువేల సువర్ణముద్రలను సంపాదించును.

వి॥ ఈ శ్లోకము యొక్క మొదటి పాదము బృ. ప. హో. సారాంశములో లేదు. నిష్కమును గురించి; ప్రాచీనకాలమందు వ్యవహారములోనున్న ధనమానము.

వరాటకానాం దశకద్వయం యత్సా కాకిణీ తాశ్చపణశ్చతస్రః।
తేషోడశ ద్రమ్మ ఇహావగమ్యో ద్రమ్మైస్తథా షోడశభిశ్చనిష్కః॥

20 గవ్వలు = 1 కాకిణి, 4 కాకిణులు 1 పణము, 16 పణములు 1 ద్రమ్మము, 16 ద్రమ్మములు 1 నిష్కము.

శ్లో॥ కేంద్రత్రికోణగే లాభనాథే శుభసమన్వితే।
చత్వారింశేతు సంప్రాప్తే సహస్రార్థమనిష్కభాక్॥ ౫

తా॥ లాభాధిపతి కేంద్రత్రికోణములలో నెందైననుండి శుభ

గ్రహములతో కూడినచో నా జాతకుడు తన 40వ సం॥రమందు 500 నిష్కములను సంపాదించును.

వి॥ బృ. ప. హో. సా. సారాంశమందు "లాభనాథే"యనుటకు మారుగ "భావేనాథే"యనిగలదు. "భావనాథే"యనుట యుక్తము. దీనివలన లాభాధిపతియను అర్థము సిద్ధించును.

శ్లో॥ లాభస్థానే గురుయుతే ధనే చంద్ర సమన్వితే।
భాగ్యస్థానగతే శుక్రే షట్సహస్రాధిపో భవేత్॥ ౬

తా॥ లాభభావమందు గురుడు, ధనభావమందు చంద్రుడు, భాగ్యభావమందు శుక్రుడుగల జాతకుడు 6 వేల నిష్కములకధిపతి యగును.

శ్లో॥ లాభాచ్చ లాభగే జీవే బుధచంద్ర సమన్వితే।
ధనధాన్యాధిపః శ్రీమాన్ రత్నాద్యాభరణైర్యుతః॥ ౭

తా॥ లాభస్థానమునకు లాభస్థానమైన భాగ్యభావమందు గురుడు బుధ చంద్ర యుతుడై యుండెనేని యట్టి జాతకుడు ధనధాన్యాభివృద్ధిగలిగి, రత్నాద్యాభరణములు గలవాడగును.

శ్లో॥ లాభేశే లగ్నభావస్థే లగ్నేశే లాభసంయుతే।
త్రయస్త్రింశేతు సంప్రాప్తే సహస్ర నిష్కభాగ్భవేత్॥ ౮

తా॥ లాభాధిపతి లగ్నమందు, లగ్నాధిపతి లాభమందుండెనేని 33వ సం॥రమందు జాతకుడు సహస్ర నిష్కములు గలవాడగును.

శ్లో॥ ధనేశే లాభరాశిస్థే లాభేశే ధనరాశిగే।
వివాహ త్పరతశ్చైవ బహుభాగ్యం సమాదిశేత్॥ ౯

తా॥ ధనాధిపతి లాభభావమందు, లాభాధిపతి ధనభావమందున్నచో జాతకుని వివాహానంతరము విశేషభాగ్యమును పొందును.

వి॥ ధనలాభాధిపతుల పరివర్తనమువలన వివాహానంతరము భాగ్యాభివృద్ధిగలుగును. వివాహానంతరమందు భాగ్యోదయ యోగములు "జాతకతత్వ సూత్రము"లలో

1. శుక్రే ఉపచమే సప్తమేవా వివాహోత్తరం భాగ్యోదయః॥

శుక్రుడు 3,6,10,11,7 రాశులలో నున్నవాడైవున్నచో వివాహానంతరమందు భాగ్యోదయమగును.

2. జాయేశే సప్తమోపచయే వివాహోత్తరం భాగ్యోదయః॥

సప్తమాధిపతి సప్తమభావమునుండి 3,6,7,10,11 రాశులందున్నచో వివాహానంతరము భాగ్యోదయమగును.

శ్లో॥ భ్రాతృపే లాభరాశిస్థే లాభేశే భ్రాతృసంస్థితే।
భ్రాతృతో వార్ధన ప్రాప్తిర్దివ్యా భరణసంయుతః॥ ౧౦

తా॥ భ్రాతృస్థానాధిపతి లాభభావమందు, లాభాధిపతి భ్రాతృభావమందున్నచో సోదరులవలన ధనలాభముగలుగును. అమూల్యాభరణములు గలిగియుండును.

వి॥ "ద్రైర్వ్యేశే"యని పాఠాంతరము గలదు.

భ్రాతృమూలక భాగ్యయోగములను గూర్చి "జాతకతత్వసూత్రకర్త" ఇట్లు చెప్పెను.

సూ :- సోత్థాంశేశౌ శుభ యుతదృష్టౌ వాశుభాంశగౌ భ్రాతృధనతో భాగ్యోదయః॥

తృతీయ భాగ్యాధిపతులు శుభాంశములను పొంది శుభగ్రహ సంబంధ వీక్షణములు గలవారైనచో సోదరద్రవ్యమువలన భాగ్యోదయమగును.

శ్లో॥ లాభేశే నీచభేఽస్తే వా త్రికే పాపసమన్వితే।
కృతే భూరిప్రయత్నేఽపి నైవలాభః కదాచన॥ ౧౧

తా॥ లాభభావాధిపతి నీచయందుగాని, అస్తమించిగాని, 6,8, 12 స్థానములందుండిగాని, పాపగ్రహయుతిగాని కలవాడైనచో నట్టి జాతకుడు విశేషప్రయత్నము చేసినను లాభమునెన్నటికి పొందజాలడు.

అధిక పాఠము (బృ. ప. హో. సారాంశము)

లాభే పాపేచ వ్యయే పాపయుక్తే।
దృష్టే పాపేక్షిత్రయుక్తేవయుక్తే॥
లాభాత్క్రమే లాభవిఘ్నే విరర్థం।
సౌమ్యార్థం యోవీక్షణం విఘ్నవాళః॥

వి॥ జన్మలగ్నమునుండి లాభస్థానము, లాభస్థానాధిపతి వీరిద్దరు పాపగ్రహాక్రాంతులైనప్పుడు, దుస్థానములందున్నప్పుడు, రవితో కలసి లాభాధిపతి అస్తమించినప్పుడు, లాభాధిపతి నీచస్థితి నొందినప్పుడు ధనలాభము విశేషము కలుగనేరదు. కేంద్రకోణములందున్నప్పుడు, శుభాధిపత్యములుగల గ్రహములతో (శుభపాపులెవ్వరితోనైనను) కూడినప్పుడు, ఉచ్చ. మిత్ర, స్వక్షేత్రములందున్నప్పుడు, శుభషడ్వర్గములను పొందినప్పుడు అధికలాభము కలుగును. మిశ్రమముగనున్నచో మిశ్రమఫలముగలుగును. లాభాధిపతి అష్టమాధిపతితో కూడి శుభక్షేత్రములందున్నప్పుడు ఆదాయమార్గములు అనుకూలముగనుండి లాభమును సంపాదించలేక పోవుటయుండును. లాభాధిపతికి షష్ఠాధిపతి సంబంధముండుటచే లాభము ఋణముల రూపములలో నుండుటయు, వ్యయాధిపతితో సంబంధమున్నప్పుడు లాభము వ్యయమగుటయు సంభవించును. లాభాధిపతి అష్టమభావమందుండి అష్టమాధిపతితో కలసియున్న జాతకులు నిరర్థక జీవనులైయుండెదరు. ఇట్టి జాతకులకు ధనపంచమ భాగ్యాధిపతులు, రాజ్యాధిపలగ్నాధిపతులు బలవంతులైయున్న యెడల జన్మతః స్థితిమంతులై స్వయంకృషిచే ధనార్జనమును చేయలేనివారగుచున్నారు. ఈ విధముగ శుభాశుభ గ్రహస్థితులయొక్క తారతమ్యముచే ధనలాభమార్గములను విచారించవలయును. లగ్న ధన లాభాధిపతులు, స్థితివలన, ఇతర శుభాధిపత్యములుగల గ్రహసంబంధములవలన ధనలాభమును, స్వార్జనాశక్తిని ఇవ్వగలరు, వీరుముగ్గురు బలహీనులైనప్పుడు దోషమును కలిగించెదరు.

స్వతంత్ర జీవనము చేయువ్యాపారులకు, విద్యవలన స్వతంత్రముగ జీవనము చేయువారికి యీ భావాధిపతుల అనుకూలత్వము ముఖ్యముగ చూడవలయును. గ్రంథాంతరోక్తములైన యితర శుభాశుభ యోగములను గూడ బాగుగ విచారించి లాభభావఫలము నూహించవలయును.

ఇతి బృహత్పరాశరహోరాశాస్త్రే లాభభావఫలాధ్యాయః ॥ ౧౪ ॥
ఇది బృహత్పరాశరహోరాశాస్త్రమందు లాభభావఫలాధ్యాయము ముగిసెను.

## వ్యయ భావ ఫలా ధ్యా య ము ॥ ౨౫ ॥

పరాశర ఉవాచ :-

శ్లో॥ అథాహం వ్యయభావస్య కథయామి ఫలంద్విజ।
వ్యయేశే శుభసంయుక్తే స్వభేస్వోచ్చ గతేఽపివా। ౧
వ్యయేచ శుభసంయుక్తే శుభకార్యే ధనవ్యయః॥

పరాశరుడు చెప్పుచున్నాడు.

ఓ మైత్రేయ! వ్యయభావఫలములను చెప్పుచుంటిని వినుము.

తా॥ వ్యయాధిపతి శుభగ్రహములతో చేరి, స్వోచ్చ స్వక్షేత్ర రాశులందున్నప్పుడు, వ్యయభావము శుభగ్రహములతో కూడియుండ నేని శుభకార్యముల నిమిత్తము జాతకుడు ధనవ్యయమును చేయును.

శ్లో॥ చంద్రోవ్యయాధిపో ధర్మలాభమంత్రేషు సంస్థితః॥ ౨
స్వోచ్చేస్వర్క్షే నిజాంశేవా లాభధర్మత్మ జాంశకే।
దివ్యాగారాది పర్యంకో దివ్యగంధైకభోగవాన్॥ ౩
పరార్ధ్య రమణోదివ్య వస్త్రమాల్యాది భూషణః।
పరార్ధ్య సంయుతో విష్ణోదినాని నయతిప్రభుః॥ ౪

తా॥ చంద్రుడు వ్యయాధిపతియై 5,9,11 భావములందుగాని, స్వోచ్చ స్వక్షేత్ర స్వనవాంశములందుగాని, 5,9,11 భావాధిపతుల యొక్క నవాంశములందుగాని యుండెనేని అట్టి జాతకుడు దివ్యమైన గృహాదులు, శయనములు, బహువిధపరిమళోపేత భోగములుగలవా

డగును మరియు ఇతరులను పూజించువాడు, ఉత్తమములైన వస్త్ర మాల్యాద్యలంకారములు గలవాడు, ఇతరులచేత పూజింపబడువాడు, ఉత్తమజ్ఞానము గలవాడు సుఖముగ జీవనమును గడుపువాడునగును.

వి॥ చంద్రునకు వ్యయాధిపత్యము సింహలగ్న జాతకులకు సంభవించును. సింహలగ్న జాతకులకు, పంచమ, భాగ్య, రాజ్య, లాభవ్యయములలో చంద్రుడుండెననుండి ఆయాభావాధిపతుల నవాంశములను పొందిగాని, స్వాంశమును పొందిగానియున్నచో నట్టి జాతకులకు పైఫలములను చెప్పవలయును. పరాశరుడీ యోగమును చెప్పుటలో భావాధిపత్యము. భావస్థితి, అంశస్థితి మూడును చెప్పియుండుటచేత మూడు సంబంధములను చూచిఫలనిర్ణయమును చేయవలయును. "చంద్రోవ్యయాధిపః" అను ప్రయోగములోగల వ్యయాధిప శబ్దమును చంద్రునకు విశేషణముగ చెప్పినప్పుడు ఒక్క సింహ లగ్నమునకు మాత్రమే యీ యోగము వర్తించుననియు, ఇట్లుగాక చంద్రుడు లేక వ్యయాధిపతి అని రెండు గ్రహములుగ విభజించినచో అన్ని లగ్నములకు యీ యోగమును చెప్పవచ్చునని కొందరభిప్రాయపడుచున్నారు. వ్యయాధిపతి యొక్క స్థితినిబట్టి గ్రంథాంతరములందు పైన చెప్పిన యోగఫలము చెప్పబడుటచేత యీ అభిప్రాయమునే గ్రహించుట యుక్తమనితోచుచున్నందున చంద్రుడుగాని, వ్యయాధిపతిగాని యని గ్రహించవలయును. గ్రంథాంతరములందు వ్యయాధిపతి యొక్క స్థితి సంబంధాదులను బట్టి చెప్పిన కొన్ని యోగములు:-

జాతక పారిజాతము" లో

వ్యయేశే స్వోచ్చరాశిస్థే శుభవర్గసమన్వితే।
శుభఖేచర సందృష్టే పర్యంకశయనం వదేత్॥

వ్యయాధిపతి స్వోచ్చరాశిగతుడై శుభవర్గములతో గూడినవాడై శుభగ్రహదృష్టిగలవాడైనచో శయనసౌఖ్యము గలవాడగును.

విచిత్రమంచే శయనం వ్యయేశే పరమోచ్చగే।
భాగ్యనాథేన వాదృష్టే మణిరత్న విభూషితమ్॥

వ్యయాధిపతి పరమోచ్చగతుడై భాగ్యాధిపతిచే చూడబడె నేని విచిత్రమైన, మణిరత్న విభూషితమైన శయనముగలవాడై శయ్యం సౌఖ్యమును పొందును.

శ్లో॥ ఏవంస్వ శత్రునీచాంశేఽష్ట మాంశేవాఽష్టమేరిపౌ।
సంస్థితః కురుతేజాతం కాంతాసుఖ వివర్జితమ్॥
వ్యయాధిశ్య పరిక్లాంతం దివ్యభోగ విరాకృతమ్॥

తా॥ వ్యయాధిపతి తన యొక్క శత్రు నీచాంశములను పొందినను, అష్టమభావనవాంశమును పొందినను, 6,8. భావము లందున్నను కళత్ర సుఖము లేనివాడగును.

శ్లో॥ సహికేంద్ర త్రికోణస్థః స్వప్రియాలంకృతః స్వయమ్।

తా॥ వ్యయాధిపతి కేంద్ర త్రికోణము లందున్నచో స్వభార్య మూలమున విశేషసుఖ భోగములననుభవించును.

యథా లగ్నాత్ఫలంచైతదాత్మనః పరికీర్తితమ్॥
ఏవం భ్రాత్రాదిభావేషు తత్తత్సర్వం విచారయేత్॥

తా॥ జాతకునకు తన జన్మలగ్నమునుండి ద్వాదశ భావముల యొక్క శుభాశుభఫలజాతిము యెట్లు చెప్పబడినదో ఇదేవిధముగా జాతకుని యొక్క భ్రాతాది భావములకు గూడ ఫలవిచారణ చేయవలయును.

శ్లో॥ దృశ్యచక్రార్ధగాః ఖేటాః ప్రత్యక్షఫలదాయకాః॥
అదృశ్యార్ధగతాః ఖేటాః పరోక్షఫలదాయకాః॥

తా॥ దృశ్యచక్రార్ధ మందుగల గ్రహములు ప్రత్యక్షఫల ప్రదులగుదురు. అదృశ్యచక్రార్ధ మందుగల గ్రహములు పరోక్షఫల ప్రదులగుదురు.

వి॥ దృశ్యచక్రార్ధమనగా సప్తమభావ భోగ్యాంశము నుండి

8,9,10,11,12, మరియు లగ్న భుక్తాంశము వరకు గల 6 రాశులు. ఈభాగము (క్రాంతి వృత్తీయ ప్రదేశము) క్షితిజమునకు ఉపరితలమున నుండును. అదృశ్య చక్రార్ధమనగా లగ్న భోగ్యాంశము నుండి 2,3,4,5,6, మరియు సప్తమభావ భుక్తాంశము వరకు గల 6 రాశులు. ఈ భాగము (క్రాంతి వృత్తీయ ప్రదేశము) క్షితిజమునకు అధోభాగము నందుండును. గ్రహములు దృశ్యచక్రార్ధ మందున్నప్పుడు తామిచ్చుఫలితములను జాతకులకు అనుభవములోనికి వచ్చునట్లు తమ తమ దశాకాలములందు ప్రత్యక్షముగా నిచ్చెదరు. అదృశ్యార్ధ చక్రమందున్న గ్రహములు పరోక్షముగ ఫలానుభవము నిచ్చెదరు.

ఇక్కడ "బృ. ప. హో. సారాంశ" మందు
లగ్నవ్య పూర్వార్ధ 10,11,12,1,2,3, గతానభోగాః
ఫలం ప్రదద్యుస్త్వపరోక్షకంతే॥
పరార్ధ 4,5,6,7,8,9 షట్కపగతాః పరోక్షం।
ఫలం వదంతీతి బుధాః పురాణాః॥ అనిగలదు.

అనగా లగ్నము నుండి పూర్వార్ధమునకు దశమభావమునుండి తృతీయ భావమువరకు, పరార్ధమునకుచతుర్ధమునుండి భాగ్యభావము వరకు గ్రహింపబడినది.

శ్లో॥ వ్యయస్థానగతో రాహుర్భౌమార్కి రవిసంయుతః।
తదీశే వ్యర్కసంయుక్తే నరకేపతనం భవేత్॥ 8

తా॥ రాహువు వ్యయస్థానమందు రవి కుజ శనులతో గూడినవాడై, రాహువున్న రాశ్యధిపతి గూడ రవితో కూడిన యెడల జాతకుడు నరకమును పొందును.

వి॥ "భౌమార్కాభ్యాంహి సంయుతః" అని దే. చం. ఝా గ్రంథమందుగలదు. "భౌమార్క రవి సంయుతః" అను పాఠమును "భౌమార్కి రవి సంయుతః" అని సరిచేయడమైనది. అర్క, రవి అని రెండు పర్యాయములుండుటచే "అర్క" అను శబ్దమును "అర్కి"

అనుట యుక్తముగనున్నది.

శ్లో॥ వ్యయస్థానగతే సౌమ్యే తదీశే స్వోచ్చరాశిగే।
శుభయుక్తే శుభైర్దృష్టే మోక్షః స్యాన్నాత్ర సంశయః॥ ౧౦

తా॥ వ్యయభావమందొక శుభగ్రహముండగ, వ్యయాధిపతి స్వోచ్చరాశియందుండి శుభగ్రహయుతి దృష్టులుగలవాడైనచో నా జాతకునకు మోక్షము ప్రాప్తించును.

వి॥ బృ. ప. హో. సారాంశమందు "పరోక్షః" అనిగలదు.

శ్లో॥ వ్యయేశే పాపసంయుక్తే వ్యయేపాపసమన్వితే।
పాపగ్రహేణ సందృష్టే దేశాద్దేశాంతరం గతః॥ ౧౧

తా॥ వ్యయభావము, వ్యయాధిపతి పాపగ్రహయుతి దృష్టులు గలవారైనచో నా జాతకుడు దేశాంతరగతుడగును.(ఒక దేశమునుండి మరియొక దేశమునకు వెడలును).

శ్లో॥ వ్యయేశే శుభరాశిస్థే వ్యయర్ క్షే శుభసంయుతే।
శుభగ్రహేణ సందృష్టే స్వదేశాత్ సంచరో భవేత్॥ ౧౨

తా॥ వ్యయభావము, వ్యయాధిపతి శుభగ్రహయుతిదృష్టులు గలవారైనచో స్వదేశసంచారము చేయువారగును.

వ్యయేమందాది సంయుక్తే భూమిజేన సమన్వితే।
శుభదృష్టే రసంప్రాప్తిః పాపమూలాద్ధనార్జనమ్॥ ౧౩
(శుభదృష్టేశ్చ సంప్రాప్తిః) బృ.ప.హో. సారాంశపాఠము.

తా॥ వ్యయభావము శని మొదలగు పాపులతో కూడి కుజునితో గూడ చేరియుండగ శుభదృష్టిలేని యెడల పాపకార్యముల వలన ధనమార్జించును.

వి॥ వ్యయభావమందు శని, కుజ, రాహు, మాంది గ్రహము లుండి శుభగ్రహముల దృష్టిలేనియెడల పాపకార్యములవలన ధనార్జన చేయును. శుభగ్రహదృష్టియున్నచో కొంతదోషము తగ్గును. (అకృత్య

ములను చేయువాడయ్యు న్యాయమును గూడ విచారించుకొనును)

శ్లో॥ లగ్నేశే వ్యయరాశిస్థే వ్యయేశే లగ్నసంయుతే।

భృగుపుత్రేణ సంయుక్తే ధర్మమూలాద్ధనక్షయః॥ ౧౪

తా॥ లగ్నాధిపతి వ్యయభావమందుండగ, వ్యయాధిపతి లగ్నగతుడై శుక్రునితో కూడిన యెడల నా జాతకునకు ధర్మమూలక ధనవ్యయముండును.

వి॥ ధనవ్యయయోగములలో గ్రంథాంతరోక్త యోగములు; "సర్వార్థచింతామణి"లో

వ్యయేశే బలహీనేవా శత్రునాథయుతేక్షితే।

గుళికాహి సమాయుక్తే శత్రుమూలాద్ధనక్షయః॥

వ్యయాధిపతి బలహీనుడై శత్రుభావాధిపతి యొక్క సంబంధ వీక్షణములు గలవాడై, గుళిక, లేక రాహువుతో కూడినచో శత్రుమూలముగ ధనవ్యయమగును.

వ్యయేశే దారనాథేన బలహీనేన తేనతు।

దృష్టేయుతేవా క్రూరాంశే స్త్రీహేతోర్ధన నాశనమ్॥

బలహీనుడైన సప్తమాధిపతితో వ్యయాధిపతి సంబంధవీక్షణములుగలవాడై యుండగ, వ్యయాధిపతి క్రూరాంశములను పొందినచో స్త్రీ మూలక ధనవ్యయముగలవాడగును.

భాదృశే వ్యయనాథేస్మిన్ దృష్టేయుక్తేథవా భవేత్।

తథావిధేన భౌమేన భ్రాతృమూలాద్ధన వ్యయః॥

వ్యయాధిపతి బలహీనుడై యుండగ బలహీనుడైన కుజునియొక్క సంబంధవీక్షణములుగలవాడైనచో సోదరమూలక ధనవ్యయముండును.

ఏవంమాతృపయోగేన యుతేదృష్టే వ్యయాధిపే।

క్రూరాన్వితే క్రూరభాగే మాతృమూలాద్ధన వ్యయః॥

వ్యయాధిపతి మాతృస్థానాధిపతి యొక్క సంబంధ వీక్షణములు

గలవాడై క్రూర గ్రహములతో చేరినను, క్రూరనవాంశములను పొందినను మాతృమూలక ధనవ్యయముండును.

పుత్రేశే కారకేవాపి బలహీనేన సంయుతే।
దృష్టేవ్యయేశే క్రూరాంశే పుత్రమూలాద్ధన వ్యయః॥

వ్యయాధిపతి క్రూర గ్రహరాశ్యంశములను పొంది, బలహీనులైన పుత్ర భావాధిప కారకుల యొక్క సంబంధ వీక్షణములు గలవాడైనచో పుత్రమూలక ధనవ్యయముండును.

పితృస్థానేశ్వరేణాపి కారకేణాపి సంయుతే।
వ్యయేశే దృష్టిసంబంధే పితృమూలాద్ధన వ్యయః॥

వ్యయాధిపతి పితృభావాధిప కారకుల సంబంధము గలవాడై పాపరాశ్యంశము లందున్నచో పితృమూలక ధనవ్యయముండును.

మరియు గ్రంథాంతరములందు గల వ్యయభావఫల విచారణా పద్ధతులను గూడ బాగుగ పరిశీలించి ఫలమును చెప్పవలయును.

పరాశరహోరాసారాంశమందు వ్యయభావమందు ఈ క్రింద శ్లోకములు అధికముగ నున్నవి.

(1) అగ్రేజాతం రవిర్హంతి పృష్ఠేజాతంశనైశ్చరః॥
అగ్రజం పృష్ఠజం హంతిసహజ స్థోధరాసుతః ॥

(2) పత్నిస్థానేయదారాహుః పాపయుగ్మేనవీక్షితః।
పత్నియోగస్థితా తస్యభూతాఽ ప్రియతేఽచిరాత్॥

(3) షష్ఠేచభవనే భౌమః సప్తమే రాహుసంభవః॥
అష్టమే చయదాసౌరిస్తస్య భార్యానజీవతి॥

1 వ శ్లోకము సోదరభావమునకు 2,3 శ్లోకములు సప్తమభావమునకు సంబంధించినది.

ఇతి శ్రీ బృహత్పరాశరహోరాశాస్త్రే వ్యయభావఫలాధ్యాయస్సమాప్తః॥ ॥౧౨॥
ఇది బృహత్పరాశరహోరాశాస్త్రమందు వ్యయభావఫలాధ్యాయము ముగిసెను.

## అథ భావేశ ఫలాధ్యాయః ॥౨౫॥

### లగ్నేశఫలమ్॥

శ్లో॥ లగ్నేశే లగ్నగే దేహసుఖభాగ్ భుజవిక్రమీ।
మనస్వీ చంచలశ్చైవ ద్విభార్యో పరగోఽపివా॥ ౧

తా॥ లగ్నాధిపతి లగ్నమందుండగా పుట్టినవాడు దేహసుఖము గలవాడు, భుజపరాక్రమముగలవాడు, (పౌరుషవంతుడు) మనస్వి (మంచిమనస్సుగలవాడు లేక అభిమానవంతుడు,) చంచలమైన ఆలోచనలు గలవాడు, ఇద్దరు భార్యలుగలవాడు లేక పరస్త్రీలను పొందువాడు అగును.

వి॥ లగ్నాధిపతి లగ్నమందున్నప్పుడు ద్వికళత్ర యోగమును గాని పరస్త్రీ సంబంధయోగమునుగాని చెప్పవలసియుండును. ఇది సహచరయోగముగాని స్వతంత్రయోగముగాదు. సప్తమభావ విచారణచేసి కళత్ర భావదోషము గూడ యున్నప్పుడే యీ యోగము దానిని సహకరించును. కళత్రభావదోషములేనప్పుడు లగ్నాధిపతి లగ్నమందున్నంత మాత్రమున ద్వి భార్యాయోగమునుగాని, పరస్త్రీ సంబంధయోగమునుగాని చెప్పరాదు.

శ్లో॥ లగ్నేశే ధనగే బాలో లాభవాన్ పండిత స్సుధీః।
సుశీలో ధర్మవాన్ మానీ బహుదారగుణైర్యుతః॥ ౨

తా॥ లగ్నాధిపతి ధనస్థానమందున్నప్పుడు పుట్టిన బాలుడు ధనలాభముగలవాడు, పండితుడు (జ్ఞానవంతుడు లేక విద్యావంతుడు) సుఖముగలవాడు, మంచి శీలముగలవాడు, ధర్మమును చేయువాడు, విశేషమైన ఉదారగుణములుగలవాడు అగును.

వి॥ ధనాధిపతి నైసర్గిక పాపగ్రహమై ధనస్థానమందుండెనేని పై ఫలములు తక్కువగనుండును. శుభగ్రహమైనప్పుడు అధికముగ

నుండును. నైసర్గిక శుభగ్రహమైన గురుడు ధనుర్లగ్నమునకు ద్వితీయ భావమందు నీచలోనున్నను, పై ఫలములనన్నింటిని చెప్పవలయును. నీచపట్టుటచేత ఫలము చెడిపోవుట లేదు.

శ్లో॥ లగ్నేశే సహజే జాతః సింహతుల్యపరాక్రమః।
సర్వసంపద్యుతో మానీ ద్విభార్యో మతిమాన్ సుఖీ॥ ౩

తా॥ లగ్నాధిపతి తృతీయమందుండగ బుట్టిన జాతకుడు సింహముతో సమానమైన పరాక్రమముగలవాడు, సర్వసంపదలతో తుల తూగువాడు, అభిమానముగలవాడు, ద్విభార్యాయోగముగలవాడు, మతిమంతుడు (మంచిబుద్ధిగలవాడు) సుఖముగలవాడు అగును.

వి॥ జాతక సంగ్రహమందు;

సహజగతో లగ్నపతి ర్వద్వంధు ప్రవర మిత్ర పరికలితమ్।
ధర్మరతం దాతారం శూరంవబలంకరోతినరమ్॥ అని గలదు.

లగ్నాధిపతి తృతీయోపచయ స్థానమందు (ఉపచయరాశియగు తృతీయము తృతీయభావమై, భావమధ్య భాగలందు) ఉన్నచో బాధువులు, యోగ్యమైన మిత్రులుగలవాడు, ధర్మచింతగలవాడు, దాతృత్వముగలవాడు, శూరుడు, బలవంతుడు అగునని చెప్పవలయును.

లగ్నాధిపతి నైసర్గిక పాపియై తృతీయోపచయ స్థానమందు నీచలోనున్నప్పుడు పై ఫలములు చాల తక్కువగనుండును సింహలగ్నమునకు రవి, కుంభలగ్నమునకు శని తృతీయ భావమందు నీచయందున్నప్పుడు బంధుమిత్రులకు దూరముగనుండువాడు, లుబ్ధుడు, భయముగలవాడు, ఓర్వలేని తనముగలవాడు అగును. వృశ్చికలగ్నమునకు నైసర్గిక పాపియగు కుజుడు తృతీయమందు వృశ్చికలో నుండగ బుట్టినవాడు, ఆత్మాభిమాన మెక్కువగలవాడు, గర్వముగ మాట్లాడువాడు, స్వశక్తివలన సంపదలనువృద్ధిపొందించుకొనువాడు, పౌరుష, సాహస కృత్యములను చేయువాడు అగును.

శ్లో॥ లగ్నేశే సుఖగే బాలః పితృమాతృసుఖాన్వితః।
బహు భ్రాతృయుతః కామీ గుణరూప సమన్వితః॥ ౪

తా॥ లగ్నాధిపతి చతుర్థమందుండగ బుట్టినవాడు మాతాపితరుల సుఖముగలవాడు. అధిక సోదరవర్గముగలవాడు, కాముకుడు, సద్గుణములు, మంచి రూపముగల వాడగును.

వి॥ జాతక సంగ్రహమందు;

లగ్నేశస్తుర్యగతో నృపప్రియం ప్రవర జీవితం కురుతే।
లబ్ధియుతం బహుమిత్రం పిత్రోర్బహు భక్తిభాజనం కురుతే॥

లగ్నాధిపతి తృతీయమందుండగ బుట్టినవాడు నృపప్రియుడు (ప్రభువులకు స్నేహితుడు) గొప్పఖ్యాతితో జీవించువాడు, లాభము గలవాడు, అనేక మిత్రులుగలవాడు, తండ్రియందు విశేషభక్తిగల వాడనగును.

నైసర్గిక పాపియగు కుజుడు మేషలగ్నమునకు చతుర్థభావమందు నీచలోనున్నప్పుడు, మకర లగ్నమునకు శని చతుర్థభావమందు నీచలోనున్నప్పుడు పై ఫలము లెక్కువగనబడవు. అట్టి జాతకుడు మాతాపితరులకు ఇష్టము లేకయే సేవచేయువలసిన పరిస్థితులుగలవాడు, సోదరాదివర్గముతో మైత్రిలేనివాడు అగును. రూపము తక్కువగల వాడు, పుష్టిలేని శరీరముగల వాడు అగును. విశాలమైన భావములు లేక స్వార్థబుద్ధిగలవాడును అగును. మిథునమునకు బుధుడు శుభుడై ఉచ్చలోనుండగ శుభము, లగ్నాధిపతి పాపుడై నీచలోనుండగ దోష ఫలమును చెప్పవలయును.

శ్లో॥ లగ్నేశే సుతగే జంతోః సుతసౌఖ్యం చ మధ్యమమ్।
ప్రథమాపత్యనాశః స్యాత్ మానీ క్రోధీ నృపప్రియః॥ ౫

తా॥ పంచమభావమందు లగ్నాధిపతియుండగ బుట్టినవాడు మధ్యమమైన సంతాన సుఖముగలవాడు, ప్రథమసంతానము నష్టపోవు

వాడు, అభిమాని, క్రోధముగలవాడు, రాజులకు (ప్రభువులకు) మిత్రుడు అగును.

వి॥ వృషభలగ్నమునకు లగ్నాధిపతియగు శుక్రుడు పంచమములో నీచలోనున్నప్పుడు, కర్కాటక లగ్నమునకు చంద్రుడు పంచమములో నీచలోనున్నప్పుడు, తక్కువ సంతతిగలవారు, పురుషసంతతి నష్టమై స్త్రీ సంతతి మిగిలియున్నవారు, గలరు. మీనమునకు గురుడు పంచమమందుచ్చలో నున్నప్పుడు నిస్సంతాన వంతులుగ కొందరు జాతకులు, బహుపురుష సంతతిగలవారుగ కొందరు జాతకులు గలరు. పంచమభావ విచారణచేసి దానియందుగల బలతారతమ్యమును బట్టి ఫలనిర్ణయమును చేయవలయును.

శ్లో॥ లగ్నేశే షష్ఠగే జాతో దేహసౌఖ్యవివర్జితః।
పాపాఢ్యే శత్రుతః పీడా సౌమ్యదృష్టివివర్జితే॥ ౬

తా॥ లగ్నాధిపతి షష్ఠభావమందుండగ పుట్టినవాడు దేహసౌఖ్యము లేనివాడగును. లగ్నాధిపతి షష్ఠమందుండి పాపులతో కూడియుండి శుభగ్రహ వీక్షణము లేనివాడైనచో శత్రుపీడగలవాడగును.

వి॥ లగ్నాధిపతి నైసర్గిక పాపగ్రహమై షష్ఠభావమందున్నప్పుడు కష్టమును లెక్కచేయనివాడు. దేహమును కష్టపెట్టు పనులను చేయువాడు, మోటుపనులు చేయువాడు అగును. నైసర్గిక శుభగ్రహమైనప్పుడు దేహసౌఖ్యము తక్కువగలవాడు, సర్వదాసుఖముగ నుండవలెనను కాంక్షగలవాడు అగును.

శ్లో॥ లగ్నేశే సప్తమేపాపే భార్యా తస్య వజీవతి।
శుభేఽటనో దరిద్రో వా విరక్తో వా నృపోఽపివా॥ ౭

తా॥ లగ్నాధిపతి పాపగ్రహమై సప్తమభావమందున్నయెడల ఆ జాతకునకు భార్యానష్టమగును. లగ్నాధిపతి శుభుడై సప్తమభావమందున్నప్పుడు మహారాజుగ పుట్టినను, దేశసంచారము చేయువాడు

గాని, దరిద్రుడుగాని, విరక్తుడుగాని యగును.

వి॥ ఈ శ్లోకమందు లగ్నాధిపతి శుభుడైనను, పాపుడైనను కూడ సప్తమభావమందున్నప్పుడు దోషఫలములనే ఇచ్చును. నైసర్గిక పాపుడైనచో కళత్రభావమును చెడగొట్టుననియు, నైసర్గిక శుభుడైనచో జాతకుని యొక్క స్థితిని చెడగొట్టుననియు చెప్పబడినది.

"వృద్ధయవన" మతములో

ప్రథమ పతౌ సప్తమగే తేజస్వీ శీలవాన్ భవేత్పురుషః।
తద్భార్యాపి సుశీలా జ్ఞేయా కలితా సురూపాచ॥

అని గలదు. దీనిభావమేమనగా; లగ్నాధిపతి సప్తమమందుండగ బుట్టిన జాతకుడు తేజస్సుగలవాడు. శీలవంతుడు, జాతకుని భార్యకూడ సుశీలయు, రూపవతియు, ప్రవీణురాలు అగునని భావము. ఈ రెండు అభిప్రాయములు భిన్నములుగానున్నవి. కనుక అనుభవమును బట్టి విచారించగ, లగ్నాధిపతి నైసర్గిక శుభుడై సప్తమభావమందున్నప్పుడు వృద్ధయవనులచే చెప్పబడిన ఫలములు సరిపోవుచున్నవి నైసర్గిక పాప గ్రహమైన లగ్నాధిపతి సప్తమ భావమునందున్నప్పుడు ద్వికళత్రయోగాంతరమున్నప్పుడు పరాశర మతాభిప్రాయము సరిపడుచున్నది.

శ్లో॥ లగ్నేశేఽష్టమగే జాతః సిద్ధ విద్యా విశారదః।
రోగీచౌరో మహాక్రోధీ ద్యూతీచ పరదారగః॥

తా॥ లగ్నాధిపతి అష్టమమందుండగ బుట్టినవాడు సిద్ధవిద్యానిపుణుడు, రోగవంతుడు, చోరుడు, గొప్పక్రోధముగలవాడు, జూదమాడువాడు, పరభార్యలను పొందువాడు అగును.

వి॥ జాతక సంగ్రహమందు దహరించిన "వృద్ధయవన" మతములో

లగ్నప తావష్టమగే కృపణో ధనసంచయః సుదీర్ఘాయుః।
జ్యోతిషే చరేద్భూరిః దివ్యేవపుషా భవేత్ప్రాయః॥

అని గలదు. లగ్నాధిపతి అష్టమభావమందున్నచో కృపణుడు, ధనమును జాగ్రత్త చేయువాడు, దీర్ఘాయువుగలవాడు అగును. పాప గ్రహమైన క్రూరుడును, శుభగ్రహమైనచో సౌమ్యస్వభావముగల వాడు, అగునని భావము.

ధనుర్లగ్నమునకు గురుడు లగ్నాధిపతియై అష్టమములో నున్న జాతకులు ధనమును అధికముగ నిలువచేయువారు, దీర్ఘాయుష్మంతులు, కృపణులు అగుచున్నారు.

శ్లో॥ లగ్నేశే భాగ్యగే జాతో భాగ్యవాన్ జనవల్లభః।
విష్ణుభక్తః పటు ర్వాగ్మీ దారపుత్ర ధనైర్యుతః॥ ౯

తా॥ లగ్నాధిపతి భాగ్యమందున్నప్పుడు భాగ్యవంతుడు, జనులకిష్టుడు, విష్ణుభక్తిగలవాడు, పటుత్వముగలవాడు, మంచిమాటలు నేర్చినవాడు, దారపుత్ర ధనసుఖములను భవించువాడు అగును.

శ్లో॥ లగ్నేశే దశమే జాతః పితృసౌఖ్య సమన్వితః।
నృపమాన్యో జనేఖ్యాతః స్వార్జితస్వో న సంశయః॥ ౧౦

తా॥ లగ్నాధిపతి దశమమందుండ బుట్టినవాడు, పితృసుఖము గలవాడు, ప్రభువులచే గౌరవింపబడువాడు, జనులందు ఖ్యాతిగలవాడు, స్వార్జితధనముగలవాడు అగును.

శ్లో॥ లగ్నేశే లాభగే జాతః సదాలాభ సమన్వితః।
సుశీలః ఖ్యాత కీర్తిశ్చ బహూ దారగుణైర్యుతః॥ ౧౧

తా॥ లగ్నాధిపతి లాభభావమందున్నప్పుడు పుట్టినవాడు ఎల్లప్పుడు లాభముగలవాడు, మంచి శీలముగలవాడు, విశేషమైన కీర్తి గలవాడు, గొప్పవైన ఉదార గుణములుగలవాడు అగును.

శ్లో॥ లగ్నేశే వ్యయభావస్థే దేహసౌఖ్య వివర్జితః।
వ్యర్థవ్యయీ మహాక్రోధీ శుభదృగ్యోగవర్జితే॥ ౧౨

తా॥ లగ్నాధిపతి వ్యయమందుండగ బుట్టినవాడు దేహసౌఖ్యములేనివాడు, అనవసర ధనవ్యయము చేయువాడు, గొప్పక్రోధము కలవాడు అగును. శుభ గ్రహముల దృగ్యోగములు లేనప్పుడే పై ఫలములను చెప్పవలయును. శుభగ్రహ దృష్టి సంబంధములున్నప్పుడు పై ఫలములను చెప్పరాదు. శుభఫలములనే చెప్పవలయును.

వి॥ తులా లగ్నజాతకులకు లగ్నాధిపతి యగు శుక్రుడు వ్యయమందు నీచలోనున్నప్పుడు పై ఫలములన్నియు గోచరించుచున్నవి. ఈ శుక్రునిపై గురు దృష్టియున్నను, శుక్రుడు గురుని సంబంధము గలిగియున్నను దాన ధర్మములను చేయుట వలన ధనవ్యయమును చేయుట, దేహసుఖమునకెక్కువ ప్రాముఖ్యమునిచ్చుట వంటి ఫలములు గోచరించుచున్నవి.

## ధ నే శ ఫ ల ము

శ్లో॥ ధనేశే లగ్నగే జాతో పుత్రవాన్ ధనసంయుతః।
కుటుంబ కంటకః కామీ నిష్ఠురః పరకార్యకృత్॥ ౧౩

తా॥ ధనాధిపతి లగ్నమందుండగ బుట్టినవాడు పుత్రవంతుడు, ధనముగలవాడు, కుటుంబమునకు కష్టమునిచ్చువాడు, కాముకుడు, నిష్ఠురముగ మాట్లాడువాడు, పరకార్యరతుడు అగును.

శ్లో॥ ధనేశే ధనగే జాతో ధనవాన్ గర్వసంయుతః।
ద్వికారో బహుదారో వా సుతహీనః ప్రజాయతే॥ ౧౪

తా॥ ధనాధిపతి ధనభావమందుండెనేని ధనవంతుడు, గర్వముగలవాడు, ఇద్దరు భార్యలుగాని, బహుభార్యలుగాని గలవాడు, సంతానహీనుడు అగును.

వి॥ ద్వికళత్ర, బహుకళత్ర యోగములున్నప్పుడే యీ ఫలములను చెప్పవలయును. పంచమభావము బలముగనుండి సంతాన యోగములు, సంతానాభివృద్ధి యోగములు పట్టినప్పుడు సంతానముండ

దని చెప్పరాదు పంచమభావమందు బలవత్తరమైన దోషములు-దగ, ద్వితీయమందు ధనాధిపతి యున్నచో సంతానహీనుడగునని చెప్ప వలయును.

శ్లో॥ ధనేశే సహజే జాతో విక్రమీమతిమాన్ గుణీ।
కామీ లోభీ శుభార్యేచ పాపార్యే దేవనిందకః॥ ౧౫

తా॥ ధనాధిపతి తృతీయ భావమందున్న జాతకుడు పరాక్రమ వంతుడు, బుద్ధిమంతుడు, గుణవంతుడు, అగును. శుభగ్రహములతో గూడినచో కాముకుడు, లోభి, యగును. పాపులతో గూడినచో దేవ నింద చేయువాడగును.

శ్లో॥ ధనేశే సుఖభావస్థే సర్వసంపత్సమన్వితః।
గురుణా సంయుతే స్వోచ్చే రాజతుల్యోనరో భవేత్॥ ౧౬

తా॥ ధనాధిపతి సుఖభావమందున్న యెడల సర్వసంపదలుగల వాడగును. ధనాధిపతి గురునితో గూడినను, తన యొక్క ఉచ్చరాశి యందున్నను రాజతుల్యుడగును,

వి॥ మేషాది ద్వాదశ లగ్నములలో తులా లగ్నమునకు ధన భావాధిపతియగు కుజునకు చతుర్థభావమందుచ్చ పట్టుట సంభవించును. ఇతర లగ్నములందు సంభవముగాజాలదు. దేశభేదముచే కొన్ని ప్రదేశములందు భావములు తక్కువ ప్రమాణముగలవైనను, కొన్ని భావము లధిక ప్రమాణములుగలవైనను గూడ ధనాధిపతికి చతుర్థ భావము స్వోచ్చరాశికాజాలదు. కనుక ధనాధిపతి గురునితో చేర స్వోచ్చరాశియందున్నచో రాజతుల్యుడగునని చెప్పవలయును. మేష లగ్నమునకు వ్యయభావమందు (మీనరాశియందు) గురు శుక్రులున్న ప్పుడు, వృషభలగ్నమునకు పంచమభావమందు (కన్యారాశియందు) గురు బుధులున్నప్పుడు, మిథున లగ్నమునకు వ్యయభావమందు (వృషభ రాశియందు) గురు చంద్రులున్నప్పుడు, కర్కటక లగ్నమునకు

రాజ్యభావమందు (మేషమందు)గురు రవులున్నప్పుడు, సింహలగ్నము నకు ధనభావమందు (కన్యయందు) గురు బుధులున్నప్పుడు, కన్యాలగ్నమునకు సప్తమభావమందు (మీనమందు) గురు శుక్రులున్నప్పుడు, తులాలగ్నమునకు చతుర్థభావమందు (మకరమందు) గురు కుజులున్నప్పుడు, వృశ్చిక లగ్నమునకు భాగ్యభావమందు (కర్కటకమందు) గురుడున్నప్పుడు, ధనుర్లగ్నమునకు లాభభావమందు (తులయందు) శని గురువులున్నప్పుడు, మకరలగ్నమునకు రాజ్యభావమందు (తులయందు) శని గురువులున్నప్పుడు, కుంభలగ్నమునకు షష్ఠభావమందు (కర్కటకమందు) గురుడున్నప్పుడు. జన్మించిన జాతకులు ప్రభువులయ్యెదరని భావము.

ఇక్కడ ఏ భావమందు ధనాధిపతి యున్నాడని విచారించనవసరము లేదు. ధనాధిపతి స్వోచ్చరాశియందు గురునితో కలసియుండుటయే ముఖ్యము. వృశ్చిక కుంభలగ్నములకు గురుడే ధనాధిపతియగుటచే గురు సంయుతి ప్రసక్తియే లేదు.

శ్లో॥ ధనేశే సుతభావస్థే జాతో ధనసమన్వితః।
ధనోపార్జనశీలాశ్చ జాయంతే తత్సుతా అపి॥ ౧౩

తా॥ ధనాధిపతి పంచమభావమందున్నప్పుడు జన్మించినవాడు ధనముగలవాడగును. ఈతని సంతానము గూడ ధన సంపాదన చేయు స్వభావము గల వారగుదురు.

వి॥ "ధనేనసంచితద్రవ్య" మనువచనముచే ధనభావమునుబట్టి, ధనాధిపతినిబట్టి సంచితద్రవ్యమును విచారించవలయును. ధనాధిపతి పంచమ భావగతుడైనప్పుడు జాతకునకు పిత్రాదులచే జాగ్రత్త చేయబడిన ద్రవ్యము సమకూడునని చెప్పవలయును.

శ్లో॥ ధనేశే రిపుభావస్థే సశుభే శత్రుతో ధనమ్।
సపాపే శత్రుతో హానిర్జంఘా వైకల్యవాన్ భవేత్॥ ౧౪

తా॥ ధనాధిపతి షష్ఠభావమందు శుభగ్రహములతో గూడి యుండెనేని శత్రుమూలక ధనలాభముగలుగును. పాపులతో గూడి యుండెనేని శత్రువులవలన హాని. జంఘూవైకల్యమును గలుగును.

వి॥ "జాతకతత్త్వ సూత్రము" ధనవివేకము 76వ సూత్రములో

షష్ఠేఽర్థేశే సపాపే నీచగే రాజ కారకయుతేవా రాజచంద్రాద్ధనక్షయః।

అని, ధనాధిపతి పాపులతో గూడి షష్ఠభావమందున్నప్పుడు, నీచయందుండి రవితో చేరినప్పుడుగాని రాజమూలక ధనక్షయమగునని చెప్పబడినది. మేషలగ్నజాతకులకు ధనభావాధిపతి శుక్రుడై షష్ఠమందు నీచలో నుండగ రవితో గూడి యున్నప్పుడు,

మిథున లగ్నమునకు ధనభావాధిపతి చంద్రుడై షష్ఠమందు నీచలోనుండగ రవితో గూడినప్పుడు,

ధనుర్లగ్న జాతకులకు మేషము షష్ఠ భావమై అందు ధనాధిపతియగు శని నీచలో నుండగా రవి సంబంధమున్నప్పుడు,

మీనలగ్నమునకు కర్కాటకము షష్ఠభావమై అందు ధనాధిపతి యగు కుజుడు నీచలోనుండగ రవి సంబంధమున్నప్పుడు ప్రభుమూలక ధనవ్యయమును చెప్పవలయును. (ఒకే రాశియందు రెండు భావ మధ్యమములు వచ్చినప్పుడీ విషయమును గ్రహించుటకు వీలగును.)

"జాతకతత్త్వ సూత్రకర్త" ధనాధిపతి షష్ఠభావములో నుండి పాపసంబంధము గలిగినప్పుడు జంఘాక్షతి ఫలమునిచ్చుట చెప్పలేదు.

"జాతకసారదీప"మందు ఫలప్రదీప గ్రంథమునుండి ఉదహరించిన విషయమిట్లున్నది.

షష్ఠగతో ద్రవిణపతిర్ధన తత్పరం రిపు ఘ్నంచ।
భూలాభినం చ అచరే పాపే ధనవర్జితం పురుషమ్॥ అవియున్నది.

శ్లో॥ ధనేశే సప్తమే జాతః పరదారరతోభిషక్।
పాపేక్షితయుతే తస్యభార్యాచవ్యభిచారిణీ॥

తా॥ ధనాధిపతి సప్తమమందుండగ బుట్టినవాడు పరదార రతుడగును. వైద్యుడగును. ఈ ధనాధిపతికి పాపగ్రహదృగ్యోగములున్నప్పుడు జాతకుని భార్యగూడ వ్యభిచారిణి అగును.

వి॥ పై అభిప్రాయ ప్రకారమను భవములో సరిపడుటలేదు. ధనాధిపతి నైసర్గిక పాపుడై నవాంశమందు శుక్రలేక శని నవాంశములను పొందినప్పుడు కొన్నిచోట్ల సరిపడుచున్నది.

వి॥ "జాతకసంగ్రహ" మందుగల "వృద్ధయువన" వచనమిట్లు గలదు.

ధనపే సప్తమగృహగే శ్రేష్ఠాంగనా విలాసభోగభాగ్యవతి।
ధనసంగ్రహణీ భార్యా క్రూరేఖచరే భవేద్వంధ్యా॥

అనగా ధనాధిపతి శుభుడై సప్తమమందున్నచో శ్రేష్ఠమైన భార్యగలవాడు, జాతకునిభార్య ధనమును కూడబెట్టునదియు అగును. మరియు ధనాధిపతి పాపుడై సప్తమమందున్నచో నాతనిభార్య "వంధ్య" యగును. (అనగా సంతానము కలుగనిదని భావము)

శ్లో॥ ధనేశేఽష్టమగే జాతో భూరిభూమిధనైర్యుతః।
పత్నీసుఖం భవేత్స్వల్పం జ్యేష్ఠభ్రాతృసుఖం నహి॥ ౨౦

తా॥ ధనాధిపతి అష్టమభావమందున్నప్పుడు పుట్టినవాడు విశేషమైన భూములు, ధనముగలవాడగును. భార్యాసుఖము తక్కువనుండును. జ్యేష్ఠ భ్రాతృసుఖము కొంచెమైననుండ జాలదు.

శ్లో॥ ధనేశే ధర్మభావస్థే ధనవా నుద్యమీ పటుః।
బాల్యే రోగీ సుఖీ పశ్చాత్ తీర్థధర్మవ్రతాదికృత్॥ ౨౧

తా॥ ధనాధిపతి భాగ్యభావమందున్నచో ధనవంతుడు, పరిశ్రమ చేయువాడు, సామర్థ్యముగలవాడు, బాల్యమందు రోగవంతుడు, తరువాత మంచి ఆరోగ్యముగలవాడు, తీర్థయాత్రలు, ధర్మములు, వ్రతములు మొదలగు పుణ్యకర్మలను చేయువాడు అగును.

వి॥ వృద్ధయవనాచార్యులు శుభపాపభేదముచే ఫలభేదమును చెప్పియుండెను.

జాతక సంగ్రహమందు దహరించిన వృద్ధయవన వచనము;

ధనపే ధర్మగృహగే సౌమ్యే దానప్రసిద్ధి భాగ్యవతి।
క్రూరే దరిద్ర భిక్షుక పిదంబప్రవృత్తి స్త్రథామనుజః॥

అనగా ధనాధిపతి శుభగ్రహమైయి భాగ్యభావమందున్నచో దానములను చేయుటవలన ప్రసిద్ధినొందువాడనియు, పాపగ్రహమైనచో దరిద్రుడు, భిక్షాటనము చేయువాడు, హింసప్రవృత్తిగల వాడనియు భావము.

శ్లో॥ ధనేశే కర్మగే జాతో కామీమానీచ పండితః।
బహుదార ధనైర్యుక్తః కించ పుత్రసుఖోజ్ఞితః॥ ౨౨

తా॥ ధనాధిపతి దశమభావమందుండగ బుట్టినవాడు, కాముకుడు, అభిమానవంతుడు, పండితుడు, ఎక్కువ భార్యలుగలవాడు, విశేషధనవంతుడు అగును. కాని సంతాన (పుత్ర) సుఖము లేనివాడగును.

శ్లో॥ ధనేశే లాభభావస్థే సర్వ లాభసమన్వితః।
సదోద్యోగ యుతో మాపి కీర్తిమాన్ జాయతేనరః॥ ౨౩

తా॥ ధనాధిపతి లాభస్థానమందుండగ బుట్టినవాడు లాభముతో గూడినవాడు, ఎల్లప్పుడు ఉద్యోగవంతుడు, అభిమానము, కీర్తిగల వాడు అగును.

శ్లో॥ ధనేశే వ్యయభావస్థే సాహసీధన వర్జితః।
పరభాగ్యరతస్తస్య జ్యేష్ఠాపత్యసుఖం నహి॥ ౨౪

తా॥ ధనాధిపతి వ్యయమందుండెనేని సాహసవంతుడు, ధనము లేనివాడు, ఇతరుల భాగ్యమందను రక్తిగలవాడు అగును. ఇట్టి జాతకులకు జ్యేష్ఠ సంతానమువలన సుఖముండదు.

## అథతృతీయేశఫలమ్

శ్లో॥ లగ్నగే సహజాధీశే స్వభుజార్జిత విత్తవాన్।
సేవాజ్ఞః సాహసీజాతో విద్యాహీనో౽పి బుద్ధిమాన్॥ ౨౫

తా॥ తృతీయాధిపతి లగ్నమందుండగ బుట్టినవాడు స్వశక్తి వలన ధనార్జనము చేయువాడు. సేవచేయుట తెలిసినవాడు (కర్తవ్యమును తెలుసుకొనినవాడు) సాహసవంతుడు, విద్యాహీనుడైనను బుద్ధిమంతుడు అగును.

వి॥ తృతీయాధిపతి లగ్నములో నున్నజాతకులకు విద్యరాదను అభిప్రాయము వ్యక్తమగుచున్నది.

శ్లో॥ ద్వితీయే సహజాధీశే స్థూలో విక్రమ వర్జితః।
స్వల్పారంభీ సుఖీ న స్యాత్ పరస్త్రీ ధనకాముకః॥ ౨౬

తా॥ తృతీయాధిపతి ధనభావమునందుండగ బుట్టినవాడు స్థూలమైన శరీరముగలవాడు, పరాక్రమములేనివాడు, అల్పారంభముగలవాడు, సుఖములేనివాడు, పరస్త్రీ ధనములందు కోరికలుగలవాడు అగును.

శ్లో॥ సహజే సహజాధీశే సహోదర సుఖాన్వితః।
ధనపుత్రయుతో హృష్టో భునక్తి సుఖమద్భుతమ్॥ ౨౭

తా॥ తృతీయాధిపతి తృతీయభావమందుండగ బుట్టినవాడు సోదర సుఖముగలవాడు, ధనము, పుత్రులుగలవాడు, ఎల్లప్పుడు సంతోషములో నుండువాడు, అధికమైన సుఖమును భవించువాడు అగును.

శ్లో॥ సుఖస్థే సహజాధీశే సుఖీచ ధనసంయుతః।
మతిమాన్ జాయతే బాలో దుష్ట భార్యాపతిశ్చ సః॥ ౨౮

తా॥ తృతీయాధిపతి సుఖభావమందుండెనేని జాతకుడు సుఖవంతుడు, ధనవంతుడు, బుద్ధిమంతుడు, దుష్టురాలగు భార్యగలవాడు అగును.

శ్లో॥ సుతస్థే సహజాధీశే పుత్రవాన్ గుణసంయుతః।
భార్యాతస్య భవేత్క్రూరా క్రూరగ్రహయుతేక్షితే॥ ౨౯

తా॥ తృతీయాధిపతి పంచమభావమందుండెనేని పుత్రవంతుడు, గుణవంతుడు అగును. పంచమభావగతుడైన తృతీయాధిపతి పాపగ్రహముల సంబంధవీక్షణములుగలవాడైనచో నట్టి వాని భార్యక్రూరురాలగును.

వి॥ తృతీయాధిపతి నైసర్గిక పాపగ్రహమై పంచమమునందుండి పాపగ్రహసంబంధ వీక్షణములు లేనివాడైనచో భార్య క్రూరురాలగునని చెప్పకూడదు.

శ్లో॥ షష్ఠభావే తృతీయేశే భ్రాతృశత్రుర్మహాధనీ।
మాతులైశ్చ సమంవైరం మాతులానీప్రియో నరః॥ ౩౦

తా॥ తృతీయాధిపతి షష్ఠభావమందుండగ బుట్టినవాడు సోదరులతో శత్రుత్వముగలవాడు, విశేషధనవంతుడు, మేనమామలతో వైరముగలవాడు, మేనమామ భార్యకు ఇష్టుడు అగును.

శ్లో॥ సప్తమే సహజాధీశే రాజసేవా పరోనరః।
బాల్యే దుఃఖీ సుఖీ చాంతే జాయతే నాత్రసంశయః॥ ౩౧

తా॥ తృతీయాధిపతి సప్తమభావమందుండగ బుట్టిన జాతకుడు రాజకార్యములను (ప్రభుత్వోద్యోగమును) చేయువాడు, బాల్యమునందు దుఃఖములననుభవించువాడు, అంత్యవయస్సునందు సుఖము ననుభవించువాడు అగును. ఇది నిస్సంశయము.

శ్లో॥ అష్టమే సహజాధీశే జాతశ్చోరో నరోభవేత్।
దాసవృత్త్యోపజీవీ చరాజద్వారే మృతిర్భవేత్॥ ౩౨

తా॥ తృతీయాధిపతి అష్టమభావమందుండగ బుట్టిన బాలుడు చోరుడగును. దాస్యవృత్తివలన జీవించును. రాజద్వారసమీపమందు మృతి గలుగును.

శ్లో॥ నవమే సహజాధీశే పితుః సుఖవివర్జితః॥
స్త్రీభాగ్యోదయస్తస్య పుత్రాది సుఖసంయుతః॥ 33

తా॥ తృతీయాధిపతి నవమ భావమందుండెనేని పితృసుఖములేనివాడును, స్త్రీలవలన భాగ్యోదయముగలవాడు, పుత్రాదుల సుఖము గలవాడు అగును.

శ్లో॥ దశమే సహజాధీశే జాతః సర్వసుఖాన్వితః॥
స్వభుజార్జిత విత్తశ్చ దుష్టస్త్రీ భరణేరతః॥ 34

తా॥ తృతీయాధిపతి దశమమందుండగ బుట్టినవాడు సర్వసుఖములననుభవించువాడు, స్వశక్తిచే సంపాదింపబడిన ధనముగలవాడు, దుష్టస్త్రీలను గూడువాడు అగును.

జా। సం॥ బాదరాయణ వచనము.

దుశ్చిక్యేశే దశమే నృపపూజ్యో మాతృబంధుపరిత్యక్తః॥
ఉత్తమ బంధుర్వృందుషు వివిశ్చతో జాయతే మనుజః॥

తా॥ తృతీయభావాధిపతి దశమమందున్నచో జాతకుడు రాజపూజ్యుడు, తల్లి బంధువులచే గౌరవింపబడువాడు, ఉత్తమ బంధువులతో గూడినవాడు, సరియైన నిర్ణయములను చేయుగలవాడు అగును.

శ్లో॥ తృతీయేశే తు లాభస్థే స్వభుజార్జిత విత్తమాన్।
మూర్ఖః కృశో మహారోగీ సాహసీపరసేవకః॥ 35

తా॥ తృతీయాధిపతి లాభభావమందుగల జాతకుడు స్వశక్తిచే ధనసంపాదన చేయువాడు, మూర్ఖుడు, కృశించిన శరీరముగలవాడు, రోగపీడితుడు, సాహసవంతుడు, పరులకు సేవచేయువాడు అగును.

వి॥ లాభస్థః సహజేశః సుబాంధవం రాజ్యప్రియంనరం కురుతే।
పురుషం బంధుషు పూజ్యం సేవాభిధాయినం భోగనిరతంచ॥ వృ.య.జా

తృతీయాధిపతి లాభమందున్నప్పుడు, మంచి బంధువులుగలవాడు, రాజప్రియుడు, బంధువులందు గౌరవము గలవాడు, సేవాసక్తి గలవాడు, భోగనిరతుడు అగును.

శ్లో॥ తృతీయేశే వ్యయస్థేతు వ్యయకృత్ దుష్కృతౌ జనః।
తత్పితా కూరచేతాః స్యాత్ స్త్రీభిర్భాగ్యోదయో భవేత్॥ 3౬

తా॥ తృతీయాధిపతి వ్యయమందున్న జాతకుడు దుష్టకృత్యము లకు ధనవ్యయమును చేయువాడు, కూరచిత్తముగల తండ్రిగలవాడు, స్త్రీల మూలమున భాగ్యోదయముగలవాడు అగును.

వి॥ వ్యయగే దుశ్చిక్యేశే మిత్రవిరోధీ సుబంధు సంతాపీ।
దూరేవాసిత బంధుం విదేశశీలం నరం కురుతే॥

తృతీయాధిపతి వ్యయమందున్న జాతకుడు మిత్రులతో విరోధముగలవాడు, బంధువులకు తాపమును కలిగించువాడు, దూరప్రాంతములందు బంధువులుగలవాడు, విదేశనివాసశీలుడు అగును.

## అథ సుఖేశ ఫలమ్॥

శ్లో॥ సుఖేశే లగ్నగే జాతో విద్యాగుణ విభూషితః।
భూమివాహన సంయుక్తో మాతుస్సుఖ సమన్వితః॥ 3౭

తా॥ చతుర్థాధిపతి లగ్నమందున్న జాతకుడు విద్య, సద్గుణములుగలవాడు, భూమి వాహనములుగలవాడు, మాతృసుఖముగల వాడునగును.

వి॥ బృహద్యవన జాతకమందు;
తుర్యపతిర్లగ్నగతః పితృపుత్రౌ స్నేహలౌ మిథః కురుతే।
పితృపక్షవైరికలితం పితృనామ్నాభువి ప్రసిద్ధంచ॥

చతుర్థాధిపతి లగ్నమందున్న జాతకుడు తండ్రితో స్నేహముగలవాడు, పితృపక్షము వారితో వైరముగలవాడు, తండ్రి పేరుతో ఖ్యాతి నార్జించువాడునగును.

శ్లో॥ సుఖేశే ధనగే జాతో భోగీ సర్వధనాన్వితః।
కుటుంబ సహితో మానీ సాహసీ కుహకాన్వితః॥ 3౮

తా॥ చతుర్థాధిపతి ద్వితీయమందుండెనేని జాతకుడు భోగ

వంతుడు, సమస్తైశ్వర్యములుగలవాఁడు, మంచి కుటుంబముగలవాఁడు, అభిమానవంతుడు, సాహసవంతుఁడు, మోసగాఁడును అగును.

పి॥ పాతాళపేదస్థే ప్రాంకగే పితృ విరోధకృచ్చకుభే।
పితృపాలకః ప్రసిద్ధః పితాపిభునక్తి చ తల్లక్ష్మీమ్॥ బృ. య. జా॥

పాపుఁడైన చతుర్థాధిపతి ధనస్థానమందున్న జాతకుడు తండ్రితో విరోధముగలవాడగును. శుభుఁడైన చతుర్థాధిపతి యున్నచో తండ్రిని పోషించువాడగును. తండ్రి జాతకుని ధనము ననుభవించును.

శ్లో॥ సుఖేశే సహజే జాతో విక్రమీ భృత్యసంయుతః।
ఉదారో౽రుగ్ గుణీ దాతా స్వభుజార్జిత విత్తవాన్॥ 39

తా॥ చతుర్థాధిపతి తృతీయమందున్నచో జాతకుడు పరాక్రమవంతుడు, సేవకులుగలవాడు, ఉదారుడు, రోగములేనివాడు, గుణవంతుడు, దాత, స్వశక్తివలన ధనార్జనము చేయువాడునగును.

వి॥ తుర్యేశః సహజస్థః పితృమాతృచ్ఛేదకం విదిత పితరమ్॥
పిత్రాసహ కలహపరం పితృబాంధవ ఘాతకం పురుషమ్॥ బృ॥య॥జా

చతుర్థాధిపతి తృతీయభావమందున్న జాతకుడు మాతాపితరులను దుఃఖపెట్టువాడు, ఖ్యాతిగలతండ్రిగలవాడు, తండ్రితో కలహించువాఁడు, పితృబంధువులను హింసించువాడునగును.

శ్లో॥ సుఖేశే సుఖభావస్థే మంత్రీ సర్వధనాన్వితః॥
చతురశ్శీలవాన్ మానీ జ్ఞానవాన్ స్త్రీప్రియస్సుఖీ॥ ४०

తా॥ చతుర్థాధిపతి చతుర్థమందున్న జాతకుడు మంత్రి, బహువిధధనము గలవాడు, చతురుడు, శీలవంతుడు, అభిమాని, జ్ఞానవంతుడు, స్త్రీలోలుడు, సుఖము ననుభవించువాడగును.

వి॥ తుర్యగతే తుర్యపతౌ పితురాజ్ఞా రక్షకః సదాదృష్టః॥
విదితః పితృలాభకరో భవతి సుకర్మా సుఖీ విధిపః॥ బృ॥ య॥ జా॥

పాలనచేయువాడు, విషయజ్ఞానముగలవాడు, తండ్రికిలాభమునుచేయు వాడు, సత్కర్మలనుచేయువాడు, సుఖవంతుడు, నిధులకధిపతియగును.

హోరారత్నమందు :—

తుర్యగతే తుర్యపతౌ పితరీక్షితయాధి నాథ మానకరః।
విదితః పితృలాభపరోభవతి సుధర్మా సుఖీనిధిపః॥ యనిపాఠాంతరముగలదు.

శ్లో॥ సుఖేశే పుత్రభావస్థే సుఖీసర్వజన ప్రియః।
విష్ణుభక్తోగుణీమానీ స్వభుజార్జిత విత్తవాన్॥ ४०

తా. సుఖాధిపతి పంచమ మందున్న జాతకుడు సుఖమును పొందువాడు. సర్వ జనప్రియుడు, విష్ణుభక్తిగలవాడు, గుణవంతుడు, అభిమానము గలవాడు, స్వశక్తివలన ధనమార్జించువాడు నగును

వి॥ సుతగే తుర్యగృహేశే పితాసలాభోగ్ర తశ్చ దీర్ఘాయుః।
భవతిక్షితౌ ప్రసిద్ధః సుసుతః సుతపాలకశ్చాపి॥ వృ.య జా

చతుర్థాధిపతి పంచమములోనున్న జాతకుడు ధనవంతుడైన తండ్రిగలవాడు, దీర్ఘాయువుగలవాడు, భూమియందు ప్రసిద్ధుడు, యోగ్యసంతానము గలవాడు, సంతానమును పోషించువాడగును. హోరారత్నమందు "సలాభోఽంగజశ్చ" యని పాఠభేదము గలదు.

శ్లో॥ సుఖేశేరిపు భావస్థే మాతుః సుఖ వివర్జితః॥
క్రోధీచోరోఽభిచారీ చ స్వేచ్ఛాచారశ్చ దుర్మనాః॥ ४१

తా. సుఖాధిపతి శత్రుభావమందున్న జాతకుడు మాతృసుఖము లేనివాడు, క్రోధము గలవాడు, చోరుడు, అభిచార క్రియలు చేయు వాడు, స్వేచ్ఛాచారము గలవాడు,దుష్టమైన మనస్సుగలవాడునగును.

వి. "మనస్వీ వ్యభిచారీచ చోరః క్రోధీదురాత్మవాన్॥ అని పాఠాంతరము. బృ. య. జాతకమందు.

హిబుకపతౌ రిపుసంస్థే పితురర్థ వినాశకః పితృవైరీ।
పితృద్వే (దో)షకరః క్రూరే సౌమ్యే ధన సంచయ (క) స్తనయః॥

చతుర్థాధిపతి పాపుడై షష్ఠమందున్నచో పితృధనమును నశింప చేయువాడు, తండ్రియందు వైరముగలవాడు, తండ్రికి దోషమును చేయువాడు, అగును. శుభుడై షష్ఠమందున్నచో ధనము నిల్వ చేయు కుమారుడు గలవాడగును.

శ్లో॥ సుఖేశే సప్తమే జాతో బహువిద్యా సమన్వితః॥
పిత్రార్జిత ధనత్యాగీ సభాయాం మూగవద్భవేత్॥ ४३

తా. సుఖాధిపతి సప్తమమందున్న జాతకుడు, విశేష విద్యావంతుడు, పిత్రార్జితధనమును విడిచిపెట్టువాడు, సభయందు మాట్లాడ లేనివాడు అగును.

వి॥ అంబుపతౌ సప్తమగే క్రూరే శ్వశురః స్నుషాం నపాలయతి।
సౌమ్యేపాలయతిపునః కులటాం కుజకవీ కురుతః॥ బృ.య.జా॥

పాపుడైన చతుర్థాధిపతి సప్తమమందున్నచో జాతకుని భార్యను మామ ద్వేషించును. శుభుడైనచో ప్రేమతో చూచును. సప్తమమందు కుజ శుక్రులున్న యెడల జాతకుని భార్యకులట యగును.

శ్లో॥ సుఖేశే రంధ్ర భావస్థే గృహాది సుఖవర్జితః॥
పితోస్సుఖం భవేదల్పం జాతః క్లీబసమో భవేత్॥ ४४

తా॥ సుఖాధిపతి అష్టమమందున్న జాతకుడు గృహభూమ్యాది సుఖము లేనివాడు, స్వల్పమైన మాతృ పితృసుఖముగలవాడు, క్లీబసముడు అగును.

వి॥ "సుఖేశే వ్యయ రంధ్రస్థే" అనియు, క్లీబోవానరజో భవేత్॥ అనియు పాఠభేదము గలదు.

ఛిద్రగతస్తుర్యపతిః క్రూరో రోగాన్వితం దరిద్రంచ।
దుఃకర్మరతం మనుజ్క్రియ మతవామానవంకురుతే॥ వృ.య.జా

క్రూరగ్రహమైన చతుర్థాధిపతి యష్టమమందున్న జాతకుడు రోగములుగలవాడు, దరిద్రుడు, దుష్టకర్మలాచరించువాడు, కోపముగల వాడు అగును.

శ్లో॥ సుఖేశే భాగ్యభావస్థే జాతః సర్వజనప్రియః।
దేవభక్తో గుణీమానీ భవేత్సర్వ సుఖాన్వితః॥ ४२

తా॥ సుఖాధిపతి భాగ్యమందుగల జాతకుడు సర్వజనప్రియుడు దేవతాభక్తిగలవాడు, గుణవంతుడు, అభిమానముగలవాడు, సర్వ సుఖములనుభవించువాడు అగును.

వి॥ సుకృతగతే తుర్యపతౌ పితర్య సంగీ సమస్తవిద్యావాన్।
పితృధర్మ సంగ్రహపరః పితృనిరపేక్షో భవేన్మనుజః॥ బృ.య.జా

చతుర్థాధిపతి నవమమునందుగల జాతకుడు తండ్రియందభిమానములేనివాడు, సమస్త విద్యలనునేర్చినవాడు పితృధర్మములను గ్రహించువాడు, పితృనిరపేక్షకుడు అగును.

శ్లో॥ సుఖేశే కర్మభావస్థే రాజమాన్యో నరో భవేత్।
రసాయనీ మహాహృష్టో సుఖభోగీ జితేంద్రియః॥ ४३

తా॥ సుఖాధిపతి దశమమందుగల జాతకుడు రాజమాన్యుడగు, రసాయన విద్యనేర్చినవాడు, ఎక్కువ సంతోషముగలవాడు, సుఖము భోగముగలవాడు, జితేంద్రియుడు అగును.

వి॥ పాతాలపే౽ంబరగతే పాపే సుతమాతరం త్యజతి జనకః।
శ్రయతే చాన్యాందయితాం సౌమ్యే పునరన్య సేవాకృత్॥ బృ.య.జా

పాపుడైన చతుర్థాధిపతి దశమమునందున్న యెడల జాతకుడు తల్లితో కూడ తండ్రిచే విడువబడును. శుభగ్రహమైనచో అన్యస్త్రీలతో తండ్రి సంచరించువాడగును.

శ్లో॥ సుఖేశే లాభగే జాతో గుప్తరోగ భయాన్వితః॥
ఉదారో గుణవాన్ దాతా పరోపకరణే రతః॥ ४४

తా. సుఖాధిపతి లాభభావమందుండెనేని గుప్తరోగములతో కూడినవాడు, ఉదారుడు, గుణవంతుడు, దాత, పరోపకారియు అగును.

వి॥ ఏకాదశగే తుర్యపతౌ పిత్రోః పాలకః సుకర్మా చ।
పితృభక్తః ప్రముదాయః సౌమ్యే పునరీశ్వరో భవతి। బృ.య.జా

చతుర్థాధిపతి యేకాదశ భావమందుండెనేని తల్లితండ్రులను పోషించువాడు, సత్కర్మలను చేయువాడు, పితృభక్తిగలవాడు, దీర్ఘాయువుగలవాడగును. శుభుడున్నచో పభువు కూడ యగును.

శ్లో॥ సుఖేశే వ్యయ భావస్థే గృహాది సుఖవర్జితః।
జాతో దుర్వ్యసనీ మూఢః సదాలస్య సమన్వితః॥ ౪౭

తా. వ్యయమందు సుఖాధిపతిగల జాతకుడు గృహభూమ్యాది సుఖములేనివాడు దుర్వ్యసనములు గలవాడు, మూర్ఖుడు, ఎల్లప్పుడు ఆలస్యముతో కూడినవాడు అగును.

వి॥ ద్వాదశగే తుర్యపతౌ మృతః పితా వా విదేశగో వాచ్యః।
పుత్రస్య పాపఖచరే త్వన్య పితుర్జన్మ నిర్దేశ్యమ్॥ వృ.య.జా

వ్యయమందు చతుర్థాధిపతి యుండెనేని యాజాతకుని తండ్రి మృతిచెందుటగాని, విదేశమునకు పోవువాడుగాని యగును. పాప గ్రహమున్నచో జాతకుడు ఇతరులవలన జన్మించిన వాడనియు చెప్పవలెను.

వృద్ధయవన జాతకములో నీ ఫలములన్నియు పితృవిషయముగా చెప్పబడియున్నవి. పరాశర గ్రంథోక్త ఫలములకు యవనోక్త ఫలములకు సంబంధములేదు.

## అథ పంచమేశ ఫలమ్

శ్లో॥ సుతేశే లగ్నగే జాతో విద్వాన్ పుత్రసుఖాన్వితః।
కదర్యో వక్ర చిత్తశ్చ పరద్రవ్యాపహారకః॥
'కృపణః కుటిలశ్చైవ' పాఠాంతరము. ౪౮

తా. లగ్నమందు పంచమాధిపతియున్న జాతకుడు విద్వాంసుడు పుత్రసుఖము గలవాడు, లోభి లేక ధనమును కూడబెట్టువాడు, కుటిలుడు, ఇతరుల ద్రవ్యమును హరించువాడు అగును.

వి। లగ్నగతః ప్రపంచమపః ప్రసిద్ధమస్తోక తనయ పరికలితమ్।
శాస్త్ర విదం గీతవిదం సుకర్మ విరతం వదంతురుతే॥ వృ.య.జా

పంచమాధిపతి లగ్నగతుడైన జాతకుడు ప్రసిద్ధుడు, బహుపుత్ర సహితుడు, శాస్త్ర విదుడు, సంగీతజ్ఞుడు, సత్కర్మనిరతుడు అగును.

శ్లో॥ సుతేశే ధనగే జాతో బహుపుత్రో ధనాన్వితః।
కుటుంబ పోషకో మానీ స్త్రీప్రియః సుయశా భువి॥ ౧౦

తా॥ ధనస్థానమందు పుత్రాధిపతియున్న జాతకుడు బహు పుత్రులుగలవాడు, ధనముగలవాడు, కుటుంబ పోషకుడు, అభిమాన వంతుడు, స్త్రీ ప్రియుడు, మంచికీర్తిగలవాడు అగును.

వి॥ పంచమ పతిర్ధనస్థః క్రూరః అచరో ధనోజ్ఝితం కురుతే।
గీతాది కలాకలితం కష్టభుజం స్థానక ప్రచురమ్॥ బృ.య.జా

పాపియైన పంచమాధిపతి ధనమందున్న జాతకుడు ధనములేని వాడు, సంగీతాది కలలందు కుశలుడు, శ్రమ జీవనుడు, స్వస్థానమందు కీర్తిగలవాడు అగును.

శ్లో॥ సుతేశే సహజే భావే జాయతే సోదరప్రియః।
పిశునశ్చ కదర్యశ్చ స్వకార్య నిరతస్సదా॥ ౧౧

తా॥ పంచమాధిపతి తృతీయమందున్న జాతకుడు సోదరుల యందు ప్రీతిగలవాడు, లోభి, మాయావి, స్వకార్యనిరతుడు అగును.

వి॥ తనయపతిః సహజగతః సమధురవాచం స్వబంధుజన విదితమ్।
కురుతే స్థానం తదీయతనయాః పరిపాలయంతి బంధుమ్॥ వృ.య.జా

పుత్రాధిపతి తృతీయ మందుండెనేని మంచి వాక్కుగలవాడు, బంధుజనమునకు తెలిసినవాడు, పితృభుక్తమైన స్థానమును పాలించు వాడు బంధుపోషకుడగును.

శ్లో॥ సుతేశే సుఖభావస్థే సుఖీమాతృసుఖాన్వితః।
లక్ష్మీయుక్తః సుబుద్ధిశ్చ రాజ్ఞోఽమాత్యోఽథవాగురుః॥ ౧౨

తా॥ పంచమాధిపతి చతుర్థ గతుడైనచో నట్టి జాతకుడు సుఖ వంతుడు, మాతృసుఖము గలవాడు. ధనవంతుడు, మంచిబుద్ధిగలవాడు

అమాత్యుడు లేక గురువు అగును.

వి॥ సుతపః పాతాల గతః పితృకర్మణాం వపాలితం పిత్రా।
జననీ భక్తం కురుతే క్రూరస్తు విరోధకృత్ పిత్రా॥ వృ.య.జా

పుత్రాధిపతి చతుర్థమందుగల జాతకుడు తండ్రిచే చేయబడిన కర్మల నాచరించువాడు. తల్లియందు భక్తి గలవాడగును. పంచమాధిపతి పాపుడైనచో తండ్రితో విరోధము గల వాడగును.

శ్లో॥ సుతేశే సుతభావస్థే శుభాఢ్యే పుత్రవాన్ నరః।
పాపాఢ్యే ఽపత్యహీనోఽసౌ గుణవాన్ మిత్రవత్సలః॥ ౫౩

తా॥ శుభుడైన పంచమాధిపతి పంచమమందున్నచో పుత్రవంతుడు గుణవంతుడు, మిత్రులయందు వాత్సల్యముగల వాడగును. పాపుడైనచో సంతానము లేని వాడగును.

వి॥ తనయగతస్తనయపతిర్మతి మంతం మానినం వచన కుశలమ్।
సుతయుక్తం ప్రవరజనం ప్రఖ్యాతం మానపం కురుతే॥ వృ.య.జా

పంచమాధిపతి పంచమమునందుండగ బుట్టినవాడు బుద్ధిమంతుడు, అభిమానవంతుడు, వాక్చాతుర్యముగలవాడు, పుత్రవంతుడు, జన శ్రేష్ఠుడు, ఖ్యాతిగలవాడు అగును.

శ్లో॥ సుతేశే రిపుభావస్థే పుత్రశ్శత్రుసమోభవేత్।
మృతాపత్యోథవా జాతో దత్తక్రీతసుతోఽథవా॥ ౫౪

తా॥ పంచమాధిపతి షష్ఠభావమందుగల జాతకుని పుత్రులు శత్రువులుగ గలవాడగును. లేక మృతసంతానవంతుడు, లేక దత్త పుత్రుడు, క్రీతపుత్రుడు గలవాడగును.

వి॥ ఈ యోగమును స్వతంత్రముగ చెప్పుటకు అవకాశము లేదు. భావసంబంధమైన ఇతర శుభాశుభములను గూడ విచారించి, భావదోషము ప్రబలముగ నున్నప్పుడీ యోగము సహకరించును. భావమునకు శుభాధిక్యముండి పుత్రాధిపతి షష్ఠమందుండెనేని

సామాన్య దోషమును, స్వల్ప పుత్ర నష్టమును చెప్పవలయును.

పంచమపః శత్రుగతః శత్రు ప్రతిమమాత్మ సంభవం హీనమ్।
రోగయుతం ధనరహితం క్రూరఃఖచరః కరోతినరమ్॥ వృ.య జా

పంచమాధిపతి షష్ఠమందున్నప్పుడు శత్రువుగ చూడబడువాడు తనను తక్కువగ చూచుకొనువాడు (లేక జ్ఞానము లేనివాడని కొందరు) అగును. పాప గ్రహము పంచమాధిపతియై షష్ఠభావమందున్నప్పుడు రోగవంతుడు, ధనహీనుడు అగును.

శ్లో॥ సుతేశే సప్తమే మానీ సర్వధర్మ సమన్వితః।
పుత్రాది సుఖయుక్తశ్చ పరోపకరణే రతః॥ ౨౫

తా॥ సుత స్థానాధిపతి సప్తమ మందుండెనేని యా జాతకుడు సర్వధర్మములతో గూడినవాడు, పుత్రసుఖాదులు గలవాడు, పరోపకారి యగును.

వి॥ తనయపతౌ సప్తమగే సుముఖా సుభగా స్వదేవ గురుభక్తా॥
ప్రియవాదినీ సుశీలా నరస్యభవ జాయతే దయితా॥ వృ.య.జా

పంచమాధిపతి సప్తమ మందుగల జాతకుని భార్య తత్సంతాన వతి, సౌభాగ్యవతి, గురుదేవతా భక్తిగలది, ప్రియముగ మాట్లాడునది, శీలవతి, యగును. (ఇక్కడ పంచమాధిపతియగు శని తులాలగ్నమునకు 7వ యింటిలో నీచలో నుండగ శుభ గ్రహ సంబంధ వీక్షణములు లేనప్పుడు మాత్రము పై ఫలములు సరిపడుట లేదు. ఫలభేదము గనబడుచున్నది. కర్కాటకలగ్న జాతకులకు పంచమాధిపతియగు కుజుడు సప్తమమందుచ్చగతుడై ఇతర గ్రహసంబంధ వీక్షణములు లేనప్పుడు ఆ జాతకులభార్య, ధూర్తురాలు, స్వతంత్ర ప్రవర్తన గలిగి పరుషము గమాట్లాడునదియు, సంతాన దోషములు గలది యగుచున్నది. పరాశరుడు చెప్పిన ఫలములు అనుభవమునకు బాగుగనున్నవి.)

శ్లో॥ సుతేశే రంధ్రభావస్థే స్వల్పపుత్ర సుఖాన్వితః।
కాసశ్వాససమా యుక్తః క్రోధీచ సుఖవర్జితః॥ ౨౬

తా॥ పంచమాధిపతి అష్టమమందుండెనేని స్వల్పపుత్రసుఖము గలవాడు, కాసశ్వాసవ్యాధిగలవాడు, క్రోధముగలవాడు, సుఖము లేనివాడు అగును.

వి॥ సుతపే నిధనగృహస్థే కుత్సిత వాక్ప్రియమప్రియో భండా॥
నష్టాప్త్యంగాః సహజాస్త్రత్పుత్రాః సంభవంతి తథా॥ వృ.య.జా

పంచమాధిపతి అష్టమమందున్న జాతకుడు కుత్సితవాక్కుగల వాడు, స్త్రీలనుగురించి అశ్లీలముగ మాట్లాడువాడు, సోదరులు, పుత్రులు నష్టపోవువాడును అగును.

(అష్టమభావ మధ్యమము రాశి ప్రథమద్రేక్కాణములోనున్న జాతకులకు పై ఫలములు సరిపడుచున్నవి. ద్వితీయ తృతీయ ద్రేక్కాణ ములలో భావమధ్యముండి అక్కడ పంచమాధిపతి యున్న జాతకులకు ఫలములు సరిపడుటలేదు.)

శ్లో॥ సుతేశే భాగ్యగే పుత్రో భూపోవా తత్సమోభవేత్।
వ్యయం వా గ్రంథకర్తాచ విఖ్యాతః కులదీపకః॥ ఇ

తా॥ పంచమాధిపతి భాగ్యమందుగల జాతకుడు ప్రభువుగాని, ప్రభుసమానుడుగాని యగును. మరియు గ్రంథకర్త, ఖ్యాతిగలవాడు, వంశమునకు ప్రసిద్ధుడు అగును.

వి॥ సుకృతగతే స్తనయపతి స్సద్బోధవిద్యం కవిం సుగీతజ్ఞమ్।
నృపపూజితం సురూపం నాటక రసికం నరం కురుతే॥ వృ.య.జా

భాగ్యమందుగల పంచమాధిపతి వలన జాతకుడు విద్యలను బాగుగ నేర్చినవాడు, కవి, సంగీతజ్ఞుడు, ప్రభుసమ్మానితుడు, మంచి రూపముగలవాడు, నాటక ప్రీతిగలవాడు అగును.

శ్లో॥ సుతేశే రాజ్య భావస్థే రాజయోగోహి జాయతే॥
అనేక సుఖభోగిచ ఖ్యాతకీర్తిర్నరో భవేత్॥ ఇ

తా॥ దశమమందు పంచమాధిపతి యుండెనేని యా జాతకునకు రాజయోగముపట్టును. అనేక సుఖభోగముల ననుభవించును. కీర్తి వంతుడగును.

వి॥ సుతపతిరంబరయాతో నృపకర్మాణం నృపాత్ఫలిత విభవమ్।
సత్కర్మరతం ప్రవరం జననీకృత సుఖశతం కురుతే॥ వృ.య.జా

దశమగత పుత్రాధిపతివలన జాతకుడు రాజకార్యములను చేయువాడు, ప్రభువులవలన సంపదలుగలవాడు, సత్కార్యాచరణ శీలుడు, శ్రేష్ఠుడు, తల్లివలన అనేక సుఖములను పొందువాడగును.

(దశమమందు పుత్రాధిపతి యుండి చతుర్థమును సంపూర్ణ దృష్టితో చూచినప్పుడు తల్లివలన విశేషసుఖముల ననుభవించునని భావము. కొన్ని జాతకములందు పాపుడైన పంచమాధిపతి దశమములోనున్నప్పుడు తల్లితో విరోధము సంభవించుమన్నది.

శ్లో॥ సుతేశే లాభగే జాతో విద్యావాన్ జన వల్లభః।
గ్రంథకర్తా మహాదక్షో బహు పుత్ర ధనాన్వితః॥ ౫౯

తా॥ పంచమాధిపతి లాభస్థానమందుండగ బుట్టినవాడు విద్యావంతుడు, జనవల్లభుడు, గ్రంథకర్త, కార్యదక్షుడు, బహుసంతానము, ధనముగలవాడగును.

వి॥ సుతనాథే లాభస్థే శూరం సుతవాన్ సుకృత్య కృద్భోగీ।
గీతాది కలా కలితో నృపలాభీ జాయతే జాతః॥ వృ. య. జా॥

పంచమాధిపతికి లాభస్థితి గలిగినప్పుడు జాతకుడు శూరుడు, పుత్రవంతుడు, పుణ్యకర్మలను (సత్కర్మలను) చేయువాడు, భోగి, గీతాదికళలందు నైపుణ్యముగలవాడు, ప్రభువులవలన లాభమును పొందువాడు, అగును.

శ్లో॥ సుతేశేవ్యయభావస్థే జాతఃపుత్రసుఖోజ్ఝితః।
దత్తపుత్రయుతోవాఽసౌ క్రీతపుత్రాన్వితోఽథవా॥ ౬౦

తా॥ వ్యయమందు పంచమాధిపతి యున్న జాతకుడు పుత్రసుఖములేనివాడు,దత్తపుత్రుడుగాని,క్రీతపుత్రుడుగానిగలవాడుఅగును.

(పంచమాధిపతి షష్ఠభావమందున్నప్పుడు గూడ దత్త, క్రీత పుత్రయోగము తెలుపబడినది. 6, 12 భావములు దుస్థానములగుట చేత పుత్రభావమునకు దోషఫలము చెప్పబడెను. అనుభవములో

పుత్రాధిపతి వ్యయమందున్న జాతకులకు సంతానమధికముగ నుండి వారి వలన ధనవ్యయమధికముగనున్న జాతకులుగలరు. సంతానము వలన సుఖము తక్కువగనుండును. దత్తక్రీత పుత్రయోగములున్నప్పుడు యీ స్థితి సహకరించును. గాని పంచమాధిపతి వ్యయమందున్నంత మాత్రముననే యీ ఫలము సిద్ధించుటలేదని తెలియుచున్నది.)

వి॥ పంచమపే ద్వాదశగే క్రూరేసుతవిహితః శుభేసుసుతః।
సుతసంతాప పరః స్యాద్విదేశ గమనోద్యతో మనుజః॥ వ్య. య. జా॥

పంచమాధిపతి పాపుడై ద్వాదశమందున్నచో జాతకుడు సంతానము లేనివాడు, శుభగ్రహమైనచో సత్పుత్రులుగలవాడు, పుత్రుల వలన సంతాపముగలవాడు, విదేశమునకు పోవువాడు అగును.

యవనాచార్యులు పంచమాధిపతి పాపుడైనప్పుడు సంతానమునకు దోషఫలమును, శుభుడైనప్పుడు శుభఫలమును తెలిపియుండెను. తులాలగ్నమునకు, ధనుర్లగ్నమునకు, కర్కటక లగ్నమునకు పంచమాధిపతులగు శని కుజులు వ్యయమునందున్న జాతకులకు సంతానమధికముగ గలిగి వారివలన క్లేశములుగలుగుట యనుభవములో గోచరించుచున్నది. మేష, కన్యా లగ్నములకు పంచమాధిపతులగు రవి శనులు వ్యయమందున్నప్పుడు అల్పసంతానముగలుగుట, లేక సంతాన నష్టములు గలుగుచున్నవి.

---

## అథ రోగేశ ఫలమ్॥

శ్లో॥ షష్ఠేశే లగ్నగేజాతో రోగవాన్కీర్తిసంయుతః।
ఆత్మశత్రుర్ధనీ మానీసాహసీగుణవాన్నరః॥ 18

"జ్ఞాతిశత్రుః" అని మరొక పాఠమందుగలదు.

తా॥ లగ్నమందు షష్ఠాధిపతియున్న జాతకుడు రోగములచే పీడింపబడువాడు, కీర్తివంతుడు, ఆత్మవర్గము శత్రువులుగ గలవాడు (జ్ఞాతులు శత్రువులుగగలవాడని కొందరు) ధనవంతుడు, అభిమానవంతుడు, సాహసముగలవాడు, గుణవంతుడు అగును.

వి॥ షష్ఠేశే లగ్నగతే నీరుక్ సబలః కుటుంబ కష్టకరః।
బహుపక్షో రిపుహంతా భవతి నరః శౌచవచన ధనః॥ వృ. య. జా॥

షష్ఠాధిపతి లగ్నమందుండెనేని రోగములు లేనివాడు, బలాఢ్యుడు, కుటుంబమునకు కష్టమును కలిగించువాడు, గొప్పపరివారము గలవాడు, శత్రుహంతకుడు, సత్యమును పలుకువాడు అగును.

పరాశరుని యభిప్రాయములో రోగపీడితుడనియు, యవన మతములో రోగములు లేనివాడనియు చెప్పుటచే భిన్నాభిప్రాయము కనబడుచున్నది. ఈ విషయమైన పరిశీలనలో;

1. వృషభలగ్నమునకు లగ్నమందు శుక్రుడున్నప్పుడు, 2. కర్కటకమునకు లగ్నమందు గురుడున్నప్పుడు, 3. కన్యాలగ్నమునకు లగ్నమందు శని యున్నప్పుడు, 4. తులాలగ్నమునకు లగ్నమందు గురుడున్నప్పుడు, 5. వృశ్చికమునకు లగ్నమందు కుజుడున్నప్పుడు, 6. ధనుర్లగ్నమునకు లగ్నమందు శుక్రుడున్నప్పుడు, 7. మకరమునకు బుధుడు లగ్నమందున్నప్పుడు బలాఢ్యులుగను, ఆరోగ్యవంతులుగ నున్న జాతకులు గలరు. మిగిలిన లగ్నములకు లగ్నమందు షష్ఠాధిపతి యున్నప్పుడు సాధారణ బలవంతులు, తక్కువ ఆరోగ్యముగలవారును అగుదురని తెలియుచున్నది.

షష్ఠాధిపతి స్వక్షేత్ర, ఉచ్ఛ, మిత్రక్షేత్ర, శత్రుక్షేత్రములందు ఆరోగ్యము నిచ్చుటయు, దేహబలము గలిగియుండుట గోచరించు చున్నది. సింహలగ్నమునకు లగ్నగత శని రోగముల నిచ్చుచుండెను. మీన లగ్నమునకు లగ్నగతరవి మిత్రక్షేత్రమందున్నను రోగవంతుని చేయుచుండెను. మేషమునకు లగ్నబుధుడు, మిధునమునకు లగ్నకుజుడు కన్యకు లగ్నశని, అనారోగ్యములను కలిగించుచుండెను. ఇట్టి జాతకులు దీర్ఘవ్యాధులచేత, తరుచు అనారోగ్యములచేత పీడింపబడుచుండిరి.

శ్లో॥ షష్ఠేశేధవభావస్థే సాహసీకులవిశ్రుతః।
పరదేశీసుఖీవక్తా స్వకర్మవిరతఃసదా॥

తా॥ షష్ఠాధిపతి ధనభావమందుండగ బుట్టినవాడు సాహసవంతుడు, కులశ్రేష్ఠుడు, పరదేశవాసము చేయువాడు, సుఖవంతుడు, వక్త, స్వకార్యనిరతుడు అగును.

వి॥ శత్రుపతౌ ద్రవిణస్థే దుష్టశ్చతురో హి సంగ్రహేఽనిష్టః।
స్థానప్రవరో విదితః క్రూరే సవ్యాధి తనుర్గతవిత్తః॥ వృ. య. జా॥

శత్రుస్థానాధిపతి ధనస్థానమందున్నచో దుష్టుడు, చతురుడు, వస్తుసంగ్రహము చేయుటలో నిష్టములేనివాడు, స్వస్థానమందు శ్రేష్ఠుడు, తెలియబడువాడు అగును. శత్రుస్థానాధిపతి పాపగ్రహమైనచో వ్యాధిపీడిత శరీరముగలవాడు, ధనము లేనివాడు అగును.

"హోరారత్న" మందు "సంగ్రహేఽనిష్టః" అను చోట "సంగ్రహపరోపదిష్టః" యని పాఠభేదముగలదు. దీనికి సంగ్రహపరుడని, ఇతరులకు ఉపదేశమును చేయువాడు యని గ్రహించవలయును.

శ్లో॥ షష్ఠేశే సహజే జాతః క్రోధీ విక్రమ వర్జితః॥
భ్రాతా శత్రుసమస్తస్య భృత్యశ్చోత్తర దాయకః॥ 23

తా॥ షష్ఠాధిపతి తృతీయములోనున్న జాతకుడు, క్రోధస్వభావముగలవాడు, పరాక్రమము లేనివాడు. సోదరులు శత్రువులుగ గలవాడు, ఎదురు చెప్పెడి సేవకులు గలవాడగును "భృత్యశ్చోత్తర దాయకః అనుదానికి "దాసస్తస్యోత్తరప్రదః" అని పాఠాంతరము గలదు.

వి॥ షష్ఠపతిః సహజస్థః క్రూరః కురుతే సలోక కష్టకరమ్।
జనకస్య తథా కష్టమరణం సంగ్రామతస్తస్య॥ వృ. య. జా॥

తృతీయమందు పాపుడైన షష్ఠాధిపతి యున్నచో ప్రజలకు కష్టములను కలిగించువాడు, జాతకుని తండ్రి యుద్ధాదిహేతువులచే కష్టముగ మరణించువాడు అగును.

పై దానినిబట్టి మిథున లగ్నజులకు కుజుడు (పాపుడైన షష్ఠాధిపతి) తృతీయ భావమందున్నప్పుడు, సింహ లగ్నజాతకులకు శని తృతీయమందున్నప్పుడు, కన్యా లగ్నజులకు తృతీయమందు శనియున్న

ప్పుడు, వృశ్చిక లగ్నజాతులకు కుజుడు మకరములో తృతీయభావమందు నున్నప్పుడు మీన లగ్నజాతకులకు రవి తృతీయమందున్నప్పుడు, పితృ స్థానమునకు సప్తమమందు పాపులుండుటచేత తండ్రికి కష్టముతోకూడిన మరణము గలుగునని చెప్పియుండెను. కుజ శనులు పాపులగుటచే యుద్ధాది హేతువులకు వీరు కారకులగుటచేత "సంగ్రామ" శబ్దము ప్రయోగింపబడినది.

శ్లో॥ షష్ఠేశే తుర్య భావస్థే జాతో మాతృసుఖోజ్ఝితః।
మనస్వీ పిశునోద్వేషీ చలచిత్తోఽతి విత్తవాన్॥ ఉ॥
"చలచిత్తోఽపి విత్తవాన్" అని పాఠాంతరముగలదు.

తా॥ చతుర్థమందు షష్ఠాధిపతియున్న జాతకుడు మాతృసుఖము లేనివాడు, మనస్వి, పిసునుడు, ద్వేషముగలవాడు, చలచిత్తుడు, విశేష ధనవంతుడు అగును.

వి॥ షష్ఠాధిపతి స్తుర్యే పితృ తనయౌ వైరిణౌ మిథః కురుతే।
సరుక్పితా నోఽపత్యయుతో లక్ష్మీం లభతే నరః సుచిరమ్॥ వృ. య. జా.

చతుర్థమందు షష్ఠాధిపతియున్న జాతకుడు, తండ్రితో కలహించువాడు, రోగవంతుడైన తండ్రిగలవాడు, సంతతిలేనివాడు, చిరకాలము నిలువచేయబడిన ధనముగలవాడగును.

శ్లో॥ షష్ఠేశః సుతగోయస్య చలం తస్య ధనాదికమ్।
శత్రుతా పుత్రమిత్రైశ్చ సుఖీ స్వార్థీ ధనాన్వితః॥ ఉ॥

తా॥ షష్ఠాధిపతి పంచమమందున్న జాతకుడు చంచలమైన ధనమిత్రాదులుగలవాడు, పుత్రులతోను మిత్రులతోను శత్రుత్వముగలవాడు, సుఖవంతుడు, స్వార్థముగలవాడు, ధనముగలవాడు అగును.

గ్రంథాంతరమందు "ధనాన్వితః" అనుటకు "దయాళుః" అను పదమును చెప్పియుండెను.

వి॥ రిపుభవనేశే సుతగే పితృ సుతయోర్వైరతా మృతిస్తు తతః॥
క్రూరే శుభేచ నిర్ధనపదపి దుష్టశ్చ తజ్జాతః॥ వృ. య. జా॥

క్రూరుడైన షష్ఠాధిపతి పంచమమందున్నప్పుడు తండ్రికి జాతకునకు శత్రుత్వముగలుగును, కుమారునివలన మృతిచెందువాడు, శుభుడైనచో ధనములేని స్థితియందుండువాడు, దుష్టుడు, అగును.

శ్లో॥ షష్ఠేశే రిపుభావస్థే వైరం స్వజ్ఞాతి మండలాత్।
అన్యైస్సహ భవేన్మైత్రీ సుఖం మధ్యం ధనాదికమ్॥ ౬౬

తా॥ షష్ఠాధిపతి షష్ఠభావమందున్నప్పుడు స్వజ్ఞాతి వైరము గలుగును. ఇతరులతో మిత్రత్వ మేర్పడును. మధ్యమమైన సుఖము, ధనము కలుగును.

వి॥ రిపుభవనేశే రిపుగే నీరుగ్వైరీ సుఖీ కృపణ రూపః।
నహి జన్మతోఽపిసీదతి స్థానక వాసీ భవతి మనుజః॥ వృ. య. జా.

షష్ఠాధిపతి షష్ఠమందుండగ బుట్టినవాడు రోగములులేనివాడు, వైరముగలవాడు, సుఖవంతుడు, లోభి, జన్మాది దుఃఖములెరుగనివాడు, స్వస్థలమందు నివాసముగలవాడు అగును.

శ్లో॥ షష్ఠేశే దార భావస్థే జాతో దార సుఖోజ్ఝితః।
కీర్తిమాన్ గుణవాన్ మానీ సాహసీ ధన సంయుతః॥ ౬౭

తా॥ షష్ఠాధిపతి సప్తమమందుండెనేని కళత్రసుఖము లేనివాడు, కీర్తి, సద్గుణములు, అభిమానము, సాహసము, ధనముగలవాడగును.

వి॥ అహితపతౌ సప్తమగే నార్యో భార్యా విరోధినీ చండః।
తాపకారీత్వథ సౌమ్యే వంధ్యా వాగర్భ గలనపరా॥ వృ. య. జా॥

షష్ఠాధిపతి పాపగ్రహమై సప్తమమందుండెనేని భార్యతో విరోధము గలుగును. జాతకుడు ఉగ్రస్వభావముగలవాడు, సంతాపమును కలిగించువాడు, అగును. శుభుడైన షష్ఠాధిపతి యుండెనేని భార్య గొడ్రాలు లేక గర్భస్రావదోషము గలదియగును.

శ్లో॥ షష్ఠేశేష్టమగే జాతో రోగీ శత్రుర్మనీషిణామ్।
పరద్రవ్యాభిలాషీచ పరదారరతోఽశుచిః॥ ౬౮

తా॥ షష్ఠాధిపతి అష్టమమందుండెనేని రోగవంతుడు, బుద్ధిమంతులతో శత్రుత్వముగలవాడు, పరస్త్రీ ధనములను అభిలషించు

వాడు, ఆచారహీనుడు అగును.

వి॥ శనేర్గ్రహాణి కారుణో శశధరాద్వాననందనాత్।
యుధాచ్చ విషదోషత స్పవది మృత్యుభీకోరితే।
రవేర్భృగు పతేర్నృప పాచ్చ భవతి రిష్టపాదష్టమాత్।
గురోర్నృపతితః స్వమాన ధనదోషవాన్ శుక్రితః॥ వృ. య. జా॥

షష్ఠాధిపతి శనియై అష్టమమందున్నచో గ్రహాణి రోగమువలన, చంద్ర, కుజ, బుధులలో నెవరైననున్నచో విషమువలనగాని, యుద్ధమువలనగాని మృత్యుభయముగలవాడు, రవి శుక్రులలో నెవరైన షష్ఠాధిపతియై అష్టమమందుండెనేని రాజులవలన, గురుడైనచో ప్రభువులవలన, శుక్రుడైనచో గౌరవమునకు ధనమునకు, హానిని పొందు వాడు అగును.

(రవేర్మృగ పతేర్భయం" అనియు, "నయన దోషవాన్ శుక్రతః" అనియు పాఠభేదముగలదు. అనగా సూర్యుడైనచో మృగముల వలన, శుక్రుడైనచో నేత్ర దోషమువలన దుఃఖమును పొందునని భావము)

శ్లో॥ షష్ఠేశే భాగ్యగే జాతో కాష్ఠ పాషాణ విక్రయీ।
వ్యవహారే క్వచిద్ధానిః క్వచిద్వృద్ధిశ్చ జాయతే॥ ౬౯

తా॥ షష్ఠాధిపతి భాగ్యమందుండెనేని కాష్ఠములు, పాషాణములు మొదలగు ద్రవ్యములను విక్రయించువాడు, వ్యవహారమందు ఒకప్పుడు లాభముగలవాడు అగును.

వి॥ శత్రుపతిర్యదిన వమః పాపైః ఖచరస్తదా భవేత్ ఖంజః।
బంధు విరోధీ శాస్త్రం నమన్యతే యాచకః పురుషః॥ వృ. య. జా॥

నవమభావమందు పాపుడైన షష్ఠాధిపతియున్నచో జాతకుడు కుంటివాడగును. బంధు విరోధి, శాస్త్రములను గౌరవించలేనివాడు. యాచకుడు అగును,

శ్లో॥ షష్ఠేశే దశమేభావే మానవః కుల విశ్రుతః।
అభక్తశ్చ పితుర్వక్తా విదేశే చ సుఖీ భవేత్॥ ౭౦

తా॥ షష్ఠాధిపతి దశమమందున్న జాతకుడు కులశ్రేష్ఠుడు,

పితృభక్తిలేనివాడు, వక్త, విదేశమునందు సుఖమును పొందువాడు అగును

వ॥ అరిగృహపే దశమస్థే క్రూరేమాతరి రిపుస్తథాదుష్టః।
ధర్మసుతపాలకమతి ర్మాతుర్ద్వేషైశ్చవైర్యేరీ॥ వృ. య. జా.

పాపుడైన షష్ఠాధిపతి దశమమందున్న జాతకుడు తల్లియందు విరోధభావము గలవాడు, దుష్టుడు. ధర్మమును సంతానమును రక్షించుకొనువాడు, మాతృదోషముచేత తల్లియందు విరోధము గలవాడగునని భావము.

పరాశరుని యభిప్రాయము ప్రకారము పితృభక్తిలేనివాడనియు యవనమతములో మాతృద్వేషము గలవాడనియు ఫలభేదము గుర్తించదగినది.

శ్లో॥ షష్ఠేశేలాభభవనే ధనాప్తి రిపుతోభవేత్ ।
ధనవాన్ గుణవాన్ మానీసాహసీసుతవర్జితః ॥ ౩౧
"పుత్రసుఖోజ్ఝితః పాఠాంతరము.

తా॥ షష్ఠాధిపతి లాభమందుండనేని శత్రువులవలన ధనలాభమును పొందును. జాతకుడు గుణవంతుడు, ధనవంతుడు, అభిమానవంతుడు, సాహసవంతుడు, సంతానములేనివాడు అగును. (సంతానసుఖము లేనివాడగునని పాఠాంతరము)

వ॥ వైరిపతౌలాభగతేక్రూరే మరణం విపక్షతోభవతి।
తస్కరకృతహానిస్స్యాత్ చతుష్పదాల్లాభవాన్ మనుజః॥
వృ. య. జా.

శత్రుస్థానాధిపతి పాపగ్రహమై లాభరాశియందుండనేని శత్రువులవలన మరణముగలుగును. దొంగలవలన భయము హానికలుగును. చతుష్పదజంతువులవలన లాభముగలుగును.

(పరాశరమతమందు శత్రువులవలన ధనలాభము అనియు, యవనమతములో శత్రువులవలన మరణముగలుగునని చెప్పబడినది.)

శ్లో॥ షష్ఠేశే వ్యయభావస్థే వ్య[illegible]త్సదా।
విద్వద్వేషీభవేజ్జీ [illegible]త్పరః॥ ౩౨

తా॥ షష్ఠాధిపతి వ్యయభావగతుడైనచో నా జాతకుడు వ్యసనములవలన ధనవ్యయము చేయువాడు, విద్వాంసులను ద్వేషించువాడు, జీవహింస చేయుటయందు ప్రీతిగలవాడు అగును.

వి॥ షష్ఠపతౌ ద్వాదశగే చతుష్పద ద్రవ్యధాన్యనాశకరః।
గమనాగమనం లక్ష్మీ స్ఫ్లోదపరో వా నరో భవతి॥వృ.య.జా.

ద్వాదశమందు షష్ఠాధిపతియున్న జాతకుడు, చతుష్పద జంతువులను, ధనమును, ధాన్యమును పోగొట్టుకొనును. ధనము చంచలముగ నుండును కాని సంతోషములో జీవించును. ఈ అధ్యాయమందు పరాశరమతమునకు, వృద్ధయవన మతమునకుగల ఫలభేదము వివరింపబడినది. కొన్ని జాతకములందు పరాశరునిచే చెప్పబడిన ఫలములు అనుభవమునకు సరిపడుచున్నవి. కొన్ని జాతకములందు యవనునిచే చెప్పబడిన ఫలములు అనుభవమునకు సరిపడుచున్నవి.

ఇతి షష్ఠేశ ఫలమ్॥

## జాయేశ ఫలము

శ్లో॥ దారేశేలగ్నగే జాతః పరదారేషులంపటః।
దుష్టో విచక్షణో ఒధీరో జనో వాతరుజాన్వితః॥ ౧౩
(దుష్టోధీరో ఒతిచతురః అని పాఠాంతరము)

తా॥ సప్తమాధిపతి లగ్నమందుండగ పుట్టినవాడు పరభార్యాసక్తిగలవాడు, దుష్టుడు, విచక్షణుడు. అధైర్యముగలవాడు, వాతరోగ పీడితుడు అగును.

(ధైర్యము గలవాడని పాఠాంతరము)

వి॥ దయితేశే లగ్నగతే, శోకం విస్నేహమసత్కృతము భార్యమ్।
భోగభుజం రూపయుతం జనయతిదయితా లలితచిత్తంచ॥
వృ. య. జా.

సప్తమాధిపతి లగ్నమందుండగ జన్మించినవాడు శోకముగలవాడు, స్నేహితులు లేనివాడు, ఇతరుల కార్యములతో సంబంధము

గలవాడు, భోగవంతుడు, రూపవంతుడు, స్త్రీలచే హరింపబడిన చిత్తముగలవాడు అగును.

శ్లో॥ దారేశేధనగేజాతో బహుస్త్రీభిః సమన్వితః॥
దారయోగాద్ధనాప్తిశ్చ దీర్ఘసూత్రీచమానవః॥ ౭౪

తా. సప్తమాధిపతి ధనభావమందుండగ జన్మించిన జాతకుడు అనేకమంది స్త్రీలను కూడువాడు, భార్యవలన ధనలాభము గలవాడు దీర్ఘసూత్రియగును.

వి॥ జాయాపతౌధనస్థేసుస్టాదయితా సుశీలాక్షితాఖవతి।
చిత్తంచ కళత్రకరం సతతం దయితా విసంగంచ॥ వృ.య.జా.
("విత్తంచకళత్రకరం" అని పాఠాంతరము)

సప్తమాధిపతి ధనస్థానగతుడైన జాతకుని భార్య దుష్టురాలు, సంతానము లేనిది (సంతానమును విడిచిపెట్టునది) యగును. జాతకుడు భార్యవలన ధనమును పొందువాడు లేక ఎక్కువ మక్కువగలవాడు భార్యతో సాంగత్యము లేనివాడు అగును.

శ్లో॥ దారేశేసహజేజాతో మృతాపత్యోహిమానవః॥
కదాచిజ్జాయతేపుత్రీ యత్నాత్పుత్రోపిజీవతి॥ ౭౫

తా॥ సప్తమాధిపతి తృతీయభావ మందుండగ పుట్టినవాడు మృతసంతానము గలవాడగును. ఒకప్పుడు ఒక పుత్రికగాని, ఒక పుత్రుడుగాని యత్నము వలన జీవించును.

వి॥ సప్తేశే సహజగతే చాత్మబలో బంధువత్సలోదుఃఖి।
దేవరరతా సురూపాగృహిణీ క్రూరేతుతద్గృహగా॥
వృ. య. జా.

సప్తమాధిపతి తృతీయభావమందుగల జాతకుడు ఆత్మబలము గలవాడు, బంధుప్రీతిగలవాడు, దుఃఖితుడు అగును. పాపగ్రహమైన సప్తమాధిపతి తృతీయమందుండెనేని మరది గృహమందు నివసించునదియు రూపవతి, మరదియందు ఆసక్తి గలదియు అగును.

శ్లో॥ దారేశేసుఖభావస్థే జాయా నాస్యవశే సదా।
వ్యయంసత్యప్రియోధీమాన్ ధర్మాత్మాదంతరోగయుక్॥
(జాయానైవపతివ్రతా॥) అని పాఠాంతరము.

తా॥ చతుర్థభావమందు సప్తమాధి పతి యున్నచో సట్టిజాతకుని భార్య జాతకునివశములో నుండదు, (భార్యపతివ్రతగాదని కొందరభిప్రాయము) జాతకుడు సత్యప్రియుడు. ధీమంతుడు ధర్మాత్ము దంతరోగముగలవాడు అగును.

వి॥ జాయేశేతుర్యస్థేలోలః పితృవైరసాధకఃస్నేహీ।
అస్యపితాదుర్భాగ్యస్తద్భార్యాం పాలయేచ్చపితా।
వృ. య. జా.

సప్తమాధిపతి చతుర్థభావమందుండగ బుట్టినవాడు, లోలుడు పితృవైరము గలవాడు, స్నేహపాత్రుడు అగును. జాతకుని తండ్రి దుర్భాగ్యుడు, జాతకుని భార్యను పోషించువాడు అగును.

శ్లో॥ దారేశేపంచమే జాతోమానీ సర్వగుణాన్వితః॥
సర్వదాహర్షయుక్తశ్చతధా సర్వధనాధిపః॥ ౭౭

తా॥ సప్తమాధిపతి పంచమమందుండగ పుట్టినవాడు అభిమానవంతుడు, సర్వసద్గుణములు గలవాడు. ఎల్లప్పుడు సంతోషముగలవాడు, సమస్తసంపదలు గలవాడు అగును.

వి॥ సప్తమపతౌసుతస్థే సౌభాగ్యయుతః సుతాన్వితఃపురుషః
ప్రియయాసహాదుష్టమతి స్తత్తనయః పాలయేద్దయితామ్॥
వృ. య, జా.

పంచమభావమందు సప్తమాధిపతిగల జాతకుడు భాగ్యవంతుడు, పుత్రులుగలవాడు అగును. భార్యయందు అభిమానములేనివాడు, జాతకునిభార్య కుమారులచే పోషింపబడునదియు అగును.

శ్లో॥ దారేశేరిపుభావస్థేభార్యాతస్యరుజాన్వితా॥
ప్రియాతపాఽథవావైరంవ్యయం క్రోధసుఖోజ్జితః॥ ౭౮

తా॥ సప్తమాధిపతి షష్ఠభావమందుండనేని అతని భార్య రోగముతో కూడినదగును. జాతకుడు భార్యతో విరోధముగలవాడు, క్రోధస్వభావముగలవాడు, సుఖము లేనివాడు అగును.

వి॥ రిపుగృహగః కాంతేశః ప్రియయా సహ వైరిణం సరుగ్భార్యామ్।
వనితాసంగక్షయినం క్రూరః క్రియతే చ మృత్యుపదమ్॥
వృ. య. జా.

షష్ఠభావమందు సప్తమాధిపతియున్న జాతకుడు భార్యతో వైరము గలవాడు, భార్య రోగములచే బాధపడునదియు అగును. పాపుడైన సప్తమాధిపతి షష్ఠమందుండనేని స్త్రీ సౌఖ్యము లేనివాడై మృతిచెందును.

శ్లో॥ దారేశే సప్తమే భావే జాతో దార సుఖాన్వితః।
ధీరో విచక్షణో ధీమాన్ కేవలం వాతరోగవాన్॥ ౭౯

తా॥ సప్తమాధిపతి సప్తమ భావమందుండగ బుట్టినవాడు భార్యా సుఖముగలవాడు, ధీరుడు, విచక్షణుడు, ధీమంతుడు, వాతరోగము గలవాడు అగును.

వి॥ సప్తమగే సప్తమపే పరమాయుః ప్రీతివత్సలః పురుషః।
నిర్మలశీలసమేతస్తేజస్వీ జాయతే సతతమ్॥ వృ. య. జా.

సప్తమమందు సప్తమాధిపతి యుండగ బుట్టిన జాతకుడు దీర్ఘాయుష్మంతుడు, ప్రీతిగలవాడు, పవిత్రమైన శీలము గలవాడు, తేజస్వియు అగును.

శ్లో॥ దారేశే మృత్యుభావస్థే జాతో దారసుఖోజ్ఝితః।
భార్యాఽపి రోగయుక్తాస్య దుశ్శీలాపినవామనా॥ ౮౦

తా॥ సప్తమాధిపతి అష్టమ భావమందుండగ జన్మించినవాడు భార్యాసుఖహీనుడు, అగును. భార్యరోగములు కలది, దుశ్శీలము గలది, భర్తను వ్యతిరేకించునది యగును.

వి॥ కాంతేశే నిధనగతే గణికాసురతః కరగ్రహణరహితః।
దేవద్విజాతిసక్తో న స్త్రీసేవాకరః పురుషః॥ వృ. య. జా.

అష్టమమందు సప్తమాధిపతి యున్న జాతకుడు వేశ్యాలోలుడు వివాహము లేనివాడు దేవ బ్రాహ్మణ భక్తి గలవాడు స్త్రీని పోషించనివాడు అగును.

శ్లో॥ దారేశే ధర్మభావస్థే నానాస్త్రీభిస్సమాగమః।
జాయాహృతమనా జాతో బహ్వారంభకరో నరః॥ ౮౧

తా॥ సప్తమాధిపతి నవమమందున్న జాతకుడు బహుస్త్రీ సంగతుడు, భార్యయందు ప్రీతిగలవాడు, ఘనమైన కార్యములను చేయువాడు అగును.

వి॥ సుకృతగతే సప్తమపే తేజోవాన్ శీలవాన్ ప్రియోపేతః।
క్రూరేతు మందరూపో లగ్నేశనిరీక్షితే తపః ప్రబలః॥

వృ. య. జా.

నవమభావమందు సప్తమ భావాధిపతి యున్నచో తేజోవంతుడు, శీలవంతుడు, ప్రీతిగలవాడు అగును. క్రూరగ్రహమైనచో నపుంసకుడు అగును. లగ్నాధిపతిచే చూడబడెనేని తపశ్శాలి అగును.

శ్లో॥ దారేశే కర్మభావస్థే నాస్య భార్యా వశానుగా।
స్వయం ధర్మరతో జాతో ధనపుత్రాదిసంయుతః॥ ౮౨

తా॥ సప్తమాధిపతి దశమభావమందుగల జాతకుని భార్య జాతకునకు వశ్యురాలుగ నుండదు. జాతకుడు ధర్మనిరతుడు, ధనపుత్రాదులు గలవాడు అగును.

వి॥ సప్తమపే దశమస్థే నృపద్రోహీ లంపటః కువాక్ కూటః।
క్రూరే దుఃఖార్తస్స్యాత్ శ్వశ్రూవశగో భవేత్పురుషః।

వృ. య. జా.

సప్తమాధిపతి దశమమందున్న జాతకుడు రాజద్రోహము చేయువాడు, లంపటుడు, కుత్సిత వాక్కు గలవాడు, అబద్ధము చెప్పువాడు, అగును. క్రూరగ్రహమైయున్నచో దుఃఖార్తుడు, భార్యాతల్లికి వశ్యుడుగనుండువాడు అగును.

శ్లో॥ దారేశేలాభభావస్థే దారైరర్థ వమాగమః ।
పుత్రాది సుఖమల్పంచజనః కన్యాప్రజోభవేత్ ॥ ౭౩

తా॥ కళత్రాధిపతి లాభభావమందున్నచో భార్యవలన ధనము లభించును. మరియు పుత్రాది సుఖము తక్కువగనుండును. స్త్రీసంతాన మధికముగ నుండును.

వి॥ లాభస్థేజాయేశే భర్తారూపాన్వితా సుశీలాచ।
దయితా పరిణీతా స్యాన్మ్రియతే సాచప్రసవసమయే ॥
వృ. య. జా.

లాభభావమందు కళత్రాధిపతి యున్నచో నాజాతకుని భార్య భర్తురాలు రూపవతి, శీలవతి, ప్రసవ సమయమందు మరణించునది యగును.

శ్లో॥ దారేశేవ్యయగే జాతోదరిద్రః కృపణోఽపివా।
భార్యాపివ్యయశీలాస్య వస్త్రాజీవీనరోభవేత్ ॥ ౭౪

తా॥ వ్యయభావమందు సప్తమాధిపతిగల జాతకుడు దరిద్రుడుగాని, కృపణుడుగానియగును. జాతకుని భార్య వ్యయ స్వభావము గలదియు, జాతకుడు వస్త్రములతో జీవించువాడు అగును.

వి॥ సప్తమపే ద్వాదశగే గృహబంధా నాస్తికాథ వేద్భార్యా।
సాలోలాదుష్టగుణాగ్లపితా తస్యపురుషస్య। వృ. య. జా.

సప్తమాధిపతి వ్యయమందున్న జాతకునిభార్య గృహమందు బంధింపబడునది, నాస్తికురాలు, చంచల స్వభావముగలది, దుష్టగుణములుగలది, రోగవంతురాలు, యగును.

ఇతిజాయేశ ఫలమ్

## అష్టమేశ ఫలము

శ్లో॥ అష్టమేశతనౌ జాతస్తనుసౌఖ్య వివర్జితః ॥
దేవానాం బ్రాహ్మణానాంచ నిందకోవ్రణసంయుతః ॥ ౭౫

తా॥ లగ్నమం దష్టమాధిపతి యుండగ బుట్టినవాడు దేహసౌ

ఖ్యము లేనివాడు, దేవ బ్రాహ్మణులను నిందించువాడు, వ్రణములు కలవాడు అగును.

వ॥ అష్టమేశే లగ్నగతే బహువిఘ్నో దీర్ఘరోగభాక్ పుమాన్ ।
నేష్టానువాదనిరతో లక్ష్మీంలభతే నృపతేశ్చవా ।

వృ. య. జా.

అష్టమాధిపతి లగ్నమందుండగ బుట్టినవాడు అనేక విఘ్నములు కలవాడు, దీర్ఘరోగి, అనిష్టములైన అనువాదములందాసక్తి కలవాడు ప్రభు వాక్యము వలన ధనమును పొందువాడు అగును.

("నేష్టానువాద నిరతు"డనగా అశ్లీలమైన గ్రంథములందిష్టముకలవాడని భావము)

శ్లో॥ అష్టమేశే ధనే బాహుబలహీనః ప్రజాయతే ।
ధనంతస్య భవేత్స్వల్పం నష్టంచిత్తం న లభ్యతే॥ ౮౬

తా॥ ధనస్థానమందష్టమాధిపతి గల జాతకుడు బాహుబలము లేనివాడు, స్వల్పధనము గలవాడు. నష్టమైన ధనమును తిరిగి సంపాదించలేనివాడు అగును.

వ॥ నిధనపతౌ ధనలీనే౽ల్పజీవితో వైరవాన్నరశ్చోరః ।
క్రూరేసౌమ్యే చ శుభం కింతుక్షితిపాలతో మరణమ్ ॥

వృ. య. జా.

పాపిమైన అష్టమాధిపతి ధనభావమందున్న జాతకుడు అల్పజీవితము గలవాడు. ఇతరులతో వైరము గలవాడు, చోరుడు అగును. శుభుడున్నచో శుభము గలుగును. కాని ప్రభు దండనమువలన మరణమునొందును.

శ్లో॥ రంధ్రేశే సహజే భావే భ్రాతృసౌఖ్యం న జాయతే ।
సాలస్యో భృత్యహీనశ్చ జాయతే బలవర్జితః ॥ ౮౭

తా॥ అష్టమాధిపతి తృతీయభావమందున్న జాతకుడు సోదర సుఖము లేనివాడు, అలసుడు, భృత్యహీనుడు, బలము లేనివాడగును.

వి॥ అష్టమపతౌ తృతీయే బంధువిరోధీసుహృద్విరోధీచ।
వ్యంగోదుర్వాగ్లోలః సోదరరహితో భవేన్మనుజః ॥
వృ. య. జా.

తృతీయమందష్టమాధిపతి యుండగ బుట్టినవాడు బంధుమిత్ర విరోధి, అంగవైకల్యము గలవాడు. దుష్టవచనములాడువాడు, లోలుడు, సోదరులు లేనివాడు అగును.

శ్లో॥ రంధ్రేశే సుఖభావస్థే మాతృహీనోభవేచ్ఛిశుః॥
గృహభూమి సుఖైర్హీనో మిత్రద్రోహీన సంశయః॥ ౭౮

తా॥ అష్టమాధిపతి చతుర్థ భావమందున్న జాతకుడు మాతృహీనుడు, గృహాభూమ్యాది సుఖములేనివాడు, మిత్రద్రోహి యగును.

వి॥ నిధనేశే తుర్యగతే పితరిరిపుః రిపుగతాం లభేల్లక్ష్మీమ్।
పితృపుత్రయోశ్చయుద్ధం పితాచరోగాన్వితో భవతి॥
వృ. య. జా.

చతుర్థభావమందష్టమాధిపతి నిలచియుండగ బుట్టిన జాతకుడు తండ్రితో వైరముగలవాడు, శత్రువులవలన ధనమును పొందువాడు, తండ్రితో కలహమాడువాడు, తండ్రి రోగాన్వితుడు అగును.

శ్లో॥ రంధ్రేశే సుతభావస్థే జడబుద్ధిః ప్రజాయతే।
స్వల్పప్రజోభవేజ్జాతో దీర్ఘాయుశ్చధనాన్వితః॥ ౭౯

తా. అష్టమాధిపతి పంచమమందున్న జాతకుడు మందబుద్ధి గలవాడు, తక్కువసంతానముగలవాడు, దీర్ఘాయుష్మంతుడు. ధనముతో కూడిన వాడు అగును.

వి॥ ఛిద్రపతౌ తనయస్థే క్రూరే సుతవిరహితః శుభే సుసుతః।
జాతోపినైవ జీవతి జీవత్యే భకితవ కర్మరతః॥ వృ. య. జా.

పాపుడైన అష్టమాధిపతి పంచమమందుండగ జన్మించినవాడు సుతహీనుడు, శుభుడున్నచో యోగ్యులైన సంతానముగలవాడు, అగును. ఒకప్పుడు ఆయుర్దాయము లేనివాడు, బ్రతికి యుండినచో

కితవకర్మలాచరించువాడు అగును.

"కితవ' అనగా జూదరి లేక మోసగాడు అని అర్థము.

శ్లో॥ రంధ్రేశే రిపుభావస్థే శత్రుజేతాభవేన్నరః।
రోగయుక్త శరీశ్చ బాల్యే సర్పజలాద్భయమ్॥ ౬౦

తా॥ శత్రుభావమందు అష్టమాధిపతి యున్నవాడు శత్రువులను జయించువాడు, రోగయుక్తుడు, బాల్యమందుసర్పములచేగ నిజముచే గాని ప్రమాదము గలవాడు అగును.

వి॥ ఛిద్రే శేరిపు సంగతే దినకరే భూభృద్విరోధీసుతా।
తుంగేసీదతి దృష్టిరోగకలితః శుక్రోసగో భృశమ్।
భౌమేవక్షసి సంహతో ఽహిభయ భృత్యుం దార్తి ఘాతశ్చనా।
సామ్యేవ్యాధి భయం శశౌచమరణం సౌమ్యేక్షితే నైవకిమ్॥
వృ. య. జా.

సూర్యుడష్టమాధిపతియై షష్ఠమందున్న సమయమున బుట్టినవాడు ప్రభువిరోధి, షష్ఠమందు గురుడు ఉచ్చలో నుండెనేని దుఃఖములను పొందును. శుక్రుడున్నయెడల నేత్రరోగముచే ప్రబల దుఃఖమును పొందువాడు, కుజుడున్నయెడల వక్షస్థలమందు గాయములు గలుగును. శనియున్నయెడల సర్పభయము, గలవాడు, పెద్దకడుపు గలిగిపీడింప బడువాడు అగును. బుధుడున్నచో వ్యాధిపీడితుడగును. చంద్రుడున్నచో మరణము గలుగును. వీనికి శుభగ్రహ దృష్టి సంబంధము లున్నచో శుభము గలుగును.

"హోరారత్నమందు" బలభద్రుడుదహరించిన శ్లోకములో పాఠాంతరమిట్లున్నది.

'భౌమేర్యాసహితో బుధేఽహిభయకృత్తుందార్తి ఘాతశ్చనా।
కష్టంరాహు విధౌహి శత్రుశశభృత్సౌమ్యేక్షితే నైవకిమ్॥"
దీనిభావము.

కుజుడు అష్టమాధిపతియై షష్ఠమందున్నచో ఈర్ష్య గలవాడు బుధుడున్నచో సర్పభయము గలవాడు అగును. చంద్రరాహువు

లున్నచో గొప్ప కష్టము గలుగును. చంద్రుడు శుభగ్రహదృష్టి కల వాడైనచో శుభము కలుగును.

శ్లో॥ రంధ్రేశే దారభావస్థే తస్య భార్యాద్వయం భవేత్।
వ్యాపారేచ భవేద్ధానిస్తస్మిన్ పాపయుతే ధ్రువమ్॥ ౫౦

తా॥ అష్టమాధిపతి సప్తమమందున్న జాతకునకు ఇద్దరు భార్య లుండురు. అష్టమాధిపతి పాపుడైనచో వ్యాపారమందు నష్టము కలుగును. (వ్యాపారశబ్దమునకు జీవనోపాయమని గ్రహించుటయుక్తము).

శ్లో॥ మృత్యుపతౌ సప్తమగే గుహ్యరుక్ కుస్త్రీ వల్లభో దుష్టః।
క్రూరే భార్యాద్వేషీ కళత్రదోషాన్మృతిం లభతే॥
వృ. య. జా.

సప్తమమందు అష్టమాధిపతియున్నచో గుహ్యరోగియు, దుష్టస్త్రీ భర్తయు, దుష్టుడు అగును. పాపుడైన అష్టమాధిపతి యున్నచో కళత్రమును ద్వేషించువాడు, కళత్రదోషమువలన మరణించువాడు అగును.

శ్లో॥ రంధ్రేశే మృత్యుభావస్థే జాతో దీర్ఘాయుషాయుతః।
నిర్బలే మధ్యమాయుస్స్యాచ్చోరో నింద్యోఽన్యనిందకః॥ ౫౧
"రుగ్ఽందః" అని పాఠాంతరము గలదు.

తా॥ అష్టమాధిపతి బలవంతుడై అష్టమమందున్న యెడల దీర్ఘాయువుగలవాడగును. అష్టమాధిపతి బలహీనుడైనచో మధ్యమాయువు గలవాడు, చోరుడు నింద్యుడు. ఇతరులను నిందించువాడు అగును.

శ్లో॥ నిధనపతౌ నిధనగతే వ్యవసాయీ వ్యాధివర్జితో నీరుక్।
కితవ కలాకలితవపుః కితవకులేజాయతే విదితః॥ వృ. య. జా.

అష్టమాధిపతి అష్టమమందుండగ జన్మించినవాడు కృషిచేయువాడు, వ్యాధులు లేనివాడు, మంచి ఆరోగ్యము కలవాడు. జూదవిద్యయందు నేర్పరియు, జూదరుల కుటుంబమందు జన్మించువాడును ప్రసిద్ధుడు అగును.

శ్లో॥ అష్టమేశే తపఃస్థానే ధర్మద్రోహీచ నాస్తికః।
దుష్ట భార్యాపతిశ్చైవ పరద్రవ్యాపహారకః॥ ౯౩

తా॥ అష్టమాధిపతి భాగ్య భావమందున్న జాతకుడు ధర్మమునకు ద్రోహము చేయువాడు, నాస్తికుడు, దుష్టురాలైన భార్యగలవాడు, పరద్రవ్యమును హరించువాడగును.

వి॥ మృతినాథే నవమస్థే నిస్సంగీ జీవఘాతకః పాపీ।
నిర్బంధుర్నిస్స్నేహీ పూజావిముఖో ముఖవ్యంగః॥ వృ.య.జా

అష్టమాధిపతి నవమమందున్న జాతకుడు నిస్సంగుడు, జీవఘాతుకుడు, పాపి, బంధువులు, స్నేహితులు లేనివాడు, పూజావిముఖుడు, ముఖ వికారము గలవాడు అగును.

శ్లో॥ రంధ్రేశే కర్మభావస్థే పితృసౌఖ్య వివర్జితః।
పిశునః కర్మహీనశ్చయదినైవ శుభేక్షితే॥ ౯౪

తా॥ అష్టమాధిపతి దశమమందున్న జాతకుడు పితృసుఖము లేనివాడు, పిశునుడు, కర్మహీనుడు, యగును. శుభవీక్షితుడైనచో యీ దోషము లుండవు.

వి॥ కర్మగతే నిధనేశే నృపకర్మానీచకర్మనిరతశ్చ।
అలసః క్రూరేఽన్యభవస్తన యోవా జీవతిన మాతా॥ వృ.య.జా.

అష్టమాధిపతి దశమమందుగల జాతకుడు రాజోద్యోగము చేయువాడు, నీచకర్మలయందు అనురక్తిగలవాడు, అలసుడు అగును. పాపుడైనచో ఇతరులవలన జన్మించినవాడు లేక తల్లి లేనివాడు అగును.

శ్లో॥ రంధ్రేశే లాభభావస్థే సపాపే ధనవర్జితః।
బాల్యేదుఃఖీ సుఖీపశ్చాద్దీర్ఘాయుశ్చ శుభాన్వితే॥ ౯౫

తా॥ అష్టమాధిపతి లాభస్థానమందు పాపులతో కూడియున్నచో జాతకుడు ధనహీనుడు. బాల్యమందు దుఃఖముల ననుభవించువాడు, తరువాత వయస్సులో సుఖమునొందువాడగును. శుభులతో కూడినచో దీర్ఘాయువు గలవాడగును.

వి॥ బృ ప హో॰. సారాంశమందు; పాఠాంతరములో;

అష్టమేశే సుతేలాభే తస్య వృద్ధిర్నజాయతే।
ద్రవ్యం నస్థీయతే గేహేస్థిరబుద్ధిర్భవేజ్జనః॥

అష్టమాధిపతి లాభమందున్నప్పుడు జాతకునకు వృద్ధి కలుగదనియు, గృహమందు ద్రవ్యముకొంచమైన నుండజాలదనియు, జాతకుడు స్థిరమైన బుద్ధిగలవాడని చెప్పియుండెను.

వృద్ధయవన జాతకములో

లాభస్థే చాష్టమపే బాల్యే దుఃఖీభవతి పశ్చాత్।
దీర్ఘాయుస్సౌమ్యఖగే పాపేల్పాయుర్నరో భవతి॥

అష్టమాధిపతి లాభభావమందున్నచో బాల్యమందు దుఃఖము నొందువాడు. తరువాత సుఖపడువాడగును. శుభుడైన అష్టమాధిపతి యున్నచో దీర్ఘాయువుగలవాడు. పాపుడైన అష్టమాధిపతి యున్నచో అల్పాయు గలవాడగును.

పరాశరుడు అష్టమాధిపతి శుభునితో కలిసినచో దీర్ఘాయువును పాపునితో కలిసినచో అల్పాయువని కొంతభేదమును చెప్పియుండెను.

శ్లో॥ రంధ్రేశే వ్యయభావస్థేకుకార్యేవ్యయకృత్సదా।
అల్పాయుశ్చ భవేజ్జాతః సపాపేచ విశేషతః॥

తా॥ అష్టమాధిపతి వ్యయమందున్న జాతకుడు కుత్సితకార్యములకు ధనవ్యయమును చేయును. పాపులతో కూడినచో అల్పాయువు గలవాడగును.

వి॥ వ్యయసంస్థితేఽష్టమేశే క్రూరే పాతస్కరో శఠోనికృష్టశ్చ।
ఆత్మగతిర్వ్యంగ వపుర్మృతిస్తు కాకాదిభిర్భక్ష్యః॥ వృ॥ య॥ జా॥

పాపుడైన అష్టమాధిపతి వ్యయ మందున్నప్పుడు తస్కరుడు శఠుడు, నికృష్టుడు స్వేచ్ఛాప్రవృత్తిగలవాడు అంగవైకల్యముగలవాడు అగును. మరణించినపిమ్మట యిట్టి జాతకుని శరీరమును కాకులు గ్రద్దలు మొదలగునవి భక్షించును.

ఇది అష్టమేశ ఫలము

## భాగ్యేశ ఫలము

శ్లో॥ భాగ్యేశే లగ్నగేజాతో భాగ్యవాన్ భూపవందితః।
సుశీలశ్చ సురూపశ్చ విద్యావాన్ జనపూజితః॥ ౯౭

తా॥ భాగ్యాధిపతి లగ్నమందుగల జాతకుడు భాగ్యవంతుడు, ప్రభువులచే నమస్కరింపబడువాడు. సుశీలుడు, మంచిరూపముగల వాడు, విద్యావంతుడు, జనులచే గౌరవింపబడువాడు అగును.

వి॥ లగ్నస్థే నవమేశే దేవాన్ గురూంశ్చ మన్యతే శూరః।
కృపణః క్షితిపతికర్మా స్వల్పాగ్రాసీ భవతిమతిమాన్॥ వృ.య.జా.

తా॥ లగ్నమందు భాగ్యాధిపతి యుండగ పుట్టినవాడు దేవత అను గురువులను పూజించువాడు, శూరుడు, కృపణుడు ప్రభుకృత్యము లను చేయువాడు, మితముగ భుజించువాడు. బుద్ధిమంతుడు అగును.

శ్లో॥ భాగ్యేశే ధనభావస్థే పండితో జనవల్లభః।
జాయతే ధనవాన్ కామీ స్త్రీ పుత్రాది సుఖాన్వితః॥ ౯౮

తా॥ భాగ్యాధిపతి ధన స్థానమందున్నచో నాజాతకుడు పండి తుడు, జనవల్లభుడు. ధనవంతుడు, కాముకుడు. స్త్రీపుత్రాది సుఖము గలవాడగును.

వి॥ నవమాధిపతౌ ధనగేవృషభో విదితః సుశీలవాన్ సత్యః।
సుకృతీవదనవ్యంగః చతుష్పదోత్పన్నపీడావాన్॥ వృ.య.జా.

ధనస్థానమందునవమాధిపతియున్న జాతకుడు పురుష శ్రేష్ఠుడు, లోక విదితుడు, సుశీలుడు, సత్యముపలుకువాడు, పుణ్యకర్మలు, చేయువాడు ముఖమునందు వికారముగలవాడు చతుష్పాద జంతువులవలన పీడింప బడువాడుఅగును.

శ్లో. భాగ్యేశే భ్రాతృభావస్థే జాతో భ్రాతృసుఖాన్వితః।
ధనవాన్ గుణవాంశ్చాపి రూపశీలసమన్వితః॥ ౯౯

తా॥ భాగ్యాధిపతి తృతీయ మందుండగ బుట్టినవాడు సోదరసుఖము గలవాడు, ధనవంతుడు ,గుణవంతుడు, రూపశీల సమన్వితుడుఅగును.

వి॥ సహజగతే సుకృతపతౌరూపస్వీ బంధువత్సలఃపురుషః।
బంధు(శీరక్షణాకృదద్యదిజీవతి బంధుభిస్తదానహితః॥ వృ.య.జా।
(బంధుస్త్రీ రక్షణకృద్యతి జీవితం బంధుభిస్సహితః)
హోరారత్న పాఠము.

తృతీయమందు భాగ్యాధిపతియున్న జాతకుడు రూపవంతుడు, బంధుప్రీతిగలవాడు, బంధువుల స్త్రీలనురక్షించువాడు, జీవితాంతము బంధువులతో గూడినవాడు అగును.

శ్లో. భాగ్యేశేచతుర్థ భావస్థే గృహయాన సుఖాన్వితః।
సర్వసంపత్తి యుక్తశ్చ మాతృభక్తోభవేన్నరః॥ ౧౦౦॥

తా॥ భాగ్యాధిపతి చతుర్థమందుండగ పుట్టినవాడు, గృహములు వాహనములుగలవాడు. సమస్త సంపదలుగలవాడు, మాతృభక్తిగలవాడు అగును.

వి॥ సుకృతేశే హిబుకస్థే పితృభక్తః పితృకృతేషు శ్రద్ధావాన్।
విదితోమర్త్యః సుకృతీ మైత్రేకర్మసుంతిర్భవతి॥ వృ.య.జా.

చతుర్థమందు భాగ్యాధిపతి గలజాతకుడు పితృభక్తిగలవాడు, తండ్రిచేయు పనులందు శ్రద్ధగలవాడు, విదితుడు, పుణ్యశాలి, మిత్రకార్యరతుడు అగును.

(పరాశరుడు మాతృభక్తిగలవాడని చెప్పియుండగ, యవనాచార్యులు పితృభక్తి గలవాడని చెప్పియుండెను.)

శ్లో. భాగ్యేశేసుతభావస్థేసుతభాగ్య సమన్వితః।
గురుభక్తిరతో ధీరో ధర్మాత్మా పండితోనరః। ౧౦౧

తా॥ భాగ్యాధిపతి పంచమములో నుండగ బుట్టిన మనుజుడు సంతాన మూలకభాగ్యము గలవాడు, గురుభక్తిగలవాడు, ధీరుడు, ధర్మాత్ముడు, పండితుడు అగును.

వి॥ సుకృతగృహపే సుతస్థేసుకృతీ గురుదేవపూజనే నిరతః।

వపుషా సుందరమూర్తిః సుకృతిసుచే తాభవంతిసుతాః

వృ. య. జా॥

పంచమ మందు భాగ్యాధిపతియున్న జాతకుడు పుణ్యవంతుడు, గురుదేవ పూజానిరతుడు, అందమైన శరీరముగలవాడు పుణ్యవంతులైన సుతులు గలవాడు అగును.

(పరాశరుడు పుత్రులు భాగ్యవంతులగుదురనియు, యవనుడు పుత్రులు పుణ్యముగలవారని చెప్పియుండెను.)

శ్లో. భాగ్యేశేరిపు భావస్థేస్వల్పభాగ్యోభవేన్నరః।
మాతులాది సుఖైర్హీనఃశత్రుభిఃపీడితస్సదా॥ ౧౦౨

తా॥ భాగ్యాధిపతి షష్ఠమందుండగ జన్మించిన జాతకుడు స్వల్ప భాగ్యముగలవాడు, మాతులాది సుఖములేనివాడు, శత్రువులచేపీడింప బడువాడు అగును.

వి॥ శత్రుప్రణతి పరాయణ ధర్మరతి కలితం కలావికలదేహమ్॥
దర్శనవనిందానిరతం సుకృతిపతిః షష్ఠగఃకురుతే। వృ.య.జా

షష్ఠమందు భాగ్యాధిపతి యున్నజాతకుడు శత్రువులకు విధేయుడుగ నుండువాడు, ధర్మచింతగలవాడు, కళావిహీనమైన దేహము గలవాడు, దర్శనమాత్రమున ఇతరులను నిందించువాడు, యగును.

శ్లో. భాగ్యేశేదారభావస్థే దారయోగాత్సుఖోదయః।
గుణవాన్ కీర్తిమాంశ్చాపిజాయతేద్విజసత్తమ॥ ౧౦౩

భాగ్యాధిపతి సప్తమమందున్న జాతకుడు భార్యవలన సుఖము గలవాడు, గుణవంతుడు, కీర్తివంతుడు అగును.

వి॥ నవమపతౌ సప్తగే సత్యవతీ సువినయాసురూపాచ।
శీలశ్రీయుతదయితా సుకృతయుతాజాయతేనియతమ్

వృ. య. జా॥

సప్తమమందునవమాధిపతి యున్నజాతకుని భార్య సత్యమును

మ్లాదునది, వినయముగలది, రూపవతి, శీలము,సంపత్తుగలది, పుణ్య కర్మచేయునది యగును.

శ్లో॥ భాగ్యేశే మృత్యుభావస్థే భాగ్యహీనో నరోభవేత్।
జ్యేష్ఠ భ్రాతృసుఖంనైవ తస్యజాతస్య జాయతే॥ ౧౦॥

తా॥ భాగ్యాధిపతి అష్టమభావమందుగల జాతకుడు భాగ్యహీనుడు, జ్యేష్ఠ సోదర సుఖములేనివాడు అగును.

వి. దుష్టోజంతు విఘాతీ గృహాబంధు వివర్జితః సుకృతరహితః।
నవమేశేమృత్యుగతే క్రూరేమందస్తు విజ్ఞేయః॥ వృ. య.జా.

నవమాధపతి అష్టమ భావములో నున్నప్పుడు జాతకుడుదుష్టుడు, జంతుహింస చేయువాడు, గృహములు లేనివాడు, బంధువులచే విడువబడినవాడు, పుణ్యహీనుడు అగును. నవమాధిపతి పాపుడై అష్టమమందున్నచో నపుంసకుడగును.

వి. పాపగ్రహామైన నవమాధిపతి అష్టమమందున్నంత మాత్రమున నపుంసకయోగము చెప్పుటయుక్తముగ నుండదు. దీనినే ప్రధానముగ తీసుకొని చెప్పదలచినయెడల;

1. వృషభలగ్నమునకు ధనస్సులో (అష్టమమందు) శనియున్నప్పుడు, 2. మిధున లగ్నమునకు మకరమందు (అష్టమము) శని యున్నప్పుడు 3, సింహాలగ్నమునకు మీనమందు (అష్టమము) కుజుడున్నప్పుడు 4. ధనుర్లగ్నమునకు కర్కటకమందు రవి యున్నప్పుడు 5. మీనలగ్నమునకు తులయందు కుజుడున్నప్పుడు నపుంసక యోగమును చెప్పవలసి యుండును. నపుంసక యోగమునకు తాత్పర్యమేమనగా సంతానోత్పాదకశక్తి సామర్థ్యములు లేకపోవుటయని గ్రహించవలయును. పై గ్రహస్థితులుగల జాతకులుసంతానవంతులై యున్నారు.

నపుంసకయోగము రెండు విధములుగ గనబడుచున్నది.
1, జన్మతః నపుంసకుడుగ నుండువాడు(అనగా అంగహీనుడనిభావము)
2. ఇతర కారణములచేత నపుంసకుడైనవాడు. ఈ సందర్భములో ప్రాచీనులచే చెప్పబడిన విషయములు ముందు వివరింపబడుచున్నవి.

వరాహమిహిరుడు మొదలగువారు నపుంసక యోగములను రెండు గ్రహముల యొక్క సంబంధముతో చెప్పియున్నారు. యవనుడు ఒక గ్రహసంబంధముతో చెప్పియున్నాడు. క్లీబయోగములనుగురించి వరాహమిహిరుడు;

అన్యోన్యం యదిపశ్యతః శశిరవీ యద్యార్కి సౌమ్యౌతథా।
వక్రోవాసమగం దినేశ మసమే చంద్రోదయౌ చేత్స్థితౌ।
యుగ్మౌజర్క్ష గతావపీందుశశిజౌ భూమ్యాత్మజే నేక్షితౌ।
పుంభాగే సితలగ్నశీతకిరణాః షట్ క్లీబయోగాః స్మృతాః॥

ఈ శ్లోకమందు ఆరు నపుంసక యోగములు చెప్పబడినవి.

1. సమరాశి యందుగల చంద్రుడు, విషమరాశి యందుగల సూర్యుడు ఒకరి నొకరు చూచినప్పుడు,

2. సమరాశియందుగల శని విషమరాశి యందుగల బుధుడు ఒకరి నొకరు చూచి నప్పుడు,

3. విషమరాశియందుగల కుజుడు సమరాశియందుగల సూర్యుని చూచినప్పుడు,

4. విషమరాసులందుగల చంద్రజన్మలగ్నములు, సమరాశి గతుడైన కుజునిచేత చూడబడినప్పుడు,

5. సమరాశి యందుగల చంద్రుడు,విషమరాశియందుగలబుధుడు కుజునిచేత చూడబడినప్పుడు,

6. లగ్న, శుక్ర, చంద్రులు ముగ్గురు ఏరాశియందున్నను పురుష నవాంశములను పొందినప్పుడు నపుంసక యోగములని చెప్ప బడినవి.

ఈ ఆరు యోగములలో మొదటి మూడు యోగములు స్త్రీ పురుషాంగ హీనులగు నపుంసకుల జన్మమును, మిగిలిన మూడు యోగములు స్త్రీ పురుష ధర్మహీనయోగములనియు వీరికి మర్మాంగము లున్నను సంతానోత్పాదక శక్తిసామర్థ్యము లుండనేరవనియు. తెలియ చేయబడినది. గర్భమనగా శుక్లశోణిత సంయోగ సంభవము.

అందు శుక్లాధిక్యమైనపుడు పురుషుడు, శోణితాధిక్యమందు స్త్రీయని శుక్లశోణితములయొక్క సామ్యమునందు నపుంసకమని గ్రహించవలెయును.

మొకటి మూడు యోగములలో మొదటిదానియందు పురుషరూపుడైన సూర్యుడు ఓజరాశియందుండుటచేత శుక్లాధిక్యము, స్త్రీరూపుడైన చంద్రుడు సమరాశియందుండుటచేత శోణితాధిక్యము గలుగునని స్పష్టమగుచున్నది. ఇప్పటికి నిద్దరు సమానబలవంతులగుటచేత శుక్లశోణితములకు సమత్వము చూపబడినది. సూర్యచంద్ర పరస్పర వీక్షణముచేత శుక్లశోణిత సంబంధము సమత్వము నొందుటచేత నపుంసకత్వ ప్రసక్తి గలిగినది, విషమసమరాశి గతులగు రవి చంద్రులకు పరస్పరవీక్షణములేనిచో నపుంసకత్వ ప్రసక్తియుండదు. ఈ యోగమందు విషమరాశి గత రవికి సమరాశి గత చంద్రునకు అన్యోన్య వీక్షణము చతుర్థదశమ స్థితియందు ఒకనికి పాదోనదృష్టి, ఒకనికి పాదదృష్టి గలుగును. లేక జాతక పద్ధతిరీతిచే దృష్ట్యానయన ప్రకారము షష్ఠాష్టమములందున్న రవిచంద్రులకు పూర్ణదృష్టియు సంభవమగును. పాద, పాదోన దృష్టులు శుక్లకృష్ణాష్టములందు సంభవించును. కనుకనే అష్టమియందు స్త్రీ పురుష సంప్రయోగమునకు నిషేధము చెప్పబడినది. మరియు సప్తమదృష్టి శుక్లచతుర్దశిపూర్ణిమలందు గలుగుటచేత శుక్లచతుర్దశీ పూర్ణిమలందు గూడ గర్భాధానము నిషేధింపబడినది. కృష్ణచతుర్దశ్యమావాస్యలందు శీర్షోదయ గ్రహమగు చంద్రుడు (క్రిమదృష్టి గలవాడగుటచేత) పృష్ఠోదయ గ్రహమగు రవియు అన్యోన్య వీక్షణము గలవారగుటచేత యీ రెండు తిథులు గర్భాధానమునకు నిషేధింప బడినవి. (పర్వతిథులు గర్భాధానమునకు నిషేధింపబడినవి)

అష్టమి, చతుర్దశి, అమావాస్య, పూర్ణిమలు పర్వదినములుగ

ష్ణు పురాణములో;

చతుర్దశ్యష్టమీచైవ అమావాస్యాచ పూర్ణిమా।
పర్వాణ్యేతాని రాజేంద్ర రవిసంక్రాంతిరేవచ॥ అని గలదు.

2,3 యోగములు గూడ శుక్ల శోణిత సామ్యము వలననే నపుంసకత్వమునకు కారణము, ఈ మూడు యోగములందు వ్యంజనహీనులైన నపుంసకులు జన్మించెదరు.

మిగిలిన 4,5,6 యోగములందు జన్మించిన స్త్రీ పురుషులు స్త్రీ పురుష ధర్మహీనులనగా సంభోగమందసమర్థులుగా నుందరు. యోగకర్త బలహీనుడైనచో వానిదశయందు మాత్రమే నపుంసకత్వము(సంతానోత్పాదక శక్తి రాహిత్యము) సంభవించును.

2వ యోగమందు రవిచంద్రస్థానములో రవిచంద్ర పుత్రులగు శనిబుధులు గ్రహింపబడినారు.

3వ యోగమందు రక్తస్వరూపుడగు కుజుడు విషమరాశియందుండి సమరాశియందుగల పురుష రూపసూర్యుని చూచుటవలన నపుంసక యోగము.

4. విషమరాశులందుగల లగ్న చంద్రులు కుజునిచే చూడబడినను నపుంసక యోగము. ఇది పూర్ణనపుంసక యోగము కాదు.

5. యుగ్మరాశియందుగల చంద్రుడు విషమ రాశియందుగల స్త్రీ నపుంసక గ్రహమగు బుధుడు పురుషస్వరూప కుజునిచే చూడబడినప్పుడు నపుంసక యోగము. ఇదియు పూర్ణ యోగముకాదు.

6. లగ్న శుక్ర చంద్రులలో శుక్రచంద్రులు స్త్రీ గ్రహములు పురుషాంశములలో నుండుటచేత లగ్నముగూడ పురుషాంశమును పొందుటచేత నపుంసక యోగము. ఇదియు పూర్ణ యోగముగాదు.

(పుంనపుంసకునకు స్తనము లుండుట, స్త్రీయొక్క ముఖము వంటి ముఖముండుటయు) స్త్రీ నపుంసకునకు స్తనములు లేకపోవుట పురుష ముఖమువంటి ముఖముండుటయు యోగ కర్తృగ్రహములనుబట్టి నిర్ణయించవలయును.

నపుంసకుల ప్రస్తావనలో "స్మృతిముక్తాఫల"మందు, నారద వాక్యము;

చతుర్దశవిధశ్శాస్త్రే షండో దృష్టో మనీషిభిః।
చికిత్స్యశ్చాచికిత్స్యశ్చ తేషాముక్తో విధిః క్రమాత్ ॥
నిసర్గషండో ఽముష్కశ్చ పక్షషండ స్తథైవచ।
అభిశాపాద్గురో రోగా ద్దేవక్రోధా త్తథైవచ।
ఈర్ష్యా షండశ్చ సేవ్యశ్చ వాతరేతా ముఖేభగః।
ఆక్షిప్తో మోఘబీజశ్చ శాలీనో న్యాపతి స్తథా ॥ఇతి॥ అని గలదు.

శాస్త్రకారులు నపుంసకులను గురించి చెప్పచు చికిత్సకువీలైన వారు, చికిత్సకు వీలుకానివారు కలిసి మొత్తము 14 మంది నపుంసకులు గలరనిరి. వారిలో 1 నిసర్గషండుడు, (జన్మతఃలింగ వృషణ రహితుడు) 2 అముష్కుడు (ఛిన్నవృషణుడు) 3. పక్షషండుడు (15 దినములకొకమారు స్త్రీ భోగము గలవాడు) 4 శాపషండుడు (గురుశాపమువలన నపుంసకత్వము నొందినవాడు) 5. రోగషండుడు (రోగము వలన పుంస్త్వము లేనివాడు 6. దేవకోపషండుడు (అర్జునునివలె దేవతా కోపమువలన వీర్యశక్తి నశించినవాడు) 7. ఈర్ష్యాషండుడు (ఈర్ష్య వలన వీర్యశక్తిని పోగొట్టుకొనినవాడు) 8, స్త్రీల కుపచారములను చేయుటచేత నపుంసకత్వము గలవాడు) 9. వాతరేతస్కుడు (వాత దోషముచేత వీర్యశక్తి లేనివాడు) ముఖభగుడు (నోటిని భగముగ నుపయోగించువాడు) 10 ఆక్షిప్తషండుడు (రేతస్సును నిరోధించుట చేత నపుంసకత్వము నొందినవాడు) 12. మోఘబీజుడు (గర్భమును కలిగించు శక్తిలేని రేతస్సుగలవాడు) 13. శాలీనుడు (దుఃఖమువలన పుంస్త్వమును పోగొట్టుకొనినవాడు) 14. అన్యాపతి (భార్యకంటె భిన్నమైన యితర స్త్రీలయందు పురుష ధర్మము గలవాడు) అని వివరింపబడెను.

పైన ఉదహరించినవారిలో మొదటి యిద్దరు చికిత్సకు వీలు లేనివారు. మిగిలినవారు చికిత్సకు తగినవారు.

వరాహమిహిరుడు స్త్రీ పురుష గ్రహ సంబంధముతో చెప్పిన మొదటి మూడు యోగములు అచికిత్స్యలగు నిసర్గషండ, అనుష్ణ విషయములనియు, మిగిలిన మూడు యోగములు చికిత్స్యలగు పక్షషండాదుల విషయమని సమన్వయించవలయును. యవనాచార్యుడు భాగ్యాధిపతియొక్క అష్టమస్థితిని బట్టి మాత్రమే నపుంసకత్వ యోగమును చెప్పుటచేత ఈయోగముగూడ చికిత్స్య నపుంసకవిషయమని గ్రహించవలయును చికిత్సనపుంసక యోగములకు కారణభూతులగు గ్రహములు పుత్రకారక గ్రహమగు గురుసంబంధము గలవారైనచో నట్టివారికి శాస్త్రోక్త చికిత్సలను చేయించినయెడల సంతానముగలుగు ననియు; గురు సంబంధము లేనప్పుడు, ఇతర సంతాన యోగములు బలమైనవి లేనప్పుడు, నపుంసక యోగకారక గ్రహములకు బలము పట్టినప్పుడు, చికిత్సాదులవలన గూడ సంతానము కలుగదనియు చెప్పవలయును. సంతాన ప్రద యోగములు; నపుంసక యోగములు పట్టినప్పుడు బలహీనులైనవారి దశలందు సంతానము కలుగదనియు, బలవంతుని దశయందు సంతానము గలుగుననియు చెప్పవలయును. ఈ విషయమై సారావల్యాది గ్రంథములను గూడపరిశీలించవలయును. గ్రంథ విస్తరమగుటచే నిక్కడ వివరించలేదు.

పైన వ్రాసిన విషయముల నన్నింటిని ఆధానలగ్నమందు జాతకమందు సంతానప్రశ్నమందుగూడ విచారించి జాతకునకు పుత్రోత్పాదక శక్తిని నిర్ణయించవలయును.

వధూవర జాతక పరిశీలనలో గూడ స్త్రీ పురుష జాతకములందుగల గ్రహస్థితినిబట్టి సంతానభావవిచారణ చేయవలయును.

శ్లో॥ భాగ్యేశేభాగ్యభావస్థే బహుభాగ్యసమన్వితః।
గుణసౌందర్య సంపన్నో సహజేశః సుఖంబహు। ౧౦౫

తా॥ భాగ్యాధిపతి భాగ్యభావమందున్నచో బహు భాగ్యవంతుఁడు, గుణసౌందర్యసంపన్నుఁడు, సోదరాదులసుఖము గలవాఁడు అగును.

వి॥ సుకృతపతిః సుకృతస్థః స్వబంధుభిః ప్రీతిమనుచ్ఛ్రిత సమమ్।
దాతారం దేవగురుస్వజనకళత్రాదిష్వపి చ భక్తమ్ వృ.య.జా.

భాగ్యాధిపతి భాగ్య భావమందుండఁగ బుట్టినవాఁడు బంధుప్రీతి గలవాఁడు, అందరియందు సమభావముగలవాఁడు, దాత, దేవ, గురు, స్వజన కళత్రాది వర్గమునం దభిమానము గలవాఁడు అగును.

శ్లో॥ భాగ్యేశేకర్మ భావస్థే జాతో రాజాఽథవా ప్రభుః॥
మంత్రీ సేనాపతిర్వాపి గుణవాన్ జనపూజితః॥ ౧౦౬

తా॥ భాగ్యాధిపతి రాజ్యభావమందుగల జాతకుఁడు ప్రభువు లేక ప్రభుసముఁడు, మంత్రి, లేక సేనాధిపతి, గుణవంతుఁడు, జనులచే పూజింపబడువాఁడు అగును.

వి॥ నృపకర్మాణం శూరం ఖ్యాతం నృపలాభినం స్వకర్మరతమ్।
మాతురవిఘ్నం కురుతే సుకృతపతిర్గగనగృహలీనః॥
వృ. య. జా.

దశమభావమందు భాగ్యాధిపతియున్న జాతకుఁడు రాజకార్యములు చేయువాఁడు, శూరుఁడు ఖ్యాతిగలవాఁడు, రాజువలన లాభము గలవాఁడు, స్వకర్మ నిరతుఁడు, తల్లికి అనుకూలుఁడు నగును.

శ్లో॥ భాగ్యేశే లాభభావస్థే ధనలాభో దినే దినే।
భక్తో గురు జనానాం చ గుణవాన్ పుణ్యవానపి॥ ౧౦౭

తా॥ భాగ్యాధిపతి లాభభావమందుండెనేని యాజాతకుఁడు ప్రతి దినమందు ధనలాభముగలవాఁడు, గురువులయందు పెద్దలయందు, భక్తిగలవాఁడు, గుణవంతుఁడు; పుణ్యవంతుఁడు అగును.

వి॥ దీర్ఘాయుర్ధర్మపరోధనేశ్వరః స్నేహాలో నృపతిలాభీ।
సుకృతఖ్యాతిః సతతం సుకృతవిభౌ లాభభవనస్థే॥ వృ.య.జా.

భాగ్యాధిపతి లాభమందుండఁగ పుట్టినవాఁడు దీర్ఘాయుష్మంతుఁడు

ధర్మపరుడు, ధనవంతుడు, స్నేహశీలి, ప్రభుమూలకలాభము గలవాడు, సుకృతము, ఖ్యాతిగలవాడు అగును.

శ్లో॥ భాగ్యేశే వ్యయభావస్థే భాగ్యహాని కరోన్నృణామ్।
శుభకార్యే వ్యయోనిత్యం నిర్ధనోఽతిథి సంగమాత్॥ ౧౦౮

తా. భాగ్యాధిపతి వ్యయమందుగల జాతకుడు భాగ్యము లేనివాడు, శుభకార్యములకు ధనవ్యయమును చేయువాడు, అతిథి సత్కారములను చేయుటవలన నిర్ధనుడు అగును. (భాగ్యాధిపతి పాపగ్రహమై వ్యయమందున్న జాతకులు దుర్మార్గవ్యయమును చేయువారు లోభులు అపమార్గ ధనవ్యయ శీలులుగలరు.) సింహలగ్న జాతకులకు వ్యయమందు భాగ్యాధిపతియగు కుజుడు నీచలోనున్న జాతకులు ధర్మమూలక ధనవ్యయమును చేయుటలేదు. వృషభలగ్న జాతకులు భాగ్యాధిపతియగు శనివ్యయమందు నీచలోనున్నప్పుడుగూడ దుర్మార్గము వలన ధనవ్యయమును చేయుచున్నారు ఈ కుజ శనులకు గురు శుక్రాది శుభ సంబంధమున్నప్పుడు మిశ్రమధనవ్యయము జరుగుచున్నది. మీనలగ్నజులకు వ్యయమందుకుజుడుండగ నిర్హేతుకవ్యయము జరుగుచున్నది. మిధునలగ్నజులకు వ్యయమందు శనియున్నప్పుడు మోసగింపబడుటచేత ధననష్టము గలుగుచున్నది.

ఇది భాగ్యేశఫలము

## కర్మేశ ఫలమ్

శ్లో॥ కర్మేశేలగ్న గేజాతో విద్వాన్ఖ్యాతో ధనీకవిః।
బాల్యేరోగీ సుఖీపశ్చాత్ ధనవృద్ధిర్దినేదినే॥ ౧౦౯

తా॥ దశమాధిపతి లగ్నమందుండగ జన్మించినవాడు విద్వాంసుడు, ధనవంతుడు కవి, బాల్యమందు రోగపీడితుడు. తరువాత సుఖవంతుడు. దినదినము వృద్ధిపొందు ధనము గలవాడు అగును.

వి॥ దశమపతౌ లగ్నగతే మాతృవైరీ పితరిభవతిభక్తః।
దుఃఖీ గతః పితా బాల్యే పరపురుషరతా భవతి మాతా।
వృ. య. జా।

దశమాధిపతి లగ్నమందున్న జాతకుడు మాతృవైరముగల వాడు, పితృభక్తిగలవాడు, దుఃఖమునొందువాడు, బాల్యమందు తండ్రి మరణించువాడు, తల్లి పరపురుష సంబంధముగలదియు యగును.

పరాశరుడు యీ శ్లోకములో మాతృవిషయమును చెప్పలేదు. యవనాచార్యుడు మాతృవిషయమును చెప్పుచు పరపురుష రతురాలగు నవి చెప్పియుండెను. ఈ ఫలము నింతి మాత్రముచేత చెప్పకూడదు. ఈఫలము భావస్థ గ్రహఫలము మాత్రమే గనుక యోగజమైన ఫలమును గూడ విచారించి చెప్పవలయును.

శ్లో॥ రాజ్యేశే ధనభావస్థే ధనవాన్ గుణసంయుతః॥
రాజమాన్యో వదాన్యశ్చ పిత్రాది సుఖసంయుతః॥ ౧౧౦

తా. రాజ్యాధిపతి ధనభావమందుండగ జన్మించిన పురుషుడు ధనవంతుడు, గుణవంతుడు, రాజమాన్యుడు, వదాన్యుడు, పిత్రాది సుఖముగలవాడు అగును.

వి. విత్తస్థే గగనపతౌ మాత్రాన్యయా లలితఃసుతోభవతి।
లోభీమాతరి దుష్టః స్వల్పగ్రాసః సుతపకర్మా। వృ.య.జా।

హోరా రత్నమం దుదహరించినవృద్ధ యవనజాతక శ్లోకములో "మాత్రాన్యయా లలితఃసుత "అనుటకు మారుగ" మాత్రాపాలిత సుతః॥ అని। స్వల్పగ్రాసః" అనుటకు బదులుగ "స్వల్పగ్రామః" అనియు పాఠ భేదముగలదు.)

దశమాధిపతి ధనస్థానమందున్న జాతకుడు సవతితల్లిచే పోషింప బడువాడు, లోభి, తల్లియందు దుష్టముగ ప్రవర్తించువాడు, స్వల్ప గ్రాసము గలవాడు. (లేకచిన్న గ్రామమందు నివసించువాడు,) సూక్ష్మములైన పనులను చేయువాడు అగును.

శ్లో॥ కర్మేశే సహజేజాతో భ్రాతృభృత్య సుఖాన్వితః।
విక్రమీ గుణసంపన్నః వాగ్మీసత్యరతో నరః॥ ॥౧౧౧॥

తా॥ దశమాధిపతి తృతీయ మందున్న జాతకుడు సోదర, భృత్య సుఖముగలవాడు, పరాక్రమ వంతుడు, గుణసంపన్నుడు, వక్త, సత్య ప్రియుడు అగును.

వి॥ మాతృ స్వజనవిరోధీ సేవా నిరతో న కర్మణి సమర్థః।
మాతులకుల పాలితస్స్యాత్ దశమపతౌ సహజ భవనగ తే।
వృ. య. జా.॥

తృతీయమందు దశమాధిపతియున్న జాతకుడు తల్లిని, స్వజనమును విరోధించువాడు, సేవానిరతుడు, పనిచేయుటయందసమర్థుడు, మేనమామలచే పోషింపబడువాడు, అగును.

శ్లో॥ కర్మేశేసుఖభావస్థే సుఖీమాతృహితేరతః॥
యాన-భూమి-గృహాధీశోగుణవాన్ధనవానపి॥ ౧౧౨

తా॥ కర్మాధిపతి సుఖభావమందుగల జాతకుడు సుఖవంతుడు, తల్లికి సుఖమును కూర్చువాడు, వాహనములు-భూములు-గృహములు గలవాడు అగును.

వి॥ దశమపేంబుగతేనిరతఃసుఖేపితరిమాతరిపోషణపూజనే।
సకలలోకదశా మమృతాయతే నృపతిసంభవలాభ విభూషితః।
వృ. య. జా॥

దశమాధిపతి చతుర్థమందున్నచో సుఖముగలవాడు, మాతాపితరుల పోషణయందు, పూజించుటయందు ఆసక్తిగలవాడు, సమస్తజనులకు ఆనందము కలిగించువాడు, ప్రభువువలన లాభము గలవాడు అగును.

శ్లో॥ కర్మేశే సుతభావస్థే సర్వవిద్యాసమన్వితః।
సర్వదా హాస సంయుక్తో ధనవాన్ పుత్రవానపి॥ ౧౧౩

తా॥ దశమాధిపతి పంచమమందున్నచో సకలవిద్యాసమన్వితుడు,

ఎల్లప్పుడు సంతోషముగలవాడు, ధనవంతుడు, పుత్రవంతుడుఅగును

వి॥ శుభకర్మకోఽవిడంబీ నృపలాభీ గీతవాద్యనిరతఃస్యాత్।
గగనపతౌ తనయగతే పాలయతి చ తత్సుతంమాతా॥ వృ.య.జా॥

దశమాధిపతి పంచమమందుండెనేని శుభకర్మలను చేయువాడు, రాజువలన లాభముగలవాడు, గీతవాద్యనిరతుడు, తల్లిచేత పాలింపబడువాడు అగును.

శ్లో॥ కర్మేశే రిపుభావస్థే పితృసౌఖ్య వివర్జితః।
చతురోఽపిధనైర్హీనః శత్రుభిఃపరిపీడితః॥ ౧౧౪

తా॥ దశమాధిపతి శత్రుభావమందుండగ జన్మించినవాడు పితృసౌఖ్యము లేనివాడు చతురుడైనను ధనములేనివాడు, శత్రుబాధగలవాడు అగును.

వి॥ అంబరపే రిపుసంస్థే క్రూరేబాలోఽతికష్టభాక్ భవతి।
పురుషః పశ్చాదీశఃపరపురుషరతనిరతా తథామాతా॥వృ.య జా॥

దశమాధిపతి శత్రుభావమందుండెనేని జాతకుడు అతికష్టములను పొందువాడు. యౌవనమందు అధిపత్యముగలవాడు, అగును. జాతకుని తల్లి పరపురుషాసక్తి గలదగును.

శ్లో॥ రాజ్యేశే దారభావస్థే జాతోదారసుఖాన్వితః।
మనస్వీగుణవాన్ వాగ్మీ సత్యధర్మరతః సదా॥ ౧౧౫

తా॥ రాజ్యాధిపతి సప్తమభావమందుండగ జన్మించినవాడు భార్యాసుఖము గలవాడు. మనస్వి, గుణవంతుడు, వక్త, సత్య ధర్మరతుడు అగును.

వి॥ సుతవతీ శుభరూపసమన్వితా రమణమాతరి పాలనలాలసా।
భవతి తస్య నరస్య నిరంతరం ప్రియతమాంబరపేదయితాగతే॥
వృ. య. జా.

దశమాధిపతి సప్తమమందుగల జాతకుని భార్య సంతానవతి, యోగ్యమైన రూపముగలది, భర్తయొక్క తల్లిని ఆదరించునది, భర్తకు ఇష్టురాలు అగును.

శ్లో॥ కర్మేశే రంధ్రభావస్థే కర్మహీనో భవేన్నరః
దీర్ఘాయురప్యసౌ జాతః పరనిందాపరాయణః॥ వృ. య. జా॥

తా॥ దశమాధిపతి రంధ్రభావమందు గలజాతకుడు కర్మహీనుడు దీర్ఘాయుష్మంతుడు, పరనింద చేయువాడు అగును.

వి. అంబరపతిరష్టమగః క్రూరశ్చోరం మృషాన్వితం దుష్టమ్।
మాతరిసంతాపకరం జనయతి తనుజీవితం కితవమ్॥ వృ.య.జా॥

పాపియైన దశమాధిపతి అష్టమములో గల జాతకుడు చోరుడు, అసత్యమాడువాడు, దుష్టుడు తల్లిని దుఃఖపెట్టువాడు, అల్పాయువు గలవాడు, మోసగాడు అగును.

(పరాశరుడు దీర్ఘాయుష్మంతుడని చెప్పగ, యవనుడు అల్పాయువు గలవాడని చెప్పియుండెను.)

శ్లో॥ రాజ్యేశే భాగ్యభే జాతో రాజా రాజకులోద్భవః।
తత్సమోన్యకులోత్పన్నో ధనపుత్రాదిసంయుతః॥ ౧౧౭॥

తా॥ రాజ్యాధిపతి భాగ్యభావమందున్న జాతకుడు రాజకులమందు జన్మించినచో ప్రభువగును. అన్యవంశమందు జన్మించిన మొదలు ధన పుత్రాదులతో కూడినవాడై రాజుతో సమానుడగును.

వి. శుభశీల స్సద్బంధుః సన్మిత్రో దశమపే నవమలీనే।
తన్మాతాపి సుశీలా సుకృతవతీ సత్యవచనరతా॥ వృ. య. జా.

దశమాధిపతి నవమభావమందుండగ పుట్టినవాడు శుభశీలుడు, సౌభాగ్యులైన బంధువులు, మిత్రులు గలవాడగును. జాతకుని తల్లి సచ్ఛీలము గలది, పుణ్యవంతురాలు, సత్యవచనప్రీతి గలదియగును.

శ్లో॥ కర్మేశే రాజ్యభావస్థే సర్వకర్మపటుః సుఖీ।
విక్రమీ సత్యవక్తా చ గురుభక్తిరతో నరః॥ ౧౧౮॥

తా॥ దశమాధిపతి దశమమందుగల జాతకుడు సర్వకర్మల యందు సమర్థుడు, సుఖముగలవాడు, పరాక్రమవంతుడు. సత్యమును మాట్లాడువాడు. గురుభక్తిగలవాడు అగును.

వి॥ గగనపతి ర్గగనగతో జనయతి జననీ సుఖ పదం పురుషమ్।
జననీకులవిపులసుఖం ప్రకటితఘటనాపటీయాంసమ్॥ వృ.య.జా.

దశమాధిపతి దశమ భావమందుగల జాతకుడు తల్లికి సుఖమును చేకూర్చువాడు, మాతృవంశమువలన విశేషసుఖము గలవాడు, ప్రత్యక్షఘటనయందు సమర్థుడు అగును.

శ్లో॥ రాజ్యేశే లాభభావస్థే జాతో ధనసుతాన్వితః।
హర్షవాన్ గుణవాంశ్చాపి సత్యవక్తాసదాసుఖీ॥ ౧౧౯

తా॥ రాజ్యాధిపతి లాభస్థానమందున్న యెడల జాతకుడుధనము, పుత్రులు గలవాడు, సంతోషము గలవాడు, గుణవంతుడు, సత్యమును మాట్లాడువాడు, సుఖముగలవాడు అగును.

వి. నాకోజ్ఞతి భగాగంతధాచసుతరక్షిణీ స్వేమ్ముఖీ।
దీర్ఘాయుర్మాతృసుఖః పురుషోలాభా శ్రితేంబరేశే॥ వృ.య జా॥

దశమాధిపతి లాభస్థానమందున్న జాతకుని తల్లి భర్తను విడిచి పెట్టును. జాతకుని రక్షించును. మరియు జాతకుడు దీర్ఘాయుష్మంతుడు. మాతృసుఖము గలవాడు అగును.

శ్లో॥ రాజ్యేశేవ్యయభావస్థే నక్రరాజగృహేవ్యయః।
శత్రుతోఽపిభయంనిత్యం చతురశ్చాపిచింతితః॥ ౧౨౦

తా॥ రాజ్యాధిపతి వ్యయభావమందుగల జాతకునకు రాజకూలశ ధనవ్యయము గలుగును. శత్రుభయము గలుగును. మరియు చతురుడు, చింతలు గలవాడు అగును.

వి. మాత్రోజ్ఞితో నిజబలః శుభకర్మా నృపతికర్మరతచేతాః।
వ్యోమపతౌవ్యయసంస్థే దేశాంతరగశ్చపాపఖగే॥ వృ.య.జా॥

దశమాధిపతి వ్యయభావమందున్న పురుషుడు తల్లిచేత విడువ

బడువాడు, బలాఢ్యుడు, శుభకర్మలను చేయువాడు, రాజకార్యములను చేయువాడు అగును. దశమాధిపతిపాపుడై వ్యయమందున్నచో దేశాంతరగతుడగును.

ఇది కర్మేశఫలము.

## లాభేశ ఫలమ్.

శ్లో॥ లాభేశే లగ్నగేజాతః సాత్త్వికో ధనవాన్సుఖీ॥
సమదృష్టిః కవిర్వాగ్మీ సదా లాభసమన్వితః॥ ౧-౨౧

తా॥ లాభాధిపతి లగ్నమందున్నచో జాతకుడు సాత్త్వికుడు, ధనవంతుడు సుఖముగలవాడు, సమదృష్టిగలవాడు, కవి,వక్త, ఎల్లప్పుడు లాభముగలవాడు అగును.

వి॥ స్వల్పాయు ర్బలకలితః శూరో దాతా జనప్రియశ్శుభగః॥
లాభపతౌ లగ్నగతే తుచ్ఛాద్దోషాన్మృతిం లభతే॥ వృ.య.జా॥

లాభాధిపతి లగ్నగతుడైనచో నా జాతకుడు అల్పాయువు గలవాడు, బలవంతుడు, శూరుడు, దాత, జనప్రియుడు. యోగ్యుడుఅగును. నీచ దోషములవలన మృతిచెందును.

శ్లో॥ లాభేశే ధనభావస్థే జాతస్సర్వధనాన్వితః॥
సర్వసిద్ధియుతోదాతాధార్మికశ్చసుఖీసదా॥ ౧-౨౨

తా॥ లాభాధిపతి ధనభావమందుండగ పుట్టిన జాతకుడు సమస్తైశ్వర్యములుగలవాడు, సమస్త సిద్ధులుగలవాడు, దాత, ధార్మికుడు, సుఖవంతుడు అగును.

వి. విత్తగతే లాభపతౌ వుత్పన్నభుగల్పభోజనోఽల్పాయుః॥
అష్టకపాలీ చౌరః క్రూరేసౌమ్యేచధనకలితః॥ వృ. య. జా॥

పాపియైన లాభాధిపతి ధనస్థానమందుగల జాతకుడు ప్రాప్తవస్తువులతో భోగము సమభవించువాడు, అల్పముగ భుజించువాడు, అల్పా

యువు గలవాడు, దరిద్రుడు, చోరుడు అగును. శుభుడైన లాభాధిపతి యున్నచో ధనవంతుడగును.

శ్లో॥ లాభేశే సహజే జాతః కుశలః సర్వకర్మసు।
ధనీ భ్రాతృసుఖోపేతః శూలరోగభయం క్వచిత్॥ ౧౨౩

తా॥ లాభాధిపతి తృతీయమందుండగ బుట్టినవాడు సర్వకార్యకుశలుడు. ధనవంతుడు, సోదరసుఖము గలవాడు, ఒకప్పుడు శూలరోగము గలవాడు అగును.

వి. బంధుమిత్రపాలనకః సుబాంధవో బంధువత్సలస్తుశుభే।
లాభేశే సహజగతే బంధూనామాశ్రయోరిపుచ్ఛేత్తా। వృ.య.జా

శుభుడైన లాభాధిపతి తృతీయమందున్న జాతకుడు బంధుమిత్రపాలకుడు, మంచి బంధువులు గలవాడు, బంధుప్రీతిగలవాడు, బంధువుల కాశ్రయమిచ్చువాడు, శత్రువులను నశింపచేయువాడు అగును.

శ్లో॥ లాభేశే సుఖభావస్థే లాభో మాతృకులాద్భవేత్।
తీర్థయాత్రాకరో జాతో గృహభూమిసుఖాన్వితః॥ ౧౨౪

లాభాధిపతి సుఖభావమందుగల జాతకునకు మాతృవర్గమునుండి ధనలాభముగలుగును. మరియు తీర్థయాత్రలు చేయువాడు, గృహభూసౌఖ్యము గలవాడు అగును.

వి. తుర్యస్థేలాభేశే దీర్ఘాయుఃపితరి భక్తిభాగ్భవతి।
సామయికకర్మ నిరతః స్వకర్మతో లాభవాన్ పురుషః॥
వృ. య. జా॥

లాభాధిపతి చతుర్థమందున్న జాతకుడు దీర్ఘాయుష్మంతుడు, పితృభక్తిగలవాడు, సమయానుకూల కర్మలను చేయువాడు, స్వీయవృత్తివలన లాభముగలవాడు అగును.

శ్లో॥ లాభేశే సుతభావస్థే భవంతి సుఖినః సుతాః॥
విద్యావంతోఽపి వచ్ఛీలాః న్యాయంధర్మరతః సుఖీ॥ ౧౨౫

తా॥ లాభాధిపతి పంచమ భావమందుండగ పుట్టినవాని కుమారులు సుఖవంతులు, విద్యావంతులు, సచ్ఛీలముగలవారు అగుదురు. జాతకుడుకూడ ధర్మనిరతుడు, సుఖవంతుడు అగును.

వి॥ తనయగతో లాభపతిః పితృపుత్రౌ స్నేహాలౌ మిథః కుంతే,
తుల్యగుణౌ చ పరస్పరం తృష్ణాజీవీ చ భవతి సుతః॥ వృ.యు.జా

లాభాధిపతి పంచమములోనుండగ జన్మించినవాడు తండ్రి కుమారులు మైత్రితోనుండగలరు. ఇద్దరు సమానగుణములు గలవారగుదురు. కుమారుడు తృష్ణతో జీవించును.

శ్లో॥ లాభేశే రోగభావస్థే జాతో రోగ సమన్వితః।
క్రూరబుద్ధిః ప్రవాసీచ శత్రుభిః పరిపీడితః॥ ౧౭౬

తా॥ లాభాధిపతి శత్రుభావమందుగల జాతకుడు రోగసమన్వితుడు, క్రూరబుద్ధిగలవాడు, ప్రవాసమందుండువాడు, శత్రువులచే పీడింపబడువాడు అగును.

వి॥ లాభాధిపే షష్ఠగతే సువైరః సుదీర్ఘరోగీ చతురంగసంగ్రహీ।
మృతింసమాప్నోతి చ చౌరహస్తాత్ క్రూరేవిదేశాంతర సంగతో నరః॥ వృ. యు॥ జా.

లాభాధిపతి షష్ఠభావమందుగల జాతకుడు గొప్పవైరముగలవాడు, దీర్ఘరోగి, చతురంగబలసహితుడు అగును. మరియు దొంగలచే మృతిని పొందువాడగును. పాపియైన లాభాధిపతి షష్ఠభావమందుండెనేని దేశాంతరములో నివసించువాడగును.

శ్లో॥ లాభేశే దారభావస్థే లాభోదారకులాత్ సదా। ౧౭౭
ఉదారశ్చ గుణీకామీ జనో భార్యావశానుగః॥

తా॥ లాభాధిపతి సప్తమభావమందుగల జాతకుడు భార్యావర్గమువలన లాభముగలవాడు, ఉదారుడు, గుణవంతుడు, కాముకుడు, భార్యావశుడు అగును.

వి॥ సప్తమగే లాభేశే తేజస్వీ శీలసంపదః పదవీ॥
దీర్ఘాయుర్నృపతి నరస్తథైకదయితా పతిర్నియతమ్॥ వృ.యు.జా॥

లాభాధిపతి సప్తమభావమందుండగ బుట్టినవాడు తేజస్వి, శీల సంపదగలవాడు. దీర్ఘాయుష్మంతుడు, ఏకభార్యగలవాడు అగును.

శ్లో॥ లాభేశే రంధ్రభావస్థే హానిః కార్యేషు జాయతే।
తస్యాయుశ్చ భవేద్దీర్ఘం ప్రథమం మరణం ప్రియః॥　　౧౨౮

తా॥ లాభాధిపతి అష్టమభావమందుగల జాతకుడు కార్యములందు హానిగలవాడు, దీర్ఘాయుష్మంతుడు, అగును. జాతకుని భార్య తనకంటెముందుగ మరణించును.

వి॥ ఏకాదశేఽష్టమగే క్రూరే ఽల్పాయుః సుదీర్ఘరోగీచ।
జీవన్మృతశ్చ దుఃఖీ భవతి నరః సౌమ్యగగనచరే॥ వృ.య.జా॥

ఏకాదశ భావాధిపతి క్రూరుడై అష్టమములో నుండుటచే జాతకుడు దీర్ఘవ్యాధి గలవాడై అల్పాయుర్దాయము గలవాడగును. శుభుడైన లాభాధిపతి అష్టమములో నున్నచో జీవన్మృతుడు, దుఃఖములో కూడినవాడు అగును.

శ్లో॥ లాభేశే భాగ్యభావస్థే భాగ్యవాన్ జాయతే నరః।
చతురః సత్యవాదీచ రాజపూజ్యో ధనాధిపః॥　　౧౨౯

తా॥ లాభాధిపతి భాగ్యభావములో నున్న జాతకుడు భాగ్యవంతుడు, చతురుడు, నిజమును పలుకువాడు, రాజపూజ్యుడు, ధనవంతుడు అగును.

వి॥ ఏకాదశేశే సుకృతాలయస్థే బహుశ్రుతః శాస్త్రవిశారదశ్చ।
ధర్మప్రసిద్ధో గురుదేవభక్తః క్రూరేచబద్ధో వ్రత వర్జితశ్చ॥
వృ. య. జా॥

లాభాధిపతి భాగ్యమందున్నచో నా జాతకుడు గొప్పవిద్వాంసుడు, శాస్త్రవిశారదుడు, ధర్మమందు ప్రసిద్ధుడు, గురుదేవతాభక్తి గలవాడగును. పాపియైన లాభాధిపతి యున్నచో బద్ధుడు, నియమము లేనివాడు అగును.

శ్లో॥ లాభేశే కర్మభావస్థే భూపవంద్యో గుణాన్వితః।
నిజధర్మ రతో ధీమాన్ సత్యవాదీ జితేంద్రియః॥　　౧౩౦

తా॥ లాభాధిపతి దశమభావ మందున్న జాతకుడు ప్రభువులచే నమస్కరింప దగినవాడు, గుణవంతుడు, స్వధర్మ నిరతుడు, బుద్ధి మంతుడు, సత్యమును మాట్లాడువాడు, ఇంద్రియ నిగ్రహము గలవాడు అగును.

వి॥ మాతరిభక్తః సుకృతీ పితరి ద్వేషీ సుదీర్ఘతరజీవీ।
ధనవాన్ జననీపాలకనిరతో లాభాధిపే ఖగతే॥ వృ. య. జా॥

లాభాధిపతి దశమమందుగల జాతకుడు మాతృభక్తి గలవాడు పుణ్యవంతుడు, పితృవైరము గలవాడు, చిరకాలము జీవించువాడు, ధనవంతుడు. తల్లిని పోషించువాడు అగును.

శ్లో॥ లాభేశే లాభభావస్థే లాభస్సర్వేషు కర్మసు।
పాండిత్యం చసుఖంతస్య వర్ధతేచ దినేదినే॥ ౧౩౧

తా॥ లాభాధిపతి లాభస్థానమందుగల జాతకునకు సర్వకారములందు జయము లాభము కలుగును. మరియు పాండిత్యము, సుఖము దినదినాభివృద్ధి నొందును.

వి॥ లాభాధిపో లాభగతః కరోతి దీర్ఘాయుషంపుష్కల పుత్రపుష్టమ్
సత్కర్మకం రూపయుతం సుశీలం జనప్రమోద ప్రవణంసునీతమ్
వృ. య. జా॥

వి॥ లాభాధిపతి లాభస్థానమందు గల జాతకుడు దీర్ఘాయువు, విశేష సంతానము, గలిగి యుండును. మరియు సత్కర్మలు చేయువాడు, రూపవంతుడు, శీలవంతుడు, జనులకు సంతోషమును కలిగించుటయందాసక్తి గలవాడు, సంగీతజ్ఞానము గలవాడు అగును.

శ్లో॥ లాభేశే వ్యయభావస్థే సత్కార్యేషు వ్యయస్సదా।
కాముకో బహుపత్నీకో మ్లేచ్ఛ సంసర్గ కారకః॥ ౧౩౨

తా॥ లాభాధిపతి వ్యయభావ మందుండగ బుట్టిన జాతకుడు సత్కార్యములకు ధనవ్యయమును చేయువాడు, కాముకుడు, అనేక భార్యలు గలవాడు, మ్లేచ్ఛస్నేహమును చేయువాడు అగును.

వి॥ ద్వాదశగే లాభపతౌ పుత్రోత్పన్నభుగస్థిరో భవతి రోగీ।
ఉత్పాతరతో మానీ దాతా దుఃఖసదా పురుషః॥ వృ.య.జా॥

('భోగీ' యనుచోట "భోగి" యని పాఠాంతరము గలదు.)

లాభాధిపతి వ్యయభావ మందున్నచో నా జాతకుడు లభ్యమైన దానిననుభవించువాడు, అస్థిర చిత్తముగలవాడు, (భోగి) భోగి, ఉత్ప్రాతములందాసక్తిగలవాడు, అభిమానవంతుడు, దాత, సర్వదా దుఃఖము నొందువాడు అగును.

ఇది లాభేశ ఫలము

## అథ వ్యయేశ ఫలమ్॥

శ్లో॥ వ్యయేశే లగ్నగే జాతోవ్యయశీలో జనోభవేత్॥
దుర్బలః కఫరోగీచ ధనవిద్యా వివర్జితః॥ ౧౩౩

తా॥ వ్యయాధిపతి లగ్నమందుండగ బుట్టినవాడు వ్యయశీలుడు దుర్బలుడు, కఫవ్యాధిగలవాడు, ధనము, విద్యలేనివాడు అగును.

వి॥ వ్యయనాథే లగ్నగతే విదేశగః సువచనః సురూపశ్చ।
అపసంగవాద దోషీ భవతి కుమారో౽థ వాషండః॥వృ.య.జా.

వ్యయాధిపతి లగ్నగతుడైన జాతకుడు విదేశ నివాసముచేయువాడు, మంచి వాక్కుగలవాడు, రూపవంతుడు, దుష్టులతో వాదము చేయుటవలన దోషియగువాడు, లేక నపుంసకుడు అగును.

శ్లో॥ వ్యయేశే ధనభావస్థే శుభకార్యే వ్యయప్రదా।
ధార్మికః ప్రియవాదీచ గుణసౌఖ్య సమన్వితః॥ ౧౩౪

తా॥ వ్యయాధిపతి ధనభావమందు గల జాతకుడు శుభములకు వ్యయమును చేయువాడు, ధార్మికుడు, ప్రియముగ మాట్లాడువాడు, సద్గుణములు, సుఖము గలవాడగును.

వి॥ వ్యయనాథే విత్తగతే కృపణః కటువాగ్మి నష్టలాభభవః॥
భామేతు గచ్ఛతి ధనం నృపతస్కరవహ్ని భవభయంచ॥
(భామేగచ్ఛతి నిధనం నృపతస్కర వహ్నిభక్త భయతః)
వృ. య. జా॥ లో పాఠాంతరము.

వ్యయాధిపతి ధనస్థానమందుగల జాతకుడు కృపణుడు, కటువుగ

మాట్లాడువాడు, నష్టలాభము గలవాడు అగును. వ్యయాధిపతి శుభుడై ధనభావమందున్న యెడల ప్రభువువలన, దొంగలవలన లేక అగ్ని భయము వలన ధనము నష్టమగువాడు అగును.

(పాఠాంతర విషయము; రాజువలన, దొంగలవలన లేక అగ్ని భయమువలన మృత్యువు గలవాడనియర్థము. ఈ యర్థముకంటె ధన భావఫలమునకే ప్రాముఖ్యము నిచ్చుట యుక్తమని తోచుచున్నది.)

శ్లో॥ వ్యయేశే సహజేజాతో భ్రాతృసౌఖ్య వివర్జితః।
భవేదన్య జనద్వేషీ స్వశరీరస్యపోషకః॥ ౧౩

తా॥ వ్యయాధిపతి తృతీయమందుగల జాతకుడు సోదరసౌఖ్యము లేనివాడు, ఇతరులను ద్వేషించువాడు, తన శరీరమును పోషించుకొను వాడు అగును.

వి॥ సహజగతే ద్వాదశపే క్రూరేఽధన బాంధవః శుభేచధనీ।
తను సోదరశ్చ కృపణో బాంధుషుదూరే సదావసతి॥ వృ. యా. జా.

పాపియైన వ్యయాధిపతి తృతీయమందున్నచో ధనములేనివాడు, బంధువులు లేనివాడు, శుభుడైన తృతీయాధిపతి యున్నచో ధన వంతుడు, స్వల్ప సోదరులు గలవాడు, కృపణుడు, బంధువులకు దూర ముగ నివసించువాడు అగును.

శ్లో॥ వ్యయేశే సుఖభావస్థే మాతుఃసుఖ వివర్జితః।
భూమియాన గృహదీనాం హానిస్తస్య దినేదినే॥ ౧౪

తా॥ వ్యయాధిపతి సుఖభావమందు గల జాతకుడు మాతృ సౌఖ్యము లేనివాడు, గృహములు, భూములు, వాహనములు క్రమ ముగ నష్టపోవువాడు అగును.

వి॥ తుర్యగతే వ్యయనాథే కృపణో రోగోజ్ఝితః సుకర్మాచ।
మృతిమాప్నోతి హి సుతతః సతతం మనుజో మహాదుఃఖీ॥
వృ. య. జా.

చతుర్థమందు వ్యయాధిపతియున్న జాతకుడు కృపణుడు, రోగము లేనివాడు, మంచిపనులు చేయువాడు అగును. కుమారుని వలన మరణ మును పొందువాడు, విశేషదుఃఖము గలవాడు అగును.

శ్లో॥ వ్యయేశే సుతభావస్థే సుతవిద్యా వివర్జితః॥
పుత్రార్థేచవ్యయ స్తస్య తీర్థాటనపరో నరః॥ ౧౩౦

తా॥ వ్యయాధిపతి పంచమభావములో నుండగ జన్మించిన మనుజుడు పుత్రులు, విద్య లేనివాడు, సంతానమును గురించి విశేష వ్యయమును చేయువాడు, తీర్థయాత్రలు చేయువాడు అగును.

వి॥ ద్వాదశపతౌ సుతస్థే క్రూరే సుతవర్జితః శుభే సుసుతః।
జనక కమలా విలాసీ సమర్థతా విరహితః పురుషః॥ వృ.య.జా॥

ద్వాదశాధిపతి పాపుడై పంచమములోనుండెనేని సంతానము చేత విడవబడిన వాడగును. శుభుడైన ద్వాదశాధిపతి యున్నచో పితృభాగ్యముననుభవించువాడు, అసమర్థుడు అగును.

శ్లో॥ వ్యయేశే రిపుభావస్థే జాతస్స్వ జన వైరకృత్।
క్రోధీపాపీచ దుఃఖీచ పరజాయారతో నరః॥ ౧౩౧

తా॥ వ్యయాధిపతి షష్ఠమభావ మందున్న జాతకుడు స్వజన విరోధము కలవాడు, క్రోధముగలవాడు, పాపి, దుఃఖము గలవాడు, పరభార్యారతుడు అగును.

వి షష్ఠగతే వ్యయనాథే క్రూరే కృపణో ఒక్షిదూషణః పురుషః।
లభతే మృతిం నితాంతం భృగుతనయే నేత్రరహిత స్స్యాత్॥
వృ. య. జా॥

వ్యయాధిపతి పాపగ్రహమై షష్ఠభావమందుండగ పుట్టినవాడు కృపణుడు, నేత్రదోషము గలవాడు అగును. శుక్రుడు వ్యయాధిపతియై షష్ఠమందున్నచో నేత్రము లేనివాడై మరణము నొందును.

శ్లో॥ వ్యయేశే దారభావస్థే వ్యయోదార కృతస్సదా।
తస్యభార్యాసుఖంనైవ బలవిద్యా వివర్జితః॥ ౧౩౨

తా॥ వ్యయాధిపతి సప్తమ భావమందుగల జాతకునకు భార్యా మూలక ధనవ్యయమగును. మరియు భార్యాసుఖము లేనివాడు, బలము విద్య లేనివాడు అగును.

వి॥ ద్వాదశపే సప్తమగే దుష్టో దుశ్చరిత కృత్ కపటవచనః।
క్రూరే నస్త్రీ సౌమ్యే స సౌఖ్యతామేతి గణికాతః॥ వృ.య.జా॥

వ్యయాధిపతి సప్తమములో నుండగ పుట్టినవాడు దుష్టుడు, దుశ్చరితుడు, కపటముగ మాట్లాడువాడు అగును. వ్యయాధిపతి క్రూర గ్రహమైనచో కళత్రనష్టము గూడ యుండును. శుభగ్రహమైన వ్యయాధిపతి యున్నచో వేశ్యవలన సౌఖ్యమును నొందును.
("క్షయమేతి గణికాతః" అని జాతక సంగ్రహ పాఠము. ఈ పాఠము నకు వేశ్యవలన క్షీణత్వము నొందువాడని చెప్పవలయును.)

శ్లో॥ వ్యయేశే మృత్యుభావస్థే జాతో లాభాన్వితస్సదా।
ప్రియవాఙ్మధ్యమాయుశ్చ సంపూర్ణ గుణసంయుతః॥ ౧౪౦

తా॥ వ్యయాధిపతి అష్టమ భావమందున్నచో జాతకుడులాభము గలవాడు, ప్రియముగ మాట్లాడువాడు, మధ్యమాయువు గలవాడు, విశేష గుణవంతుడు అగును.

వి॥ వ్యయనాథే నిధనగతేఽష్టకపాలీ కార్యసాధన రహితః॥
ద్రోహమతిః సౌమ్యఖగే ధనసంగ్రహాత త్పరోభవతి॥ వృ.య.జా॥

క్రూరుడైన వ్యయాధిపతి అష్టమములో నున్నచో దరిద్రుడు, కార్యసాధన లేనివాడు, ద్రోహబుద్ధి గలవాడగును. శుభుడైనచో ధనమును జాగ్రత్త చేయువాడగును.

శ్లో॥ వ్యయేశే భాగ్యభావస్థే గురుద్వేషీ భవేన్నరః।
మిత్రైరపి భవేద్వైరం స్వార్థసాధనతత్పరః॥ ౧౪౧

తా॥ వ్యయాధిపతి భాగ్యభావమందుండెనేని జాతకుడు గురు ద్వేషి, మిత్రద్వేషి, స్వార్థప్రయోజనములను సాధించువాడు అగును.

వి॥ వ్యయనాథే సుకృతగతే తీర్థావలోకతో వ్యయే వృత్తిః।
క్రూరే ఖగేచ పాపీ నిరర్థకం యాతి తద్ద్రవ్యమ్॥ వృ.య.జా॥

వ్యయాధిపతి భాగ్యభావ మందున్నచో పుణ్యక్షేత్రములను సేవించుటకు ధనవ్యయము అగును. పాపుడైన వ్యయాధిపతియున్నచో నా జాతకుని ద్రవ్యము నిరర్థకముగ వ్యయమగును.

శ్లో॥ వ్యయేశే రాజ్యభావస్థే వ్యయో రాజకులాద్భవేత్।
పితృతోఽపి సుఖంతస్య స్వల్పమేవహి జాయతే॥ ౧౪౨

తా॥ వ్యయాధిపతి రాజ్యభావమందుండగల జాతకునకు రాజమూలకముగ ధనవ్యయమగును. తండ్రి వలన సుఖము తక్కువగ ఉండును.

వి॥ వ్యయనాథే గగనస్థే పరరమణీ పరాఙ్ముఖః పవిత్రాంగః।
సుతధనసంగ్రహనిరతో మన్యావనపరా భవతి మాతా॥
వృ. య. జా।

వ్యయాధిపతి దశమమునందున్న జాతకుడు పరస్త్రీ విముఖుడు, పవిత్రుడు, సుతుల నిమిత్తము ధనమును జాగ్రత్త చేయువాడు అగును జాతకునితల్లి దుర్భాషలాడునది యగును.

శ్లో॥ వ్యయేశే లాభభావస్థే లాభేహానిః ప్రజాయతే।
పరేణ రక్షితం ద్రవ్యం కదాచిల్లభతేనరః॥ ౧౪౩

తా॥ వ్యయాధిపతి లాభభావమందున్న జాతకునకు ధనలాభమందు హాని కలుగును. ఇతరుల చే రక్షింప బడిన ద్రవ్యమును ఒకప్పుడు పొందగలడు.

వి॥ లాభస్థే ద్వాదశపే ద్రవ్యపతి ర్దీర్ఘజీవితో భవతి।
స్థానప్రవణో దాతా విఖ్యాతః సత్యవచన పరః॥ వృ. య. జా॥

వ్యయాధిపతి లాభస్థానమందు గల జాతకుడు ధనవంతుడు, దీర్ఘాయుష్మంతుడు, స్వస్థానమందు శ్రేష్ఠుడు, దాత, విఖ్యాతుడు సత్యవచనపరుడు అగును.

('ద్రవ్యపతిః' అనుచోట 'సుకుమారః' అని పాఠాంతరము గలదు.)

శ్లో॥ వ్యయేశే వ్యయభావస్థే వ్యయాధిక్యం ప్రజాయతే।
న శరీరసుఖం తస్య క్రోధీద్వేషపరో నృణామ్॥ ౧౪౪

తా॥ వ్యయాధిపతి వ్యయభావమందున్న జాతకుడు ధనమునధికముగ వ్యయపరుచును. మరియు శరీరసుఖము లేనివాడు, క్రోధస్వభావము గలవాడు, ద్వేషింపబడువాడు అగును.

వి॥ విభూతిమాన్ గ్రామనివాసచిత్తః కార్పణ్యబుద్ధిః పశుసంగ్రహీ చ।
చేజ్జీవతి గ్రామయుతస్సదా స్యాద్వ్యయాధనాథేవ్యయభావలీనే॥
వృ. య. జ॥

వ్యయాధిపతి వ్యయమందున్న జాతకుడు స్వగ్రామమందు నివాసము చేయుబుద్ధిగలవాడు, కార్పణ్యము గలవాడు, పశువులుగలవాడు, జీవితాంతము స్వగ్రామమందు నివసించువాడు అగును.
('గ్రామయుతః' అనుచోట 'గ్రామసయుతః' అను పాఠము గలదు.)

## ఉక్త ఫలతారతమ్య వివేకము

శ్లో॥ ఇతితేకథితం విప్ర! భావేశానాం చ యత్ఫలమ్।
బలాబల వివేకేన సర్వేషాం తత్ఫమాదిశేత్॥ ౧౪౫

తా॥ ఓ ద్విజశ్రేష్ఠ! పై ప్రకారము భావాధిపతుల ఫలము చెప్పబడినది. గ్రహములయొక్క బలాబలములను బట్టి ఫలమునూహించి చెప్పవలయును.

శ్లో॥ ద్విరాశీశస్య ఖేటస్య విదిత్వా తయదా ఫలమ్॥
విరోధే తుల్యఫలయో ర్ద్వయోర్నాశః ప్రజాయతే॥ ౧౪౬

తా॥ రెండు రాశులకధిపతి యొక్క ఫలములను రెండు విధములుగ తెలుసుకొని, వానియందు తుల్యఫల విరోధము గలిగినప్పుడా ఫలము నశించును.

శ్లో॥ విభిన్నయోస్తు ఫలయోర్ద్వయోః ప్రాప్తిర్భవేద్ధ్రువమ్।
గ్రహేపూర్ణ బలేపూర్ణ మర్ధమర్ధ బలే ఫలమ్॥ ౧౪౭
పాదంహీనబలే ఖేటే జ్ఞేయ మిత్థం ద్విజోత్తమ।
ఉక్తం భావస్థితానాం తే భావేశానాం ఫలం మయా॥ ౧౪౮

తా॥ రెండు భావాధిపత్యముల వలన సంభవించు ఫలము భిన్నముగ నున్నప్పుడు రెండుఫలములను చెప్పవలయును.

గ్రహము సంపూర్ణబలము గలదైనచో పూర్ణఫలమును, అర్ధబలముగలదైనచో అర్ధఫలమును, పాదబలముగల్గినప్పుడు పాదఫలమును

చెప్పవలయును. ఈ విధముగ భావాధిపతుల స్థితి ఫలమునాచే నీకు చెప్పఁబడినది.

ఉ॥ స్వరాశినాధుడు స్థితిభేదముచే ఒకే విధమైన ఫలమును ఇచ్చుటలో విభేదము గలిగినప్పుడు ఆ ఫలము నశించును. మేషలగ్న జాతకునకు లగ్నాధిపతి కుజుడు లగ్నమందున్నప్పుడు 'దేహసుఖభాక్' దేహసుఖము గలవాడనియు, ఈ లగ్నమున కష్టమాధిపతియైన కుజుడు లగ్నమందున్నప్పుడు, "తనుసౌఖ్య వివర్జితః" శరీరసుఖము లేనివాడు అనియు చెప్పబడినది. ఈ రెండు ఫలములకు భేదము గలిగినందున, ఎక్కువ శరీరసుఖము కలుగుటగాని, శరీరసుఖము లేకపోవుటకాని యుండదు. విభిన్నములైన ఫలములను చెప్పవచ్చును. అట్లా భావాధిపతులిచ్చు ఫలములలో విభిన్నములైన ఫలములను నిశ్చయముగ చెప్పవచ్చును. ఒకే విధమైన ఫలము రెండింటివలన రెండు విధములున్నప్పుడా ఫలమును చెప్పనవసరము లేదు. మిగిలిన వానిసగూడ పై విధముగ గ్రహించవలయును.

జాతకఫల విచారణలో రాశిఫల, గ్రహఫల, రాశిగ్రహఫల, భావఫల, భావగ్రహజఫల, యోగజఫలములని ఆరువిధముల ఫలములు శాస్త్రకారులచే చెప్పబడినవి.

1. రాసులచే స్వతంత్రముగ నీయబడుఫలము రాశిఫలము 2. గ్రహములచే స్వతంత్రముగ నీయబడుఫలము గ్రహఫలము 3. రాశియందు గ్రహముండుట వలన సంభవించుఫలము 4. భావములచే స్వతంత్రముగ నీయబడు ఫలము. 5. భావములందు గ్రహములుండుట వలన సంభవించుఫలము. 6. రాశిభావ సంబంధముతో గ్రహములచే నీయబడుఫలము యోగజఫలము అని చెప్పియున్నారు.

1. రాసులు తమతమ కారకత్వములకు సంబంధించిన విషయముల నిచ్చుటలో స్వతంత్రములు, 2. భావములుగూడ తమ తమ కారకత్వములకు సంబంధించినవిషయముల నిచ్చుటలో స్వతంత్రములు.

3. గ్రహములు తమ కారకత్వ ఫలములనిచ్చుటలో స్వాతంత్రములు. 4. రాశులకు గ్రహసంబంధముచేత 5. భావములకు గ్రహసంబంధములచేత. 6. రాశిభావ గ్రహసంబంధములచేత గలుగు ఫలములు ఒకదానికంటె నొకటి బలీయములు. వీనిలో అవాంతర భేదములు గూడ గలవు. రాశ్యారంభములోనున్న గ్రహము పూర్ణ ఫలమును, మధ్యమమందున్న గ్రహము మధ్యమఫలమును, అంతమందున్న గ్రహము అల్పఫలమును ఇచ్చుననియు, భావమధ్యగత గ్రహము సంపూర్ణ ఫలమును, భావారంభమందుగల గ్రహము ఒకవంతు ఫలమును, భావమధ్యమమును దాటిన గ్రహము 2వంతులు ఫలమును ఇచ్చును. రాశి భావసంబంధముగ ఫలవిచారణ చేయుటలో రాశ్యారంభమందు భావాంతమున్నప్పుడు అక్కడున్న గ్రహము ఇచ్చెడి ఫలము రాశి ఫలమును పూర్ణముగను, భావఫలమును 2వంతులను ఇచ్చునని గ్రహించవలయును. రాశిఫలభావఫల సామ్యమున్నప్పుడు విశేషించి చెప్పవలయును. రాశిఫల భావఫల విరోధమున్నప్పుడు భావఫలమునకే ప్రాముఖ్యము నీయవలయును. యోగజమైన ఫలము సర్వస్వతంత్రమైనది. యథాతథముగ యోగజఫలమును చెప్పవలయును.

ఇతి శ్రీబృహత్పరాశర హోరాశాస్త్రే భావేశఫలాధ్యాయోనామ షడ్వింశోధ్యాయః
ఇది శ్రీ బృహత్పరాశర హోరాశాస్త్రమందు భావేశఫలాధ్యాయము ముగిసెను-౨౬

## అప్రకాశక గ్రహఫలాధ్యాయము - ౨౭॥

పరాశర ఉవాచ:

పరాశర మహర్షి ధూమాద్య ప్రకాశ గ్రహములు తన్వాది ద్వాదశ భావములలో నున్నప్పుడు సంభవించుఫలములను చెప్పుచున్నాడు:

### (౧) ధూమ ఫలమ్॥

శ్లో॥ రవ్యాదిసప్త ఖేటానాం ప్రోక్తం భావఫలం మయా।
అప్రకాశ గ్రహాణాంచ ఫలాని కథయామ్యహమ్॥ ౧

తా॥ వెనుక రవ్యాది సప్తగ్రహములయొక్క భావస్థితి ననుసరించి ఫలములు చెప్పబడినవి. ఇప్పుడు ధూమాద్యప్రకాశ గ్రహముల యొక్క ఫలములను చెప్పుచున్నాను.

శ్లో॥ శూరో విమలనేత్రాంశః సుస్తబ్ధో నిర్ఘృణః ఖలః।
మూర్తిస్థే ధూమసంజ్ఞేచ గూఢరోషోనరస్సదా॥ ౨

తా॥ ధూమగ్రహము లగ్నమందు (తనుభావమందు) ఉన్నచో నా జాతకుడు శూరుడు, స్వచ్ఛమైన నేత్రములు గలవాడు, స్తబ్ధుడు (వినయము లేనివాడు లేక జడుడు) నిర్ఘృణుడు (దయలేనివాడు) ఖలుడు (దుర్మార్గుడు) దాచబడిన రోషముగలవాడు (రహస్యముగ ప్రతికారము చేయువాడని కొందరు) అగును.

శ్లో॥ రోగీధనీ తు హీనాంగో రాజ్యాపహృతమానసః।
ధూమే ద్వితీయే సంప్రాప్తే మందప్రజ్ఞోనపుంసకః॥ ౩

తా॥ ద్వితీయమందు ధూమమున్నచో రోగి, ధనవంతుడు, అంగ వైకల్యముగలవాడు, అధికారముచే అపహరింపబడిన మనస్సుగలవాడు (రాజ్యకాంక్ష, పదవికాంక్ష గలవాడని భావము) మందప్రజ్ఞుడు, నపుంసకుడు అగును.

శ్లో॥ మతిమాన్ శౌర్యసంపన్నః ఇష్టచిత్తః ప్రియంవదః।
ధూమేసహజభావస్థే ధనాఢ్యో ధనవాన్ భవేత్॥ ౪

తా॥ తృతీయమందు ధూమమున్నచో మతిమంతుడు, శౌర్యము గలవాడు, అనుకూలమైన చిత్తవృత్తిగలవాడు, ప్రియముగ మాట్లాడు వాడు, ధనము కలవాడు, ధనమును సంపాదించువాడు అగును.

శ్లో॥ కళత్రాంగ పరిత్యక్తో నిత్యం మనసి దుఃఖితః।
ధూమే చతుర్థే సంప్రాప్తే సర్వశాస్త్రార్థ చింతకః॥ ౫

తా॥ ధూమగ్రహము చతుర్థభావమందున్నచో కళత్రసౌఖ్యము లేనివాడు, నిత్యము మనస్సులో దుఃఖపడువాడు, సర్వశాస్త్రములను గురించి తెలుసుకొను ప్రయత్నము చేయువాడు అగును.

శ్లో॥ స్వల్పాపత్యో ధనైర్హీనో ధూమేపంచమ సంస్థితే।
గురుతా సర్వభక్షంచ సుహృన్మంత్ర వివర్జిత॥

తా॥ ధూమము పంచమమందున్న జాతకుడు స్వల్పసంతానము గలవాడు, ధనములేనివాడు, గురుత్వము గలవాడు, సమస్తమును భక్షించువాడు, మిత్రులచేత మంత్రబలముచేత్త విడువబడినవాడునగును

శ్లో॥ బలవాన్ శత్రు వధకో ధూమేచ రిపుభావగే।
బహుతేజోయుతః ఖ్యాతః సదారోగ వివర్జిత॥ ౬

తా॥ ధూమము షష్ఠభావములో నున్నప్పుడు బలవంతుడు, శత్రువులను సంహరించువాడు, విశేషమైన తేజస్సుగలవాడు, కీర్తిగల వాడు, రోగములు లేనివాడు అగును.

శ్లో॥ నిర్ధనః సతతంకామీ పరదారేషు కోవిదః।
ధూమేసప్తమగేజాతో నిస్తేజాస్సర్వదాభవేత్॥ ౭

తా॥ ధూమము సప్తమభావములో నున్నయెడల నిర్ధనుడు, కాముకుడు, ఇతరులభార్యను పొందువాడు, తేజోహీనుడు అగును.

శ్లో॥ విక్రమేణ పరిత్యక్తః సోత్సాహో సత్యసంగరః।
అప్రియో నిష్ఠురః స్వామీ ధూమే మృత్యుగతే సతి॥ ౮

తా॥ ధూమము ఎనిమిదవభావములోనున్నచో పరాక్రమము లేనివాడు, ఉత్సాహవంతుడు, సత్యమునుగురించి వాదించువాడు, అప్రియుడు, కఠినముగ మాట్లాడువాడు, ప్రభువు, అగును.

శ్లో॥ సుతసౌభాగ్యసంపన్నో ధనీమానీ దయాన్వితః।
ధర్మస్థానే స్థితే ధూమే ధనవాన్ బంధువత్సలః॥ ౧౦

తా॥ ధూమము భాగ్యభావమందున్నయెడల సుతులు, సౌభాగ్యముగలవాడు, ధనవంతుడు, అభిమానముగలవాడు, దయాస్వభావముగలవాడు, బంధువులయందు ప్రీతిగలవాడు అగును.

వి॥ (ధర్మిష్ఠో బంధువత్సలః) అని పాఠాంతముగలదు. ధర్మమార్గమునను సరించినవాడనిభావము. పై శ్లోకమందు ధనీ, ధనవాన్

అను రెండు శబ్దములు ఒకేయర్థమును బోధించుటచేత ।ధర్మిష్ఠః॥ అను ప్రయోగము సరియైనదిగ తోచును.

శ్లో॥ సుతసౌభాగ్య సంయుక్తః సంతోషీ మతిమాన్ సుఖీ।
కర్మస్థే మానవో నిత్యం ధూమే సత్యపదస్థితః॥ ౧౧

తా॥ ధూమము దశమభావమందున్నప్పుడు సుతులు, సౌభాగ్యముగలవాడు, సంతోషముతో కూడినవాడు, బుద్ధిమంతుడు, సుఖము గలవాడు, సత్యమైనమార్గమునను సరించువాడు అగును.

శ్లో॥ ధనధాన్య హిరణ్యాఢ్యో రూపవాంశ్చ కలాన్వితః।
ధూమే లాభగతే చైవ వినీతో గీత కోవిదః॥ ౧౨

తా॥ ధూమము ఏకాదశమందున్నచో ధనము, ధాన్యము, బంగారము, గలవాడు. రూపవంతుడు, కళలందు నేర్పరి, నీతిమంతుడు సంగీతమందు పాండిత్యముగలవాడు అగును.

శ్లో॥ పతితః పాపకర్మాచ ధూమే ద్వాదశసంగతే।
పరదారేషు సంసక్తో వ్యసనీ నిర్ఘృణః శఠః॥ ౧౩

తా॥ ధూమము ద్వాదశభావమందున్నప్పుడు పాపకర్మలు చేయువాడు, ఇతరులభార్యలతో కూడువాడు, వ్యసనపరుడు, దయ లేనివాడు. కపటముగలవాడు అగును.

ఇది ధూమఫలము.

## పాతఫలమ్

శ్లో॥ లగ్నే పాతే చ సంప్రాప్తే జాతకో దుఃఖపీడితః।
క్రూరో ఘాతకరో మూర్ఖో ద్వేషీ బంధుజనస్య చ॥ ౧౪

తా॥ లగ్నమందు పాతయను గ్రహమున్నచో జాతకుడు దుఃఖపీడితుడు, క్రూరుడు, ప్రాణహింస చేయువాడు, మూర్ఖుడు, బంధుజనద్వేషము గలవాడునగును.

శ్లో॥ జిహ్మోఽతిపిత్తవాన్ భోగీ ధనస్థే పాతసంజ్ఞకే।
విస్మృతశ్చ కృతఘ్నశ్చ దుష్టాత్మా పాపకృత్తథా॥ ౧౫

తా॥ ద్వితీయమందు పాతయున్నచో కుటిలుడు (సౌందర్యవిహీనుడని కొందరు) విశేషమైన పైత్యము గలవాడు, భోగి, దయలేనివాడు కృతఘ్నతలేనివాడు, దుష్టస్వభావము గలవాడు, పాపకార్యములను చేయువాడునగును.

శ్లో॥ స్థిరప్రజ్ఞో రణీదాతా ధనాఢ్యో రాజ వల్లభః।
సంప్రాప్తే సహజే పాతే సేనాధీశో భవేన్నరః॥ ౧౬

తా॥ తృతీయమందు పాతయున్నచో స్థిరప్రజ్ఞగలవాడు, యుద్ధాభిలాషి. దాతృత్వముగలవాడు, ధనాఢ్యుడు. ప్రభువులకుఇష్టుడు సేనాధిపతి యగును.

శ్లో॥ బంధవ్యాధి సమాయుక్తః సుతసౌభాగ్య వర్జితః।
చతుర్థగోయదాపాతస్తదాస్యాన్మనుజశ్చసః॥ ౧౭

తా॥ పాతగ్రహము చతుర్థమందున్నప్పుడు బంధనము, వ్యాధి గలవాడు, సుత, సౌభాగ్యములు లేనివాడు నగును.

శ్లో॥ దరిద్రో రూపసంయుక్తః పాతేపంచమగేసతి।
కఫపిత్తానిలైర్యుక్తో నిష్ఠురో నిరపత్రపః॥ ౧౮

తా॥ పాతగ్రహము పంచమమందున్నప్పుడు దరిద్రుడు, రూపవంతుడు, త్రిదోషములు గలవాడు కఠినముగ మాట్లాడువాడు, సిగ్గులేనివాడు అగును.

శ్లో॥ శత్రుహంతా సుపుష్టశ్చ సర్వాస్త్రాణాంచధారకః।
కలాసునిపుణశ్శాంతః పాతేశత్రు గతేసతి॥ ౧౯

తా॥ షష్ఠభావమందు పాతగ్రహమున్నచో శత్రుహంతకుడు, పుష్టిగలవాడు, సమస్తములైన అస్త్రములను ప్రయోగించువాడు, కళానైపుణ్యము గలవాడు, శాంతుడు అగును,

వి॥ (సర్వాస్త్రాణాం ప్రయోగకృత్ ॥)అని పాఠాంతరము గలదు సర్వాస్త్రాణాంచగ్రాహకః॥ అని మరియొక పాఠము గలదు.

శ్లో॥ ధనదారసుతైస్త్యక్తః స్త్రీజితో దుఃఖసంయుతః।
పాతే కళత్రగే కామీ నిర్లజ్జః పరసౌహృదః॥ ౨౧

తా॥ సప్తమభావమందు పాతగ్రహమున్నచో ధనపుత్ర కళత్రములచే విడువబడినవాడు, స్త్రీలచే జయింపబడినవాడు, దుఃఖములు గలవాడు, సిగ్గులేనివాడు, పరులయందు సుహృద్భావము గలవాడగును.

శ్లో॥ వికలాక్షో విరూపశ్చ దుర్భగో ద్విజనిందకః।
మృత్యుస్థానస్థితే పాతే రక్తపీడా పరిప్లుతః॥ ౨౨

తా॥ అష్టమమందు పాతయున్నచో వికలములైన నేత్రములు గలవాడు, రూపహీనుడు, దుర్భగుడు, బ్రాహ్మణనింద చేయువాడు, రక్తదోషములు గలవాడు అగును.

శ్లో॥ బహువ్యాపారకో నిత్యం బహుమిత్రో బహుశ్రుతః।
ధర్మభే పాతఖేటే స్త్రీప్రియశ్చ ప్రియంవదః॥ ౨౩

తా॥ పాతగ్రహము నవమమందున్నయెడల విశేషవ్యాపారమును చేయువాడు, మిత్రజనమెక్కువగలవాడు, విజ్ఞానవంతుడు, స్త్రీలకు ఇష్టుడు, ప్రియముగ మాట్లాడువాడు అగును,

వి॥ స్త్రీ ప్రియజ్ఞః అని పాఠాంతరము. అనగా స్త్రీలకిష్టమైన దానిని తెలిసినవాడని యర్థము.

సశ్రీకో ధన్యకృచ్ఛాంతో ధర్మకార్యేషు కోవిదః।
కర్మస్థే పాతసంజ్ఞేహి మహాప్రాజ్ఞో విచక్షణః॥ ౨౪

తా॥ దశమమందు పాతగ్రహమున్న జాతకుడు ధనవంతుడు, శాంతుడు, ధర్మకార్యములను తెలిసినవాడు, ప్రాజ్ఞుడు, విచక్షణజ్ఞానముగలవాడు అగును.

ప్రమితధనవాన్ మానీ సత్యవాదీ దృఢవ్రతః।
అశ్వాఢ్యో గీతసంయుక్తః పాతేలాభగతేసతి॥ ౨౫

తా॥ పాతగ్రహమేకాదశ స్థానమందున్నప్పుడు విశేషధనము గలవాడు, అభిమానముగలవాడు, సత్యమునుపలుకువాడు, దృఢమైన

వ్రతము గలవాడు, అశ్వాదివాహనములుగలవాడు, సంగీతాదివిద్య లందు నేర్పరియగును.

శ్లో॥ కోపీచ బహు కర్మార్థో వ్యంగో ధర్మస్యదూషకః।
వ్యయస్థానే గతేపాపే విద్వేషీ నిజబంధుషు॥ ౨౨

తా॥ పాతగ్రహము వ్యయస్థానములోనుండగ బుట్టినవాడు కోపముగలవాడు, అధికమైనకర్మలను చేయువాడు (ఎక్కువ కష్టపడి పనిచేయువాడు) అంగహీనుడు, ధర్మదూషకుడు, బంధుద్వేషము గలవాడు అగును.

ఇది పాతఫలము

## పరిధిఫలము

శ్లో॥ విద్వాన్ సత్యరతః శాంతో ధనవాన్ పుత్రవాన్ శుచిః।
పరిధౌతనుగే దాతా జాయతే గురువత్సలః। ౨౩

తా॥ పరిధియను ఉపగ్రహము లగ్నమందున్న యెడల విద్వాంసుడు, సత్యమునుమాట్లాడువాడు, శాంతుడు. ధనవంతుడు, పుత్రవంతుడు. పరిశుద్ధుడు. దాతృత్వముగలవాడు, గురువాత్సల్యమును పొందువాడునగును.

శ్లో॥ ఈశ్వరో రూపవాన్ భోగి సుఖీ ధర్మపరాయణః।
ధనస్థే పరిధౌజాతః ప్రభుర్భవతి మానవః॥ ౨౪

తా॥ పరిధి ధనభావమందున్నచో సర్వాధికారి, రూపవంతుడు, భోగము, సుఖముగలవాడు, ధర్మపరాయణుడు. ప్రభువును అగును.

శ్లో॥ స్త్రీవల్లభః సురూపాంగో దేవస్వజనసంగతః।
తృతీయేపరిధౌ భృత్యో గురుభక్తి సమన్వితః॥ ౨౫

తా॥ పరిధి తృతీయమందున్నయెడల స్త్రీవల్లభుడు, మంచి రూపముగలవాడు, దేవతలందు, స్వజనమునందు ప్రీతి గలవాడు, భృత్యుడు, గురుభక్తి గలవాడు అగును.

శ్లో॥ పరిధౌ సుఖభావస్థే విస్మితం శ్రిమంగళమ్।
అక్రూరం శ్వశంపూర్ణం కురుతే గీతకోవిదమ్॥ ౨౯

తా॥ చతుర్థభావమందు పరిధియున్నచో ఆశ్చర్యపడు స్వభావము గలవాడు, శీఘ్రముగ శుభములు చేయువాడు, సౌమ్యుడు, సంపూర్ణమైన స్వభావశీలాదులుగలవాడు. సంగీతవిద్వాంసుడు అగును.

శ్లో॥ లక్ష్మీవాన్ శీలవాన్ కాంతః ప్రియవాన్ ధర్మవత్సలః।
పంచమే పరిధౌ జాతః స్త్రీణాం భవతి వల్లభః॥ ౩౦

తా॥ పరిధియను ఉపగ్రహము పంచమభావ మందున్నచో ధనవంతుడు, శీలవంతుడు, మనోహరరూపము గలవాడు, ప్రియమైనవాడు. ధర్మమందు బుద్ధిగలవాడు, స్త్రీలకు ఇష్టుడు అగును.

శ్లో॥ వ్యక్తోఽర్థపుత్రవాన్ భోగీ సర్వసత్త్వహితే రతః।
పరిధౌ ఽషభావస్థే శత్రుహా జాయతే నరః॥ ౩౧

తా॥ శత్రుభావమందు పరిధియున్న జాతకుడు పండితుడు, ధనము. పుత్రులు, భోగములు గలవాడు, సమస్త ప్రాణులకు హితమును గోరువాడు, శత్రువులు లేనివాడు అగును.

శ్లో॥ స్వల్పాపత్యః సుఖైర్హీనో మందప్రజ్ఞః సునిష్ఠురః।
పరిధౌ ద్యూనభావస్థే స్త్రీణాంవ్యాధిశ్చ జాయతే॥ ౩౨

తా॥ పరిధి సప్తమభావమందుండగ బుట్టినవాడు, స్వల్పసంతానము గలవాడు, సుఖములేనివాడు, మందప్రజ్ఞుడు, పరుషవాక్కుగలవాడు, అనారోగ్యముగల భార్యగలవాడు అగును.

శ్లో॥ అధ్యాత్మ చింతకః శాంతో దృఢకాయో దృఢవ్రతః।
ధర్మవాంశ్చసత్త్వ శ్చ పరిధౌ రంధ్ర సంస్థితే॥ ౩౩

తా॥ అష్టమమందు పరిధిగల జాతకుడు ఆధ్యాత్మిక చింతనము గలవాడు, శాంతుడు దృఢమైన శరీరము గలవాడు, దృఢవ్రతుడు, ధర్మబుద్ధిగలవాడు, బలాఢ్యుడు అగును.

శ్లో॥ పుత్రాన్వితః సుఖీకాంతో ధనాఢ్యో లోభవర్జితః।
పరిధౌ ధర్మగే మానీ స్వల్పసంతుష్ట మానసః॥ ౩౪

తా॥ ధర్మభావమందు పరిధియున్న యెడల సంతానముగలవాడు సుఖమును అనుభవించువాడు, రూపవంతుడు, ధనవంతుడు, చపలత్వము లేనివాడు, అభిమానవంతుడు, స్వల్పసంతుష్టి గలవాడు అగును.

శ్లో॥ కాలాభిజ్ఞస్తథా భోగీ దృఢకాయో హ్యమత్సరః।
పరిధౌ దశమే ప్రాప్తే సర్వశాస్త్రార్థ పారగః॥ 31

తా॥ పరిధి దశమభావమునందున్న జాతకుడు కాలమును తెలిసినవాడు, భోగి, దృఢశరీరి, మత్సరము లేనివాడు, సమస్త శాస్త్ర రహస్యము నెల్ల తెలుసుకొనినవాడు అగును.

శ్లో॥ స్త్రీభోగీ గుణవాంశ్చైవ మతిమాన్ స్వజనప్రియః।
లాభగే పరిధౌ జాతో మందాగ్ని రుపపద్యతే॥ 32

తా॥ ఏకాదశమందు పరిధి యుండగ బుట్టినవాడు స్త్రీసౌఖ్యము గలవాడు, గుణవంతుడు, బుద్ధిమంతుడు, స్వజనప్రియుడు, అజీర్ణము గలవాడునగును.

శ్లో॥ వ్యయస్థేపరిధౌ జాతో వ్యయకృత్ మానవస్సదా।
దుఃఖభాక్ దుష్టబుద్ధిశ్చ గురునిందా పరాయణః॥ 33

తా॥ వ్యయమునందు పరిధియున్న యెడల నా జాతకుడు వ్యయశీలుడు, దుఃఖముల నొందువాడు, దుష్టబుద్ధిగలవాడు, గురునిందచేయువాడు అగును.

## చాప ఫలము

శ్లో॥ ధనధాన్య హిరణ్యాఢ్యః కృతజ్ఞః సంమతస్సతామ్।
సర్వదోషపరిత్యక్తశ్చాపే తనుగతేనరః॥ 34

తా॥ తనుభావమందు చాపమను ఉపగ్రహమున్న జాతకుడు, ధన, ధాన్య, హిరణ్యములు గలవాడు, కృతజ్ఞుడు (చేసిన మేలు మరువనివాడు) సత్పురుషులచే కొనియాడబడువాడు, దోషములు లేనివాడు అగును.

శ్లో॥ ప్రియంవదః ప్రగల్భోక్త్యా వినీతో విద్యయాఽన్వితః।
ధనస్థే చాపఖేటే తు రూపవాన్ ధర్మతత్పరః॥ ౩౯

తా॥ చాపగ్రహము ధనభావ మందున్నయెడల ప్రియమును పలుకువాడు, ప్రగల్భవచనములు గలవాడు, నీతిమంతుడు, విద్యావంతుడు, రూపవంతుడు, ధర్మతత్పరుడు అగును.

శ్లో॥ కృపణోఽతికలాభిజ్ఞ శ్చౌర్యకర్మ రతస్సదా।
సహజే ధనుషి ప్రాప్తే హీనాంగో గతసౌహృదః॥ ౪౦

తా॥ తృతీయమందు చాపగ్రహమున్నయెడల కృపణుడు, అనేక కళలందు నేర్పుగలవాడు, దొంగతనమును చేయువాడు, అంగవైకల్యము (అంగవిహీనత) గలవాడు, మిత్రులు లేనివాడు అగును.

శ్లో॥ సుఖీ గోధనధాన్యాది రాజసన్మాన పూజితః।
కార్ముకే సుఖ సంస్థే తు నీరోగో వను జాయతే॥ ౪౧

తా॥ చతుర్థభావమందు చాపగ్రహమున్నచో సుఖమునుపొందువాడు, గోవులు, ధనము, ధాన్యములు గలిగి, ప్రభుసన్మానములచే పూజింపబడువాడు, రోగములు లేనివాడు అగును.

శ్లో॥ రుచిమాన్ దీర్ఘదర్శీ చ దేవభక్తః ప్రియంవదః।
చాపే పంచమగే జాతో వివృద్ధః సర్వకర్మసు॥ ౪౨

తా॥ పంచమభావములో కార్ముకగ్రహమున్నచో అనురాగము గలవాడు, దూరముగ ఆలోచనచేయువాడు, మనోహరరూపము గలవాడు, దేవతాభక్తుడు, ప్రియముగ మాట్లాడువాడు, సర్వకార్యములందును వృద్ధి నొందువాడు అగును.

శ్లో॥ శత్రుహన్తాఽతిధూర్తశ్చ సుఖీ ప్రీతిరుచిః శుచిః।
షష్ఠస్థానగతే చాపే సర్వకర్మ సమృద్ధిభాక్॥ ౪౩

తా॥ కార్ముకము (చాపము) శత్రుస్థానమందు (షష్ఠభావమందు) ఉన్నచో శత్రువులను జయించువాడు, అతిధూర్తుడు, సుఖవంతుడు, అందమైనవాడు, స్వచ్ఛముగనుండువాడు, సర్వకర్మలందు సమృద్ధియగు ఫలమునొందువాడును అగును.

శ్లో॥ ఈశ్వరో గుణసంపూర్ణః శాస్త్రవిద్ధార్మికః ప్రియః।
చాపే సప్తమభావస్థే భవతీతి నసంశయః॥ ౪౪

తా॥ చాపము సప్తమభావమందున్నయెడల సర్వాధికారి, గుణములతోనిండినవాడు, శాస్త్రజ్ఞుడు, ధార్మికుడు, అందరకు ఇష్టమైనవాడు అగును.

శ్లో॥ పరకర్మరతః క్రూరః పరదార పరాయణః।
అష్టమస్థానగే చాపే జాయతే వికలాంగకః॥ ౪౫

తా॥ అష్టమమందు చాపమున్నజాతకుడు ఇతరుల పనులయందాసక్తి గలవాడు, క్రూరుడు, పరభార్యాసక్తుడు, వికలాంగుడు అగును.

శ్లో॥ తపస్వీ వ్రతచర్యాసు నిరతో విద్యయాధికః।
ధర్మస్థే జాయతే చాపే మానవో లోకవిశ్రుతః॥ ౪౬

తా॥ భాగ్యమందు కోదండగ్రహమున్నయెడల తపస్వి, వ్రతముల నాచరించుటయందు నిరతుడు, విద్యాధికుడు, లోకప్రసిద్ధుడు అగును.

శ్లో॥ బహుపుత్ర ధనైశ్వర్యో గోమహిష్యాదిమాన్ భవేత్।
కర్మభే చాపసంయుక్తే జాయతే లోకవిశ్రుతః॥ ౪౭

తా॥ దశమమందు చాపమున్నజాతకుడు పుత్రులు, ధనము, ఐశ్వర్యము గలవాడు, గోమహిష్యాదిపశుసంపద గలవాడు, లోకప్రసిద్ధుడు అగును.

శ్లో॥ లాభగే చాపభేచైవ లాభయుక్తో భవేన్నరః।
నీరోగో దృఢకోపాగ్ని మంత్రస్త్రీ పరమాస్త్రవిత్॥ ౪౮

తా॥ లాభభావమందు చాపమున్నయెడల లాభముగలవాడు, రోగములులేనివాడు, దృఢమైన కోపముగలవాడు, మంత్రములు, స్త్రీలు, అస్త్రములు తెలిసినవాడు అగును.

శ్లో॥ ఖలోఽతిమానీ దుర్బుద్ధి ర్నిర్లజ్జో వ్యయసంస్థితే।
చాపే పరస్త్రీసంయుక్తో జాయతే నిర్ధనస్సదా॥ ౪౯

తా॥ వ్యయభావమందుచాపమున్న జాతకుడు ఖలుడు, దురభి

మాని, దుష్బుద్ధిగలవాడు, సిగ్గులేనివాడు, పరస్త్రీలయందనురక్తిగల వాడు, ధనహీనుడు అగును.

## కేతు ఫలము

శ్లో॥ కుశలః సర్వవిద్యాసు సుఖీవాఙ్నిపుణః ప్రియః
తనౌశిఖి సంజాతః సర్వకామాన్వితో భవేత్॥ ౧౦

తా॥ కేతు గ్రహము జన్మలగ్నమందున్న యెడల సమస్తవిద్యలందు కుశలుడు, సుఖవంతుడు, వాక్చాతుర్యము గలవాడు, ఇష్టుడు, సమస్తమైన కోరికలతో కూడినవాడునగును.

శ్లో॥ వక్తా ప్రియంవదః కాంతో ధనస్థానగతేధ్వజే।
కావ్యకృత్పండితో మానీ వినీతో వాహనాన్వితః॥ ౧౧

తా॥ ధనస్థానమందు కేతువున్నయెడల వక్తృత్వముగలవాడు, జనప్రియముగ మాట్లాడువాడు, మంచికాంతిగల శరీరముగలవాడు, కావ్యములు వ్రాయువాడు, పండితుడు, అభిమానము, నీతి, వాహనములు గలవాడు నగును.

శ్లో॥ కదర్యః క్రూరకర్తాచ కృశాంగో ధనవర్జితః।
సహజస్థేతుశిఖి తీవ్రరోగీ ప్రజాయతే॥ ౧౨

తా॥ తృతీయమందు కేతువుగల మనుజుడు లోభి, క్రూరకర్మములను చేయువాడు, శుష్కించిన దేహముగలవాడు, ధనహీనుడు తీవ్రమైన వ్యాధిగలవాడు నగును.

శ్లో॥ రూపవాన్ గుణసంపన్నః సాత్త్వికోఽపి శ్రుతిప్రియః।
సుఖసంస్థే తు శిఖిని వదాభవతి సౌఖ్యభాక్॥ ౧౩

తా॥ చతుర్థమందు కేతువున్నయెడల రూపవంతుడు, గుణవంతుడు సాత్త్వికుడు. వేదములందు ప్రీతిగలవాడు, సుఖమును పొందువాడు అగును.

శ్లో॥ సుఖీభోగీ కలావిచ్చ పంచమస్థానగే ధ్వజే।
యుక్తిజ్ఞో మతిమాన్ వాగ్మీ గురుభక్తిసమన్వితః॥ ౧౪

తా॥ పంచమమందు కేతువున్నయెడల సుఖవంతుడు, భోగి, కళలందు నేర్పరి, యుక్తి తెలిసినవాడు, మతిమంతుడు, మంచివక్త, గురుభక్తి గలవాడు నగును.

శ్లో॥ మాతృపక్షక్షయకరః శత్రుహా బహుబాంధవః।
రిపుస్థానే ధ్వజేప్రాప్తే శూరఃకాంతో విచక్షణః॥ ౫౫

తా॥ శత్రుభావమందు కేతువున్నచో మాతృవర్గము లేనివాడు, శత్రువులు లేనివాడు, ఎక్కువ బంధువులు గలవాడు, శూరుడు, అందమైనవాడు, సూక్ష్మదృష్టి గలవాడు అగును.

శ్లో॥ ద్యూతక్రీడా వ్యసనరతః కామీ భోగసమన్వితః।
ధ్వజేతు సప్తమస్థానే వేశ్యాసుకృత సౌహృదః॥ ౫౬

తా॥ సప్తమభావమందు కేతువున్నచో జూదమందు ప్రీతిగలవాడు, కాముకుడు, భోగములననుభవించువాడు, వేశ్యాలోలుడగుగును.

వి॥ రక్తపీడావిచరతః అను పాఠాంతరము గలదు. రక్తదోషముతో బాధపడువాడని యర్థము.

శ్లో॥ నీచకర్మరతః పాపో నిర్లజ్జో నిందకస్సదా।
మృత్యుస్థానే ధ్వజేప్రాప్తే గతస్త్ర్యపరపక్షకః॥ ౫౭

తా॥ అష్టమమందు కేతువున్నయెడల నీచకర్మలను చేయువాడు పాపి, సిగ్గులేనివాడు, ఇతరులను నిందించువాడు. భార్యావర్గము లేనివాడు అగును.

శ్లో॥ లింగధారీ ప్రసన్నాత్మా సర్వభూతహితేరతః।
ధర్మభే శిఖిప్రాప్తే ధర్మకార్యేషు కోవిదః॥ ౫౮

తా॥ నవమమందు కేతువున్నయెడల లింగధారణ చేయువాడు ప్రసన్నమైన హృదయము గలవాడు, సమస్తభూతములకు హితమును కోరువాడు, ధర్మకార్యములను తెలిసినవాడు అగును.

శ్లో॥ సుఖసౌభాగ్యసంపన్నః కామినీనాం చ వల్లభః।
దాతా ద్విజైస్సమాయుక్తః కర్మస్థే శిఖిధ్వజే॥ ౫౯

తా॥ దశమమందు కేతువున్న యెడల సుఖసౌభాగ్యములు గల వాడు, స్త్రీజనవల్లభుడు, దాతృత్వము గలవాడు, బ్రాహ్మణులతో గూడినవాడు అగును.

శ్లో॥ విత్తలాభః సుధర్మీచ లాభే శిఖి పూజితః।
ధనాఢ్యః సుభగః శూరః సుయజ్ఞజ్ఞాతి కోవిదః॥ ౬౨

తా॥ ఏకాదశ భావమందు కేతువున్న యెడల విత్తము లాభము గలవాడు, ధర్మపరుడు, పూజితుడు, ధనముగలవాడు, సుందరుడు, శూరుడు, క్రతువులు చేయువాడు, మిక్కిలి విద్వాంసుడు అగును.

శ్లో॥ పాపకర్మరతఃశూరః శ్రాద్ధహీనోఽఘృణో నరః।
పరదారరతో రౌద్రః శిఖి వ్యయగేనతి॥ ౬౧

తా॥ వ్యయభావమందు కేతువున్న యెడల పాపకర్మలను చేయు వాడు, శూరుడు, పితృదేవతా క్రియలు చేయనివాడు, దయలేనివాడు పరభార్యాసక్తుడు, రౌద్రస్వభావము గలవాడునగును.

## గు ళి క ఫ ల ము

శ్లో॥ రోగార్తః సతతంకామీ పాపాత్మాదిగతః శఠః।
తనుస్థే గుళికేజాతో ఖలభావోఽతిమిఃఖితః॥ ౬౨

తా॥ తనుభావమందు గుళికుడున్న యెడల రోగార్తుడు, కాముకుడు, పాపబుద్ధిగలవాడు, మూర్ఖుడు, దుష్టస్వభావము గలవాడు, ఎక్కువ దుఃఖములు గలవాడు అగును.

వి॥ జాతక గ్రంథములందు మాందికి గుళికుడని నామాంతరముతో వ్యవహరింపబడినది. మాండవ్యముని మతములో మాంది గుళికులు వేరనియు, శని యొక్క పుత్రులనియు విడిగ చెప్పబడినట్లు కాళిదాసు ఉత్తరకాలామృతములో చెప్పెను. గుళికునకు మాందికి ఫలము వేరుగ చెప్పబడలేదు. మాంది ఇచ్చు ఫలితములనే గుళికునకు గూడ చూచుకొన వలయును.

జాతక పారిజాతములో 9వ అధ్యాయమందు ఫలదీపిక 25వ అధ్యాయములోను "మాంది ఫలములు" చెప్పబడినవి.
పారిజాతములో;

మాంద్యద్ధాదిఫలాని వచ్మిగుళికే లగ్నస్థితే మందధీః,
రోగీ పాపయుతేతు వంచన పరః క్రోధదురాచారవాన్।। అనియు

ఫలదీపికలో;

చోరః క్రూరో వినయరహితో వేదశాస్త్రార్థహీనో।
నాతిస్థూలో నయనవికృతో నాతిధీర్నాతిపుత్రః।
నాల్పాహారీ సుఖవిరహితో లంపటోనాతిజీవీ।
శూరోనస్యాదపి జడమతిః కోపనోమాందిలగ్నే।।

మాంది లేక గుళికుడులగ్నమందున్న జాతకుడు చోరుడు క్రూరుడు వినయము లేనివాడు, వేదశాస్త్రములందు బుద్ధిలేని వాడు, కుష్ఠదేహముగలవాడు, నేత్రవికారము గలవాడు బుద్ధిలేనివాడు, తక్కువసంతానము గలవాడు, ఎక్కువగ భుజించువాడు, మందబుద్ధి గలవాడు, సుఖములేని వాడు, లంపటుడు, దీర్ఘజీవితము లేని వాడు, శౌర్యములేని వాడు, కోపస్వభావము గలవాడు నగునని భావము.

లగ్నగతుడగు మాంది పాపగ్రహముతో గూడినచో వంచన చేయువాడని జాతక పారిజాతములో విశేషము చెప్పబడినది.

వికృతో దుఃఖితః క్షుద్రో వ్యసనీచ గతత్రపః।
ధనస్థే గుళికేజాతో నిఃస్వోభవతి మానవః।। ౬౩

తా॥ ధనభావమందు గుళికుడున్న యెడల వికృతరూపము గలవాడు, దుఃఖితుడు, దురాత్ముడు, వ్యసనపరుడు, సిగ్గులేనివాడు. ధనము లేనివాడు అగును.

జా॥ పా॥ లో;

విత్తస్థే విషయాకులో౽టన పరః క్రోధీదురాలాపవాన్।
పాపవ్యోమచరాన్వితే గతధనో విద్యావిహీనో౽భవా॥

ధనగతమాంది పాపగ్రహములతో కలిసినప్పుడు మాత్రము ధనహీనుడు గాని, విద్యాహీనుడుగాని, యగునని చెప్పెను.

ఫలదీపికలో;

శ్లో॥ న చాటు వాక్యం కలహాయమానో న విత్తధాన్యంపరదేశవాసీ।
న వాఙ్మసూక్ష్మార్థవివాదవాక్యో దినేశ పుత్రే ధనరాశిసంస్థే॥

తా॥ మాంది ద్వితీయమందున్నప్పుడు ప్రియముగ మాట్లాడని వాడు, కలహించువాడు, ధనధాన్యములు లేనివాడు, పరదేశ వాసము చేయువాడు, మాటకు కట్టుబడనివాడు, వాదమందు యుక్తాయుక్తముగ వ్యవహరించనివాడు అగునని చెప్పబడినది.

చార్వంగో గ్రామపః పుణ్యసంయుక్తః సజ్జనప్రియః।
సహజే గుళికే జాతో మానవో రాజపూజితః॥　　౬౪

తా॥ గుళికుడు తృతీయభావమందున్నప్పుడు అందమైన శరీరావయవములు గలవాడు, గ్రామాధిపతి, పుణ్యముతో గూడినవాడు సజ్జనులకు ఇష్టుడు, రాజపూజితుడు అగును.

వి॥ దీనికి జాతక పారిజాతములో;

విరహగర్వమదాదిగుణైర్యుతః ప్రచురకోపధనార్జనసంభ్రమః।
విగతశోకభయశ్చ విసోదరః సహజధామవి మందసుతే యదా॥ అని గలదు.

మాంది తృతీయములోనున్న జాతకుడు. విరహము, గర్వము మదము మొదలగు గుణములు గలవాడు, విశేషమైన కోపము గలవాడు, ఎక్కువ ధనమును సంపాదించుటకు తొందరపడువాడు, శోకము, భయము లేనివాడు, సోదరులు లేనివాడు అగునని తాత్పర్యము. పరాశరుని అభిప్రాయములో వ్యత్యాసము గనబడుచున్నది. ఫలదీపికలో జాతకపారిజాతములో నున్నట్లు చెప్పబడినది. పారిజాతి శ్లోకమే ఫలదీపికలోను గలదు.

శ్లో॥ రోగీసుఖ పరిత్యక్తః సదాభపతి పాపకృత్।
గుళికే సుఖభావస్థే వాతపిత్తాధికో భవేత్॥　　౬౫

తా॥ చతుర్థమందు గుళికుడున్న యెడల రోగవంతుడు, సుఖము లేనివాడు, పాపకృత్యములను చేయువాడు, వాతపిత్తములధికముగ గల శరీర ప్రకృతిగలవాడు అగును.

వి॥ "యమాత్మజే సుఖస్థేతు" అని పాఠాంతరము.

జా॥ పా॥ లో;

హిబుక భవన సంస్థే మందజే వీత విద్యా ధనగృహ సుఖబంధు క్షేత్రయానోఽటనః స్యాత్ ॥

చతుర్థమందు గుళికుడున్న మనుజుడు విద్య, ధనము, గృహము భూమి, సుఖము, బంధువులు, వాహనములు మొదలగునవి లేనివాడు, ఎల్లప్పుడు సంచారము చేయువాడు అగును.

ఫలదీపికలో, "సుహృద్విశనిసుతేస్యాద్బంధుయానార్థహీనః"అనిగలదు.

శ్లో॥ విస్తుతిర్విధనోల్పాయుర్ద్వేషీ క్షుద్రో నపుంసకః॥
గుళికే సుతభావస్థే స్త్రీజితో నాస్తికో భవేత్॥ ౬౬

తా॥ స్తుతియందు విముఖుడు, ధనములేనివాడు, అల్పాయువు, ద్వేషి, నీచుడు, నపుంసకుడు, స్త్రీలచే జయింపబడినవాడు, నాస్తికుడు అగు మనుష్యుడు పంచమములో గుళికుండగ పుట్టును.

వి॥ జా. పా. లో,

తనయభవనయాతే మందసూనౌ విశీలః
చలమతి రఘుబుద్ధిః స్వల్పపుత్రోఽల్పజీవీ॥

ఫలదీపికలో;

"చలమతి రవబుద్ధి స్స్వల్పజీవీచ పుత్రే"

పంచమమందు గుళికుడున్న యెడల చంచలమైన మనస్సు గలవాడు, శీలములేనివాడు, పాపబుద్ధి, అల్పపుత్రులు, అల్పాయువు గలవాడునగును.

పరాశరునిచే చెప్పిన దానికి వీనికి భేదము గమనింపదగినది.

శ్లో॥ పీతశత్రు స్సుపుష్టాంగో రిపుస్థానే యమాత్మజే।
మదీప్తః సంమతః స్త్రీణాం సోత్సాహః సుదృఢో హితః॥　　౬౭

తా॥ శత్రువులు లేనివాడు. పుష్టిగల శరీరము గలవాడు, కాంతితో కూడినవాడు, స్త్రీలకు ప్రియమైనవాడు, ఉత్సాహవంతుడు దృఢశరీరి, ఇతరులకు హితుడు అగు మనుజుడు షష్ఠమందు గుళికుడుండగ పుట్టును.

వి॥ జా. పా. లో;

శ్లో॥ దహంగణ రిపుహంతా భూతవిద్యావినోదీ।
యది రిపుగృహయాతే మందపుత్రే తు శూరః॥ అనియు,
ఫలదీపికలో;

దహరిపుగణహంతా భూత విద్యావినోదీ
రిపుగత గుళికే వచ్ఛ్రేష్ఠ పుత్రః సశూరః॥ అనియుగలదు.

ఫలదీపికలో శ్రేష్ఠమైన పుత్రులు గలవాడని తెలుపబడినది. కొంతమంది యభిప్రాయములో శ్రేష్ఠమైన పుత్రుడు అగునని చెప్ప వలెననుచున్నారు. భూతవిద్యలందు వినోదము గలవాడని చెప్పిన విష యమును పరాశరుడు చెప్పలేదు.

శ్లో॥ స్త్రీజితః పాపకృజ్జారః కృశాంగో గతసౌహృదః।
జీవితః స్త్రీధనేనైవ గుళికే సప్తమస్థితే॥　　౬౮

తా॥ గుళికుడు సప్తమమందున్నయెడల స్త్రీలచే జయింపబడిన వాడు, పాపకర్మలను చేయువాడు, జారుడు, కృశించిన అంగములు గల వాడు, మిత్రులులేనివాడు, స్త్రీధనము చేతనే జీవించువాడు అగును.

వి॥ జా. పా. లో;

"కలహకృదివహాత్రే కామయాతే కుదారః
సకలజనవిరోధీ మందబుద్ధిః కృతఘ్నః" అనియు,

ఫలదీపికలో;

కళత్ర సంస్థే గుళికే కలహీ బహుభార్యకః।
లోకద్వేషీ కృతఘ్నశ్చ స్వల్పజ్ఞ స్స్వల్పకోపనః॥

పరాశరులు స్త్రీజితః అని, జాతకపారిజాతములో 'కుదారః' అని, ఫలదీపికలో బహుభార్యకః అనియు చెప్పబడినది.

శ్లో॥ క్షుధాతుర్దుఃఖితః క్రూరస్తీక్ష్ణరోషోఽతినిర్ఘృణః।
రంధ్రగే గుళికే విస్వో జాయతే గుణవర్జితః॥ ౧౯

తా॥ గుళికుడష్టమభావ మందుండగ బుట్టినవాడు, ఆకలిగొన్నవాడు, దుఃఖితుడు, క్రూరుడు, ఎక్కువ రోషముగలవాడు, సిగ్గులేనివాడు, ధనములేనివాడు, గుణహీనుడును అగును.

'రంధ్రే ప్రాణహరః' పాఠాంతరము.

వి॥ జా. పా. లో:

'వికలనయనవక్త్రో స్వల్పదేహోఽష్టమస్థే" యని నేత్రవికారము గల ముఖము గలవాడని చెప్పబడినది. ఈ అభిప్రాయమునే ఫలదీపికాకారుడు చెప్పియుండెను. అష్టమములో నుండెడి గుళికుడు ముఖమును, నేత్రములకు స్థానమైన ద్వితీయమును చూచుటచేత నీ విషయమును చెప్పినట్లు శోభించుచున్నది.

శ్లో॥ బహుక్లేశః కృశతనుః దుష్టకర్మాతి నిర్ఘృణః।
గుళికే ధర్మగే మందః పిశునో బహిరాకృతిః॥ ౨౦

తా॥ గుళికుడు నవమమందున్న యెడల ఎక్కువ క్లేశములు గలవాడు, కృశించిన శరీరము గలవాడు, దుష్టకర్మలు చేయువాడు, లజ్జాహీనుడు, మందబుద్ధి, లోభి, వేషగాంభీర్యము గలవాడు నగును.

వి॥ జా. పా, లో

"గురుజన పితృహంతా నీచకృత్యోగురుస్థే"

ఫలదీపికలో.

"గురుసుత వియుతోఽధూర్ధర్మసంస్థేఽర్కపుత్రే" అనిచెప్పియుండెను.

గురుజనమును, తండ్రిని చంపుసట్టివాడని జా॥ పా॥ లో చెప్పి

యుండగ, గురువులు, పుత్రులు లేనివాడని ఫలదీపికలో చెప్పబడినది. పరాశరులు యీ విషయమును చెప్పలేదు.

శ్లో॥ పుత్రాన్వితః సుఖీభోక్తా దేవాగ్న్యర్చన వత్సలః।
దశమే గుళికే జాతో యోగధర్మాశ్రితః సుఖీ॥ ౭౧

తా॥ దశమమందు గుళికుడున్న యెడల పుత్రులు గలవాడు, సుఖవంతుడు, మంచి భోజనము చేయువాడు, దేవతలను, అగ్నిని పూజించువాడు, యోగధర్మములు తెలిసినవాడు నగును.

వి॥ జా. పా. లో:

"అశుభ శతసమేతః కర్మగే మందసూనౌ
నిజకులహితకర్మాచారహీనో విమానః"

అనగా అనేక అశుభములతో కూడినవాడు. స్వకులాచార విహితమైన కర్మలనాచరించనివాడు, అభిమానము లేనివాడు అగునని చెప్పబడినది.

ఫలదీపికలో: "నశుభఫలదకర్మాకర్మ సంస్థే విదానః" అని విమానః అనుదానికి విదానః॥ అని చెప్పబడినది. 'విదానః' అనగా దానము చేయుట కిష్టపడనివాడని భావము. పరాశరుడు చెప్పినదానికి పైన చెప్పిన దానికి ఫలవ్యత్యాసము గలదు.

శ్లో॥ సుఖీభోగీ ప్రజాధ్యక్షో బంధూనాంచహితేరతః।
లాభస్థేగుళికే జాతో నీచాంగః సార్వభౌమకః॥ ౭౨

తా॥ లాభభావమందు గుళికుడున్న యెడల సుఖవంతుడు, భోగము గలవాడు, ప్రజాధ్యక్షుడు, బంధువులకుపకారము చేయువాడు, బలహీనమైన అంగములు గలవాడు, సార్వభౌముడు అగును.

వి॥ జా॥ పా॥ లో;

"అతిసుఖ ధనతేజోరూపవాన్ లాభయాతే
దినకరసుతపుత్రే చాగ్రజం హంతిజాతః"

గుళికుడేకాదశ మందున్నప్పుడు జ్యేష్ఠసోదరులు నశింతురని చెప్పియుండెను. ఫలదీపికలో నీ విషయమై "సుఖసుతమతి తేజః కాంతి నూంల్లాభ సంస్థే" యని మాత్రము చెప్పబడినది. జ్యేష్ఠసోదర నష్ట మును చెప్పలేదు.

శ్లో॥ నీచకర్మాశ్రితః పాపో హీనాంగో దుర్భగోఽలసః।
వ్యయగే గుళికే జాతో నీచేషు కురుతేరతిమ్॥ ౨౩

తా॥ వ్యయమందు గుళికుడుండగ బుట్టినవాడు నీచకర్మలను చేయువాడు, పాపి, హీనాంగుడు, దుర్భగుడు, అలసుడు నీచజనులతో తిరుగువాడునగును.

వి॥ జా. పా. లో:
"విషయ రహితవేషో దీనవాక్య ప్రవీణో
వివిధధన హరస్స్యాత్ మందజే రిఃఫయాతే॥"

అనగా సన్యాసివేషమును ధరించువాడు, దీనముగ మాట్లాడుట యందు నేర్పరి, సర్వవిధ ధనములను హరింప చేయువాడు నగును.
ఫలదీపికలో;
"విషయవిరహితో దీనో బహువ్యయస్స్యాద్వ్యయే గుళికసంస్థే"
అని చెప్పబడినది.

ఇతర గ్రంథములందు అన్యగ్రహ సంబంధముల వలన గలుగు ఫలములు గూడ చెప్పబడినవి,

## ప్రాణపద ఫలము

శ్లో॥ లగ్నే ప్రాణపదే క్షీణో రోగీ భవతి మానవః।
మూకోన్మత్తో జడాంగస్తు హీనాంగో దుఃఖితః కృశః॥ ౨౪

తా॥ లగ్నమందు ప్రాణపద గ్రహమున్నచో క్షీణుడు (తేజో హీనుడు, రోగి, మూగివాడు, పిచ్చివాడు, శక్తితక్కువగల అవయవ ములు, హీనములైన అవయవములు గలవాడు, దుఃఖితుడు, కృశించిన వాడు అగును.

శ్లో॥ బహుధాన్యో బహుధనో బహుభృత్యో బహుప్రజః।
ధనస్థానస్థితే ప్రాణే సుభగో జాయతే నరః॥ ౬౫

తా॥ ధనస్థానమందు ప్రాణపదమున్నచో ధనము, ధాన్యము, భృత్యులు, సంతానము అధికముగ గలవాడు, సుందరమైనవాడు అగును.

శ్లో॥ హింస్రో గర్వసమాయుక్తో నిష్ఠురోఽతిమలిమ్లుచః।
తృతీయగే ప్రాణపదే గురుభక్తివివర్జితః॥ ౬౬

తా॥ తృతీయమందు ప్రాణపదమున్నచో హింస చేయువాడు, గర్వము గలవాడు, నిష్ఠురవాక్కు గలవాడు, లేక కఠిన చిత్తుడు, దొంగతనము లధికముగ చేయువాడు, గురుభక్తి లేనివాడు అగును.

శ్లో॥ సుఖస్థేతు సుఖీకాంతః సుహృద్రామాసు వల్లభః।
గురౌపరాయణః శీతః ప్రాణే వై సత్యతత్పరః॥ ౬౭

తా॥ ప్రాణపదము చతుర్థ భావమందుండగ బుట్టినవాడు సుఖవంతుడు, అందమైనవాడు, స్నేహితుల భార్యలందనురక్తిగలవాడు, గురుభక్తిగలవాడు, శాంతుడు, సత్యమును పలుకుటయందు తాత్పర్యము గలవాడు అగును.

శ్లో॥ సుతభాక్ సత్క్రియోపేతస్త్వుపచారదయాన్వితః।
పంచమస్థే ప్రాణపదే సర్వకామ సమన్వితః॥ ౬౮

తా॥ పంచమమందు ప్రాణపద మున్నయెడల మంచిపనులు చేయువాడు, అపచారము చేసినవారిని దయతో చూచువాడు, సర్వకాములు గలవాడు అగును.

శ్లో॥ బంధుశత్రువశః స్తీక్ష్ణో మందాగ్నిర్నిర్దయః ఖలః।
షష్ఠే ప్రాణపదేరోగీ విత్తపోఽల్పాయురేవచ॥ ౬౯

తా॥ షష్ఠ భావమందు ప్రాణపదమున్నచో బంధువులకు, శత్రువులకువశమగువాడు, జీర్ణశక్తితక్కువగలవాడు, దయలేనివాడు, దుర్మార్గుడు, రోగి, ధనవంతుడు, అల్పాయువు గలవాడు అగును.

శ్లో॥ ఈర్ష్యాళుః సతతం కామీ తీవ్ర రౌద్రవపుర్నరః।
సప్తమస్థే ప్రాణపదే దురారాధ్యః కుబుద్ధిమాన్॥ ౮౦

తా॥ సప్తమమందు ప్రాణపదమున్న యెడల ఈర్ష్యగలవాడు, ఎక్కువ కామము గలవాడు, భయంకరమైన శరీరము గలవాడు, సేవించుటకు సాధ్యము గానివాడు, దుష్టబుద్ధి గలవాడు అగును.

శ్లో॥ రోగసంతాపితాంగశ్చ ప్రాణపాదేఽష్టమే సతి।
పీడితః పార్థివైర్దుఃఖైర్భృత్య బంధుసుతోద్భవైః॥ ౮౧

తా॥ ప్రాణపదము అష్టమ భావములో నున్నప్పుడు రోగములచే పీడింపబడువాడు, భూ, గృహ, భృత్య, బంధు సుతాదుల వలన దుఃఖపడువాడు అగును.

శ్లో॥ పుత్రవాన్ ధనసంపన్నః సుభగః ప్రియదర్శనః।
ప్రాణేధర్మస్థితే భృత్యః సదాఽదుష్టో విచక్షణః॥ ౮౨

తా॥ ప్రాణపదము నవమమునందుండగ బుట్టినవాడు పుత్రవంతుడు, ధనసంపన్నుడు, అందమైనవాడు, చూచుటకు మనోహరముగ నుండువాడు, భృత్యుడు, సత్ప్రవర్తన గలవాడు, పండితుడు అగును.

శ్లో॥ వీర్యవాన్ మతిమాన్దక్షో నృపకార్యేషు కోవిదః।
దశమే వై ప్రాణపదే దేవార్చన పరాయణః॥ ౮౩

తా॥ ప్రాణపదము దశమములో నుండగ బుట్టినవాడు వీర్యవంతుడు, బుద్ధిమంతుడు, కార్యదక్షుడు, రాజకార్యములను తెలిసినవాడు, దేవతారాధన చేయువాడు అగును.

శ్లో॥ విఖ్యాతో గుణవాన్ ప్రాజ్ఞో భోగీ ధనసమన్వితః।
లాభస్థానస్థితే ప్రాణే గౌరాంగో మానవత్సలః॥ ౮౪

తా॥ లాభస్థానమందు ప్రాణపదమున్న యెడల ఖ్యాతిగలవాడు, గుణవంతుడు, ప్రాజ్ఞుడు, స్వచ్ఛమైన అవయవములు గలవాడు, ధనవంతుడు, భోగి, అభిమాని యగును.

శ్లో॥ శుక్రోదుష్టస్తు హీనాంగో విద్వేషీ ద్విజబంధుషు।
వ్యయే ప్రాణే నేత్రరోగీ కాణో వాజాయతే నరః॥ ౮౫

తా॥ వ్యయభావమందు ప్రాణపదముగల మనుజుడు నీచుడు, ...డు. అంగవైకల్యము గలవాడు, బ్రాహ్మణులను, బంధువు ...గలవాడు, నేత్రరోగము గలవాడు గాని గ్రుడ్డివాడు

...ప్రకాశ ఖేటానాం ఫలాన్యుక్తాని భూసుర।
తథాయావి ప్రకాశానాం రవ్యాదీనాం ఖచారిణామ్॥ ౮౬

తానిస్థితివశాత్తేషాం స్పష్టదృష్టి వశాత్తథా।
బలాబల వివేకేన వక్తవ్యాని శరీరిణామ్॥ ౮౭

తా॥ ఓ మైత్రేయ! పూర్వము గో ప్రకాశవంతములై (దృగ్గోచరములైన) రవ్యాది గ్రహములను బట్టి ఫలములు చెప్పబడినవి. ఇప్పుడు అప్రకాశములైన (దృగ్గోచరములు కాని) గ్రహముల యొక్క ఫలములు చెప్పబడినవి. ఈ ఫలములు ఆయా గ్రహముల యొక్క స్థితి చేత, స్పష్టదృష్టి చేత బలాబలములను నిర్ణయించి ఫలములను చెప్ప వలయును. అని పరాశర మహర్షి చెప్పెను.

వి॥ రవ్యాది గ్రహములు తన్వాది ద్వాదశ భావములందున్న ప్పుడిచ్చు ఫలములను, ద్వాదశ భావాధిపతులాయా భావములందున్న ప్పుడిచ్చు ఫలములను, ధూమాద్యప్రకాశక గ్రహములాయా భావము లందున్నప్పుడిచ్చు ఫలములను, ఆయా గ్రహముల యొక్క స్థితిసంబంధ దృష్టి విశేషముల చేత, బలాబలముల చేత బాగుగ పరిశీలించి బలవద్గ్ర హముల యొక్క స్థితిసంబంధాదులను బట్టి ఫలమునూహించవలయును. ఒకప్పుడొక గ్రహము వలన శుభఫలము ప్రాప్తించగ, ఆ భావమునకు

మరియొక గ్రహము వలన దోషఫలము ప్రాప్తించును. ఇట్టి సందర్భములందు బలవద్గ్రహమునను సరించి శుభాశుభ నిర్ణయమునుచేసి ఏదిబలమైనదో యాఫలమును చెప్పవలయును. బలములేని గ్రహముయొక్క ఫలమును సూచనప్రాయముగ తెలుపవలయును.

సుశిక్షితుడైన విద్వాంసుడు తనయొక్క బు[illegible]ను, సేవింగతానుభవముచేత జాగ్రత్తగ పరిశీలించి ఫల[illegible] వలయును.

ఇతి శ్రీ బృహత్పరాశర హోరాశాస్త్రే అప్రకాశకగ్రహఫలాధ్యాయో నామ షడ్వింశోధ్యాయః॥ ౨౬॥

ఇది బృహత్పరాశర హోరాశాస్త్రమందు అప్రకాశకగ్రహ ఫలాధ్యాయము సమాప్తము.

* ప్రథమభాగము సమాప్తము *